ఓమ్

నందికేశ్వరప్రణీతమైన

# అభినయ దర్పణం

అనువాదం

(ప్రతిపదార్థ - తాత్పర్య - టీకాసహితం)


డా. పోణంగి శ్రీరామ అప్పారావు

(తెలుగు నాట్యశాస్త్రకర్త)





హైదరాబాదు 1987 అక్షయ : సంక్రాంతి

నాట్యమాలా ప్రచురణము-4



అక్షయ - సంక్రాంతి

14 జనవరి 1987

ప్రథమ ముద్రణము

2000 కాపీలు

వెల : రు. 50/-

ప్రతులకు :

పి. వి. ఆర్. కె. రవిప్రసాద్

ఫ్లాట్ నెం. 6, బ్లాక్ నెం. 1

సత్యనగర్, హైదరాబాదు-500 044.

ముద్రణము : చారి & కో., 9-4-9, చార్లెస్ స్ట్రీట్, సికింద్రాబాదు.

SWADHARMA SWAARAJYA SANGHA Telegrams:'ORTHODOX'
(Orthodox National League) Telephone : 614477
'Beehive Buildings'
No. 29, Prakasam Road,
Broadway : Madras-600 108

Sri Kowtha Suryanarayana Rao started his life as school teacher having been the son of a wealthy father on a paltry sum of Rs. 7/- per mensem and by dint of his hard and disciplined life and work rose to be one of the leading industrialists of South India. He pioneered many industries and was responsible for the establishment of Indian Commerce & Industries Co. Pvt. Ltd., at Madras, Kowtha Steel Products, Beehive Foundry etc. Kowtha Steel Products have to their credit a lot of Import Substitution developments.

Swadharma Swaarajya Sangha was established by Sri Kowtha Suryanarayana Row in 1930 with a view to institutionalise all his religious, educational, and charitable works. He has donated more than 80% of his self-earned wealth to the Sangha for the above purpose,as a token of gratitude to Lord Sri Krishna whom he took as his guiding spirit,as his benefactor both in his material and spiritual life. Sri Kowtha was known for his ready wit, strict discipline, charitable disposition without attracting any publicity. A few of his close friends used to call him 'Industrial Vedantin'. The Swadharma Swaarajya Sangha has created schools, instituted scholarships, founded social institutions, runs journals, and printing institutes. Multi-farious are the conduits through which Sri Kowtha Suryanarayana Row's munificence flows into the pastures of culture that is India.

Some of the great and profound Advaita texts like Khandana-Khanda-Khadya have been introduced by him for Vakyartha in the traditional style in the yearly Vidvat Sadas he had organised. Many Pandits of the Stature of Mahamahopadhyaya Ananthakrishna Sastri, Sri Venkatesa Sastri of the Mysore Samasthan, Sri Dravida Rajeswara Sastri have all appreciated his interest and anxiety to maintain and continue the pristine glory of Bharatiya Culture whose ultimate aim is to obtain nitya-niratisayaananda.

Sri Kowtha Suryanarayana Row's great work is being continued by his worthy grandson, Sri B.V.S.S. Mani.

## స్వధర్మ స్వారాజ్య సంఘం
## (Orthodox National League)



వ్యవస్థాపకులు : శ్రీ కౌతా సూర్యనారాయణరావు

*Founder :* **Sri Kowtha Suryanarayana Rao**

# విజ్ఞప్తి

**పితరౌ జగతఃపితరౌ వందే ।**

నందికేశ్వర ప్రణీతమైన అభినయదర్పణాన్ని తెలుగులోనికి అనువదింపజేసి, ప్రకటించవలసినదిగా చాలా కాలం క్రిందట డా॥ నటరాజ రామకృష్ణగారు, నాటి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమికి సూచించారు. అందుకు అంగీకరించి, ఈ అనువాదం బాధ్యతను నాకు అప్పగించారు ఆ సంగీత నాటక అకాడమి అధ్యక్షులు ఆచార్య కూర్మా వేణుగోపాలస్వామిగారు. 1981 ఫిబ్రవరిలో సంగీత నాటక అకాడమి స్థానంలో నృత్య-నాటక-సంగీతాలకు వేర్వేరుగా మూడు అకాడమిలు అవతరించాయి. క్రొత్తగా ఏర్పడిన నృత్య అకాడమికి డా॥ నటరాజ రామకృష్ణగారు అధ్యక్షులైనారు; నేను కార్యదర్శిగా నియుక్తుణ్ణి అయ్యాను. 1981 జూలై 21 వ తేదినుంచి క్రొత్తగా సాంస్కృతిక శాఖకు ప్రత్యేక డైరక్టరేట్ ఏర్పడటంతో, నేను డైరక్టర్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించాను. ఇట్లా ఆయా కారణాలవల్ల నా అనువాద కార్యక్రమం కృత్యాద్యవస్థలోనే ఉండిపోయింది.

1983 ఫిబ్రవరి 28 వ తేదీన నేను పదవీ విరమణ చేశాను. కావలసినంత విశ్రాంతి లభించింది. అప్పుడు అభినయ దర్పణం అనువాదం వైపు నా దృష్టి మరలింది. కేవలం అనువాదంకంటె, ప్రతి శ్లోకానికీ ప్రతి-పద-అర్థం కూడా వ్రాయటం అవసరమని భావించాను. అంతేకాదు. తాత్పర్యం వ్రాసి, 'టీక' అనే శీర్షిక క్రింద విశేషాంశాలను చేర్చాలని కూడా నిర్ణయించుకొన్నాను. ఇట్లా అనువాదం సాగుతూ ఉండగా, డా॥ తిప్పాభట్ల రామకృష్ణ

మూర్తిగారు కొంత ప్రతిని చదివి, చక్కని సలహాలు ఇచ్చారు. అనువాదం పూర్తి అయిన తరువాత, ఆచార్య పుల్లెల శ్రీరామ చంద్రుడుగారు, ఆసాంతం చదివి, మార్పులు చేర్పులు సూచించారు. ఇంతలో నృత్య అకాడమి కూడా అంతరించింది.

స్వీయ గ్రంథ ప్రచురణోద్యమంలో చాలా నష్టపోయిన నేను ఈ అనువాదాన్ని స్వయంగా ప్రచురించే సాహసం చేయలేక పోయాను. ఇంతలో ప్రియ మిత్రులయిన శ్రీ గరిమెళ్ళ రామమూర్తిగారి ద్వారా ఈ విషయం తెలుసుకొన్న ఆత్మీయులు, నా నాట్యశాస్త్ర ప్రియంభావుకులు, అంతర్జాతీయ ఖ్యాతి గడించిన సుప్రసిద్ధ కూచిపూడి నాట్యాచార్యులు అయిన డా॥ వెంపటి చిన్నసత్యంగారు నన్ను మద్రాసు పిలిపించి, శ్రీ బి.వి.యస్.యస్. మణిగారికి పరిచయం చేశారు. డా॥ చిన్నసత్యంగారు వారితో ఏమి చెప్పారో కానీ, తొలి పరిచయంలోనే ఆత్మీయతచూపి, స్వధర్మ స్వారాజ్యసంఘంపక్షాన ముద్రణభారం వహించటానికి శ్రీ మణిగారు అంగీకరించటమేకాక, ఇంకా ముద్రణ ప్రారంభం కాకముందే ఆదరంతో ఆ భూరి విరాళం అందించారు.

సికింద్రాబాదులోని 'చారి & కో.' ముద్రణాలయం అధిపతి శ్రీ యమ్. మురళీకృష్ణగారు దీని ముద్రణబాధ్యత స్వీకరించారు. నా నాట్యశాస్త్రంలోని అసంయుత-సంయుత హస్తాలకు రేఖా చిత్రాలు వ్రాసినవారు శ్రీ మడిపడగ బలరామాచార్యులుగారు; అందులో కొన్ని, ఈ గ్రంథంలో ముద్రితములైనాయి. ముఖచిత్ర రచనకూడా వారిదే. అభినయదర్పణంలో విశేషంగాఉన్న హస్తాలకు శ్రీ ఎ.వి.బి.యస్. ఆనంద్‌గారు రేఖాచిత్రాలు వ్రాసినారు.

నేటికి ఈ నా తెలుగు అభినయదర్పణం వెలుగు చూస్తున్నది. ఇందుకు తోడ్పడిన సహృదయులందరకూ కృతజ్ఞత నిండిన హృదయంతో నమస్కరిస్తున్నాను.

మాది పశ్చిమగోదావరిజిల్లా, కొవ్వూరు తాలూకా, బందపురం గ్రామం. కొవ్వూరు తాలూకాలోనే గోదావరీ తీరాన ఉన్న కుమారదేవం గ్రామంలోని మంచిరాజు వేంకట్రాజు అనే నియోగి బ్రాహ్మణుడు, కూచిపూడి నాట్య సంప్రదాయంలో, భామాకలాపానికి ఆనాడు ప్రసిద్ధి పొందారు. వారి శిష్యులయిన వల్లంపట్ల రామయ్యగారు, మా పితృపాదుల ప్రోత్సాహంతో, మా ఊరిలోని పిచ్చుకకుంట్లుకు భామాకలాపం, గొల్లకలాపం నేర్పారు. బయ్యా పెదగంగాధరుడు, బండి చట్టిలింగం, దేశి లక్ష్మీనారాయణ మున్నగు వారు భామాకలాపంలో సిద్ధహస్తులయినారు. నా చిన్నతనంలో, అప్పటికి సుమారు 16 సంవత్సరాలవయస్సులో ఉన్న లక్ష్మీనారాయణ భామాకలాప ప్రదర్శనము అద్భుతావహంగా ఉండేది. తరువాతి కాలంలో ఈ పిచ్చుకకుంట్లు భాగవతులు ఉషాపరిణయం, కృష్ణలీలలు మొదలగు నృత్యనాటకాలు కూడా సశాస్త్రీయంగా ప్రదర్శించేవారు. ఆ నాటి మధురస్మృతులు ఈ నాటికీ నా మనస్సులో నవ్యంగానే ఉన్నాయి. చిన్నతనంలోనే నా నృత్య-నాటక వ్యాసంగానికి స్ఫూర్తినిచ్చినవి వారి ప్రదర్శనములే. వారికి నా కృతజ్ఞతలు.

మా పితృపాదులు జన్మించి ఇప్పటికి నూటపది సంవత్సరాలు దాటినవి; స్వర్గస్థులై పథయి సంవత్సరాలయింది. మా మాతృమూర్తి జననం ఎప్పుడో తెలియలేదు; 1945 వ సంవత్సరం శ్రీరామనవమి రోజున స్వర్గస్థులైనారు. ఇరువురూ శ్రీరామచంద్ర సంకీర్తనంలో, భాగవతపారాయణ శ్రవణములలో తమ జన్మలు చరితార్థం చేసుకొని, అనాయాస మరణం పొందారు. మా పితృపాదుల ఛాయాచిత్రం గ్రూపు ఫోటోలో ఉన్నది మాత్రమే లభించింది; మా అమ్మగారి ఛాయాచిత్రం ఎంత ప్రయత్నించినా లభ్యం కాలేదు. జన్మ ఇచ్చి, 'అప్పారావు బహద్దర్' అంటూ గారం చేసి, చిన్నతనంలోనే సాహిత్యంలో, నృత్య-నాటక కళలలో అభినివేశం కలిగించిన పూజ్య పితరుల పవిత్ర స్మృతి చిహ్నంగా ఈ నా కృషిని అంకితం చేసుకొంటున్నాను.

14-1-1987 *పోణంగి శ్రీరామ అప్పారావు*

# కృతికర్త

## పోణంగి శ్రీరామ అప్పారావు, ఎమ్.ఏ., పి.హెచ్‌డి.

జననం : రుధిరోద్గారి ఆషాఢ శుద్ధ అష్టమీ శనివారం (21-7-1923)

జన్మస్థలం : పశ్చిమగోదావరిజిల్లా, కొవ్వూరుతాలూకా, ఐందపురంగ్రామం.

తల్లిదండ్రులు: శ్రీమతి లక్ష్మీనరసమ్మ, శ్రీ రామమూర్తి.

భార్య : శ్రీమతి వేంకటరమణమ్మ.

విద్యాభ్యాసం : కొవ్వూరు ఉన్నత పాఠశాల, విజయవాడ శ్రీ రాజా రంగయప్పారావు కళాశాల, ఆంధ్ర విశ్వవిద్యాలయం (తెలుగు సాహిత్యంలో ఎమ్.ఏ. - 1946)

పరిశోధన : ఉస్మానియా విశ్వవిద్యాలయం (తెలుగునాటకవికాసంపై పి.హెచ్‌డి. పట్టం - 1961)

ఉద్యోగాలు : భీమవరం, రాజమండ్రి, కడప, శ్రీకాకుళం, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలల తెలుగు శాఖలు; హైదరాబాదు డిగ్రీ కళాశాల ప్రిన్సిపాలు; పాఠ్యపుస్తకాల జాతీయాకరణ ప్రత్యేకాధికారి; సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి; తెలుగుఅకాడమి, అంతర్జాతీయతెలుగుసంస్థల వ్యవస్థాపక డైరక్టర్; సాంస్కృతిక వ్యవహారాలశాఖ డైరక్టర్‌గా పదవీ విరమణ.

విదేశపర్యటనలు: మలేషియా, సింగపూర్, లండన్, ప్రాగ్ (జకోస్లోవేకియా), వియన్నా, అమెరికా.

విశిష్టతలు : ఉత్తమ గ్రంథకర్తగా జాతీయ బహుమానం (నాట్యశాస్త్రం -1961); ప్రథమప్రపంచ తెలుగు మహాసభల ప్రధాన కార్యదర్శి - 1975); ఉత్తమకళాశాల అధ్యాపకసన్మానం(1980); ప్రస్తుతం యు.జి.సి. పథకంలో - "సంస్కృతనాటకాలు, చతుర్విధ అభినయాలు" - అనే అంశాలపై గ్రంథరచన.

రచనలు : తాజ్‌మహల్ (నాటిక - 1942)
విశ్వభారతి (నవల - 1946)
వేణువు (పద్యాత్మక గద్యం - 1952)

# కృతికర్త



డా. పోణంగి శ్రీరామ అప్పారావు

**Dr. P. S. R. Appa Rao**

నాట్యశాస్త్రము (భరతముని నాట్యశాస్త్రమునకు సమగ్రానువాదం - గుప్త భావప్రకాశికా వ్యాఖ్యా సహితం - 1959 - 1961 లో జాతీయ బహుమతి పొందిన గ్రంథం).

తెలుగు నాటక వికాసము (పి. హెచ్‌డి. సిద్ధాంత వ్యాసం - 1967)

A Monograph on Bharata's Natya Sastra (1967)

ధర్మవరం రామకృష్ణమాచార్య (జీవితం-రచనలు-1986)

నృత్యకళ : తెలుగుదేశం (తెలుగు నృత్తరత్నావళికి 70 పుటలు పీఠిక - 1974)

ధూర్జటి కవితావైభవం (1976)

భారతీయనాటకరంగం (శ్రీ ఆద్యరంగాచారి ఆంగ్లగ్రంథానువాదం - 1980)

అభినయదర్పణం (1987)

అముద్రితములు :

నాట్యశాస్త్ర పరిచయం; ప్రథమాంధ్ర నాటకకర్తలు; ఆంధ్ర - ఆలంకారికులు; సాహిత్య సంప్రదాయాలు.

సంపాదకత్వం : శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యం (విపులపీఠికా సహితం)

Historical Tables (History of A. P. as main entry)

Select Prayers

విషాద సారంగధర (విపులపీఠికా సహితం)

Antonyms & Synonyms (English-Telugu)

మానవల్లి కవి రచనలు (తెలుగులో, ఆంగ్లంలో)

# శివతాండవం

పటంలో నటరాజు జ్వాలామాలా ప్రభామండలమందున్నాడు. ఆ వృత్తాకారము సర్వనాదాత్మకమైన ప్రణవము (ఓమ్)నకు చిహ్నము. వేణీబంధము (జటాజూటము) నందు గంగయును, అర్ధచంద్రుడును కలరు. గంగ సంపత్సమృద్ధికిని, చంద్రరేఖ అనుగ్రహామునకును చిహ్నములు; అంతియేకాక చంద్రుడు కాలమునకు అధిపతికూడను. సూర్య-చంద్ర అగ్న్యాత్మకములైన శివుని మూడు నేత్రములును మూడు కాలములకును చిహ్నములు; అంతియేకాక మూడవ నేత్రము జ్ఞానమునకు చిహ్నము (ఈ జ్ఞాననేత్రస్థానమందే మనము తిలకాదులను ధరింతుము). శివుని కుడిచెవియందు మకరకుండలమును (పురుషాభరణమును), ఎడమ చెవియందు తాటంకమును ఉండుట అతడు అర్ధనారీశ్వరుడగుటకు చిహ్నము. సర్పము కుండలినీ శక్తికి చిహ్నము; అసలు శివుడు భుజగభూషణుడు కదా! యజ్ఞోపవీతము పవిత్రతకును, సర్వకర్మాధిపత్యమునకు చిహ్నము. నాలుగు హస్తములలో పై కుడిచేయి డమరుక సమన్వితము, డమరుకము సృష్టికి చిహ్నము; క్రింది కుడిచేయి అభయ హస్తము, ఇది స్థితికి చిహ్నము; పై ఎడమచేయి అగ్ని సమన్వితము, ఇది సంహార చిహ్నము; క్రింది ఎడమచేయి దోలాహస్తము, ఇది అనుగ్రహాత్మకమైనది. రెండు పాదములలో కుడిపాదము స్థితపదము; దాని క్రింద ఉన్న మరుగుజ్జు (రాక్షసుడు) రుగ్జరామరణములు, అజ్ఞానము మొదలగువానికి చిహ్నము. శివుడు వానినెల్ల జయించి అణగద్రొక్కెను; ఆ జయచిహ్నమే స్థితపదము. ఎడమపాదము కుంచితపాదము; ఇది అనుగ్రహామునకును, మోక్షమునకును చిహ్నము. శివుడు ధరించిన గజచర్మమును, జంఘలమీది గజ్జెలును వీరతా చిహ్నములు. ఇట్లు ఈ తాండవము పరమేశ్వరుని సృష్టి-స్థితి-సంహార - తిరోభావ - అనుగ్రహాములనెడి పంచక్రియా శక్తికి చిహ్నమైయున్నది.

# శివతాండవం



ఆంగికం భువనం యస్య వాచికం సర్వవాఙ్మయమ్ ।
ఆహార్యం చంద్రతారాదితం వందే సాత్త్వికం శివమ్ ॥

# అంకితం

నిత్య భాగవతపారాయణ పరాయణులు

రామభక్తులు, నృత్య-నాటకాభిమానులు

పూజ్య పితరులు

శ్రీమతి లక్ష్మీనరసమ్మ-శ్రీరామమూర్తి

దంపతుల దివ్యస్మృతికి

— శ్రీరామ అప్పారావు

# అంకితం



కీ. శే. పోణంగి రామమూర్తిగారు

క్రీ. శ. 1876 - 1937

# శివతాండవస్తోత్రాలు

సంధ్యారంభ విజృంభితం శ్రుతిశిరఃస్థానాంతరాధిష్ఠితం
సప్రేమభ్రమరాభిరామమసకృత్సద్వాసనాశోభితం ।
భోగీంద్రాభరణం సమస్తసుమనః పూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీ గిరిమల్లికార్జున మహాలింగం శివాలింగితం ॥

- శివానందలహరి - 50 వ శ్లోకం.

వాలినభక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్
బాలశశాంక మౌళికిఁ గపాలికి మన్మథ గర్వపర్వతో
న్మూలికి నారదాదిమునిముఖ్య మనస్సరసీరుహాళికిన్.

భాగవతం - ప్ర. స్కం. 2 వ వ.

తలపైని జదలేటియలలు దాండవమాడ
నలల త్రోపుడులఁ గ్రొన్నెల పూవు గదలాడఁ
మొనసిఫాలముపైన ముంగురులు చెఱలాడఁ
గనుబొమ్మలో మధుర గమనములు నడయాడఁ
గనుపాపలో గౌరి ఎలనవ్వు బింబింపఁ
గనుచూపులను తరుణ కౌతుకము చుంబింపఁ
గడఁగి మూడవకంటఁ గటికనిప్పులురాలఁ
గడుఁబేర్చి పెదవిపైఁ గటికనవ్వులు వ్రేల
ధిమిధిమిధ్వని సరిద్గిగర్భములు తూఁగ
నమిత సంరంభ హాహాకారమురేగ

ఆడెనమ్మా ! శివుఁడు

పాడెనమ్మా ! భవుఁడు

సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులుగారి
'శివతాండవం' నుంచి

జటాటవీగలజ్జల ప్రవాహపావితస్థలే
గలేఽవలంబ్య లంబితాం భుజంగ తుంగమాలికామ్ ।
డమడ్డమడ్డమడ్డమ న్నినాదవడ్డమర్వయం
చకార చండతాండవం తనోతు నః శివః శివమ్ ॥

జటాకటాహ సంభ్రమభ్రమన్నిలింప నిర్ఝరీ
విలోల వీచివల్లరీ విరాజమానమూర్ధని ।
ధగద్ధగ ద్ధగజ్జ్వలల్లలాటపట్ట పావకే
కిశోరచంద్రశేఖరే రతిః ప్రతిక్షణం మమ ॥ 2

కరాలఫాలపట్టికా ధగద్ధగద్ధగజ్జ్వలత్
ధనంజయాహుతీకృత ప్రచండపాయకే ।
ధరాధరేంద్ర నందినీ కుచాగ్రచిత్రపత్రక
ప్రకల్పనై కశిల్పిని త్రిలోచనే రతిఃమమ ॥ 3

జటాభుజంగ పింగళస్ఫురత్ఫణామణి ప్రభా
కదంబ కుంకుమద్రవ ప్రలిప్త దిగ్వధూముఖే ।
మదాంధసిందుర స్ఫురత్త్వగు త్తరీయమేదురే
మనోవినోద మద్భుతం బిభర్తు భూతభ ర్తరి ॥ 4

ప్రఫుల్లనీలపంకజ ప్రపంచకాలిమచ్ఛటా
విడంబికంఠ కంధరారుచి ప్రబంధకంధరమ్ ।
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదాంధకచ్ఛిదం తమంతకచ్ఛిదం భజే ॥ 5

అఖర్వ సర్వమంగళా కళాకదంబమంజరీ
రసప్రవాహ మాధురీ విజృంభణామధువ్రతమ్ ।
స్మరాంతకం పురాంతకం భవాంతకం మఖాంతకం
గజాంతకాంధకాంతకం తమంతకాంతకమ్ భజే ॥ 6

జయత్వదభ్ర విభ్రమ భ్రమత్ భుజంగమశ్వసత్
వినిర్గమత్ క్రమస్ఫురత్ కరాళఫాల హవ్యవాట్ ।
ధిమిద్ధిమిద్ధిమిత్ ధ్వనన్ మృదంగ తుంగమంగళ
ధ్వని క్రమప్రవర్తిత ప్రచండతాండవం శివః॥ 7.

- రావణకృత శివతాండవస్తోత్రం నుంచి

# పీఠిక

## 1. నృత్యోత్పత్తి

నాట్యోత్పత్తిని గూర్చి నాట్యశాస్త్రంలోని ప్రథమాధ్యాయంలో ఇట్లా కథ ఉంది : ప్రతి మన్వంతరంలోనూ కృతయుగం సమాప్తమై త్రేతాయుగం ప్రారంభమయ్యే సంధికాలంలో ప్రజలు అరిషడ్వర్గానికి లోనై, గ్రామ్యధర్మ ప్రవృత్తిని అవలంబించి (=స్వధర్మాలను విడిచి) సుఖ-దుఃఖ సమ్మిశ్రితములైన జీవితాలను గడుపుతూ ఉంటారు. అటువంటి ఒకానొక సమయంలో ఇంద్రుడు మొదలయిన లోకపాలురు ధర్మ ప్రతిష్ఠాపనాపరులై ప్రజలను స్వధర్మనిరతులను చేయటంకొరకు బ్రహ్మను సందర్శించి, "క్రీడనీయకమిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్" (=చూడదగిన వినదగిన వినోదాన్ని కోరుతున్నాము) అని ప్రార్థించారు. అంతే కాదు. "శూద్ర జాతులకు నేటి వేదాలపై అధికారం లేదు. కాబట్టి, సార్వవర్ణికమైన ఇంకొక వేదాన్ని సృష్టించండి" అని కూడా కోరినారు.

అంతట బ్రహ్మ సమాధిగతుడై, "ధర్మ ప్రతిపాదకం, చతుర్విధ పురుషార్థ సాధకం, యశస్కరం, ఉపదేశ్యసహితం, సమ్యక్ జ్ఞాన ప్రదం, ముందు తరాలవారికి సత్కర్మ మార్గ ప్రదర్శకం, సర్వ శాస్త్రార్థ సంపన్నం, సర్వశిల్ప ప్రవర్తకం, ఇతిహాస సహితం అయిన 'నాట్యము' అనే పంచమవేదాన్ని నిర్మిస్తాను" అని సంకల్పించి, ఋగ్వేదంనుంచి పాఠ్యం, సామవేదంనుంచి గీతం, యజుర్వేదంనుంచి అభినయం, అథర్వవేదంనుంచి రసం గ్రహించి వేదోపవేదాల సారంగా లలితాత్మకమైన నాట్యవేదం (=నాట్యశాస్త్రం) అనే

పంచమ వేదాన్ని సృష్టించినాడు. ఇంద్రుని సూచనను అంగీకరించి, బ్రహ్మ ఈ నాట్యవేదాన్ని భరతమునికి బోధించినాడు. పిమ్మట, భరతముని యోగ్యులైన తన పుత్ర (=శిష్య) శతానికి నాట్యం సాకల్యంగా నేర్పి, ప్రయోగ విధానాన్ని కూడా బోధించినాడు.

తరువాత భరతముని ప్రార్థననుమన్నించి, బ్రహ్మ లలితాత్మకమైనకైశికీవృత్తి ప్రయోగార్థం మంజకేశి మున్నగు ఇరవైనలుగురు అప్సరసలను సృష్టించి భరతమునికి అప్పగించినాడు. అంతేకాదు. శిష్యసహితుడగు స్వాతిమునిని ఆతోద్య (=వాద్య) నిర్వహణంలో, నారద-గంధర్వులను గానక్రియలో నియోగించినాడు. ఇట్లా తొలి నాట్యబృందం సిద్ధమైంది. ఈ బృందంవారు బ్రహ్మ నిర్మితమైన 'అమృతమంథనం' అనే నాట్యాన్ని ఇంద్రధ్వజోత్సవ సమయంలో, 'త్రిపురదాహం' అనే నాట్యాన్ని శివుని యెదుట ప్రదర్శించారు. ఈ నాట్యాన్ని తిలకించిన శివుడు, పూర్వరంగవిధులలో నృత్తాన్ని చేరిస్తే గీతములలోని అర్థాలు చక్కగా అభినయింపబడగలవని తలపోసినాడు. అంతట మహేశ్వరుని ఆదేశాన్ని అనుసరించి, తండువు భరతమునికి నృత్తం నేర్పినాడు. తండువు నేర్పినది కావటం చేత, నృత్తం 'తాండవం' అనబడింది. గీతాలతో నృత్తం చేరటం వల్ల, నృత్తం గీతార్థప్రకటనకు దోహదకారి అయింది.

నాట్యోత్పత్తిని కించిత్ భేదంతో భావప్రకాశనంలో శారదాతనయుడు ఇట్లా వివరించినాడు : మహేశ్వరుడు కల్పాంతమందు లోకాలనన్నింటిని దగ్ధంచేసి, పిమ్మట స్వేచ్ఛగా ఆనంద తాండవం చేసినాడు. తరువాత మనస్సంకల్పంతో విష్ణువును, బ్రహ్మను సృష్టించినాడు. మాయామయి అయిన వైష్ణవీశక్తి సర్వమంగళ అయిన అంబికారూపంతాల్చి, శివుని వామపార్శ్వం చేరింది. అంతట దేవదేవుని నియోగం ప్రకారం, బ్రహ్మ లోకాలను అన్నింటిని సృజించి, శివుని పురావృత్తాన్ని చూడగోరినాడు. ఈశుని దివ్యచరి

తమును ఏవిధంగా చూడగల్గుదునా అని చింతిస్తున్న బ్రహ్మయొద్దకు నందికేశ్వరుడేతెంచి, సప్రయోగంగా నాట్యవేదం బోధించి, ఇట్లా చెప్పినాడు — "నాట్యవేదంలో చెప్పబడిన రూపకాలలో ఒకదానిని నీవు లక్షణాన్వితంగా నిర్మించి, చక్కగా భరతులకు (=నటులకు) నేర్పుము. ఆ రూపకం భావాభినయ కోవిదులైన భరతులచేత ప్రయుక్తమైనప్పుడు ప్రాక్తన కర్మలన్నీ నీకు ప్రత్యక్షం కాగలవు". చింతితార్థం చేకూరినందుకు బ్రహ్మ ఆనందించి, దేవతలతో కూడిన వాడై, 'త్రిపురదాహం' అనే రూపకం రచించి, దానిని భరతులకు నేర్పి, "చక్కగా ప్రయోగించండి" అని కోరినాడు. వారు దానిని చక్కగా ప్రయోగించినారు. ఆ ప్రయోగాన్ని చూస్తున్న బ్రహ్మ యొక్క నాలుగు ముఖాలనుంచి నాలుగు వృత్తులతోపాటు, శృంగారాది ప్రధాన రసాలు నాలుగు జనించినవి

పైని పేర్కొన్న రెండు కథలలోనూ నాట్యశాస్త్రము.దలి కథ సమంజసంగా గోచరిస్తున్నది. బ్రహ్మ నాట్యాన్ని సృష్టించి, భరతమునికి బోధించినాడు. భరతముని శిష్యసహితంగా ఆ నాట్యాన్ని ప్రయోగించినాడు. నృత్తం లేదా తాండవం ప్రవర్తింపజేసినవాడు శివుడు. బ్రహ్మ నిర్మితమైన నాట్యాన్ని శివుడు క్రొత్తగా చూచినాడు. ఇంతకుముందు, సంధ్యాకాలములందు నృత్తం చేస్తున్నప్పుడు శివుడు కూడా నాట్యాన్ని గూర్చి ఆలోచించినాడట; కాని నాట్యసృష్టికి ఆయన పూనుకోలేదు. భరత ప్రయుక్తమైన నాట్యాన్ని చూడగానే, వృత్త-నాట్యాలను సమ్మిశ్రితంచేస్తే బాగుంటుందని శివునికి తోచినది. అనగా తన నృత్తానికి నాట్యంలోని అభినయాలను జోడించవలెనని శివుడు అభిప్రాయపడినాడన్నమాట! ముందుగా, ఆ పనిని పూర్వరంగ విధులందు చేయుమని శివుడు బ్రహ్మను ఆదేశించినాడు. శివుని ఆదేశాన్ని అనుసరించి, భరతముని తండువు ద్వారా నృత్తాన్ని కూడా నేర్చి, పూర్వరంగవిధులందు కూర్చినాడు. నాట్య

శాస్త్రంలో పూర్వరంగ విధానం విపులంగా ఒక అధ్యాయంలో వర్ణితమైనది. అంతకుముందు 'శుద్ధము'గా ఉన్న పూర్వరంగవిధి, నృత్తం చేరటంతో 'చిత్ర పూర్వరంగ'మైనది. భరతముని నృత్తాన్ని, అభినయాన్ని జోడించటంవల్ల, ఒక క్రొత్త కళ సృష్టి అయింది; అదే 'నృత్యం'. ఇది క్రొత్త కళ అని బ్రహ్మకానీ, భరతమునికానీ గుర్తించినట్లు లేదు. నాట్యశాస్త్రంలో నృత్తం అనే పదం తప్ప నృత్యం అనే పదం లేదు. నాటికి నృత్యం ప్రత్యేక కళగా, నిర్దిష్టమైన రూపం తాల్చకపోవటమే ఇందుకు కారణం అయి ఉంటుంది. కాని, నిజానికి, భరతమునియే నృత్య సృష్టికర్త అయినాడు[1].

నృత్తాన్నేకాక నృత్యాన్ని కూడా శివుడే సృష్టించినాడన్న కోహలుని అభిప్రాయాన్ని అభినవగుప్తుడు పేర్కొన్నాడు :

సంధ్యాయాం నృత్యతః శంభో ర్భక్త్యాగ్రే నారదః పురా ।
గీతవాం త్రిపురోన్మథం తచ్చిత్తస్స్వత గీతకే ॥
చకారాభినయం ప్రీత స్తత స్తండుం చ సోఽబ్రవీత్ ।
నాట్యోక్తాభినయేనేదం వత్స యోజయ తాండవమ్ ॥

— అభినవభారతి - 1 వ సం. పుట 180

-హిమాలయంమీద ఒకనాటి సంధ్యాకాలంలో శివుడు నృత్తం చేస్తుండగా ఆయన ఎదుట నారదుడు భక్తితో త్రిపురోన్మథగీతం గానంచేసినాడు. ఆ గీతం వింటున్న శివుడు ప్రీతమనస్కుడై ఆ గీతంయొక్క అర్థాన్ని అభినయించినాడు. అంతట శివుడు తండువును పిలిచి, "ఈ తాండవాన్ని నాట్యంలో చెప్పబడిన అభినయాలతో కూర్చుము" అని ఆదేశించినాడు.

---

1. "Natya Nritya and Nritta - Their meaning and relation" by Dr. K.M. Varma (Orient Longmans, Calcutta, 1957).

నాట్యశాస్త్రమందలి కథను సరిగా అర్థంచేసుకోనకపోవటం వల్ల అట్లా చెప్పినాడనటంకంటె, నృత్యానికి కూడా దివ్య యోని త్వాన్ని కల్పించదలచి కోహలుడు అట్లా చెప్పినాడని తలంచవలసి ఉంటుంది. అందుచేత నృత్యసృష్టికర్త భరతముని అనటానికి ఇది అభ్యంతరం కాజాలదు.

అర్వాచీన కాలంలో, ఈ కళ క్రమంగా పూర్వరంగ విధు లందేకాక, విడిగా కూడా ప్రయుక్తమవుతూ 'నృత్యం' అనేపేర ప్రసిద్ధిపొందింది. అమరకోశంలోని "తాండవం - నటనం - నాట్యం - లాస్యం - నృత్యం చ నర్తనే" అనేదానినిబట్టి క్రీ.శ. 5వ శతాబ్దికి పూర్వమే 'నృత్యం' అనే పదం ప్రచారంలో ఉన్నదని చెప్పవచ్చును. కాగా, ఏదేనా గీతాన్ని అర్థప్రదర్శకంగా అభినయించటం నృత్యం అవుతుందన్నమాట. నృత్య కళనుగూర్చి, ఆంగికాభినయాన్ని గూర్చి నృత్తరత్నావళికి వ్రాసిన పీఠికలో విపులంగా వివరించాను. — పుటలు ౧-౧౭.

నాట్యశాస్త్రంలో నృత్తం, తాండవం అనేవి పర్యాయ పదాలుగా ప్రయుక్తములైనాయి. ఈ నృత్తం లేదా తాండవం నటరాజు అయిన శివునిచేత ప్రయుక్తమైనది. ఇంక పార్వతిచేత ప్రయుక్తమయిన సుకుమార నృత్తాన్ని గూర్చిన ప్రసక్తి నాట్య శాస్త్రంలోని 4వ అధ్యాయంలో రెండుసార్లు ఉంది:[1]

---

1. అసలు ఈ భాగమంతా ప్రక్షిప్తమని డా. వర్మగారి అభి ప్రాయం. కాని ఈ భాగాన్ని అభినవగుప్తుడు వ్యాఖ్యా నించటంచేత, ఇది అంతకు ముందే నాట్యశాస్త్రంలో చేరి ఉంటుందని వారభిప్రాయపడినారు. అంతేకాదు, ఈ భాగంలో వర్ణింపబడిన — నటీ ప్రవేశ సమయంలో వాద్యాలు మ్రోగటం, గాన సమయంలో అర్థ ప్రదర్శకంగా ఆమె అభి నయించటం, గానాంతమందు ఆమె నృత్తం చేయటంవంటివి నేటికీ మన నృత్యాలలో నిలిచి ఉన్నాయనీ, ఇది ఆనాటి సంప్రదాయమే అనీ వారు పేర్కొన్నారు.

ప్రదర్శించటం జరిగి ఉంటుంది. ఈ పని కోహాలుడు చేసినట్లుగా శాస్త్రగ్రంథాలవల్ల తెలియవస్తున్నది. ఆవాడు వీటిని 'నృత్తప్రకారాలు' అన్నారు; తరువాత వీటిని 'ఉపరూపకాలు' అన్నారు; నేడు మనం వీటిని 'నృత్యరూపకాలు' అంటున్నాము.

## 3. నృత్యావతరణం

నాట్యం భూమి మీద ఎట్లా అవతరించిందో నాట్యశాస్త్రం చివరి అధ్యాయం వివరిస్తున్నది. ఇంక నృత్యం ఎట్లా అవతరించిందో అభినయదర్పణం వివరించింది. చిరు భేదాలతో, పలువురు శాస్త్రకర్తలు ఈ కథనే తమ గ్రంథాలలో అనుసరించారు. ఈ కథ ఇట్లా ఉంది: నటరాజు అయిన శివుడు తండువు ద్వారా భరతునకు ఉద్ధత నృత్యం నేర్పినాడు. అంతకుముందే ప్రీతితో పార్వతికి లాస్యం నేర్పినాడు. తండువువలన నేర్చిన తాండవాన్ని మునులు మర్త్యులకు నేర్పినారు. ఇంక పార్వతి, బాణాత్మజ అయిన ఉషకు లాస్యం నేర్పింది. ఆమెనుంచి ద్వారవతిలోని గోపికలు నేర్చుకొన్నారు. వారినుంచి సౌరాష్ట్రయోషితలు నేర్చుకొన్నారు. వారినుంచి ఆయా దేశీయయోషితలు నేర్చుకొన్నారు. ఇట్లా నృత్యం పరంపరా ప్రాప్తమై లోకంలో అవతరించింది. అభినయదర్పణ కథాసారాన్ని తెలుగులో కావ్యంగా రచించిన మాతృభూతయ్యకవి ప్రకారం మునిసంఘం పార్వతి ద్వారా నృత్యం నేర్చి, దానిని సౌరాష్ట్రయోషితలకు నేర్పినది; వారినుంచి క్రమంగా తక్కిన రాష్ట్రాలకు ప్రసరించింది.

"సంగీతోపనిషత్-సారోద్ధార గ్రంథాలను రచించిన వాచనాచార్య 'సుధాకలశుడు' (క్రీ.శ. 1324-50) ఇటువంటి కథనే కొంత భిన్నంగా చెప్పినాడు: బ్రహ్మ వశిష్ఠునకు, ఆయన తనపుత్రశతానికి నృత్య విద్య చెప్పారు. ఇంద్రుని కోర్కె ప్రకారం లాస్య-తాండవ

మిశ్రితమైన నృత్యం రంభా-మేనకాదులకు చెప్పబడింది. తరువాత లాస్యం ఉష నేర్చుకొన్నది. దేవలోకంలో విశ్వావసుడు, వానిద్వారా చిత్రరథుడు, వానిద్వారా పార్థుడు, వానిద్వారా ఉత్తర నేర్చుకొన్నారు. భర్తృమరణంతో ఉత్తర నృత్యం మర్చిపోయింది. తరువాత పాలకరాజు శివుని అర్చించి, మరల నృత్యవిద్యను వరంగా పొందాడు. పిమ్మట నృత్యం మానవలోకంలో ప్రసిద్ధి పొందింది. సుధాకలశుని ప్రకారం నరకృతం నృత్తం; నారీకృతం నృత్యం; ఇంక నర-నారీ కృతం నాట్య నాటకాలు. సుధాకలశుని నృత్య నిర్వచనం కూడా గమనింపదగినది; "యస్మాత్ పంచేంద్రియ ప్రీతి ర్భవేచ్చ దుఃఖ విస్మృతిః సదాసౌఖ్యకరం తత్తు నృత్యం" (5వ అధ్యా. 2వ శ్లో). దేని వలన పంచేంద్రియాలకు తృప్తికలుగుతుందో, దుఃఖం విస్మరింపబడుతుందో, సౌఖ్యం చేకూరుతుందో, అది నృత్యం అవుతుంది అని దీని సారాంశం. నాట్యంవలెనే, నృత్యం కూడా రసోత్పాదక సమర్థమనటానికి, ఈ నిర్వచనం బలమిస్తున్నది.

## 4. నృత్యం - రసం

'రస-భావ వ్యంజనాదియుక్తం నృత్యమి తీర్యతే' అని నందికేశ్వరుడు స్పష్టంచేసినప్పటికీ, అర్వాచీనులైన దశరూపకకర్త ధనంజయుడు, తద్వ్యాఖ్యాత ధనికుడు, సంగీతరత్నాకరకర్త శార్ఙ్గదేవుడు, నృత్తరత్నావళి కర్త జాయసేనాపతి నృత్య నిర్వచనంలో 'రస' పదాన్ని త్యజించినారు. కాగా, వీరి దృష్టిలో నృత్యము రసవ్యంజకం కాదన్నమాట. కాని, తరువాత, నాట్యదర్పణకర్తలయిన రామచంద్ర-గుణచంద్రులు (క్రీ.శ. 12వ శతాబ్ది) నృత్యాన్ని 'రస భావ వ్యంజనాదియుక్తము'గానే చెప్పినారు. సుధాకలశుని నిర్వచనం ఈ విషయంలో మరింత స్పష్టంగా ఉన్నది— రసపదం వాడకపోయినప్పటికీ. కావున, నాట్యంవలెనే నృత్యం కూడా రసవ్యంజకము కానటం పత్యసమ్మతమైన విషయం. రసానుభూతివల్ల కలిగే ఆనందం

బ్రహ్మానందం కంటె కూడా అధికమని చెప్పి, అట్లేకాక పోతే నారదాది మహర్షుల చిత్తాలను ఈ నృత్యం ఎట్లా ఆకర్షించగలిగింది? అని ప్రశ్నించినాడు నందికేశ్వరుడు.

మాళవిక 'ఛలిత' మనే నాట్యం ప్రదర్శించినట్లు కాళిదాసు (క్రీ.శ. 4వ శతాబ్ది) మాళవికాగ్నిమిత్రంలో వర్ణించినాడు. ఇది రూపకం కాదు; యథారసమభినయింపబడినదని చెప్పటంచేత ఇది కేవలం అంగవిక్షేపాత్మకమైన నృత్తం కూడా కాదు. ఇంక ఇది అభినయపూర్వకమైన నృత్తమన్నమాట; అంటే 'నృత్యం' అని అర్థం. కాగా కాళిదాసు కాలానికి రసాత్మకమైన నృత్యం ప్రచారంలో ఉంది (కాళిదాసు నాట్యపదాన్ని నాట్యం, నృత్యం అనే రెండు అర్థాలలోనూ వాడినాడు).

అయితే ఈ రసానుభూతి ఎవరిలో కలుగుతుంది? ఈ ప్రశ్న మీద ప్రాచీనాలంకారికులు బహుళంగా చర్చలు జరిపి, చివరకు సహృదయులయిన ప్రేక్షకులకు ఈ ఆనందానుభూతి కలుగుతుందని నిర్ణయించినారు. ప్రేక్షకులు తృప్తిపడినప్పుడేకదా ప్రయోగం సిద్ధిని పొందిందని చెప్పటం. అయితే నటునకుకానీ, నర్తకి కానీ రసానుభూతి ఉండదా? అని ప్రశ్నించవచ్చును. నటుడు, నర్తకి కూడా సహృదయులే కాబట్టి వ్యక్తులుగా వారికి కూడా రసానుభూతి తప్పక ఉంటుంది. కాని, రంగస్థలం మీద మాత్రం ఆ రసానుభూతి ఉండరాదు. నటుడు, నర్తకి అనుభూతి లేదా ఆస్వాదన ఉపాయములు మాత్రమే; కావుననే వారు పాత్రము, పాత్రి అనబడినారు. పాత్రము మద్యాది, మధురాది రసాలను ఆస్వాదించటానికి ఆస్వాదయితకు తోడ్పడుతుందేకాని, దానికి తదనుభూతి ఉండదు; పాత్రము కేవలం సాధనము మాత్రమే. అట్లే నటుడు, నర్తకి సహృదయుల రసాస్వాదనమునకు సాధనములు మాత్రమే.

నృత్తంలోనూ, నృత్యంలోనూ ఆంగికాభినయం ప్రధానమే కాని, ఆంగికాభినయం, నృత్తంలో తాళలయాశ్రయం కాగా నృత్యంలో భావప్రదర్శకం కూడా అవుతున్నది. ఈ భావప్రదర్శనలో నాలుగు విధాలయిన అభినయాలు నృత్య-నాట్యాలలో సమానమే కాని, నృత్యం ఆంగికాభినయ ప్రధానం కాగా, నాట్యం సాత్త్వికాభినయ ప్రధానం, కథాత్మకం అవుతున్నది. నృత్యంలో ప్రతిపదం యొక్క అర్థం అభినయింపబడుతుంది. అందుచేతనే నృత్యం ప్రతి పద-అర్థ-అభినయమనీ, నాట్యం వాక్యార్థాభినయమనీ శాస్త్రకర్తలు పేర్కొన్నారు. అయితే, రెండూ రసవ్యంజకాలే. నృత్యంలో ఆంగికాభినయం ప్రధానమైనా, వాచిక-సాత్త్విక అభినయాలు కూడా సముచితంగా ప్రయుక్తములై సహృదయ ప్రేక్షకులకు పంచేంద్రియ తృప్తి చేకూర్చటంలో సహకరిస్తాయి.

## 5. చతుర్విధాభినయాలు

'అభినయం' అనే పదంలోని 'అభి' అనే ఉపసర్గకు 'అభిముఖంగా' అనీ, నీ (=నయ) ధాతువునకు పొందించటం, తీసుకొని వెళ్ళటం అనీ అర్థాలు. కావున అభినయమంటే ప్రయోగాన్ని అభిముఖంగా పొందించటం లేదా ప్రయోగం యొక్క అర్థాలను సామాజిక హృదయాలకు తీసుకొని వెళ్ళటం అని అర్థం. ప్రయోగ సమయంలో నటుడు లేదా నర్తకి అభినయముల సాహాయ్యంతో నాట్యం లేదా నృత్యంలోని అర్థాలను సామాజిక హృదయాలకు సువ్యక్తం చేయటం జరుగుతుంది. నటుడు లేదా నర్తకి సర్వమానవ వ్యాపారాన్ని రంగస్థలం మీద ప్రదర్శింపవలసి ఉంది. మానవ వ్యాపారమంతా మనో-వాక్-కాయ భేదాలచేత మూడు విధాలని విజ్ఞులకు తెలిసిందే (వీటినే త్రికరణము లంటారు). ఈ మూడు వ్యాపారాలు నృత్య-నాట్యాలలో సాత్త్విక-వాచిక-ఆంగిక అభి

నయాలవుతున్నాయి. ఇవే త్రివిధాభినయాలు. నాలుగవది అయిన 'ఆహార్యాభినయం' (— వేషం) ఈ మూడింటిలో అంతర్గతమై ఉంటుందని అభినవగుప్తుడు పేర్కొన్నాడు. నిజానికి, నృత్యంలో ఆహార్యానికి అంతగా ప్రాధాన్యం లేదు.

నటుడు కానీ, నర్తకి కానీ, లోకంలో తనకు వచ్చిన కష్ట సుఖాలకు అనుగుణంగా ప్రవర్తించటం అభినయం కాజాలదు. కాని రంగస్థలం మీద ఉన్నప్పుడు, తాను ఏ పాత్రను ధరించాడో లేదా తాను ఏ పాత్రమును నిరూపిస్తున్నదో, దానికి అనుగుణంగా సంచ రించటం, మాటాడటం, భావ వ్యక్తీకరణ చేయటం — ఇదే అభినయ మవుతుంది. అంటే తనకు సహజం కాని, వేరే వ్యక్తికి చెందిన, ఆంగిక-వాచిక-మానసిక వ్యాపారాలను తనమీద ఆరోపించుకొని, ఆ వ్యక్తివలెనే ప్రవర్తించటం అభినయమవుతున్నదన్న మాట.

ఇంతకుముందు పేర్కొన్నట్లుగా, ఈ అభినయం నాలుగు విధాలు — ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్త్వికాలు. అభినయ దర్పణం ప్రథమశ్లోకంలో, నటరాజ పరంగా ఈ నాలుగు అభి నయాలు సూచింపబడినవి. ఆ తరువాత, "కంఠే నాలంబ యేత్......", "యతో హస్తస్తతోదృష్టిః......" అనే శ్లోకా లలో నర్తకి నృత్యం చేయవలసిన పద్ధతి సూచితమైంది.

చిత్రకళలో, విగ్రహశిల్పంలో — ముఖ్యంగా దేవతామూర్తుల చిత్రణంలో — నృత్య భంగిమలు ఎన్నో గోచరిస్తాయి. నృత్యశాస్త్రా లలో చేయబడిన శారీరకవిశ్లేషణ చిత్రకారులకు, విగ్రహశిల్పులకు ఎంతో ఉపయోగకరమైనది. అందుచేతనే చిత్రకళలో, విగ్రహ శిల్పంలో నిష్ణాతులు కాగోరు వారు నృత్య విధానాన్ని సాకల్యంగా పరిశీలించవలసి ఉంటుందని ఆయా శాస్త్రకర్తలు పేర్కొన్నారు.

## 6. హస్తాభినయం

ఆంగికాభినయాన్ని వర్ణించేటప్పుడు, శాస్త్రకర్తలు మానవ శరీరాన్ని అంతటిని మూడు భాగాలుగా విభజించినారు — 1. (ముఖ్య) అంగాలు, 2. ఉపాంగాలు, 3. ప్రత్యంగాలు. ఉపాంగ-ప్రత్యంగ సంఖ్యల విషయంలో ఆయా శాస్త్రకర్తలు విభేదించినా, అందరూ అంగాలు ఆరు అని మాత్రం అంగీకరించినారు — 1. శిరము, 2. హస్తాలు, 3. కటి, 4. ఉరము, 5. పార్శ్వములు, 6. పాదములు. అంగాలు ఆరింటిలోనూ హస్తాలు ప్రధాన పాత్ర వహిస్తున్నాయి. ముల్లోకాలలోని సకల భావాలను-అవి మూర్తములయినా, అమూర్తములయినా-హస్తాలు వ్యక్తం చేయగలవు. భాష లేని ఆదిమ కాలంలో, మనుష్యులు, తమ భావాలను హస్తాల ద్వారానే వ్యక్తం చేస్తూ ఉండి ఉండాలి. భాష పెంపొందిన తరువాత హస్తాభినయం కళగా రూపొంది ఉంటుంది; అంతేకాదు, తాంత్రికపరంగా కూడా పెంపొందింది.

అంగం అంటే శరీరంలోని ఒక భాగం లేదా అవయవం అంగాలతో కూడినది కాబట్టి శరీరాన్ని 'అంగి' అనికూడా అంటారు. మూడు విధాలయిన అంగాల పరస్పర సంబంధాన్ని శ్రీ అడివి బాపిరాజుగారు, సరళంగా, క్రింది విధంగా వివరించారు: "అంగాభినయంలో దేహం అంతా వస్తువు అవుతుంది.అందులో ముఖ్యాంగాలు, ప్రత్యంగాలు, ఉపాంగాలు అని ఉన్నాయి.......చేతికి మోచేయి ప్రత్యంగము; వ్రేళ్ళు ఉపాంగాలు. కంటికి కనుబొమ ప్రత్యంగము; కనురెప్పలు గ్రుడ్లు ఉపాంగాలు. అల్లా అన్నింటికీ, వీని కదలికతో భావం చెప్పడం అంగాభినయం" ('నారాయణరావు' నవల — పుట 339).

'హస్తం' అంటే మనికట్టు నుంచి వ్రేళ్ళ చివరవరకు ఉన్న

భాగం. ఈ హస్తం కదలినప్పుడు, తక్కినచేయి కూడా కదలుతూ ఉంటుంది.

అంధులకు బ్రెయిలీ లిపివలెనే, మూగ-చెవిటి వారికి సంజ్ఞా భాష (Sign language) వెలసింది పాశ్చాత్య దేశాలలో. ఇందులో కూడా హస్తాలకే ప్రాధాన్యం. ఆంగ్ల భాష యొక్క అక్షరమాలలో 27 అక్షరాలున్నాయి: ఈ 27 అక్షరాలకు 27 హస్తాలు ఉన్నాయి. ఇక్కడి నుంచి, నిత్యకృత్యాలలో అవసరమయ్యే సకల భావాలకు హస్తాలు రూపొందించబడినవి.[1] ఈ హస్తాలకు, మన హస్తాలకు - ఆకారంలో,వినియోగంలో — కొన్ని పోలికలున్నాయి. ఈ రెండు సంప్రదాయాలను ప్రత్యేకంగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

ఈ హస్తాలు, మంత్ర శాస్త్రపరంగా ప్రయుక్తములయినప్పుడు 'ముద్రలు' లేదా 'హస్తముద్రలు' అన్న పేర ప్రసిద్ధిపొందాయి. మనస్సులో మంత్రాన్ని ఆలోచించి, నోటితో పలుకుతూ, హస్తాలతో ముద్రలు పట్టటం — ఇట్లా త్రికరణ శుద్ధిగా మంత్రజపం జరుగుతుంది. ఇదంతా తాంత్రికపరమైన విషయం.

కథాకళి నృత్య సంప్రదాయంలో హస్తాలను 'ముద్రలు' అనే అంటారు.

## 7 భరతము

భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రంలోనే 'భరతుడు' అనే పదం 'నటుడు' అనే అర్థంలో ప్రయుక్తమయింది. అర్వాచీన శాస్త్ర కర్తలు కొందరు 'భ-ర-త' పదానికి 'భావ-రాగ-తాళము'లు అనే

---

1. చదువదగిన ఒక మంచి గ్రంథం : 'The Joy of Signing' by Lottie L. Riekehof, Gospel Publishing House, Springfield, Missouri — 65802, U. S. A.

అర్థం చెప్పినారు. అంటే ఈ మూడింటి సమ్మేళనం 'భరతము' అవుతుందన్న మాట. ఈ పదం క్రమంగా భావ-రాగ - తాళసమ్మేళనమైన నృత్యానికి పర్యాయపదమైంది; నృత్యశాస్త్ర గ్రంథాలు 'భరతములు' గా పేరుపొందాయి — కోళహల భరతం, అర్జున భరతం మొదలగునవి.

ఆంధ్రదేశంలో 'భరతము' అనేపదం ప్రత్యేకార్థం సంతరించుకొన్నది. నృత్యం ప్రతి-పద-అర్థ-అభినయం కాగా, భరతం ప్రతి పదానికి విపులమైన అభినయం చేయటం అవుతున్నది. శాస్త్ర-సంప్రదాయములు తెలిసిన నర్తకి, ఒక్కొక్క పదానికి విశేషార్థాలను ప్రదర్శిస్తూ, ఒకే గీతాన్ని గంటల తరబడి అభినయిస్తుంది — ఇది ఆంధ్రదేశపు ప్రత్యేకత. ఈ సంప్రదాయం క్రమంగా క్షీణిస్తున్నది. 'భరతం పట్టటం' అన్న ప్రయోగానికి క్రమంగా దురర్థం కూడా వచ్చేసింది.

## 8. నర్తకి - పూర్వరంగం

"వయోరూపవతులైన వేయిమంది స్త్రీలలోనూ గుణయుక్తురాలైన నర్తకి ఒక్కతె అయినా అరుదుగా లభిస్తుంది" అని భరతముని పేర్కొన్నాడు. నర్తకికి ఉండవలసిన గుణాలు లేదా లక్షణాలు ఏమిటో నందికేశ్వరుడు విశదంగా వర్ణించినాడు. ఈ లక్షణాలు అన్నీ ఉన్న నర్తకి మాత్రమే ఉత్తమ నర్తకి అవుతుంది.

అభినయదర్పణంలోని వర్ణనలను బట్టి, అందులో వర్ణితమైన నర్తకి, 'రాజనర్తకి' అని స్పష్టమవుతున్నది. అభినయదర్పణంలో వర్ణితమైన సభ కూడా సప్తాంగ లక్షణోపేతమైన రాజసభయే. రాజనర్తకి నృత్యాన్ని శ్రీనాథుడు పల్నాటివీరచరిత్రలో విపులంగా వర్ణించియున్నాడు (పుటలు 18-19).

నందికేశ్వరుడు పాత్రమునకు (=నర్తకికి) బహిః ప్రాణాలు ఎనిమిది, అంతఃప్రాణాలు పది పేర్కొన్నాడు. ఇవి సమకూడని నాడు, ఆమె 'నర్తకి' పదానికి అర్హురాలు కాజాలదు. అన్నీ సమకూడిన ఉత్తమ నర్తకి, దేవతా ప్రార్థనాదులతోకూడిన పూర్వరంగ విధులు నిర్వర్తించి, నృత్యం ప్రారంభించాలి — ఆమె నోటితో గీతాన్ని పాడుతూ, హస్తాలతో అర్థం ప్రదర్శిస్తూ, కనులతో భావం ప్రకటిస్తూ, పాదాలతో తాళం పాటించాలి. అర్థ ప్రదర్శనలో — హస్తం ఎటు కదలుతుందో అటే దృష్టి ప్రసరించాలి (=హస్తం ఏ భావం ప్రదర్శిస్తుందో, దృష్టి కూడా అదే భావాన్ని ప్రకటించాలి). దృష్టి ఎటు ఉన్నదో, మనస్సు కూడా అటే ఉండాలి. మనస్సు ఎక్కడ ఉంటుందో, అక్కడ భావప్రకటన జరుగుతుంది. భావం చక్కగా ప్రకటితమైనప్పుడే, సహృదయ ప్రేక్షకులకు రసానుభూతి కలుగుతుంది. నర్తకి, నృత్యంచేస్తూ స్వయంగా పాడటమనేది కూడా ఆంధ్రదేశపు ప్రత్యేకతయే.

పూర్వరంగ విధులను గూర్చి నాట్యశాస్త్రంలో ఒక ప్రత్యేక అధ్యాయం ఉంది (5 వ అధ్యా.). పూర్వరంగ విధులలో తొమ్మిది అంతర్యవనిక అంగాలు; పది బహిర్యవనిక అంగాలు ఉన్నాయి. ఇవి అర్వాచీన కాలంలో — బహుళః భాసుని కాలంలో — బాగా సంక్షిప్తమైనాయి. అయినప్పటికీ, నాంది లేదా దేవతా ప్రార్థన అనేది నేటికీ నిలిచిఉంది. ఇందులో సాధారణంగా దేవ-గురు-వాద్య-సభ్యవందనం ఉంటుంది. ప్రార్థన చేయకుండా నర్తకి నృత్యం ప్రారంభిస్తే అది నీచనృత్యం అవుతుందనీ, నీచనృత్యం చూసినవారు పుత్రహీనులై, పశుజన్మ ఎత్తుతారనీ నందికేశుని నిర్ణయం. అంతే కాదు, చిత్రానికి పటంవలెనే, నృత్యానికి భూమి (=రంగస్థలం) ఆధారం. అందుచేత రంగాధిదేవతా ప్రార్థనను కూడా నందికేశుడు ప్రత్యేకించి చెప్పినాడు; ఈ ప్రార్థనను ఇతర శాస్త్రకర్త లెవ్వరూ చెప్పినట్లు కానరాదు.

## 9. శాస్త్రకర్తలు

శారదాతనయుడు (క్రీ.శ. 12వ శతాబ్ది) తాను అనేక మతాలను (=శాస్త్రాలను) అధ్యయనం చేసి, 'భావప్రకాశనము'ను రచించినట్లుగా చెప్పినాడు. ఆమతకర్తలు పదిమంది — సదాశివుడు, శివుడు, గౌరి, వాసుకి, వాగ్దేవి, (భరత)ముని, నారదుడు, అగస్త్యుడు, వ్యాసుడు, ఆంజనేయుడు. తాను క్రింద పేర్కొన్న మతకర్తల గ్రంథాలను, వ్యాఖ్యానాలను మథించి, 'సంగీతరత్నాకరము'ను రచించినట్లుగా శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు — సదాశివుడు, పార్వతి, బ్రహ్మ, భరతుడు, కశ్యపుడు, మతంగుడు, యష్టికుడు, దుర్గాశక్తి, శార్దూలుడు, కోహలుడు, విశాఖిలుడు, దత్తిలుడు, కంబలుడు, అశ్వతరుడు, వాయువు, విశ్వావసువు, రంభ, అర్జునుడు, నారదుడు, తుంబురుడు, ఆంజనేయుడు, మాతృగుప్తుడు, రావణుడు, నందికేశ్వరుడు, స్వాతిర్గణుడు, బిందురాజు, క్షేత్రరాజు, రాహులుడు, రుద్రటుడు, నాన్యదేవుడు, భోజరాజు, సోమేశ్వరుడు, జగదేకమల్లుడు, లోల్లటుడు, ఉద్భటుడు, శంకుకుడు, అభినవగుప్తుడు, కీర్తిధరుడు

భరతము పదహారు విధాలనీ, తనకు పది విధాలే తెలుసుననీ చెప్పి, ఆ పదింటి కర్తలను పేర్కొన్నాడు చిల్లకూరి దివాకరకవి తన భరతసారసంగ్రహంలో — కోహళుడు, నందికేశ్వరుడు, ఆంజనేయుడు, నారదుడు, అర్జునుడు, శుక్రుడు, యాజ్ఞవల్క్య, బృహస్పతి, భరతుడు, శార్ఙ్గదేవుడు. నీడామంగళం తిరువేంకటాచార్యుల వారు అభినయదర్పణంలో అధికంగా చేర్చిన సప్తసముద్ర హస్తాల వివరణలో బృహస్పతి ప్రభృతుల మతాలు పేర్కొనబడినవి. ఆయా కర్తల పేర్లతో తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయంలో కొన్ని భరతముల వ్రాతప్రతులున్నట్లు తెలుస్తున్నది. వాటిని బాగా పరిశీలించవలసి ఉన్నది.

నృత్యశాస్త్ర కర్తలను పేర్కొనటంలో క్రింది శ్లోకాలు ప్రసిద్ధంగా ఉన్నాయి:

> శంభు ర్గౌరీ తథా బ్రహ్మా మాధవో నందికేశ్వరః ।
> దత్తిలో కోహళశ్చైవ యాజ్ఞవల్క్యశ్చ నారదః ॥
> హనుమా న్విఘ్నరాజశ్చ షణ్ముఖోథ బృహస్పతిః ।
> అర్జునో రావణశ్చైవ కన్యాబాణసుతా తథా ॥
> ఏతే భరతకర్తారో భువనేషు ప్రకీర్తితాః ।

శివుడు, గౌరి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుడు, దత్తిలుడు, కోహళుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, ఆంజనేయుడు, విఘ్నేశ్వరుడు, షణ్ముఖుడు, బృహస్పతి, అర్జునుడు, రావణుడు, ఉషా కన్య — ఈ పదహారుగురు భరతశాస్త్రకర్తలుగా లోకంలో కొనియాడ బడుతున్నారు. దివాకరకవి చెప్పిన పదహారు భరతాలు ఇవే కావచ్చు.

ఆయా శాస్త్రకర్తలు పేర్కొన్న దానినిబట్టి నందికేశ్వరుడు భరత (= నృత్య) శాస్త్రకర్తగా, ప్రామాణికుడుగా అంగీకరింప బడినాడన్న విషయం స్పష్టమవుతున్నది.

## 10. నందికేశ్వరుడు

నంది లేదా నందకేశుడు లేదా నందికేశ్వరుడు - ఈ పేరు నృత్యశాస్త్ర విషయంలోనే కాక తాల-రస-యోగ-తంత్ర-కామశాస్త్ర-పూర్వమీమాంస-లింగాయతశైవాది శాఖలలో కూడా కనిపిస్తున్నది. తాలలక్షణ దీపిక, తాలాది లక్షణం, తాలాభినయ లక్షణం అనే గ్రంథాలు నందికేశ్వరప్రణీతంగా చెప్పబడినవి. రాజశేఖరుని కావ్యమీమాంసలో నందికేశ్వరుడు రసాధికారకర్తగా పేర్కొనబడినాడు. నందికేశ్వరుడు 'యోగతారావళి' అనే

గ్రంథాన్ని రచించినట్లు తెలుస్తున్నది. 'నందికేశ్వర తిలకం' అనే గ్రంథం కూడా నందికేశ్వర ప్రణీతం. 'పంచసాయకం' లో నంది కేశ్వరుడు కామసూత్రకర్తగా పేర్కొనబడినాడు. కామసూత్రంలో వాత్స్యాయనుడు ఒక 'నాంది'ని పేర్కొన్నాడు. ఈ నాంది సుప్రసిద్ధుడైన నందికేశ్వరుడే అని విమర్శకుల అభిప్రాయం. పూర్వ మీమాంసా గ్రంథమైన 'ప్రభాకరవిజయం' నందికేశ్వరప్రణీతం. లింగాయతశైవాన్ని విశదీకరించే 'లింగధారణ చంద్రిక' కూడా నందికేశ్వరప్రణీతమే.

ఒకే ఒక వ్యక్తి, ఇన్ని శాస్త్రాలలో ప్రవీణుడై, ఇన్ని గ్రంథాలు రచించి ఉంటాడా ? అన్నది సంశయాస్పదమైనవిషయం. కాని, సంగీతశాస్త్రంలో — అంటే అభినయ-గాన-వాద్యాలలో అతడు ప్రవీణుడై వాటిల్లో రచనలుచేసి ఉంటాడనటానికి ఆక్షేపణ ఉండరాదు.అభినయదర్పణాన్ని బాగా అనుసరించిన సంగీతరత్నాకర కారుడు సంగీతవిషయంలో నందికేశ్వరుని ఒక ప్రామాణికునిగా గ్రహించిన విషయం గుర్తించి ఉన్నాము.

అయితే నందికేశ్వరుడు ఈశ్వరుని వాహనమైన నందీశ్వరుడా? లేదా ఒక గణాధిపతియా ? లేదా మానవుడా ? 'లింగపురాణం' ప్రకారం నందికేశ్వరుడు తొలుత మానవుడే. అతని తల్లి అయిన శిలాద చేసిన తపఃఫలితంగా, శివుని కరుణవల్ల, అతడు చిరంజీవి, అయినాడు; గణాలకు అధిపతి అయినాడు !

నాట్యశాస్త్రాన్ని, అభినవభారతీవ్యాఖ్యాసహితంగా సంస్కరించి ప్రకటించిన మానవల్లి రామకృష్ణకవిగారి అభిప్రాయంలో 'నందీశ్వరసంహిత' కర్త అయిన 'భట్టతండువు', నందికేశ్వరుడు ఒక్కరే. నందీశ్వరసంహిత గాంధర్వానికి సంబంధించిన బృహత్తర గ్రంథమనీ, అందులో చర్చింపబడని విషయంకానీ, ప్రకరణం కానీ లేదనీ వారు పేర్కొన్నారు. క్రీ. శ. 4 వ శతాబ్దానికి చెందిన మతంగుడు తన బృహద్దేశిలో నందికేశ్వరుని పేర్కొన్నాడు.

"నందికేశ్వరేణో క్తం —

ద్వాదశస్వరసంపన్నా జ్ఞాతవ్యా మూర్ఛనా బుధైః ।

జాతి భాషాది సిద్ధ్యర్థం తారమంద్రాది సిద్ధయే ॥

క్రీ.శ. 1620 ప్రాంతాల రఘునాథనాయకుడు తన సంగీతసుధలో ఇట్లా పేర్కొన్నాడు:

సమీక్ష్య నందీశ్వరసంహితాం తామాలోచ్య శాస్త్రం భరతప్రణీతం ।

ఉమాపతే రాధునికస్య తంత్రం విలోక్యనందీశమతానుసారి ॥

— ప్రాచీనులైన భరతుడు రచించిన శాస్త్రాన్ని, నందీశ్వరుడు రచించిన సంహితను, ఆధునికుడైన ఉమాపతి రచించిన గ్రంథాన్ని సమీక్షించి, నందీశమతానుసారంగా తాను రచిస్తున్నట్లు రఘునాథ నాయకుడు చెప్పినాడు. అంటే క్రీ.శ. 17 వ శతాబ్ది వరకు నందీశ్వరసంహిత లభ్యమన్నమాట ! కాని, ఇప్పుడది అలభ్యం. లభించిన అభినయదర్పణం,నందీశ్వరసంహితలోని ఒకభాగం అని కవిగారు పేర్కొన్నారు[1].

రఘునాథ నాయకుడు చెప్పిన దానినిబట్టి, భరతమతం వేరు, నందీశమతం వేరు అని స్పష్టమవుతున్నది. ఈ రెండు మతాలు ప్రాచీనకాలం నుంచీ ఉన్నవన్న మాట ! అందుచేతనే, అభినయ దర్పణం కొన్నిచోట్ల నాట్యశాస్త్రంతో భేదించటం మనం గమనించ గలము.

భరతమునికి నృత్తం నేర్పవలసినదిగా శివుడు తండువును ఆదేశించినట్లున్నూ, తండువు నేర్పినది కావున నృత్తం తాండవం అని

1. "Literature on Music" — Vol III Part-I (July, 1928) of Quarterly Journal of Andhra Historical Research Society, Rajahmundry.

పిలువబడినట్లునూ్నా నాట్యశాస్త్రం స్పష్టంచేస్తున్నది. క్రీ.శ. 1253-54 సంవత్సరంలో రచింపబడిన నృత్తరత్నావళిలో జాయసేనాపతి తండువును, భట్టతండువును కూడా పేర్కొన్నాడు. 'తండువు' అని మాత్రమే పేర్కొన్నప్పుడు తాండవప్రవర్తకుని, 'భట్టతండువు' అని పేర్కొన్నప్పుడు కరణముల వ్యాఖ్యాతను జాయసేనాపతి ఉద్దేశించినట్లు డా. వి. రాఘవన్ నిరూపించినారు.[1] భట్ట వాచకం పాండిత్య నిదర్శకం. నన్నయభట్టు, నారాయణభట్టు వేణీసంహార నాటకకర్త భట్టనారాయణుడు పిల్లలకు సుపరిచితులే. కావున తండువు వేరు, భట్టతండువు వేరు అనీ, భట్టతండువు చారిత్రకపురుషుడు కావగునని స్పష్టమవుతున్నది. మానవల్లి రామకృష్ణకవిగారు పేర్కొన్నది — ఈ భట్టతండువు, నందికేశ్వరుడు ఒక్కరే అని. భట్టతండువు పేర్కొన్నాడంటూ జాయసేనాపతి ఉదాహరణ లిచ్చినాడే కాని, అవి ఏ గ్రంథంలోనివో చెప్ప లేదు. కాని, అవి అన్నీ నదీశ్వరసంహితలోనివే అనటం అసంభావ్యం కాజాలదు. కాగా, భట్టతండువు చారిత్రకపురుషుడనీ, ఆయన రచించిన నందీశ్వరసంహిత క్రీ.శ. 17వ శతాబ్ది వరకు ప్రచారంలో ఉన్నదనీ నిర్ణయించవచ్చును.

కాలం : నందీశ్వరసంహితను మతంగుడు పేర్కొన్నాడు కదా! ఆమతంగుని, తమిళకావ్యం అయిన 'శిలప్పదికారం' పేర్కొన్నది. శిలప్పదికారం క్రీ.శ. 5వ శతాబ్దికి చెందినదని విమర్శకుల నిర్ణయం. అప్పటికి ప్రసిద్ధుడైన మతంగుడు సుమారు ఒక శతాబ్దికి పూర్వుడు అంటే క్రీ.శ. 4వ శతాబ్దికి చెందినవాడు కావాలి. అట్లాగే మతంగునిచేత పేర్కొనబడిన నందికేశ్వరుడు క్రీ.శ. 3వ శతాబ్దికి చెందినవాడు కావాలి.

---

(1) Introduction to Nrittaratnavali - pp. 48-51.

'రామో రామః రామశ్చ' అంటూ పరశురామ, శ్రీరామ, బలరాములను దశావతారాలలో గణించటం పరిపాటి. కాని, అభినయ దర్పణంలో బుద్ధావతారానికి హస్తాభినయం చెప్పబడలేదు; దానికి బదులుగా కృష్ణావతారానికి హస్తాభినయం చెప్పబడింది. అంటే అభినయ దర్పణ రచనాకాలం నాటికి బుద్ధుడు దశావతారాలలో పరిగణింపబడలేదన్నమాట! మత్స్యపురాణం, భాగవతం బుద్ధుని అవతారమూర్తిగా పేర్కొన్న తొలి గ్రంథాలు. మత్స్య పురాణం క్రీ.శ. 6వ శతాబ్దికి చెందినది. కావున బుద్ధుని అవతారమూర్తిగా పేర్కొనని అభినయదర్పణం అంతకు చాలా ముందరిది కావాలి. కాగా, అభినయదర్పణం క్రీ.శ. 3 లేదా 4 వ శతాబ్దికి చెందినదని తలంచటంలో ఎటువంటి విప్రతిపత్తి ఉండరాదు.

దేశం : దక్షిణ హిందూదేశంలో నందికేశ్వరుని దైవంగా పూజించటంఉన్నది. ఇంతకుముందు పేర్కొన్న లింగపురాణంకూడా దక్షిణదేశానికి చెందినదే. అందుచేత నందికేశ్వరుడు దాక్షిణాత్యుడు అయి ఉండాలి. ఇంక, లభించిన అభినయదర్పణంయొక్క తాళపత్ర ప్రతులన్నీ తెలుగు లిపిలోనే ఉండటంచేత, నందికేశ్వరుడు ఆంధ్రుడని ఊహించటానికి అవకాశం ఉన్నది.

## 11. అభినయదర్పణం

భరతార్ణవం అనే బృహత్ గ్రంథానికి సంక్షిప్త రూపమని చెప్పబడిన అభినయదర్పణంలో అధ్యాయాది విభజన లేదు. అంతా ఏకాధ్యాయమే. డా॥ మనోమోహన్ ఘోష్ క్రింది అభినయ దర్పణపు తాళపత్రప్రతులను పరిశీలించి, పాఠ నిర్ణయం చేసినారు.

1. మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మానుస్క్రిప్ట్స్ లైబ్రరీ ప్రతి (నెం. 304 - 1894 లో సేకరించబడినది) — సమగ్రమైన ప్రతి.

2. విశ్వభారతి విశ్వవిద్యాలయం (ప్రతి, శాంతి నికేతన్ నెం. 3035) — తాళపత్రము సమగ్రము.
3. అడయార్ లైబ్రరీ ప్రతి, మద్రాసు (నెం. XXII C. 25) (తెలుగు టీకా సహితం) — అసమగ్రము.
4. అడయార్ లైబ్రరీ ప్రతి, మద్రాసు (నెం. XXII C. 38) అసమగ్రము).
5. అడయార్ లైబ్రరీ ప్రతి, మద్రాసు నెం. VIII. J. 9) — అసమగ్రము.

పైన పేర్కొన్న అయిదు వ్రాతప్రతులు తెలుగు లిపిలోనే ఉండటం గమనింపదగిన విశేషం. డా. ఘోష్ ప్రధానంగా విశ్వభారతిలోని వ్రాతప్రతిని ఆధారంగా చేసుకొని, తన గ్రంథం తయారు చేశారు ; మద్రాసు ప్రతిలో ఉన్న నవగ్రహ హస్తాలను ఇందులో చేర్చుకొన్నారు. డా. ఘోష్ సంస్కరించి ప్రచురించిన ఈ గ్రంథంలో మొత్తం 324 శ్లోకాలు ఉన్నాయి. ఇందులో సుమారు 90 శ్లోకాలు ఆదిలో ఉన్న పూర్వరంగం, శిరోభేదాలు, దృష్టి భేదాలు, గ్రీవాభేదాలు - ఈ అంశాలకు సంబంధించినవి; సుమారు 70 శ్లోకాలు, చివర ఉన్న పాద-మండల-స్థానక-ఉత్ప్లవన-భ్రమరీ-చారి-గతిభేదాలకు సంబంధించినవి. ఇంక తక్కిన శ్లోకాలు అన్నీ హస్తభేదాలకు సంబంధించినవి.

నీడామంగలం తిరువేంకటాచార్యుల వారు ప్రకటించిన గ్రంథంలో 718 శ్లోకాలున్నాయి. వారు ఇతర గ్రంథాల నుంచి సేకరించి ఇందులో చేర్చిన 408 శ్లోకాలను మినహాయిస్తే, అసలు గ్రంథం 310 శ్లోకాలు మాత్రమే కాగా, రెండు గ్రంథాలు ఇంచుమించుగా వైశాల్యంలో సమానమే. అయితే కొన్ని భేదాలు లేక పోలేదు. పాదాదిభేదాలను వివరిస్తున్న సుమారు 70 శ్లోకాలు నీడా

వారి గ్రంథంలో లేవు. అట్లాగే రాజ-నదీ సముద్ర-లోక-వృత్తి-మృగ-పక్షి-జలజంతు హస్తాలకు సంబంధించిన సుమారు 90 శ్లోకాలు డా. ఘోష్ పాఠంలో లేవు.

ఈ రెండింటినీ సమన్వయంచేసి, నేను సిద్ధం చేసిన ఈ గ్రంథంలో 814 శ్లోకాలున్నాయి.

అంగ-ఉపాంగ-ప్రత్యంగ భేదాలను వివరించేటప్పుడు ముందుగా నిర్వచనం చెప్పి, తరువాత వినియోగం చెప్పటం శాస్త్ర పరిపాటి. అభినయదర్పణం కూడా ఈ పద్ధతినే అనుసరించింది. నీడా వారు చేర్చిన గ్రంథాంతర భేదాలలో నిర్వచనం తరువాత, హస్తాలకు జనన-జాతి-వర్ణ-అధిదైవతాలు కూడా చెప్పబడినవి.

## 12. అభినయ దర్పణం - నాట్యశాస్త్రం

"...సమాప్తశ్చాయం గ్రంథః నందిభరత పుస్తకమ్" అని నాట్యశాస్త్రం చివర, బొంబాయి నిర్ణయసాగర ప్రెస్ ముద్రణలో ఉన్నది. "నందిభరత విరచితమైన ఈ గ్రంథం సమాప్తం" అని దీని అర్థం. అంటే నంది, భరతుడు కలిసి వ్రాసిన గ్రంథమని అర్థమా? లేదా నంది రచించిన భరతశాస్త్ర పుస్తకమని అర్థమా? నాట్యశాస్త్రం భరతముని ప్రణీతంగా సుప్రసిద్ధం కావటంచేత, నంది భరత పుస్తక మని ఏదో ఒక తాళపత్ర ప్రతిలో మాత్రమే ఉండడంచేత ఈ పంక్తిని లేఖక ప్రమాదంగా పరిగణించారు విమర్శకులు. అయితే, నంది లేదా నందికేశ్వరుడు నృత్యశాస్త్ర కర్తగా అర్వాచీనుల చేత పరిగణింపబడటం గుర్తించి ఉన్నాము. మరి, నంది-భరతులలో ఎవ్వరు పూర్వులు? అన్న ప్రశ్న ఉదయింపగలదు.

భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రం నాట్య-నృత్త-నృత్య-గీత-వాద్య-సాహిత్యాలకు మూలగ్రంథం అన్న సత్యం విజ్ఞులకు తెలిసినదే. నాట్యశాస్త్రంలోని 4 వ అధ్యాయంలో, 8 నుంచి 11వరకు

ఉన్న మరో నాలుగు అధ్యాయాలలో ఆంగికాభినయం వర్ణితమైనది. నాట్యశాస్త్రంలోని ఆంగిక భేదాలకు, అభినయదర్పణంలోని ఆంగిక భేదాలకు- సంఖ్యలో, పేర్లలో, నిర్వచనాలలో, వినియోగాలలో- తేడాలున్నవి. ఉదాహరణకు :

1. శిరోభేదాలు : భరతముని 13 భేదాలు చెప్పగా, నందికేశ్వరుడు 9 భేదాలే చెప్పినాడు. ఇందులో 5 పేర్లు మాత్రమే సమానం.

2. దృష్టి భేదాలు : నాట్యశాస్త్రం మూడు విభాగాలుగా మొత్తం 36 దృష్టి భేదాలు చెప్పగా, అటువంటి విభజన లేకుండా నందికేశ్వరుడు కేవలం ఎనిమిది భేదాలే చెప్పినాడు. వీటికి ఏమీ పోలికలు లేవు; రెండున్నూ భిన్న సంప్రదాయాలకు చెందినవి.

3. గ్రీవా భేదాలు : నాట్యశాస్త్రంలో[3] తొమ్మిది భేదాలు కలవు. కాని అభినయదర్పణంలో 4 భేదాలే. వీటిల్లో పోలికలు లేవు.

4. హస్త భేదాలు : నాట్యశాస్త్రంలో 24 అసంయుతహస్తాలు, 13 సంయుతహస్తాలు, 30 నృత్తహస్తాలు ఉండగా, అభినయ దర్పణంలో 28 అసంయుతహస్తాలు, 23 సంయుతహస్తాలు, 13 నృత్తహస్తాలు చెప్పబడినవి. వీటిల్లో చాలా తేడాలు ఉన్నాయి.

5. చారిభేదాలు : నాట్యశాస్త్రంలో 16 భౌమీచారులు, 16 ఆకాశికీచారులు ఉండగా, అభినయ దర్పణంలో ఏ విభజన లేకుండా 8 చారులు మాత్రమే ఉన్నాయి. పోలికలు లేవు.

6. మండల భేదాలు : నాట్యశాస్త్రంలో 10 భౌమీమండలాలు,

శతాబ్దికి చెందినవాడు. అంతేకాదు. శాస్త్రకర్తలలో ఒకడుగా నందికేశ్వరుడు సంగీతరత్నాకరంలో పేర్కొనబడినాడు. అందుచేత సంగీతరత్నాకరమే అభినయదర్పణమునకు ఋణపడి ఉన్నదని చెప్పక తప్పదు.

## 14. అభినయ దర్పణం-అనువాదాలు, ప్రచురణలు

పోలూరి గోవిందకవి :

ప్రాచీన కాలంనుంచీ నృత్య-గానాలకు ఆంధ్రదేశం కాణాచి అన్న సత్యం సహృదయులకు తెలిసిందే. అయినా, నృత్య-సంగీతాలకు శాస్త్ర గ్రంథాలు ఇంచుమించు క్రీ.శ. 16వ శతాబ్ది వరకు తెలుగులో వెలయలేదనే చెప్పాలి. క్రీ.శ. 16-17 శతాబ్ది ప్రాంతాలలో పోలూరి గోవిందకవి తాళదశప్రాణదీపిక, రాగతాళ చింతామణి అనే రెండు గ్రంథాలను కావ్యరూపంగా రచించినాడు.[1] "మహేశ్వరప్రణీతంబైన ఆదిభరతంబు నందికేశ్వరాది భరతంబులకంటె ఉత్తమోత్తమంబై నిలసిల్లు. అట్టి ఆదిభరతప్రకారంబున తాళదశ ప్రాణలక్షణ నిర్ణయం బొనరించెదను" అని తాళదశప్రాణదీపికను రచించినాడు. ఇందులో — కాలం, మార్గం, క్రియ, అంగం, గ్రహం, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారం అనే తాళంయొక్క దశ ప్రాణాలు వివరించబడినవి.

"సంగీత శాస్త్రంపు సర్వంకష ప్రజ్ఞగలిగియుఁ దొల్లిటి కవివరేణ్యు లీ భాతి నాంధ్రోక్తి శోభిత కావ్యంబు పచరింపక" పోవటం

---

1. చూ. "పోలూరి గోవిందకవి" అనే నా వ్యాసం (అర్చన-ఆచార్య విస్సా అప్పారావు శతాబ్ది స్మారక సంచిక-1984). మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మానుస్క్రిప్ట్స్ లైబ్రరీవారు 1950 లో తాళదశప్రాణదీపికను, 1952లో రాగతాళచింతామణిని ప్రచురించారు.

తన భాగ్యంగా ఎంచి, "సాహసము సేసి భరతశాస్త్రంబు తెనుఁగుఁ గబ్బముగఁ జేయఁబూనితి నిబ్బరముగ" అంటూ గోవిందకవి రాగ తాళచింతామణిని రచించినాడు. భాగవతరచనలో బమ్మెరపోతన్న గారికి లభ్యమైన 'శుభాధిక్యంబు' వలెనే, భరతశాస్త్ర రచనలో గోవిందకవికి 'భాగ్యగరిమ' లభించినదన్న మాట.

ఐదాశ్వాసాల రాగతాళచింతామణిలో మొదటి ఆశ్వాసం భరతముని నాట్యశాస్త్రంలోని మొదటి అధ్యాయానికి 'తెనుఁగు సేత'. ఇంక తక్కిన నాలుగు అధ్యాయాలు రాగ-తాళాలకు సంబంధించినవి.

గోవిందకవి రెండు గ్రంథాలు అభినయ దర్పణానికి సంబంధించక పోయినప్పటికీ, సంగీత శాస్త్రాన్ని తెలుగులో రచించిన ప్రథముడుగా అతడు శ్లాఘనీయుడు.

లింగముగుంట మాతృభూతయ్యకవి:

క్రీ.శ. 17వ శతాబ్దికి చెందిన మాతృభూతయ్య 'అభినయ దర్పణం' అన్న పేరుతో భరతశాస్త్రాన్ని పద్యకావ్యంగా, శ్రీరంగధామునకు అంకితంగా రచించినాడు. ఇందులో మూడు ఆశ్వాసాలున్నాయి: 1. అవతారిక, సభారచన, శిరోభేదాలు; 2. అసంయుత హస్తాలు; 3. సంయుతహస్తాలు, ప్రకీర్ణహస్తాలు. ఇది చాలా వరకు అభినయదర్పణాన్ని అనుసరించి ఉన్నది. అందులోవలెనే ఇందులో కూడా బుద్ధావతారహస్తానికి బదులు, కృష్ణావతార హస్తం చెప్పబడింది. అయితే, నందికేశుని ప్రశంసకానీ, మూలగ్రంథ ప్రసక్తి కానీ ఎక్కడా లేదు, క్రింది వాక్యం తప్ప:

"ధరను విలసిల్లు నభినయదర్పణంబు
గరిమ నిదె పద్యకావ్యంబుగా నొనర్తు". (I - 18 ప.)

మూలంలో లేని ఋతు-నవరస-నవరత్న-నవలోహ-సప్తస్వర-సప్తవార హస్తాలు ఇందులో అధికంగా ఉన్నాయి.

చిల్లకూరి దివాకర కవి :

క్రీ.శ. 17వ శతాబ్దికి తరువాతివాడు అయిన దివాకర కవి 'భరతసార సంగ్రహం' అనే శాస్త్ర గ్రంథాన్ని రామాంకితంగా, పద్యకావ్యంగా రచించినాడు[1]. భరతముని నాట్యశాస్త్రం మొదలు సంగీతరత్నాకరం వరకుగల పది విధాలయిన శాస్త్రగ్రంథాలను పరిశీలించిరచించిన గ్రంథమట.ఇందులో,విశిష్టమైన విభజన లేకపోయి నప్పటికి,నాలుగు అధ్యాయాలున్నవని చెప్పవచ్చు — 1. అభినయం, ఆయా విశేషాలు; 2. అసంయుత, నృత్య, ప్రకీర్ణహస్తాలు; 3. మృదంగం, తాళం, సభారచన; 4. పూర్వరంగ విధానం, రాగ లక్షణం, దండెలక్షణం,రాగదాంపత్యం మొదలయినవి.అసంయుత హస్తాలలో హస్తభేదాల పేరుతో సర్పచతుర,సర్పశీర్ష,పూర్వభ్రమరవంటిక్రొత్త హస్తాలు అధికంగా ఉన్నాయి. అట్లాగే సంయుత హస్తాలలో వల్లభాయుత, రక్షామోద హస్తాలు అధికం. సభాపతి, సభ్యులు, సభ, గాయకుడు, వాదకుడు, పాత్ర (=నర్తకి) - ఈ ఆరూ 'సంగీత షడంగములు' అన్నాడు దివాకరకవి. అసంయుత, సంయుతహస్తాల వివరణ ముగిసిన పిమ్మట 'సర్వాంగాభినయం' క్రొత్తగా చెప్పబడింది. మాతృభూతయ్య చెప్పినట్లుగానే ఋతు-నవరసాదులకు దివాకర కవి కూడా హస్తాభినయం చెప్పినాడు.[2]

సంస్కృతంలో చంద్రశేఖరకవి రచించిన 'భరతసారమ్' అనే శాస్త్రగ్రంథం ఉంది. దీనిని దివాకరకవి కొంతవరకు అనుసరించినాడు.ఆద్యంతాలు లభించని సంస్కృత భరతసారమ్‌ను తెనాలి

---

1. మాతృభూతయ్య రచించిన అభినయదర్పణం 1957లోనూ, దివాకరకవి రచించిన భరతసారసంగ్రహం 1956లోనూ మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మానుస్క్రిప్ట్స లైబ్రరీ వారిచేత ప్రకటితమైనవి.
2. సంస్కృత అభినయదర్పణంలో లేని ఈ క్రొత్త హస్తాలను అనుబంధంలో వివరించాను.

హాసులైన లంకా సూర్యానారాయణ శాస్త్రిగారు పూరించి, తెలుగు లిపిలో, వచనానువాదంతో, సచిత్రంగా 1955లో ప్రకటించారు. భరతసారమ్ సంస్కృత మూలంలోనూ, దివాకరకవి గ్రంథంలోనూ బౌద్ధావతారహస్తం చెప్పబడింది.

బహుజనపల్లి సీతారామాచార్యులు :

'శబ్దరత్నాకరం' అనే తెలుగు-తెలుగు నిఘంటు కర్తగా, ప్రౌఢవ్యాకరణకర్తగా ఆచార్యులవారు సుప్రసిద్ధులు. క్రీ.శ. 1885లో తొలిసారిగా ముద్రితమైన ఈ నిఘంటువులో, ఆయా హస్తాలపేర్ల క్రింద సరళమైన వచనంలో నిర్వచనాలు ఇవ్వబడినవి. ఉదా : పతాక......అభినయహస్త విశేషము (బొటనవ్రేలిని వంచి చూపుడువ్రేలి మొదటఁగూర్చి వ్రేళ్ళన్ని చక్కగాఁజాచి పట్టినది).

తిరువేంకటాచార్యులు :

వీరు తంజావూరు మండలంలోని సీడామంగల నివాసి. ఇంటి పేరు మాడభూషి. వీరు గ్రంథాంతరాల నుంచి 408 శ్లోకాలను సేకరించి, వాటిని మూలంలో ఆయా స్థానాలలో చేర్చి, అభినయ దర్పణాన్ని తెలుగులో ప్రప్రథంగా క్రీ.శ. 1887లో ప్రకటించారు. ఇందులో 718 శ్లోకాలు ఉన్నాయి. ఆ శ్లోకాలకు సరళమైన వచనానువాదము ఉన్నది. దీని చివరి ముద్రణము 1934లో జరిగినది (తరువాత ఇది మరల ముద్రితమైనట్లు కానరాదు). ఇందులో 28 అసంయుత హస్తాలకు రేఖా చిత్రాలు ఉన్నాయి.

ఆనంద కుమారస్వామి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య :

సుప్రసిద్ధ ఆంగ్లనాటక విమర్శకుడుఅయిన Gordon Craig 1915లో ఆనందకుమారస్వామికి ఉత్తరం వ్రాస్తూ భారతీయ నాట్య సంప్రదాయాన్ని వివరించే గ్రంథాలను అనువదించి ఇవ్వవలసినదిగా కోరినాడట. అప్పటికి నాట్యశాస్త్రం అనువదింపబడటమనే మాట

అటుంచి, అసలు సుసంపన్నంగా ముద్రితమే కాలేదు. అందుచేత, చిన్నదైన అభినయదర్పణమును అనువదించి ఆయనకు పంపించ టానికి పూనుకొన్నారు ఆనందకుమారస్వామి. ఇందులకు ఆనందించిన మిత్రులు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు నీడామంగలం తిరు వేంకటాచార్యులు గారు ప్రకటించిన తెలుగు లిపిలోని అభినయ దర్పమును ఆనంద కుమారస్వామికి ఇచ్చి అనువాదంలో సహకరించి నారు. అంటే 718 శ్లోకాలను, సరళమైన ఆంగ్లభాషలోనికి అను వదించి "The Mirror of Gesture" అనే పేర 1917లో ప్రక టించటమే కాక చక్కని పీఠిక కూడా చేర్చారు ఆనంద కుమార స్వామి. దీని పునస్సంశోధిత ముద్రణము 1936లో వెలువడింది. నీడామంగలంవారి తెలుగు పీఠిక కూడా, ఆంగ్లంలోకి అనూదితమై, ఇందులో ప్రకటితమైంది.

భారతీయ-పాశ్చాత్య అభినయ రీతులను గూర్చి ఆనంద కుమారస్వామి చేసిన విమర్శ తప్పక గమనించవలసియున్నది : "Indian acting is a poetic art, an interpretation of life while European acting, apart from any question of the words, is prose, or imitation (Introduction-Page 5)

ఢిల్లీలోని మున్షీరామ్ మనోహార్ లాల్ పబ్లిషర్సు వారు "The Mirror of Gesture" మూడవ ముద్రణమును 1977 లో వెలువరించినారు.

డా॥ మనోమోహన్ ఘోష్ :

1917లో వెలువడిన 'The Mirror of Gesture' ఉత్సుక తను రేకెత్తించగా, అభినయదర్పణపు వ్రాత ప్రతులను పరిశీలించి పాఠనిర్ణయం చేసి, మూలాన్ని ఆంగ్లానువాద సహితంగా 1934లో

డా. ఘోష్ ప్రకటించారు (The Mirror of Gesture లో మూలం లేదు). ముద్రిత ప్రతులు అచిరకాలంలోనే చెల్లిపోయినవి. ఇంతలో The Mirror of Gesture రెండవ ముద్రణ 1936లో వెలువడింది. డా. ఘోష్ నాట్యశాస్త్రానికి చేసిన ఆంగ్లానువాదం 1957లో వెలువడింది. అయినప్పటికీ అభినయదర్పణం కోసం డా. ఘోష్‌కు ఉత్తరాలు వస్తూనే ఉన్నవట. అందుచేత 1934 నాటి ప్రచురణను పునః సంశోధించి, రెండవ ముద్రణమును 1957లో వెలువరించినారు. దీనికి విపులమైన పీఠిక కూడా వ్రాసినారు డా. ఘోష్. ఇందులో 328 శ్లోకాలే ఉన్నాయి. సంయుత-అసంయుత హస్తాలకు రేఖా చిత్రాలు ముద్రితమైనవి.

వాచస్పతి గైరోలా :

డా॥ మనోమోహన్ ఘోష్ ఆంగ్లానువాద సహితంగా ప్రకటించిన అభినయదర్పణం ఆధారంగా, గైరోలా హిందీ అనువాదం వెలువరించారు (సంవర్తికా ప్రకాశన్-అలహాబాదు, 1967). ఇందులో కూడా 328 శ్లోకాలే ఉన్నాయి. ఈ శ్లోకాలకు గైరోలా హిందీ వచనంలో తాత్పర్యం వ్రాశారు. 'భారతీయ నాట్యపరంపరా' అన్న శీర్షికతో 187పుటల పీఠికకూడా వ్రాశారు; ఈ పీఠికలో నాట్య-నృత్త-నృత్యాలకు సంబంధించిన అనేక అంశాలు విపులంగా చర్చింపబడినవి.

మానవల్లి రామకృష్ణకవి :

కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారి సంపాదకత్వంలో వెలువడిన "ఆంధ్ర విజ్ఞాన సర్వసము' రెండవ సంపుటంలో' 'అభినయం' అన్న శీర్షిక క్రింద నాట్యశాస్త్ర సంపాదకులయిన కవిగారు పెద్ద వ్యాసం వ్రాశారు (ఆంధ్ర పత్రిక ప్రచురణము - 1934). ఇందులో అభినయదర్పణ శ్లోకాలు, సచిత్రంగా, ముద్రితమైనవి.

నా అనువాదం :

ఇవి నా దృష్టికి వచ్చిన రచనలు. తెలుగు (కావ్య) గ్రంథాలలో మూలం లేదు. నీడా వారు మూలం ఇచ్చి, తెలుగులో తాత్పర్యం మాత్రం వ్రాశారు. ఆనంద కుమారస్వామి మూలరహితంగా ఆంగ్లంలో కేవలం వచనానువాదం ఇచ్చారు. డా. ఘోష్, వాచస్పతి గైరోలా - ఇరువురూ కూడా మూల శ్లోకాలు ఇచ్చినా, తాత్పర్యం మాత్రమే వ్రాశారు. కవిగారు శ్లోకాలను ఉద్ధరించినా, తెలుగున తాత్పర్యం వ్రాయలేదు. కాగా, మూల శ్లోకాలకు ప్రతి-పద- అర్థాలు ఎవ్వరూ వ్రాయలేదు. నేటి నృత్యాచార్యులు - బహుశః చాలామంది - సంస్కృత భాషలో పరిశ్రమ చేసిన వారు కాదనటం సత్యదూరం కాదు; అందుచేత మూలశ్లోకాలు, సుబోధకం కావటానికి, ప్రతిపదార్థం వ్రాయవలసిన ఆవశ్యకత ఎంతేనా ఉంది. ఈ దృష్టితోనే నేను నా అనువాదం సాగించాను. అంతే కాదు, నా తెలుగు నాట్యశాస్త్రం ఇంతకుముందే ప్రకటితమైనది. అది ప్రచారం కూడా పొందింది. నాట్యశాస్త్రంలోని ఆంగికాభినయం అధ్యయనం చేసిన వారికి, అభినయదర్పణంలో కనిపించే తేడాలు విభ్రమం కలిగించవచ్చు. అందుచేత, సాధ్యమైనంత వరకు నాట్యశాస్త్రంతో పోలికలు, తేడాలు కూడా వివరించే ప్రయత్నం చేశాను. విద్యార్థుల సౌలభ్యం కోసం, హస్తాలకు రేఖా చిత్రాలు కూడా చేర్చాను. ఈ నా అనువాదం సహృదయులకు ఉపయోగపడ గలదని విశ్వసిస్తున్నారు.

ఇంతవరకు చేసిన పరిశీలనమునుబట్టి నాట్యశాస్త్రం, అభినయ దర్పణం, నీడావారు వేరే గ్రంథాల నుంచి అభినయదర్పణంలో చేర్చినవి - ఈ మూడూ మూడు సంప్రదాయాలకు చెందినవని స్పష్టమవుతున్నది. లభ్యమవుతున్న ఇంకో పదిపన్నెండు గ్రంథాలలో కూడా భేద-సాదృశ్యాలు కన్పట్టుతున్నాయి. కాగా, అంగ-

ఉపాంగ-ప్రత్యంగాల భేద-విభేదాలను సమన్వయంచేసి, నిర్దిష్టమైన స్వరూపం ఆంగికాభినయ విషయంలో విశదీకరించవలసిన అవసరం ఎంతేనా ఉంది. అంతేకాదు. తక్కిన మూడు అభినయాలను గూర్చి విపులంగా వివరించవలసిన అవసరం కూడా అధికంగా ఉంది. ఈ కృషి చేపట్టాలని నా చిరకాలవాంఛ. ఈ విషయంలో యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ వారు, ముఖ్యంగా ఉపాధ్యక్షులు ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు, నాకు అవకాశం కల్పించినారు. వారికి నా కృతజ్ఞతలు. నటరాజు అనుగ్రహంతో, సహృదయుల ఆదరంతో నేను నా కృషిలో కృతకృత్యుడను కాగలనని విశ్వసిస్తున్నాను.

## 15. పాఠభేదాలు : శ్లోక సంఖ్య

తాళపత్రప్రతులను పరిశీలించి, పాఠ నిర్ణయంచేసి డా. ఘోష్ ప్రకటించిన గ్రంథంలో 324 శ్లోకాలున్నాయనీ, సీడావారు ప్రకటించిన గ్రంథంలో 718 శ్లోకాలు ఉన్నాయనీ, ఈ రెండిటిని సమన్వయంచేసిన నా అనువాదంలో 814 శ్లోకాలున్నాయనీ ఇంతకు ముందు పేర్కొన్నాను. ఈ మూడింటిలోని విషయాలను, శ్లోక సంఖ్యను పట్టిక రూపంలో ఇస్తున్నాను.

| విషయాలు | శ్లోక సంఖ్య | | |
|---|---|---|---|
| | నా అనువాదంలో | ఘోష్ గ్రంథంలో | సీడా గ్రంథంలో |
| ఇష్టదేవతా ప్రార్థన | 1 | 1 | 1 |
| నందికేశ్వర దేవేంద్ర సంవాదం | 2-9 | — | 2-8 |
| నృత్యావతరణం | 10-14 | 2-7 | -- |
| శాస్త్ర ప్రశంస- | 15-18 | 7-11 | — |

## 17. నా అనువాదవిధానం

1. శ్లోకాలు అన్నీ చిన్న టైపులో ముద్రితమైనవి. ప్రతీ శ్లోకానికి 'అర్థం' అనే శీర్షిక క్రింద ప్రతి-పద-అర్థం; 'తాత్పర్యం' అనే శీర్షిక క్రింద వచనంగా ఆ శ్లోక సారాంశం వ్రాశాను. 'టీక' అనే శీర్షిక క్రింద విశేషాంశాలను, ముఖ్యంగా నాట్య శాస్త్రంతో గల పోలికలను, తేడాలను వివరించాను.

2. సంస్కృత శ్లోకాలలో చ, అపి, తు, తథా వంటివి సాధారణంగా పాద పూరణాలుగా ఉంటాయి. అందుచేత, ప్రతిపదార్థం వ్రాసేటప్పుడు, వాటిని సంస్కృతభాగంలో కుండలీకరణాలలో ఉంచి, అనువాదంలో చూపటం మానివేశాను.

3. వినియోగాలను చెప్పేటప్పుడు, ప్రతి వినియోగం సంస్కృతంలో సప్తమీ విభక్తిలో ఉంటుంది. ఉదా : నృత్తారంభే జపాదౌ చ గర్వే ప్రణయకోపయోః"-దీనిని "నృత్తప్రారంభమందు, జపాదులందు, గర్వమందు, ప్రణయమందు, కోపమందు" అంటూ అనువదించాలి. కాని "నృత్తారంభం, జపాదులు, గర్వం..." అంటూ ప్రథమా విభక్తిలో చెప్పి, చివరన -వీటిని ప్రదర్శించటంలో లేదా వీటి అర్థాలను నిరూపించటంలో" అంటూ పేర్కొన్నాను.

4. యోజ్యం, ఉక్తం, కార్యం ... మొదలయిన క్రియలకు అర్థాలు వేరువేరు అయినా, సారాంశం ఒక్కటే కాబట్టి, అనువాదంలో ఆయా భేదాలను పాటించలేదు.

5. సుబోధకం కావటంకోసం, సాధ్యమైనంతవరకు వ్యావహారికంలోనే రచన సాగించాను.

6. పాఠ భేదాలు వివరించేటప్పుడు, డా॥ మనోమోహన్ ఘోష్ గ్రంథంలోని పాఠాన్ని 'ఘోష్ పాఠం' లేదా 'ఘోష్' అనీ, నీడామంగలంవారి గ్రంథంలోని పాఠాన్ని 'నీడా పాఠం' లేదా 'నీడా' అనీ, ఆనందకుమారస్వామి అనువాదాన్ని ఉటంకించినప్పుడు 'కుమారస్వామి' లేదా 'స్వామి' అనీ పేర్కొన్నాను.

7. మాతృభూతయ్యకవి, దివాకరదాసు కొన్ని క్రొత్త హస్తాలు చెప్పినారు; వాటిని ఒకటవ అనుబంధంలో చూడవచ్చు.

8. అష్టరసాభినయమునకు ఆనవైన ఒక శ్లోకం 'సౌందర్య లహరి'లో ఉన్నది. దానిని రెండవ అనుబంధంలో ఇచ్చి, ప్రతిపదార్థ, తాత్పర్య, టీకలను వ్రాశాను.

9. దశావతారనృత్యం చేసేటప్పుడు సాధారణంగా గీత గోవిందంలోని అష్టపదిని గానం చేయటం జరుగుతున్నది. ఈ అష్టపదిని జయదేవుడు పాడుతూ ఉంటే, పద్మావతి ఏ విధంగా అభినయం చేసేదో మనకు తెలియదు. కాని, 17 అష్టపదులకు అభినయం నిర్దేశిస్తూ ఉన్న రెండు తాళపత్ర ప్రతులు తంజావూరు సరస్వతీమహాల్ లైబ్రరిలో లభించాయి. వాటిని సంస్కరించి, ఆ గ్రంథాలయంవారు దానిని 1950లో గ్రంథరూపంగా ప్రకటించారు. అందులో నుంచి దశావతార శ్లోకానికి, తరువాత అష్టపదికి నిర్దిష్టములైన అభినయాలను 3వ అనుబంధములో చేర్చాను.

10. కావలసిన హస్తాదులను సులువుగా గుర్తించుటకై అకారాదిక్రమంలో పదానుక్రమణికను 4వ అనుబంధంగా కూర్చాను. మొత్తం 74 హస్తాలకు రేఖా చిత్రాలు ముద్రించాను. నాట్యశాస్త్రంలోను, అభినయ దర్పణం లోనూ సమానంగా ఉన్న హస్తాలకు నాట్యశాస్త్రంలోని రేఖాచిత్రాలనే గ్రహించాను. భిన్నంగా ఉన్నప్పుడు క్రొత్తవి వ్రాయించటమేకాక, భేదం తెలియటంకోసం నాట్య శాస్త్రంలోని హస్తాలను కూడా ఇచ్చాను చిత్రంక్రింద 'అ, ద' అని ఉన్నవి అన్నీ అభినయ దర్పణంలో భిన్నంగా ఉన్న హస్తాలే.

11 చిన్నలైపులో న, ల కు, ష, వ లకు భేదం తక్కువ. ఇందలి పదాలను, పెద్ద లైపులో ఉన్న పదాలతో సరిచూసు కోవలెనని కోరుతున్నాను.

*పోణంగి శ్రీరామ అప్పారావు*

# విషయ సూచిక

## పీఠిక



## అనువాదం

అనుబంధాలు 443-480

కంఠే నాఽఽలంబయే ద్గీతం హస్తే నార్థం ప్రదర్శయేత్ ।
చక్షుర్భ్యాం దర్శయే ద్భావం పాదాభ్యాం తాల మాచరేత్ ॥
యతో హస్త స్తతో దృష్టిః యతో దృష్టి స్తతో మనః ।
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః ॥

- అభినయ దర్పణం - శ్లో. 56 - 57.

# 1
# అవతారిక

## ఇష్టదేవతా ప్రార్థన

**ఆంగికం భువనం యస్య వాచికం సర్వవాఙ్మయమ్ ।**
**ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్త్వికం శివమ్ ॥**

అర్థం : యస్య = ఏ శివునకు, భువనం = ఈ ప్రపంచమంతా, ఆంగికం = ఆంగిక(అభినయ) మో, సర్వ వాఙ్మయమ్ = వాఙ్మయం అంతా, వాచికం = వాచిక (అభినయ) మో, చంద్రతార - ఆది = చంద్రుడు నక్షత్రాలు మొదలైనవి, ఆహార్యం = ఆహార్య (అభినయ) మో, తం = అటువంటి, సాత్త్వికం = సాత్త్విక (అభినయ) స్వరూపుడైన, శివం = శివుని, వందే = నమస్కరిస్తున్నాను.

తాత్పర్యం : నటరాజు అయిన శివునకు చరాచరమైన ఈ ప్రపంచమంతా ఆంగికాభినయం. వాఙ్మయమంతా వాచికాభినయం. చంద్రుడు, నక్షత్రాలు మొదలైనవి ఆహార్యాభినయం - అటువంటి సాత్త్వికాభినయ స్వరూపుడయిన శివుని నమస్కరిస్తున్నాను (శివునకు నా నమస్కారము).

టీక : 'వందే' అనే క్రియకు 'నుమః' అనే పాఠాంతరం ఉంది; 'స్తుతిస్తున్నాము' అని దీని అర్థం.

మనం ఏ కార్యం ప్రారంభించాలను కొన్నా, ముందుగా విఘ్నేశ్వర ప్రార్థన చేస్తాము. అట్లాగే నృత్య - నాట్యాలను ప్రారంభించే ముందు నటరాజు అయిన శివుని ప్రార్థించటం సంప్రదాయం. శార్ఙ్గదేవుని 'సంగీతరత్నాకరం' లోని సప్తమాధ్యాయానికి 'నర్తన అధ్యాయం' అని పేరు. ఆ అధ్యాయ ప్రారంభంలోకూడా ఈ శ్లోకమే ఉంది. సంగీతరత్నాకరం అభినయదర్పణం కంటె అర్వాచీనంకాబట్టి శార్ఙ్గదేవుడు అందులో నుంచే ఈ శ్లోకాన్ని గ్రహించి ఉంటాడు. సంగీతరత్నాకరానికి రెండు సంస్కృత వ్యాఖ్యలు ముద్రితమైనాయి- 1. చతురకల్లినాథుని 'కళానిధి' వ్యాఖ్య, 2. సింహభూపాలుని 'సంగీత సుధాకర' వ్యాఖ్య. ఈ ఇరువురూ తెలుగువారే!

శివుని నటరాజ స్వరూపం ఈ శ్లోకంలో వర్ణితమైంది. అంగము (శరీరంలోని అవయవము)లకు సంబంధించింది 'ఆంగికం'. ఆంగికమైన వ్యాపారం లేదా చేష్ట 'ఆంగికాభినయం'. పరిదృశ్యమానమైన అంటే కంటికి కనిపించే లోకమంతా భువనం. శివుడు, పృథివి మొదలగు వాటితోడి అష్టమూర్తి అంటే జగత్ స్వరూపుడు. కావున ఈ భువనంలోని క్రియకలాపమంతా ఆయనకు ఆంగికమే; అంటే అంగ వ్యాపారమే. 'నిఃశ్వసితమస్యవేదాః' అని శ్రుతి. వేద - శాస్త్రాది సమస్త శబ్దజాలం ఆయనకు వాచికం అంటే వాగ్వ్యాపారం. సకల జగత్కర్త కావటంవల్ల చంద్రతారాది జ్యోతిష మండలమంతా ఆయనకు హార - కేయూరాది భూషణావళి అవుతున్నది; అసలు, శివుడు చంద్రమౌళి కదా! సత్త్వగుణ ప్రధానమైనది 'సాత్త్వికం' అనబడుతుంది. సత్త్వమంటే 'సత్త' లేదా 'సర్వశక్తిమత్త్వము' అని అర్థం. శివుడు సత్త్వగుణ స్వరూపుడేకాక సర్వశక్తిమంతుడు కూడా.

'శివ' శబ్దంచేత కూటస్థుడైన పరమశివుడు సూచితమైనాడనీ, అందుచేత సాత్త్వికమన్నదానికి విరోధం లేదనీ కల్లినాథుడు పేర్కొన్నాడు. పురాణాదులలో శివుడు తమోగుణ ప్రధానుడుగా వర్ణితుడు. మరి ఆయనను సత్త్వగుణ స్వరూపుడనటం ఎట్లా సార్థకమవుతుందని ఆశంకించుకొని, హరిహరులకు అభేదం కాబట్టి, శివుని సాత్త్విక స్వరూపునిగా వర్ణించటంలో దోషంలేదని సింహభూపాలుడు సమాధానం చెప్పినాడు. అంతేకాదు, శివ శబ్దానికి ఇంకో అర్థంకూడా చెప్పినాడు. 'శివ' శబ్దానికి 'శుభం' అనికూడా అర్థం. 'శివుని నమస్కరిస్తున్నాను' అనటానికి బదులుగా 'శుభకరమైన నృత్యాన్ని నమస్కరిస్తున్నాను' అనికూడా అర్థం చెప్పవచ్చు.

ఈ శ్లోకంలో నృత్యానికి సంబంధించిన అంశాలన్నీ సూచితములైనాయి. అంగవిన్యాసంతో చేసేది 'ఆంగికాభినయం.' వాగ్రూపమైనది వాచికాభినయం. భూషణాదులతో అలంకరించుకొనటం ఆహార్యాభినయం. కంపాది సాత్త్విక భావప్రకటన సాత్త్విక

అభినయం. ఇటువంటి నృత్యము శుభకరమైనది; శుభంకరమైన నృత్యమును నమస్కరిస్తున్నాను.

## నందికేశ్వర - దేవేంద్రసంవాదం

కల్యాణాచల వాసాయ కరుణారససింధవే ।
నమోఽస్తు నందికేశాయ నాట్యశాస్త్రార్థదాయినే ॥ 2

అర్థం : కల్యాణ - అచల - వాసాయ = మంగళప్రదమైన (కైలాస) పర్వతం నివాసంగా కలవాడు, కరుణారససింధవే = దయాసముద్రుడు, నాట్యశాస్త్ర - అర్థదాయినే = నాట్యశాస్త్రం యొక్క అర్థాలను ప్రసాదించేవాడు (అయిన), నందికేశాయ = నంది కేశునకు, నమః అస్తు = (నా) నమస్సు అగుమగాక ( = నందికేశుని నేను నమస్కరిస్తున్నాను).

తాత్పర్యం : కైలాసవాసుడు, దయాసముద్రుడు, నాట్య శాస్త్రంయొక్క అర్థాలను తెలియజెప్పగలవాడు - అయిన నంది కేశుని నమస్కరిస్తున్నాను.

టీక : ఇవి. నందికేశుని చూడటానికి కైలాసం వచ్చిన దేవేంద్రుని మాటలు. నంది లేదా నందికేశుడు లేదా నందికేశ్వరుడు నటరాజు అయిన శివునియొక్క వాహనం. ఈ అభినయదర్పణమే కాక, దీనికి మూలంగా తలంచబడే భరతార్ణవం కూడా నందికేశ ప్రణీతంగానే సుప్రసిద్ధం. అసలు, అభినయదర్పణం, భరతార్ణ వానికి సంక్షిప్తరూపమని తరువాత చెప్పబడింది. 'నాట్యశాస్త్రార్థ దాయినే' అని సంబోధించటంలోనే ఇంద్రుడు తన రాకకు కారణం చెప్పినట్లయింది.

స్వాగతం తే సురాధీశ కుశలం త్రిదివౌకసామ్ ।
కిమర్థ మాగతం బ్రూహి భవతా మమ సన్నిధౌ ॥ 3

అర్థం : సుర - అధీశ! = దేవతలకు ప్రభుడవు అయినవాడా! ( = ఓ ఇంద్రుడా! ), తే = నీకు, స్వాగతం = స్వాగతం (చెబుతు న్నాను), త్రిదివౌకసామ్ = స్వర్గ వాసుల(ందర)కు, కుశలం? =

క్షేమమా?, మమ - సన్నిధౌ = నా సన్నిధిలో (= నా దగ్గరకు); భవతా = నీ చేత (= నీ యొక్క), ఆగతం = వచ్చుట (= రాక), కిమ్-అర్థం? = ఏమి అర్థం? (= ఎందుకొరకు?), బ్రూహి = చెప్పుము.

తాత్పర్యం : ఓ ఇంద్రుడా! నీకు స్వాగతం. స్వర్గవాసులందరకు క్షేమమే కదా! నీవు నావద్దకు వచ్చుటకు కారణమేమిటి? చెప్పుము- అని నందికేశుడు అడిగినాడు.

త్వదీయ కృపయా పూర్వం నాట్యశాలా మలంకృతామ్ ।
త్వదీయనర్తకః సోఽయం త్వత్కృపా మభివాంఛతి ॥ 4

అర్థం : పూర్వం = ఇంతకుముందు, త్వదీయ కృపయా = నీ దయవల్ల, అలంకృతామ్ = అలంకరించబడిన (= సర్వసామాగ్రీ సమేతమైన), నాట్యశాలామ్ = నాట్యశాలను (కలిగిఉన్న), త్వదీయ నర్తకః = నీ యొక్క నర్తకుడు (అయిన), సః అయం = ఆ ఇతడు (= నేను), త్వత్ = నీయొక్క, కృపామ్ = దయను, అభివాంఛతి = (ఇంకను) కోరుతున్నాడు (= కోరుతున్నాను).

తాత్పర్యం : నీ దయవల్ల సర్వసామగ్రీ సముపేతమైన నాట్యశాల నాకు ఇంతకు ముందే ఉంది. ఆ నాట్యశాలకు అధిపతిని అయిన నేను నీ దయను ఇంకా కోరుతున్నాను- అని ఇంద్రుడు సమాధానమిచ్చినాడు.

టీక : "నేను కోరుతున్నాను" అనటం కంటే "( నీ ఎదురుగా ఉన్న ) వీడు కోరుతున్నాడు" అనటం సంప్రదాయం. ఇంద్రునకు సర్వలక్షణ సంపన్నమైన నాట్యశాల ఉంది. నృత్యంలో శిక్షణ పొంది, నర్తకుడు కూడా అయినాడు. కాని, ఆయనకు శాస్త్రం తెలియదు. అది తెలుసుకోవాలన్న కోర్కెతో వచ్చినవాడు కావటంచేతనే "నీ దయను ఇంకా కోరుతున్నాను" అనటం.

మయా విధేయం కిం తస్య వద వాసవ తత్త్వతః।

అర్థం : వాసవ! = ఓ ఇంద్రుడా! తస్య = అతనికి (= నీకు), మయా = నా చేత, విధేయం = చేయదగినది, కిం = ఏమిటో,

తత్త్వతః = యథార్థంగా, వద = చెప్పుము — అని ప్రసన్నుడై న నంది కేశుడు ఇంద్రుని అడిగినాడు.

తాత్పర్యం : "ఓ ఇంద్రుడా! నేను చేయదగినది ఏమిటో విశదంగా చెప్పుము" అని నందికేశుడు అడిగినాడు.

> దైతేయ నాట్యశాలాయాం నర్తకో నటశేఖరః ॥ 5
> తం విజేతు మయం నాట్యవినోదైః క్రమవేదిభిః ।
> భవద్విరచితం గ్రంథం భరతార్ణవ మిచ్ఛతి ॥ 6

అర్థం : దైతేయ నాట్యశాలాయామ్ = దైత్యుల (= రాక్షసుల) నాట్యశాలలో, నటశేఖరః = నటశేఖరుడు (అనే), నర్తకః = నర్తకుడు (ఉన్నాడు), అయం = ఈతడు (= నేను), క్రమవేదిభిః = పక్రమపద్ధతి తెలిసిన (= శాస్త్రీయంగా నిర్వహించబడే), నాట్య వినోదైః = నాట్యాలు అనే వినోదాలచేత, తం = ఆ నటశేఖరుని, విజేతుం = జయించటానికి, భవత్ విరచితం = మీ చేత బాగుగా రచింపబడిన, భరతార్ణవం = భరతార్ణవం (అనే పేరుగల), గ్రంథం = (శాస్త్ర) గ్రంథాన్ని, ఇచ్ఛతి = అపేక్షిస్తున్నాడు (= అపేక్షిస్తు న్నాను).

తాత్పర్యం : దైత్యుల నాట్యశాలలో 'నటశేఖరుడు' అనే నర్తకుడు ఉన్నాడు. శాస్త్రీయంగా నిర్వహించబడే నాట్యవినోదా లతో ఆ నటశేఖరుని జయించాలన్న ఆశతో మీరు విరచించిన 'భరతార్ణవం' అనే శాస్త్రగ్రంథాన్ని కోరుతున్నాను - అని ఇంద్రుడు విన్నవించినాడు.

టీక : 'నటశేఖరుడు' అనేది ఆ వ్యక్తి పేరు కావచ్చు, లేదా నటులలో శ్రేష్ఠుడు అని కూడా అర్థంకావచ్చు. నర్తకులమధ్య, నటులమధ్య స్పర్ధలు నాడూ నేడూ కూడా సుప్రసిద్ధాలే. నటశేఖ రుడు ప్రదర్శించే నాట్యవినోదాలు శాస్త్రబద్ధాలై ఉన్నాయి. వానిని జయించవలెనంటే ఇంద్రుడు ప్రదర్శించే నాట్య వినోదాలు కూడా శాస్త్రబద్ధం కావాలి. అందుచేతనే శాస్త్రాన్ని అభ్యసించటం

కోసం భరతార్ణవాన్ని అర్థించినాడు ఇంద్రుడు. ఒకవేళ నటశేఖరుని నాట్యవినోదాలు శాస్త్రబద్ధం కాకపోయినా, ప్రజారంజకంగా ఉండి ఉంటాయి. అప్పుడుకూడా, వానిని జయించాలంటే ఇంద్రుని నాట్యవినోదాలు శాస్త్రబద్ధం కావటం అవశ్యకం. కారణం ఏదైనా, శాస్త్రం తెలుసుకొని ప్రదర్శించటం ప్రధానమన్న అంశం ఈ సంవాదంలో స్పష్టమవుతున్నది.

> చతుస్సహస్రసంఖ్యాకైః గ్రంథైశ్చ పరిపూరితమ్ ।
> భరతార్ణవశాస్త్రం తు సుమతేః శృణు సాదరమ్ ॥ 7

అర్థం : సుమతే! = ఓ బుద్ధిమంతుడా ! (= ఓ ఇంద్రుడా!), చతుఃసహస్ర సంఖ్యాకైః = నాలుగువేల సంఖ్యకల, గ్రంథైః (చ) = గ్రంథ (= శ్లోక) ములతో, పరిపూరితమ్ = నిండిన, భరతార్ణవ శాస్త్రం (తు) = 'భరతార్ణవం' అనే శాస్త్రగ్రంథాన్ని, సాదరం శ్రుణు = శ్రద్ధగా విను.

తాత్పర్యం : ఇంద్రుని అభ్యర్థనను మన్నించిన నందికేశుడు ఇట్లా చెప్పినాడు: ఓ ఇంద్రుడా! నాలుగువేల శ్లోకాలుగల 'భరతార్ణవం' అనే శాస్త్రాన్ని (బోధిస్తాను) శ్రద్ధగా విను.

టీక : 'భరతార్ణవం' అనే పేరు గల గ్రంథాన్ని తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయం వారు 1957లో ప్రచురించారు. ఇందులో 15 అధ్యాయా లున్నాయి; 1200 శ్లోకాలు ఉన్నాయి; తక్కిన శ్లోకాలు - సుమారు మూడువేలు - ఇంతవరకు లభ్యంకాలేదు. ప్రారంభం, అంతం లేని ఈ ప్రచురణ సమగ్రం కాదన్న సత్యం స్పష్టమే. ఇందులోని 15 అధ్యాయాలలో క్రింది విషయాలు వివరించబడినాయి: 1. హస్తాలు, 2. దృష్టులు, 3. శిరస్సు, 4. పాదాలు, 5. స్థానకాలు, 6. స్థానకాల వినియోగం, సంకరహస్తాలు, 7. 108 తాలాలు, 8. చారులు, 9. అంగహారాలు (నాట్యశాస్త్రంలో వివరించబడిన వాటికంటె ఇవి భిన్నం), 10. ముద్రలు, 11. శృంగనాట్య భేదాలు. 12. శృంగనాట్య

అభినయాభ్యాసం, 13. నృత్తలాస్యాలు, 14. లాస్యవివరణ, 15. పుష్పాంజలి.

నందికేశ! దయామూర్తే! విస్తరం సంవిహాయ మే।

సంక్షిప్య నాట్యశాస్త్రార్థం క్రమపూర్వ ముదాహర॥ 8

అర్థం : నందికేశ! = ఓ నందికేశుడా!, దయామూర్తే! = ఓ దయామూర్తీ! విస్తరం సంవిహాయ = విస్తరించి చెప్పటం మాని వేసి, సంక్షిప్య = సంక్షిప్త పరచి, నాట్యశాస్త్ర - అర్థం = నాట్య శాస్త్రంయొక్క అర్థాన్ని, క్రమపూర్వం = యథాక్రమంగా. మే = నాకు, ఉదాహర = చెప్పుము.

తాత్పర్యం : దయామూర్తివైన ఓ నందికేశా! విపులంగా చెప్పవద్దు. సంక్షిప్త పరచి, నాట్య శాస్త్రార్థాలను యథాక్రమంగా చెప్పగోరుతున్నాను - అని ఇంద్రుడు ప్రార్థించినాడు.

టీక : దేవరాజు అయిన ఇంద్రుడంతటి వాడువచ్చి అడుగు తున్నాడు కాబట్టి సమగ్రంగా బోధించటానికి నందికేశుడు సిద్ధ పడినాడు. కాని, నటశేఖరుని జయించాలన్న తొందరలో ఉన్న ఇంద్రుడు ఆలస్యం భరించలేడు. అందుచేత నాట్యశాస్త్రాన్ని సంక్షిప్తంగా బోధించాలని కోరినాడు. అంతేకాదు. సమగ్రం కాక పోయినా సక్రమంగా ఉండాలని కోరినాడు.

సంప్రదాయం ప్రకారం ఇంతకుముందే ఇంద్రుడు నృత్యాం నేర్చుకొన్నాడు. ఇప్పుడు శాస్త్రం కూడా నేర్చుకోవాలన్న కోరి కతో వచ్చినాడు. సంప్రదాయం, శాస్త్రం - ఇవి విడదీయరాని జంట కాబట్టి ఉత్తమనర్తకులు కాగోరేవారికి రెండూ అవశ్యకాలే.

వదామి సుమతేః దేవః సంక్షిప్య భరతార్ణవమ్।

దర్పణాఖ్య మిదం సూక్ష్మ మవధారయ సాదరమ్॥ 9

అర్థం : సుమతే! = ఓ బుద్ధిమంతుడా!, దేవ = ఓ ఇంద్రుడా! భరతార్ణవమ్ = 'భరతార్ణవం' (అనే ఈ శాస్త్రాన్ని), సంక్షిప్య = సంక్షిప్త పరచి, వదామి = చెబుతున్నాను, దర్పణ-అఖ్యం = (అభి

నయ) దర్పణం అనే పేరుగల, సూత్మ్రం ఇదం = సూక్ష్మమైన దీనిని (= ఈ సంక్షిప్త గ్రంథాన్ని), సాదరమ్ అవధారయ = శ్రద్ధగావిను.

తాత్పర్యం : బుద్ధిమంతుడవైన ఓ ఇంద్రుడా! భరతార్ణవాన్ని సంక్షిప్త పరచి చెబుతున్నాను. 'అభినయ దర్పణం' అనే పేరుగల ఈ సంక్షిప్త గ్రంథాన్ని శ్రద్ధతో విను—అని నందికేశుడు చెప్పినాడు.

టీక : సంక్షిప్త పరచిన గ్రంథంలో ఎన్ని శ్లోకాలు ఉన్నాయో చెప్పలేదు. ఈ గ్రంథం పేరు ఇచ్చట 'దర్పణం' అని మాత్రమే ఉంది. కాని 'అభినయదర్పణం' అనే పేరు చిరకాలంగా ప్రసిద్ధిలో ఉంది. 'భరతార్ణవ సంగ్రహం' అనే గ్రంథంలో క్రింది కథ ఉన్నదని భరతార్ణవ సంపాదకులు పేర్కొన్నారు :

రాక్షసుల గురువు శుక్రాచార్యులు. ఆయనవద్ద శిక్షణ పొందిన రాక్షసులు, దేవతలతో - నర్తన విషయంలో పోటీ పడినారు; వ్యవధిలేదు. అందుచేత విస్తారంగా ఉన్న భరతార్ణవాన్ని అభ్యసించే అవకాశం లేదనీ, సంక్షిప్త పరచి చెప్పవలసిందనీ ఇంద్రుడు కోరినాడు; నందికేశుడు అంగీకరించినాడు. సంక్షిప్త పరచిన గ్రంథాన్ని అభ్యసించవలసినదిగా ఇంద్రుడు 'సుమతి' అనే నర్తకుని ఆదేశించినాడు. 'సుమతి' కి బోధింపబడింది కాబట్టి ఈ గ్రంథానికి 'సుమతి బోధకం' అనే పేరు వచ్చింది.

అభినయ దర్పణంలోని 7, 9 శ్లోకాలలో సుమతే! ( = ఓ సుమతీ!) అనే సంబోధన ఉంది. 'సుమతి' అన్నది పేరు కావచ్చు లేదా 'బుద్ధిమంతుడు' లేదా 'మంచి బుద్ధి కలవాడు' అని అర్థం కావచ్చు. కాని, ఇచ్చటి సందర్భాన్నిపట్టి ఈ సంబోధన ఇంద్రునకే అన్వయిస్తుంది. ఒకవేళ ఇది 'సుమతి' అనే నర్తకునికే అన్వయిస్తుంది అని భావిస్తే, ఇంద్రుడు సుమతిని నియమించినట్లు తెలిపే శ్లోకం నష్టమైపోయి ఉండాలి. అప్పుడు ఈ సుమతి, నటశేఖరునకు ప్రత్యర్థి అవుతాడు. ఇచ్చట 'సుమతి' అన్న సంబోధన సార్థకంగా ఉన్నదని చెప్పక తప్పదు. సుమతి కాబట్టే స్వల్ప వ్యవధిలోనే శాస్త్రాన్ని నేర్చుకొనటానికి సిద్ధపడినాడు.

భరతార్ణవసంగ్రహం, అభినయ దర్పణం, సుమతి బోధకం - ఈ మూడు పేర్లు ఒకే గ్రంథం పేర్లు కావచ్చు.

నందికేశ - దేవేంద్ర సంవాదరూపంగా ఉన్న ఈ భాగాన్ని (2 నుంచి 9 వరకు ఉన్న శ్లోకాలను) డా. ఘోష్ ప్రక్షిప్తంగా తలచి, అనువదించలేదు; కారణం - ఆయన పరిశీలించిన వ్రాత ప్రతులలో ఈ భాగం లేదట. ఇతర గ్రంథాలలోని అనేకాంశాలను నీడా మంగళం తిరువేంకటాచార్యులు గారు తెలుగు ముద్రణలో చేర్చారు; వాటిలో ఇది ఒకటి అవుతుందన్నమాట! ఇందువల్ల గ్రంథం బాగా పెరిగింది. డా. ఆనంద కుమారస్వామి ఆంగ్లాను వాదానికి ఈ తెలుగు ముద్రణమే మూలం.

2

# నృత్యకళ

## నృత్యావతరణం

నాట్యవేదం దదౌ పూర్వం భరతాయ చతుర్ముఖః ।
తత శ్చ భరతః సార్థం గంధర్వాప్సరసాంగణైః ॥ 10
నాట్యం నృత్తం తథా నృత్య మగ్రే శంభోః ప్రయుక్తవాన్।

అర్థం : పూర్వం = పూర్వ కాలంలో, చతుర్ముఖః నాట్య వేదం భరతాయ దదౌ = నాలుగు ముఖాలుకల బ్రహ్మ, నాట్య వేదాన్ని (= నాట్యశాస్త్రమనే పంచమవేదాన్ని) భరతునకు ఇచ్చినాడు. తతః (చ) = తరువాత, భరతః = భరతుడు, గంధర్వ - అప్సరసాంగణైః సార్థం = గంధర్వులతోను అప్సరసలతోను కలిసి, శంభోః అగ్రే = (నటరాజైన) శివుని ఎదుట, నాట్యం- నృత్తం (తథా) - నృత్యం ప్రయుక్తవాన్ = నాట్యాన్ని, నృత్తాన్ని, నృత్యాన్ని ప్రయోగించిన వాడైనాడు (= ప్రదర్శించినాడు).

తాత్పర్యం : పూర్వం బ్రహ్మ నాట్యవేదాన్ని సృజించి, భరతమునికి ఇచ్చినాడు. ఆ భరతముని గంధర్వులతోను, అప్సరసల తోనూ కలిసి, శివుని ఎదుట నాట్య - నృత్త-నృత్యాలను ప్రయో గించినాడు.

ప్రయోగ ముద్ధతం స్మృత్వా స్వప్రయుక్తం తతో హరః ॥ 11
తండునా స్వగణాగ్రణ్యా భరతాయ న్యదీదిశత్।
లాస్య మస్యాగ్రతః ప్రీత్యా పార్వత్యా సమదీదిశత్ ॥ 12

అర్థం : తతః = (భరతముని ప్రదర్శించిన నాట్యాదులను చూసిన) తరువాత, హరః = శివుడు, స్వప్రయుక్తం = తనచేత

ప్రయుక్తమైన, ఉద్ధతం ప్రయోగం స్మృత్వా = ఉద్ధతమైన ప్రయోగాన్ని (= తాండవాన్ని) జ్ఞప్తికి తెచ్చుకొని, స్వగణ-అగ్రగణ్యా = స్వీయగణాలకు నాయకుడైన, తండునా = తండువుచేత, భరతాయ వ్యదీదిశత్ = భరతునకు నేర్పించినాడు, అస్యఅగ్రతః = అంతకు ముందే, ప్రీత్యా = (భరతమునిమీది) ప్రీతితో, పార్వత్యా = పార్వతి దేవిచేత, లాస్యం = లాస్యాన్ని (= సుకుమార ప్రయోగాన్ని), వమదీదిశత్ = నేర్పించినాడు.

తాత్పర్యం : భరతముని ఇచ్చిన ప్రదర్శనలను తిలకించిన శివుడు తాను చేసిన ఉద్ధత నృత్యాన్ని (= తాండవాన్ని) జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. అప్పుడు, గణనాయకుడైన తండువును పిల్చి, భరతమునికి ఉద్ధత నృత్యం నేర్పవలసినదిగా ఆదేశించినాడు. అసలు అంతకుముందే, ఆదరంతో పార్వతీదేవిచేత లాస్యం (= సుకుమార నృత్యం) కూడా నేర్పించినాడు.

టీక: ముందరి 10,11 శ్లోకాలు 12వ శ్లోకంతో అన్వయిస్తాయి. భరతముని తన ప్రయోగాలతో శివుని మెప్పించి, పార్వతి ద్వారా లాస్యాన్ని, తండువు ద్వారా ఉద్ధతప్రయోగాన్ని నేర్చుకొన్నాడు. తండువు నేర్పింది కాబట్టి ఆయన పేరుమీదుగా ఉద్ధతప్రయోగం 'తాండవం' అయింది. పార్వతీదేవి లాస్యప్రయోక్త అనటం సుప్రసిద్ధం. తాండవం ఉద్ధతప్రయోగంకాగా, లాస్యం సుకుమార ప్రయోగం అవుతున్నది. (ఈ రెండు భేదాలు నృత్త-నృత్య-నాట్యాలు మూడింటికి అన్వయిస్తాయి).

భరతముని శివుని ఎదుట, తన నూర్గురు పుత్రులు లేదా శిష్యులు, అప్సరసలు కలిసిన బృందంచేత నాట్యప్రదర్శనం చేయించినట్లు నాట్యశాస్త్ర కథనం. అప్పుడు శివుడు, తాను చేసిన నృత్యాన్ని పూర్వరంగ ప్రక్రియలలో జతపర్చవలెనని భరతమునికి సూచించినాడు. నృత్తం చేరటంవల్ల పూర్వరంగంలోని గీతాలు అర్థవంతంగా

ప్రదర్శింపబడినాయి; ఆ విధంగా నృత్యమనే కొత్త కళ ఆవిర్భవించింది. అందుచేత భరతముని శివుని ఎదుట నృత్త-నృత్య-నాట్యాలను ప్రదర్శించినాడనటం సమంజసం కాజాలదు. కాక, నృత్త-నృత్యాలను భరతమునిముందే ప్రదర్శించి ఉంటే, తరువాత వాటిని నేర్వవలసిన అవసరం లేదు. (వివరణకు పీఠిక చూడవలెను)

> బుద్ధ్వాఽథ తాండవం తండోః మర్త్యేభ్యో మునయోఽవదన్ ।
> పార్వతీత్వనుశాస్తిస్మ లాస్యం బాణాత్మజా ముషామ్॥ 13

అర్థం : అథ = అప్పుడు, తండోః తాండవం బుధ్వా = తండువు యొక్క (= తండువు భరతమునికి నేర్పిన) తాండవం తెలుసుకొన్న, మునయః మర్త్యేభ్యః అవదన్ = మునులు (దానిని) మానవులకు తెలియజెప్పినారు. పార్వతీ(తు) = పార్వతీదేవి కూడా, బాణ-ఆత్మజామ్ ఉషామ్ = బాణాసురుని కుమార్తె అయిన ఉషను (= ఉషకు), లాస్యం అనుశాస్తిస్మ = లాస్యం నేర్పినది.

తాత్పర్యం : తండువు భరతమునికి నేర్పిన తాండవాన్ని గూర్చి మునులు మానవులకు తెలియజెప్పినారు. ఇంక పార్వతీదేవి బాణాత్మజ అయిన ఉషకు లాస్యం నేర్పింది.

టీక : 10 వ శ్లోకంలో గంధర్వులు పేర్కొనబడినారు; ఈ శ్లోకంలో 'మునులు' పేర్కొనబడినారు. ఈ మునులు భరతపుత్రులు కావాలి. నాట్యశాస్త్ర కథనం ప్రకారం భరతపుత్రులే నాట్యాన్ని మానవ లోకంలో అవతరింపజేసినారు.

> తయా ద్వారవతీగోప్యః తాభిః సౌరాష్ట్రయోషితః ।
> తాభిస్తు తత్తద్దేశీయాః తదశిష్యంత యోషితః ॥ 14
> ఏవం పరంపరాప్రాప్త మేతల్లోకే ప్రతిష్ఠితమ్ ।

అర్థం : తయా = ఆమె (= ఆ ఉష) ద్వారా, ద్వారవతీ గోప్యః = ద్వారకాపురి వాసులైన గోపికలు, తాభిః = వారి (= ఆ గోపికల) ద్వారా, సౌరాష్ట్ర యోషితః = సౌరాష్ట్ర దేశ యువతులు, తాభిః(తు) = వారి (= ఆ సౌరాష్ట్ర యువతుల)

ద్వారా, తత్ తత్ దేశీయాః = ఆయా దేశీయమైన, యోషితః = యువతుల, తత్ అశిష్యంత = దానిని (= ఆ లాస్యాన్ని) నేర్చు కొన్నారు. ఏవం పరంపరాప్రాప్తం = ఇట్లా పరంపరగా ప్రాప్తించిన, ఏతత్ లోకే ప్రతిష్ఠితమ్ = ఇది (= ఈ కళ) భూలోకంలో స్థిరపడింది.

తాత్పర్యం : తాను నేర్చిన లాస్యాన్ని - బాణాత్మజ అయిన ఉష ద్వారకలోని గోపికలకు నేర్పింది; వారు సౌరాష్ట్ర యువతు లకు నేర్పారు; వారినుంచి ఆయా దేశాలలోని యువతులు నేర్చు కొన్నారు. ఈ విధంగా పరంపరాప్రాప్తమై, లాస్యం భూలోకంలో స్థిరపడింది.

టీక : 10 నుంచి 14 వరకు ఉన్న శ్లోకాలు నీడామంగళం వారి తెలుగు ముద్రణలో లేవు. అందుచేత ఈ శ్లోకాలను ఆనంద కుమారస్వామి అనువదించలేదు. మాతృభూతయ్య ఆంధ్రాను వాదంలో ఈ కథ ఉంది; కాని నాట్యశాస్త్రాన్ని మునులకు పార్వతీ దేవి బోధించినట్లుగా ఉంది! (అభినయ దర్పణం - 1 ఆ. 21-28 ప) సంగీత రత్నాకరంలో కూడా ఈ కథ ఉంది- అభినయ దర్పణంలోని శ్లోకాలే, అందులో యథాతథంగా ఉన్నాయి.

## శాస్త్ర ప్రశంస

ఋగ్యజుస్సామవేదేభ్యో వేదాచ్చాఽథర్వణః క్రమాత్ ॥ 15
పాఠ్యం చాఽభినయం గీతం రసాన్ సంగృహ్య పద్మజః ।
వ్యరీరచచ్ఛాస్త్రమిదం ధర్మ కామార్థమోక్షదమ్ ॥ 16

అర్థం : ఋక్-యజుః-సామవేదేభ్యః = ఋగ్వేద-యజుర్వేద-సామవేదాలనుంచి, అథర్వణవేదాత్ (చ) = అథర్వణవేదం నుంచి; క్రమాత్ = వరుసగా, పాఠ్యం (చ) - అభినయం - గీతం - రసాన్ సంగృహ్య = పాఠ్యాన్ని, అభినయాన్ని, గీతాన్ని, రసాలను బాగుగా గ్రహించి; పద్మజః = బ్రహ్మ; ధర్మ-కామ-అర్థ-మోక్షదమ్ = ధర్మం,

కామం, అర్థం, మోక్షం (అనే చతుర్విధ పురుషార్థాలను) ప్రసాదించే; ఇదం శాస్త్రం వ్యరీరచత్ = (నాట్యవేదం అనబడే) ఈ శాస్త్రాన్ని రచించినాడు.

తాత్పర్యం : ఋగ్వేదం నుంచి పాఠ్యం, యజుర్వేదంనుంచి (చతుర్విధ) అభినయాలు, సామవేదంనుంచి గానం, అధర్వణ వేదం నుంచి రసాలు గ్రహించి, ధర్మ-కామ-అర్థ మోక్షాలను ప్రసాదించే శక్తి గల ఈ నాట్యశాస్త్రాన్ని బ్రహ్మ రచించినాడు.

టీక : నాలుగు వేదాలనుంచి గ్రహించిన అంశాలతో రచింపబడింది కావుననే ఈ నాట్యశాస్త్రం 'నాట్యవేదం' అయింది; అంతే కాదు 'పంచమవేదం' అన్న ఖ్యాతి కూడా పొందింది. ఇది వేదం కావునవే ధర్మ-కామ-అర్థ-మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను ప్రసాదించగల శక్తి సంపన్న అయింది. దీనికి సంబంధించిన కథ నాట్యశాస్త్రం ప్రథమాధ్యాయంలో ఉంది (చూ. పీఠిక).

> కీర్తి ప్రాగల్భ్య సౌభాగ్య వైదగ్ధ్యానాం ప్రవర్ధనమ్ ।
> ఔదార్య స్థైర్య ధైర్యాణాం విలాసస్య చ కారణమ్ ॥ 17
>
> దుఃఖార్తి శోక నిర్వేద ఖేద విచ్ఛేద సాధనమ్ ।
> అపి బ్రహ్మ పరానందా దిద మభ్యధికమ్ మతమ్ ॥ 18
>
> జహార నారదాదీనాం చిత్తాని కథ మన్యథా ।

అర్థం : కీర్తి, ప్రాగల్భ్య, సౌభాగ్య, వైదగ్ధ్యానాం ప్రవర్ధనమ్ = యశస్సు, ప్రావీణ్యం, సౌభాగ్యం, విదగ్ధత- వీటియొక్క పెంపుదల కలది (= వీటిని పెంపొందించేది); ఔదార్య, స్థైర్య, ధైర్యాణాం, విలాసస్య(చ) కారణమ్ = ఉదారత్వం, స్థిరత్వం, ధైర్యం, విలాసం - వీటియొక్క (= వీటికి) హేతువు; దుఃఖ, ఆర్తి, శోక, నిర్వేద, ఖేద విచ్ఛేద సాధనమ్ = దుఃఖం, ఆర్తి, శోకం, నిర్వేదం, ఖేదం- వీటిని పోగొట్టే సాధనం (అయి); ఇదం = ఇది (= ఈ శాస్త్రంవల్ల కలిగే ఆనందం), బ్రహ్మపర ఆనందాత్ అపి = బ్రహ్మానందంకంటెకూడా; అభి-అధికం మతమ్ =

బాగా ఎక్కువ (అని) సిద్ధాంతం. అన్యథా = అట్లా కాకపోతే; నారదాదీనాం, చిత్తాని, కథం, జహార = నారదమహర్షి వంటివారి, మనస్సులను, ఎట్లా, ఆకర్షించింది?

తాత్పర్యం : ఈ శాస్త్రం—కీర్తి, ప్రాగల్భ్యం, సౌభాగ్యం, విదగ్ధత- వీటిని పెంపొందిస్తుంది; ఔదార్యం, స్థిరత్వం, ధైర్యం, విలాసం- వీటిని కలిగిస్తుంది. దుఃఖం, ఆర్తి, శోకం, నిర్వేదం, ఖేదం- వీటిని పోగొడుతుంది. అంతేకాదు. ఇందువల్ల కలిగే ఆనందం బ్రహ్మానందంకంటె కూడా అధికమైంది. అట్లా కాకపోతే నారదమహర్షి వంటి జితేంద్రియులను కూడా ఈ శాస్త్రం ఎట్లా ఆకర్షించగలిగింది ?

టీక : ఈ శాస్త్రంవల్ల ప్రయోజనం ఏమిటి ? అన్న ప్రశ్న రావచ్చు. అందుకు ఇది సమాధానం. నాట్యశాస్త్రంవల్ల అంటే నాట్యశాస్త్ర విషయమైన నృత్యంవల్ల అనేక లాభాలు చేకూరు తాయి. దీనివల్ల ప్రధానంగా ఆనందం కలుగుతుంది. ఈ ఆనందం మహర్షులు, మహాయోగులు పొందే బ్రహ్మానందం ( = భగవంతుని దర్శించినప్పుడు కలిగే ఆనందం) కంటె కూడా అధికమైనదని చెబు తారు. ఇది నిజం కాకపోతే నారదమహర్షి వంటివారు కూడా ఈ కళచేత ఎందుకు ఆకర్షితులయినారు? అంటే నృత్యకళవల్ల కలిగే ఆనందం బ్రహ్మానందంకంటె కూడా ఎక్కువ కావటం చేతనే నారదాది మహర్షులు దీనిని ఆదరించినారు. ఇట్లా చెప్పటంవల్ల ఈ శాస్త్రం యొక్క ప్రాముఖ్యం విశదీకరించినట్లయింది. నాట్య ప్రయోజనాన్ని గూర్చి బ్రహ్మ చేసిన వివరణ కూడా ఈ సంద ర్భంలో పరిశీలించదగినది (చూ. తె.నా.శా. పుటలు 15-19).

ఒక మంచి కావ్యం చదివినప్పుడు లేదా విన్నప్పుడు మన మనస్సులలో ఒక విధమైన ఆనందం కలుగుతుంది. రంగస్థలం మీద మంచి నాటక ప్రదర్శనం చూసినప్పుడు ఈ ఆనందం మరింత ఎక్కువగా, శీఘ్రంగా కలుగుతుంది. అట్లాగే మంచి నృత్యం చూసి

వప్పుడు కూడా మన మనస్సులలో ఈ ఆనందం కలుగుతుంది. వేరే ఆలోచనలు లేకుండా, మనస్సు దీనిపై నిలిపి చూసినప్పుడే ఈ ఆనందం కలుగుతుంది. ఈ ఆనందాన్నే 'రసానుభూతి' అంటారు శాస్త్ర పరిభాషలో.

## నాట్య - నృత్త - నృత్యాలు

ఏత చ్చతుర్విధోపేతం నటనం త్రివిధం స్మృతమ్ ॥ 19

నాట్యం నృత్తం నృత్య మితి మునిభిః భరతాదిభిః ।

అర్థం : చతుః - విధ - ఉపేతం = నాలుగు విధాలు అయిన ( = నాలుగు అభినయాలతో కూడిన), ఏతత్ నటనం = ఈ నటన (అనే కళ); నాట్యం, నృత్తం, నృత్యం = నాట్యం, నృత్తం, నృత్యం (అనే భేదాలతో); త్రివిధమ్ ఇతి = మూడు విధాలు అని; భరతాదిభిః మునిభిః స్మృతమ్ = భరతుడు మొదలగు మునులచేత చెప్పబడినది.

తాత్పర్యం : నాలుగు అభినయాలతో కూడిన 'నటన' - నాట్య - నృత్త - నృత్య భేదాలచేత మూడు విధాలని భరతుడు మొదలయిన మునులు చెప్పినారు.

టీక : నాట్యశాస్త్రంలో నాట్యం ప్రధానంగానూ, నృత్తం ఆనుషంగికంగానూ భరతముని వివరించినాడు. నాట్యశాస్త్ర రచన తరువాతనే నృత్యం ప్రత్యేక కళగా రూపొందిందని విమర్శకుల అభిప్రాయం. అట్లా ప్రత్యేకంగా రూపొందిన నృత్యకళ కోసం వెలసిందే ఈ అభినయ దర్పణం. అయితే నాట్యశాస్త్రంలో చెప్ప బడిన నాలుగు అభినయాలు నృత్యానికి కూడా బాగా అన్వయిస్తాయి.

నాట్యం తన్నాటకం చైవ పూజ్యం పూర్వకథాయుతమ్ ॥ 20

భావాభినయహీనం తు నృత్త మిత్యభిధీయతే ।

రసభావవ్యంజనాదియుక్తం నృత్య మితీర్యతే ॥ 21

అర్థం : తత్ నాట్యం = ఆ నాట్యం; నాటకం(చ)ఏవ = నాటకమే ( = నాట్యం, నాటకం పర్యాయార్థకాలు); పూర్వ కథా యుతం = (ఆ నాట్యం) ప్రాచీనమైన కథలతో కూడినది; పూజ్యం = ఉదాత్తమైనది.

నృత్తం = నృత్తం; భావ-అభినయ-హీనం(తు) = భావాల యొక్క అభినయం లేనిది; ఇతి - అభిధీయతే = అని చెప్పబడు తున్నది.

నృత్యం = (ఇంక ) నృత్యం; రస-భావ-వ్యంజన-ఆదియుక్తం = రసాలను, భావాలను వ్యంజనం చేయటం ( = అభివ్యక్తం చేయటం = ప్రదర్శించటం) మొదలయిన వాటితో కూడినది; ఇతి-ఈర్యతే = అని చెప్పబడుతున్నది.

తాత్పర్యం : నాట్యమనగా నాటకమే. ఇది ప్రాచీన కథలతో కూడినదై ఉదాత్తంగా ఉంటుంది. నృత్యంలో భావాల యొక్క అభినయం ఉండదు. ఇంక రస-భావాలను వ్యంజనం చేస్తుంది నృత్యం.

టీక : స్థూలంగా చెప్పవలెనంటే- నృత్తం కేవలం అంగ విక్షేపం లేదా ఆంగికాభినయం; గీతార్థాలను అభినయించటం నృత్యం; రూపక లేదా నాటక ప్రదర్శనం నాట్యం. నాట్యం రస వ్యంజకమనీ, నృత్యం భావవ్యంజకమనీ, నృత్తం రస-భావహీనమనీ ప్రాచీనుల అభిప్రాయం. నందికేశుని వంటివారు ఇద్దరు ముగ్గురు మాత్రమే నృత్యం రసవ్యంజకమని చెప్పినారు. నృత్తం కూడా రసవ్యంజకమే అని ఆధునికుల అభిప్రాయం. నాట్య-నృత్త-నృత్యాలను గూర్చిన వివరణకు పీఠిక చూడవలెను. (చూ. తె. నా. శా. పుటలు-129-39; తెలుగు నృత్త రత్నావళి పీఠిక పుటలు 1-7).

ఏతత్త్రియం ద్విధాభిన్నం లాస్యతాండవ సంజ్ఞకమ్ ।
సుకుమారం తు తల్లాస్య ముద్ధతం తాండవం విదుః ॥ 22

అర్థం : ఏతత్-త్రయం = ఆ (నాట్య-నృత్త-నృత్యాలు) మూడూ; లాస్య-తాండవ సంజ్ఞకమ్ = లాస్యం, తాండవం అనే పేర్లతో; ద్విధాభిన్నం = రెండు విధాలు. తత్ లాస్యం సుకుమారం(తు) = ఆ లాస్యం సుకుమారమైనది; తాండవం ఉద్ధతం విదుః =(ఇంక) తాండవం ఉద్ధతమైనది (అని) తెలుసుకొందురు ( = చెప్పుదురు).

తాత్పర్యం : నాట్య-నృత్త-నృత్యాలు మూడూ లాస్య-తాండవ భేదాల చేత రెండేసి విధాలు — లాస్య నాట్యం, లాస్య నృత్తం, లాస్య నృత్యం, తాండవ నాట్యం, తాండవ నృత్తం, తాండవ నృత్యం. లాస్యమంటే సుకుమార ప్రయోగం; తాండవ మంటే ఉద్ధత ప్రయోగం.

టీక : నాట్యశాస్త్రంలో 'తాండవం' అనేది నృత్తానికి పర్యాయపదం మాత్రమే. అసలు, నా.శా.లో 'నృత్యం' అనే పదం లేదని పరిశీలకుల అభిప్రాయం. పార్వతీదేవి సుకుమార ప్రయోగం చేసిందని అందులో ఉండటంచేత శివుడు చేసిన తాండవం ఉద్ధతమని చెప్పటానికి అవకాశం ఉంది. (చూ. ఈ గ్రంథ పీఠిక).

## నృత్య ప్రయోగ సమయాలు

ద్రష్టవ్యే నాట్య - నృత్తే చ పర్వకాలే విశేషతః ।
నృత్యం తత్ర నరేంద్రాణామభిషేకే మహోత్సవే ॥ 23

యాత్రాయాం దేవయాత్రాయాం వివాహే ప్రియసంగమే ।
నగరాణా మగారాణాం ప్రవేశే పుత్రజన్మని ॥ 24

శుభార్థిభిః ప్రయోక్తవ్యం మాంగల్యం సర్వకర్మసు ।
ఏతన్నృత్యం మహారాజ సభాయాం కల్పయేత్సదా ॥ 25

అర్థం : నాట్య - నృత్తేచ = నాట్య - నృత్తాలు రెండూ, విశేషతః = ముఖ్యంగా, పర్వకాలే = ఉత్సవ సమయాలలో, ద్రష్టవ్యే = చూడదగినవి. తత్ర = అందు, నృత్యం = నృత్యం,

సర్వకర్మసు = సర్వకార్యములలోను, మాంగల్యం = శుభప్రదమైనది. (అందుచేత ఆ నృత్యం) - నరేంద్రాణామ్ అభిషేకే = రాజుల యొక్క పట్టాభిషేక సమయంలో, మహోత్సవే = గొప్ప ఉత్సవ సమయంలో, యాత్రాయాం = ఊరేగింపు సమయంలో, వివాహే = వివాహ సమయంలో, ప్రియసంగమే = మిత్ర సమాగమ సమయంలో, నగరాణాం-అగారాణాం ప్రవేశే = పురప్రవేశ-గృహప్రవేశ సమయాలలో, పుత్రజన్మని = పుత్రజనన సమయంలో, శుభార్థిభిః = శుభాలను కోరే వారిచేత, ప్రయోక్తవ్యం = ప్రయోగింపదగినది (= ఆయా సమయాలలో నృత్య ప్రదర్శన ఏర్పాటు చేయవలెను).

ఏతత్-నృత్యం = ఇటువంటి నృత్యాన్ని, సదా = ఎల్లప్పుడు, మహారాజ సభాయాం = మహారాజు యొక్క సభలో, కల్పయేత్ = కల్పించవలెను (= ఏర్పాటు చేయవలెను).

తాత్పర్యం : నాట్య-నృత్తాలు రెండూ ఉత్సవ (= పండుగ పబ్బాల, దేవోత్సవాల) సమయాలలో తప్పక చూడదగినవి. ఇంక నృత్యం సర్వకార్యములందును శుభప్రదమైనది. రాజుల పట్టాభిషేకం, గొప్ప ఉత్సవం, ఊరేగింపు, వివాహం, మిత్రుల కలయిక, పురప్రవేశం, గృహప్రవేశం, పుత్రజననం — ఈ సమయాలలో శుభాలను కోరేవారు, నృత్య ప్రదర్శన ఏర్పాటు చేయవలెను. ఈ నృత్యం మహారాజ సభలలో కూడా ఏర్పాటు చేయవలెను.

టీక : నృత్య ప్రదర్శన సమయాలను నందికేశ్వరుడు పేర్కొన్నట్లే, నాట్య నృత్త సమయాలను భరతముని పేర్కొన్నాడు. (చూ. తె. నా. శా. పుటలు 121-22 . మహారాజ సభయందు, నృత్య ప్రదర్శన సమయంలో ఆసన విధానం సంగీత రత్నాకరమందు వర్ణితమైనది (చూ. తె. నా. శా. పుటలు 59-60).

రాజాస్థానములందలి నృత్య వర్ణనలు తెలుగు కావ్యాలలో అసంఖ్యాకంగా ఉన్నాయి-చూ. తె. నృత్త రత్నావళి పీఠిక-పుటలు 80-88.

## సభా లక్షణం

సభా కల్పతరు ర్భాతి వేద శాఖోపశోభితః ।

శాస్త్ర పుష్ప సమాకీర్ణో విద్వద్భ్రమరశోభితః ॥ 26

అర్థం : సభాకల్పతరుః = సభ (=ప్రేక్షక సమూహం) అనే కల్ప వృక్షం, వేదశాఖ-ఉపశోభితః = వేదాలనే శాఖ ( = కొమ్మ) లతో అలంకరింపబడినదై, శాస్త్ర పుష్పసమాకీర్ణః = శాస్త్రాలనే పుష్పాలతో నిండినదై, విద్వత్-భ్రమర శోభితః = విద్వాంసులనే భ్రమరము (= తుమ్మెద) లచేత అలంకరింపబడినదై, భాతి = ప్రకాశిస్తున్నది.

తాత్పర్యం : 'సభ' అనే కల్ప వృక్షం-వేదాలనే శాఖలతో శోభిస్తున్నది. శాస్త్రాలనే పుష్పాలతో నిండినది. విద్వాంసులనే భ్రమరాలతో ప్రకాశిస్తున్నది.

టీక : ఇచ్చట సభ కల్పవృక్షంతో పోల్చబడింది. ఆ వృక్షం వేదాలే శాఖలుగా, శాస్త్రాలే పుష్పాలుగా, విద్వాంసులే తుమ్మెదలుగా ప్రకాశిస్తున్నది.

సత్యాచారసభా గుణోజ్జ్వలసభా సద్ధర్మకీర్తిస్సభా

వేదాలంకృతరాజపూజితసభా వేదాంత వేద్యాసభా ।

వీణావాణి విశేషలక్షితసభా విఖ్యాతవీరాసభా

రాజద్రాజకుమారశోభితసభా రాజత్ప్రతాపస్సభా ॥ 27

అర్థం : సత్యాచారసభా = సత్యం తప్పని వారు కలసభ, గుణ-ఉజ్జ్వల సభా = సద్గుణాలతో ప్రకాశించే సభ, సద్ధర్మ కీర్తిః సభా = మంచి ధర్మాలకు పట్టుగొమ్మ అన్న కీర్తి కలసభ, వేద - అలంకృత రాజపూజిత సభా = వేదాలచేత అలంకృతులైన (= వేదాలు చదివిన) రాజులచేత పూజింపబడే సభ (లేదా వేదాలచేత

అలంకృతమైన సభ, రాజులచేత పూజింపబడే సభ), వేదా తవేద్యా సభా = వేదాంతం తెలియబడే సభ (= వేదాంత చర్చలు జరిగేసభ), వీణా - వాణివిశేష లలిత సభా = వీణాగానంచేత, వాచికగానంచేత ( = జంత్ర-గా త్రాల చేత) విశిష్టంగాగు ర్తింపబడే సభ, విఖ్యాత వీరాసభా = సుప్రసిద్ధులైన వీరులుగల సభ, రాజత్ రాజకుమార శోభిత సభా = ప్రకాశిస్తున్న రాజకుమారులతో శోభించే సభ, రాజత్ ప్రకాంతిః సభా = తేజస్సుతో వెలుగుతున్న సభ.

తాత్పర్యం : సదాచారపరులుకలది, సద్గుణాలతో ప్రకాశించేది, ధర్మమునకు పట్టుగొమ్మ అనే కీర్తి కలది, వేద ఘోషకలది, రాజుల చేత గౌరవింపబడేది, వేదాంత చర్చలు కలది, తేజోవంతులైన రాజకుమారులు కలది - ఇన్ని గుణాలు కలదై తేజస్సుతో ఒప్పునది 'సభ' అనబడుతుంది.

టీక : కల్పతరువుతో పోల్చబడిన ఆ సభ పైనచెప్పిన విధంగా వివిధములైన గుణాలతో ప్రకాశిస్తున్నది.

విద్వాంసః కవయో భట్టాః గాయకాః పరిహాసకాః ।
ఇతిహాస పురాణజ్ఞాః సభా సప్తాంగలక్షణమ్ ॥ 28

అర్థం : విద్వాంసః = విద్వాంసులు ( = పండితులు), కవయః = కవులు, భట్టాః = శాస్త్ర గ్రంథ రచయితలు లేదా పెద్దలు, గాయకాః = గాయకులు, పరిహాసకాః = పరిహాసకులు ( = విదూష కులు), ఇతిహాస - పురాణజ్ఞాః = ఇతిహాసాలు (= భారతాదులు) (అష్టాదశ) పురాణాలు తెలిసిన వారు; (ఇట్లా) సభాసప్తాంగ లక్షణమ్ = సభ ఏడు అంగాలు కలది (=ఈ ఏడు అంగాలు కలది 'సభ' అన బడుతుంది.)

తాత్పర్యం : పండితులు, కవులు, శాస్త్రకారులు, గాయ కులు, పరిహాసకులు, ఇతిహాసజ్ఞులు, పురాణవేత్తలు — ఈ ఏడుగురు సభకు ఏడు అంగాలు. కావుననే సభ సప్తాంగ లక్షణోపేతమైనది.

టీక : 'భట్టాః' అనేదానిని 'బట్లు' (=పొగడ్తలు చేసేవారు) అని మాత్ర భూతయ్య అనువదించినాడు. కాని 'భట్టు' శబ్దమునకు శాస్త్రజ్ఞుడు లేదా శాస్త్రకారుడు అన్న అర్థమే సమంజసమైనది.

ఇచ్చట వర్ణితమైన సభ నాట్య-నృత్త-నృత్య ప్రదర్శనాలకు ఉచితమైన సభ. కేవలం కవి-పండితులతో నిండిన సభను నన్నయ భట్టారకుడు క్రింది విధంగా వర్ణించినాడు :

"వరమ వివేక సౌరభవిభాసిత సద్గుణ పుంజవారిజో
త్కర రుచిరంబులై, సకల గమ్యసుతీర్థములై, మహామనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్"

— భారతం. ఆది. పర్వం-1 వ ఆ. 23 వ.

నందికేశుడు సభను, కల్పతరువుతో పోల్చగా, నన్నయ భట్టారకుడు సరసీవనం (=పద్మాకరం) తో పోల్చినాడు.

## సభాపతి లక్షణం

శ్రీమాన్ ధీమాన్ వివేకీ వితరణనిపుణో గాన విద్యా ప్రవీణః
సర్వజ్ఞః కీర్తిశాలీ సరసగుణయుతో హావభావేష్వభిజ్ఞః ।
మాత్సర్యాద్యైర్విహీనః ప్రకృతిహితసదాచారశీలో దయాలుః
ధీరోదాత్తః కలావా నభినయచతురోఽసౌ సభానాయకః స్యాత్॥ 29

అర్థం : శ్రీమాన్ = శ్రీమంతుడు, ధీమాన్ = ధీ (=బుద్ధి) మంతుడు, వివేకీ = యుక్తాయుక్తవివేకం కలవాడు, వితరణనిపుణః = దానశీలుడు, గానవిద్యాప్రవీణః =గాన విద్యాప్రావీణ్యం కలవాడు, సర్వజ్ఞః = సర్వజ్ఞుడు (= అన్నీ తెలిసినవాడు), కీర్తిశాలి = యశోవంతుడు, సరస గుణయుతః = సరసమైన గుణాలు కలవాడు, హావ

భావేషు-అభిజ్ఞః = హావ-భావాలు తెలిసినవాడు, మాత్సర్య-ఆద్యైః విహీనః = మాత్సర్యం మున్నగు(దుర్గుణాలు) లేనివాడు (మాత్సర్య-ద్వేష హీనః = మాత్సర్యం, ద్వేషం లేనివాడు-ఘోష్), ప్రకృతి-హిత-సదాచార్య-శీలః = ప్రకృతులకు (= పరివారమునకు) హితం కలిగించే మంచినడత కలవాడు, దయాలుః = దయకలవాడు, ధీరోదాత్తః = ధీరోదాత్తుడు (ధీరః దాంతః = ధీరుడు, దాంతుడు-ఘోష్), కలావాన్ = కలావంతుడు (= కళాకారుడు), అభినయ చతురః = (నాలుగు విధాలయిన) అభినయములందు నిపుణుడు (కలావాన్-నృపనయ చతురః = కలావంతుడు, రాజనీతి చతురుడు-సీడా)-ఈదృశో = ఇట్టివాడు, సభానాయకః స్యాత్ = సభానాయకుడు కాదగును.

తాత్పర్యం: శ్రీమంతుడు, ధీమంతుడు, వివేకి, దానశీలుడు, గాన విద్యాప్రవీణుడు, సర్వజ్ఞుడు, కీర్తిశాలి, సరసుడు, హావభావాదులు తెలిసినవాడు, మాత్సర్యాదులు లేనివాడు, పరివారమును ప్రీతితో చూచేవాడు, దయకలవాడు, ధీరోదాత్తుడు, కళాకారుడు, అభినయ నిపుణుడు - అయినవాడు సభా నాయకుడుగా ఉండవలెను.

టీక : సభాపతి లక్షణాలను మాతృభూతయ్య క్రింది విధంగా అనువదించినాడు :

శ్రీమంతుఁడై బాలఁ జెన్నొంది ధీరుఁడై
వితరణశీలుఁడై వెలయువాడు,
గానవిద్య తెలిసి ఘనకీర్తిశాలియై
సరస సద్గుణములఁ బరఁగువాఁడు,
ఇరువొంద సత్కవివిహృదయంబు లరయుచు
దాతయై మిక్కిలి తనరువాఁడు,

భావజ్ఞుఁడనఁగను బరమదయాళుఁడై
మఱియు సర్వజ్ఞుడై మెఱయువాఁడు,
ఎలమి శృంగారలీలల మెలఁగువాఁడు,
ఎనసి సౌందర్యవంతుఁడై దనరువాఁడు
ఇల సభావతి యనఁగను వెలయువాఁడు.

(రాక్షస విరామ : కస్తురిరంగధామః)

— అభినయ దర్పణము - 1 వ ఆశ్వా. 29 వ.

నృత్తరత్నావళిలో సభాపతిలక్షణం ఆరు శ్లోకాలలో వర్ణిత మైనది (7 వ అధ్యా-229-34 శ్లో.). సంగీతరత్నాకరంలో కూడా ఆరు శ్లోకాలలోనే ఈ వర్ణనకలదు (7 వ అధ్యా. 1334-39 శ్లో.) కాని, రెండింట చెప్పిన పద్ధతులు, విశేషణాలు భిన్నంగా ఉన్నాయి.

అనాడు సభాపతి సర్వకళా కుశలుడుగా లేదా ముఖ్యంగా నృత్య విద్యా విశారదుడుగా ఉండేవాడు. తరువాత ధనవంతులు సభానాయకులైనారు. నేడు ఈ సంప్రదాయం మృగ్యమైనదని చెప్పవచ్చు. ఇప్పుడు నృత్య ప్రదర్శనకు హోదానుబట్టి ఆహ్వానింప బడిన పెద్దను 'ప్రధాన అతిథి' (Chief Guest) అంటున్నారు.

## మంత్రుల లక్షణం

మేధా సుస్థిర భాషిణో గుణవరాః శ్రీమద్యశోలంపటాః
భావజ్ఞా గుణదోషభేదనిపుణాః శృంగారలీలారతాః ।
మధ్యస్థా నయకోవిదాః సహృదయాః సత్పండితా భాంతి తే
భాషాభేదవిచక్షణాః సుకవయో యస్యప్రభోః మంత్రిణః ॥ 30

అర్థం : యస్య ప్రభోః = ఏ ప్రభువు యొక్క, మంత్రిణః = మంత్రులు- మేధా-స్థిరభాషిణః = వివేకంతో నిశ్చితంగా మాటాడే వారు (నిత్యంచ, స్థిరభాషిణః = ఎల్లప్పుడు, నిశ్చితంగా మాటాడే వారు-నీడా), గుణపరాః = గుణములను గ్రహించేవారు, శ్రీమత్-

యశః లంపటాః = శ్రీమంతులు కీర్తికాములు, భావజ్ఞాః = ఇతరుల భావాలను గ్రహించగలవారు, గుణ-దోష భేదవిజ్ఞాః = గుణ-దోషాల (మధ్యగల) భేదాలను తెలుసుకొనగలవారు, శృంగార లీలారతాః = శృంగార లీలాసక్తులు, మధ్యస్థాః = పక్షపాతంలేనివారు, నయకోవిదాః = నీతికోవిదులు, సహృదయః = రసాస్వాద నిపుణులు, సత్-పండితాః = మంచి పండితులు, భాషాభేద విచక్షణాః = (మాండలికాది) భాషాభేదాలను గుర్తించగలవారు (భూపాభేద విచక్షణాః = శత్రురాజులమధ్య భేదాలను కల్పించగల నిపుణులు-నీడా), సుకవయః = మంచి కవులు — అయినవారుగా, తే = ఆ మంత్రులు, భాంతి = (సభలో) ప్రకాశింతురో, (ఆ ప్రభువు సభాపతిగా ఉండదగును అని పూర్వ శ్లోకంతో అన్వయం).

తాత్పర్యం : ఏ ప్రభువు యొక్క మంత్రులు మేధావంతులు, స్థిరచిత్తులు లేదా మాట నిలుకడగలవారు, గుణ గ్రహణ సమర్థులు, శ్రీమంతులు, కీర్తికాములు, భావజ్ఞులు, గుణ-దోష భేదాలు తెలిసినవారు, శృంగార లీలారతులు, పక్షపాతరహితులు, నీతికోవిదులు, సహృదయులు, మంచి పండితులు, భాషాభేదాలు తెలిసినవారు, మంచికవులు-గా సభలో ప్రకాశిస్తారో, ఆ ప్రభువే సభాపతిగా ఉండటానికి అర్హుడు.

టీక : మనుధర్మ శాస్త్రంలో మంత్రుల లక్షణ మిట్లా ఉన్నది —

"మౌలాన్ శాస్త్రవిద శ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్ ।
సచివాన్ సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్ ॥"

7 వ అధ్యా. 54 శ్లో.

— వంశ పారంపర్యంగా వచ్చిన వారిని, శాస్త్రజ్ఞులను, శూరులను, ఆయుధ విద్యయందు నేర్పరులను, మంచి వంశములందు

పుట్టిన వారిని-ఏడుగురినో ఎనమండుగురినో పరీక్షించి, సచివులు( = మంత్రులు)గా నియమించుకోవలెను.

ఏవం విధః సభానాథః ప్రాఙ్ముఖో నివసే న్ముదా ।

వర్తేరన్ పార్శ్వయోః తస్య కవి-మంత్రి-సుహృజ్జనాః ॥ 31

అర్థం : ఏవం విధః = ఈ ( = వర్ణించిన) విధంగా ఉండే, సభానాథః = సభానాయకుడు (అయిన ప్రభువు), ముదా = సంతోషంతో ( = నృత్యం చూడాలన్న కుతూహలంతో), ప్రాక్ ముఖః నివసేత్ = తూర్పుముఖంగా కూర్చుండవలెను. తస్యపార్శ్వతః = ఆ రాజు యొక్క (ఇరు) పార్శ్వములందు, కవి - మంత్రి - సుహృజ్జనాః = కవులు, మంత్రులు, మిత్రులు (అయినవారు), వర్తేరన్ = ఉండ ( = కూర్చుండ) వలెను.

తాత్పర్యం : సభలో, సభానాయకుడైన రాజు తూర్పు ముఖంగా సంతోషంతో కూర్చుండవలెను. ఆ రాజునకు రెండు ప్రక్కల కవులు, మంత్రులు, మిత్రులు కూర్చుండవలెను.

టీక : 'సభాపతి - సభ్య విన్యాసం' అంటూ నృత్త రత్నావళిలో (8 వ అధ్యా - 1-32 శ్లో), 'సభా సంనివేశం' అంటూ సంగీతరత్నాకరంలో (7 వ అధ్యా. 1940-50 శ్లో) నృత్యసభను గూర్చిన విపులమయిన వర్ణనలు ఉన్నాయి. సంగీత రత్నాకరమందలి వర్ణన ప్రకారం రాజప్రాసాదంలోని నృత్యశాలలోని ఆసనవిధి తెలుగు నాట్యశాస్త్రంలో పటరూపంగా ప్రదర్శించబడింది- చూ. పుటలు - 59-60.

## బృందరచన

తదగ్రే నటనం కుర్యాత్ తత్స్థలం రంగ ఉచ్యతే ।

రంగమధ్యే స్థితే పాత్రే తత్సమీపే నటోత్తమః ॥ 32

దక్షిణే తాలధారీ చ పార్శ్వద్వంద్వే మృదంగికౌ ।
తయోర్మధ్యే గీతకారీ శ్రుతికారః తదంతికే ॥ 33
ఏవం తిష్ఠేత్ క్రమేణైవ నాట్యాదౌ రంగమండలీ ।

అర్థం : తత్ - అగ్రే = అతని (= ఆ సభా నాయకుని) ఎదుట, నటనం కుర్యాత్ = నటనం (= నృత్యం) చేయవలెను, తత్ స్థలం = (నృత్యం జరిగే) ఆ స్థలం, రంగఃఉచ్యతే = 'రంగము' (= రంగస్థలం) (అని) చెప్పబడుతున్నది. పాత్రే రంగమధ్యే స్థితే = పాత్రము (= నర్తకి) రంగమధ్యమందు నిలిచి ఉండగా, తత్ సమీపే = ఆమెకు దగ్గరగా, నట - ఉత్తమః = ఉత్తమనటుడు (= నృత్యాచార్యుడు లేదా గురువు) (ఉండవలెను), దక్షిణే తాలధారీ(చ) = (ఆనర్తకికి) కుడివైపున తాళం వేసేవాడు, పార్శ్వ ద్వంద్వే = ఇరుప్రక్కల, మృదంగికౌ = ఇద్దరు మార్దంగికులు (= మద్దెలలు వాయించేవారు), తయోఃమధ్యే = వారి నడుమ, గీతకారీ=గాయకుడు, తత్ - అంతికే = ఆ గీతకారుని సమీపంలో, శ్రుతికారః = శ్రుతివేసేవాడు (ఉంటారు). ఏవం = ఈ విధంగా, రంగమండలీ = నృత్యబృందం, క్రమేణ - ఏవ = క్రమ పద్ధతిలో, నాట్య-ఆదౌ = నాట్య (=నృత్య) ప్రారంభమందు, తిష్ఠేత్ = ఉండవలెను.

తాత్పర్యం : ఇంతకుముందు వర్ణించబడిన సభా నాయకుని ఎదుట నృత్యం జరగవలెను. నృత్యం జరిగే స్థలాన్ని 'రంగము' అంటారు. పాత్రము (= నర్తకి) రంగమునకు మధ్య ఉంటుంది. ఆమెకు దగ్గరగా గురువు, కుడిప్రక్క తాలధారి, ఇరుప్రక్కల మార్దంగికులు, వారి నడుమ గాయకుడు, ఆ సమీపంలో శ్రుతికారుడు ఉంటారు. ఈ విధంగా రంగమండలి (=నృత్య బృందం) నృత్యారంభమందు సిద్ధం కావలెను.

టీక : నందికేశుడు చెప్పిన 'రంగమండలి'ని జాయ సేనాపతి ప్రభృతులు 'బృందము' అన్నారు. ఈ బృంద విన్యాసాన్ని జాయన

నాలుగు శ్లోకాలలో వర్ణించినాడు (8 వ అధ్యా. 48-51 శ్లో.) "విలాసశీలుడైన రాజు విద్యావంతులైనవారి యెదుటగానీ, తన వైభవాన్ని వెలయించటం కొరకుగానీ బృందమంతా ఆడువారే అగునట్లు చేయవచ్చును" అని కూడా జాయన పేర్కొన్నాడు. కేవల స్త్రీ బృందం 'ఆభ్యంతరం', స్త్రీ-పురుషులు కలిసిన బృందం 'బాహ్యం' అనబడుతుందని శారదాతనయుడు చెప్పినాడు (భావ ప్రకాశనము-10 వ అధ్యా. 151-54 శ్లో.) "గాతృ - వాదక సంఘాతం 'బృంద' మనబడుతుంది; 4 గురు ముఖ్య గాయకులు, 8 గురు సమగాయకులు, 8 గురు గాయనులు (= స్త్రీలు), 4 గురు తాలధారిణులు, 4 గురు మార్దంగికులు, 4 గురు వేణుగాయకులు కలిగిన బృందం 'ఉత్తమ బృందం'; ఇందులో సగమున్నది 'మధ్యమ బృందం'; ఇందులో సగము 'లఘుబృందం' అనబడుతుంది" (భరత కోశం-పుట 422). 'సముదాయం (= జట్టు) లేదా 'సంప్రదాయం' అనే పేరుతో జాయన బృందమును వర్ణించినాడు (7 వ అధ్యా. 193-210 శ్లో.). జాయన చెప్పిన ప్రకారం '64 గురుకల బృందము ఉత్తమము'.

ఈ నృత్య బృందమును 'మేళం' అనటం కద్దు. మేళాలు నివసించే ఊరు కాబట్టే తంజావూరు జిల్లాలోని అచ్యుతాపురం 'మేలట్టూరు' (= మేళాల ఊరు)గా ప్రసిద్ధి పొందింది. నేటికిన్నీ, తెలుగు భాషలో ఉన్న భాగవతమేళ నాటకాలను అక్కడ ప్రదర్శిస్తూ ఉన్నారు.

తన్వీ రూపవతీ శ్యామా పీనోన్నతపయోధరా ॥ 34

ప్రగల్భా సరసా కాంతా కుశలా గ్రహమోక్షయోః ।
చారీ తాళలయాభిజ్ఞా మండలస్థానపండితా ॥ 35

హస్తాంగస్థాన నిపుణా కరణేషు విలాసినీ ।
విశాలలోచనా గీతవాద్యతాలానువర్తినీ ॥ 36

పరార్ధ్య భూషాసంపన్నా ప్రసన్నముఖపంకజా ।
నాఽతిస్థూలా నాఽతికృశా నాఽత్యుచ్చా నాఽతివామనా ॥ 37
ఏవంవిధ గుణోపేతా నర్తకీ సముదీరితా ।

అర్థం : తన్వీ = సన్నగా ఉన్నది, రూపవతీ = అందంగా ఉన్నది (= చూడచక్కనిది), శ్యామా = నడిమి యౌవనంలో ఉన్నదె (= ప్రసవం కానిది), పీన-ఉన్నత పయోధరా = బలిసిన నిక్కిన పాలిండ్లు కలది, ప్రగల్భా = ప్రౌఢ, సరసా = సరసురాలు (= చమత్కారి), కాంతా = మనోహారిణి, గ్రహ-మోక్ష యోః కుశలా = (నృత్య-అంశాలను) ప్రారంభించటంలో పరిసమాప్తి చెందించటంలో నేర్పరి, చారీ-తాళ-లయ-అభిజ్ఞా = చారుల తాళ-లయల ప్రయోగం తెలిసినది, మండల-స్థానపండితా = మండలముల యొక్క స్థానవ(= ప్రయోగ) విశేషాలలో పండితురాలు (లేదా మండలము లందు పండితురాలు), హస్త-అంగస్థాన నిపుణా = హస్తవిన్యాస - అంగ విన్యాసములందు నిపుణురాలు, కరణేషు విలాసినీ = కరణము లను సవిలాసంగా నిర్వహింపగలది, విశాలలోచనా = పెద్ద కనులు కలది, గీత-వాద్య-తాళ-అనువర్తినీ = గీతమును, వాద్యమును, తాళ మును అనుసరింప (= అనుసరించి నృత్యం చేయ) గలది, పర - అర్ధ్యభూషాసంపన్నా = శ్రేష్ఠమైన నగల సంపద గలది, ప్రసన్న ముఖపంకజా = ప్రసన్నమైన ముఖపద్మం కలది, న-అతిస్థూలా = ఎక్కువ లావుగా లేనిది, న-అతికృశా = ఎక్కువ సన్నగా లేనిది, న- అతి-ఉచ్చా = ఎక్కువ పొడవుగా లేనిది, న-అతి వామనా = ఎక్కువ పొట్టిగా లేనిది-ఏవంవిధ గుణ ఉపేతా - ఈ విధమైన గుణాలతో కూడిన (స్త్రీ), నర్తకీ సముదీరితా = నర్తకి అని చెప్పబడినది.

తాత్పర్యం : సన్ననిది, రూపవతి, నడిమి యౌవనంలో ఉన్నది, గుండ్రని పాలిండ్లు కలదె, ప్రౌఢ, చమత్కారి, మనోహారిణి, నృత్యమునందలి పట్టు-విడుపులు తెలిసినదె, చారుల తాళ లయల

ప్రయోగం తెలిసినది, మండలముల ప్రయోగంలో పండితురాలు, హస్త-అంగవిన్యాసాలలో నిపుణురాలు, కరణములను సునాయాసంగా నిర్వహింపగలది, అందమైన పెద్ద కనులు కలది, గీత-వాద్య-తాళాలను అనుసరించి నృత్యం చేయగలది, శ్రేష్ఠమైన నగలతో కూడినది, పద్మంవలె ప్రసన్నమైన ముఖం కలది; ఎక్కువ లావుగాకానీ, ఎక్కువ సన్నగా కానీ, ఎక్కువ ఎత్తుగా కానీ, ఎక్కువ పొట్టిగా కానీ లేనిది- ఇటువంటి గుణాలు కలిగిన స్త్రీ 'నర్తకి' అని చెప్పబడినది.

టీక : ఈ శ్లోకాలు చదువుతున్నప్పుడు "తన్వీశ్యామా..." అనే కవికులగురువు శ్లోకం జ్ఞప్తికి రావటం సహజం (మేఘ సందేశం-II - 21 శ్లో.) చిల్లకూరి దివాకరకవి పాత్రము (= నర్తకి) యొక్క లక్షణం క్రింది విధంగా వర్ణించినాడు (భరతసార సంగ్రహం-పుటలు 60-61).

అలివేణి విద్యుల్లతాంగి బింబాధరి

జలజాక్షి కలకంఠి చంద్రవదన

ముకురకపోల చంపకనాస మంజరీ

కుచ మత్తగజయాన కుందరదన

హరిమధ్య నతనాభి యంభోజపాణి ప

ల్లవచరణయునై విలాసగతుల

నెన్నికయుఁ బిన్నవయసును నన్నిగుణము

లెనసి నగుమోము దగుప్రౌఢతనము చెలగ

నటన-గానాభినయముల పటిమ లమర

నదియె సత్పాత్ర యండ్రు (సీతాభిరామ :)

నాట్యశాస్త్రమున 'నర్తకి' లక్షణం (పుట. 707); నృత్త రత్నావళిలో నర్తకీలక్షణం (7వ అధ్యా. 158-164 శ్లో). ప్రధాన నర్తకి వైశిష్ట్యం (8వ అధ్యా. 83-47 శ్లో.) వర్ణింపబడినవి.

పాత్రలక్షణం వివరించే ఈ సందర్భంలో కరణములు, చారులు, మండలములు ప్రస్తావించబడినవి. ఈ మూడున్నూ, అంగహారములున్నూ నృత్త-నృత్యములకు పునాదివంటివి. వీటిని గూర్చి సంక్షిప్తంగా వివరిస్తాను. మానవ శరీరంలోని అవయవా లన్నీ ముప్పేధములుగా విభజింపబడినవి - అంగములు, ఉపాంగ ములు, ప్రత్యంగములు. ఇవి అన్నీ శాస్త్రగ్రంథాలలో వేర్వే రుగా వర్ణించబడతాయి. ఈ అవయవాలలో కటి, ఊరువు, జంఘ, పాదం — ఈ నాలుగూ సంయోజితములై ఏకార్థంలో ప్రవర్తించి నప్పుడు అది 'చారి' అనబడుతుంది. ఈ నాలుగింటిలో ప్రధానం పాదం కాబట్టి పాదప్రచారమే చారి అనికూడా అంటారు. నాట్య శాస్త్రంలో భౌమీచారులు పదునారు, ఆకాశికీచారులు పదునారు వర్ణింపబడినవి. ఏకపాదప్రచారం చారికాగా, పెక్కుచారుల సంయోజనం 'మండలం' అనబడుతుంది. భౌమీ - ఆకాశికీచారుల ప్రాధాన్యమునుబట్టి మండలాలు కూడా రెండు విధాలు. నాట్య శాస్త్రంలో పది భౌమీమండలాలు,పది ఆకాశికీమండలాలు వర్ణితము లయినవి.

హస్తములు ముప్పేధములు - అసంయుత హస్తాలు, సంయుత హస్తాలు, నృత్తహస్తాలు. అసంయుత-సంయుత హస్తాలు నృత్యంలోనూ, నృత్తహస్తాలు నృత్తంలోనూ ప్రాధాన్యం వహి స్తాయి. ఈ హస్తాల కదలికలను హస్తప్రచారం అంటారు. హస్త ప్రచారం, పాదప్రచారం ఏకకాలంలో సమన్వయపూర్వకంగా, సవిలాసంగా ప్రవర్తించటం 'కరణం' అనబడుతుంది; అంటే హస్త-పాద సమాయోగం కరణమన్నమాట. కరణ ప్రయోగంలో హస్తంతోపాటు ఊర్ధ్వకాయంలోని అవయవాలు, పాదంతోపాటు

అధఃకాయంలోని అవయవాలు సాధారణంగా కదలుతాయి. అందు చేతనే కరణం 'నృత్తమాతృక' అనబడింది. చేతన ప్రధానమైన మానవ జీవితంలో హస్త-పాదాల కదలికలు అనంతంగా ఉంటాయి. కాని, సువ్యవస్థితములై, విలాసవిన్యాసములతో కూడిన 108 కరణములను మాత్రమే భరతముని వివరించినాడు.

హస్త-పాద సమాయోగంతో ఏర్పడిన కరణములను - ఆరు లేదా అంతకుమించి - పరస్పరం సంయోజనంచేస్తే, ఆ కరణముల సమూహాన్ని 'అంగహారం' అంటారు. ఇవికూడా అనంతము అయినప్పటికీ, స్పష్టగోచరములయిన 32 అంగహారములనే భరతముని వివరించినాడు. ఈ కరణములను సంయోజనం చేయటంలో ప్రధానంగా ఉపయుక్తములగునవి 'రేచకాలు'. అంటే నృత్త-నృత్యాలలో ఒక భంగిమకును, ఇంకొక భంగిమకును మధ్య ఏర్పడే అవకాశములను (gaps) పూరించి, నైరంతర్యం సాధించటంలో ఈ రేచకాలు ఉపయోగిస్తాయి (408వ పేజీని కూడా చూడవలెను).

## నిషిద్ధ పాత్రములు

పుష్పాక్షీ కేశహీనా చ స్థూలోష్ఠీ లంబిత స్తనీ ॥ 38

అతిస్థూలాఽ వ్యతికృశా అత్యుచ్చా వ్యతివామనా ।

కుబ్జా చ స్వరహీనా చ దశైతా నాట్యవర్జితాః ॥ 39

అర్థం : పుష్ప-అక్షీ = పూలువేసిన కన్నులుకలది, కేశహీనాచ = తలవెంట్రుకలు (= జుట్టు) లేనిది, స్థూల-ఓష్ఠీ = లావుపాటి పెదవులు కలది, లంబిత స్తనీ = వ్రేలాడే స్తనములుకలది, అతిస్థూలా = బాగా లావుగాఉన్నది, (అపి) అతికృశా = బాగా చిక్కినది, అతి-ఉచ్చా = బాగా పొడువుగా ఉన్నది, (అపి-) అతివామనా = బాగా పొట్టిది, కుబ్జా(చ) = గూను కలిగినది, స్వరహీనా(చ) = హీనస్వరము (= కీచుకంఠము కలది, ఏతాఃదశ = ఈ పదిమంది, నాట్యవర్జితాః = నాట్యమందు వర్జితలు (= వర్జింపదగినవారు).

తాత్పర్యం : కంటిలో పూవు ఉన్నది, జుట్టు లేనిది, లావుగా ఉన్న పెదవులు కలది, జారిన స్తనాలు కలది, బాగా లావుగా ఉన్నది, బాగా సన్నగా ఉన్నది, బాగా పొట్టిగా ఉన్నది, గూను కలిగినది, కీచు కంఠం కలది — ఈ పదిమంది నృత్యమునకు పనికి రారు.

టీక : 'దశైతా నాట్యవర్జితాః' బదులు 'వేశ్యా నాట్య వర్జితా' అని నీడా పాఠం — "ఈ గుణాలుకల వేశ్య నాట్యానికి పనికిరాదు" అని దీని అర్థం. నాట్య-నృత్యాలు వేశ్యలకు మాత్రమే పరిమితమైన కాలానికే ఇది వర్తిస్తుంది.

"అస్థాన హాసిని, రూక్ష-ఆవిద్ధగతి చేష్టాయుత, దీర్ఘరోష, దీన, ఉద్వృత్త, ఉద్భట, స్వరదోషయుత, గంధ-మాల్యాలంకారహిత అయిన స్త్రీ నాయికా భూమికకు అర్హురాలు కాదు" అనీ, "వయో రూపవతులైన వేయిమంది స్త్రీలలోనూ గుణయుక్తురాలైన నర్తకి ఒక్కతె అయినను అరుదుగా లభించును" అనీ, భరతముని స్పష్టం చేసినాడు (చూ. తె. నా. శా. పుట 855).

## పాత్ర - అంతఃప్రాణాలు

జవః స్థిరత్వం రేఖా చ భ్రమరీ దృష్టి రశ్రమః ।
మేధా శ్రద్ధా వచో గీతి స్త్వతః ప్రాణా దశ స్మృతాః ॥ 40
ఏవం విధేన పాత్రేణ నృత్యం కార్యం విధానతః ।

అర్థం : జవః = వడి (= వేగము), స్థిరత్వం = నిలుకడ, రేఖా(చ) = సమత్వం (= అవయవ సౌష్ఠవం), భ్రమరీ = భ్రమరీ విన్యాసం, దృష్టిః = చక్కనిచూపు, అశ్రమః = అలసట లేకపోవటం, మేధా = ధారణా (= జ్ఞాపక) శక్తి, శ్రద్ధా = శ్రద్ధ, వచః = మాట (నేర్పు), గీతిః (తు) = పాట, దశ = ఈపది (గుణాలు), అంతః ప్రాణాః స్మృతాః = (పాత్రము లేదా నర్తకి యొక్క) అంతరంగ

ప్రాణాలని చెప్పబడినవి. ఏవంవిధేన = ఈ విధంగా, విధానతః = (శాస్త్ర) విధిని అనుసరించి, పాత్రేణ = పాత్ర (= నర్తకి) చేత, నృతం కార్యం = నృత్యం చేయదగినది.

తాత్పర్యం : వేగం, నిలుకడ, సమత్వం, భ్రమరీ విన్యాసం, చక్కని చూపు, అలసట లేకపోవటం, ధారణాశక్తి, శ్రద్ధ, మాట నేర్పు, పాట — ఈ పది గుణాలు పాత్ర యొక్క అంతఃప్రాణాలు. ఇంతవరకు చెప్పినట్లుగా శాస్త్రవిధిని అనుసరించి, పాత్రచేత నృత్యం చేయించవలెను.

టీక : "...మేధా శ్రద్ధా వచో గీతం పాత్ర ప్రాణాదశ స్మృతాః" అని ఘోష్ పాఠం ; "...పాత్రము యొక్క పది ప్రాణాలు అని చెప్పబడినవి" అని దీని అర్థం. తరువాత పాత్ర యొక్క 'బహిఃప్రాణాలు' చెప్పబడుతున్నవి ; కాని ఈ భాగాన్ని ఘోష్ గ్రహించలేదు. అందుచేతనే 'అంతఃప్రాణాలు' అన్న పాఠాన్ని కూడా ఆయన విడిచి వేసినాడు.

ఈ పది లక్షణాలు స్త్రీ-పురుషు లిరువురకు సమానములే. భ్రమరులు నాట్యశాస్త్రమందు వర్ణింపబడలేదు. దేశి సంప్రదాయానికి చెందిన 18 భ్రమరీ భేదాలను జాయన వర్ణించినాడు (నృత్తరత్నావళి - 6 వ అధ్యా - 82-106 శ్లో. పుటలు 281-87).

## పాత్ర - బహిఃప్రాణాలు

మృదంగ శ్చ సుతాళా చ వేణుః గీతిః తతః శ్రుతిః ॥ 41

ఏకవీణా కింకిణీ చ గాయకశ్చ సువిశ్రుతః ।
ఇత్యేవ మన్వయజ్ఞైశ్చ పాత్రప్రాణా బహిః స్మృతాః ॥ 42

అర్థం: మృదంగః (చ) = మృదంగం (= మద్దెల), సుతాళా (చ) = మంచి నాదం గల తాళాల జంట, వేణుః = వంశి (= పిల్లనగ్రోవి), గీతిః = పాట, తతః = మరియు, శ్రుతిః = శ్రుతి, ఏకవీణా = ఏకవీణ, కింకిణీ (చ) = చిరుగజ్జెలు, సువిశ్రుతః గాయకః (చ) =

పేరు పొందిన గాయకుడు - ఏవం = ఈ విధంగా (ఈ ఎనిమిది), పాత్ర బహిః ప్రాణాః ఇతి = పాత్రము యొక్క బాహ్య ప్రాణాలు అని, అన్వయజ్ఞైః (చ) = సంప్రదాయజ్ఞుల (= పండితుల) చేత, స్మృతాః = చెప్పబడినవి.

తాత్పర్యం : మృదంగం, తాళాలు, వేణువు, గీతి, శ్రుతి, ఏకవీణ, చిరుగజ్జెలు, పేరుపొందిన గాయకుడు — ఈ ఎనిమిది పాత్రము యొక్క బహిఃప్రాణాలని పండితులు చెప్పినారు.

టీక : అంతఃప్రాణాలవలెనే, బహిఃప్రాణాలు కూడా నృత్యం చేసే - స్త్రీ - పురుషులకు (= నర్తకి - నర్తకులకు) సమానంగా వర్తిస్తాయి.

'ఏకవీణ' అనగా ఏమో తెలియలేదు. 'ఏకవీర' అనగా ఒక రకపు 'మురళీ వాద్యం' అని సంగీతశబ్దార్థచంద్రిక వివరిస్తున్నది. (పుట. 70) 'ఏకవీర' అనే వంశీవాద్యం కుంభకర్ణుని సంగీతరాజంలో కూడా వర్ణితమైనది. (చూ. భరత కోశము–పుట. 98). ఒకే తీగ గల తంబురను 'ఏక్‌తార' అంటారు. కావున 'ఏకవీర' అనుటకు బదులుగా 'ఏకవీణ' అని పొరపాటు పడిందేమో ? లేదా 'ఒకవీణ' అని చెప్పటం సంభావ్యం కావచ్చు.

## కింకిణీ లక్షణం

కింకిణ్యః కాంస్యవిరచితాః ఏకైకాంగులి కాంతరమ్ ।
సుస్వరాశ్చ సురూపాశ్చ సూక్ష్మా నక్షత్ర దేవతాః ॥ 43

బద్ధ్వా యా స్నిగ్ధనూత్రేణ గ్రంథిభిశ్చ దృఢం పునః ।
శతద్వయం శతం వాఽపి పాదయోః నాట్యకారిణీ ॥ 44

అర్థం : కింకిణ్యః = (పాత్రముధరించే) చిరు గజ్జెలు - కాంస్య విరచితాః = కంచుతో చేయబడినవి, ఏక-ఏక-అంగులి కాంతరమ్ = ఒక్కొక్క అంగులి దూరం (= ఒక గజ్జెకు ఇంకొక గజ్జెకు మధ్య

దూరం ఒక అంగులి) ఉన్నది, సుస్వరాః (చ) = మంచి స్వరం కలవి, సురూపాః (చ) = అందమైనవి, సూక్ష్మాః = చిన్నవి, నక్షత్రదేవతాః = నక్షత్రాలు అధిదేవతలుగాకలవి (కావలెను). (ఇటువంటి గజ్జెలను) పునః = మరల, నాట్యకారిణీ = నర్తకి, పాదయోః = (తన) పాదము లందు, శతద్వయం = రెండు వందలు, శతంవా అపి = లేదా ఒక వంద, నీల సూత్రేణ = నీలపు రంగు దారంతో, గ్రంథిభిః (చ) = గ్రంథులతో (= ముడులు వేసి), దృఢం బధ్నీయాత్ = గట్టిగా కట్టవలెను.

తాత్పర్యం : పాత్రము ధరించే గజ్జెలు — కంచువి, ఒక్కొక్క అంగులి దూరం ఉండునట్లుగా కట్టబడినవి, మంచి స్వరం కలవి, అందమైనవి, చిన్నవి, నక్షత్రదేవతాకములు — కావలెను. ఇటువంటి గజ్జెలను రెండు వందలు, లేదా ఒక వంద చొప్పున నీలపు రంగు సూత్రంతో నర్తకి తన పాదములందు గట్టిగా కట్టుకోవలెను.

టీక : 'ఏకైకాంగులికాంతరమ్' — దీనికి బదులు 'తామ్రేణ రజతేనవా' అని నీడా పాఠం. (కంచుతోనే కాక) 'రాగితో కాని, వెండితో కాని' గజ్జెలను చేయవచ్చునని దీని అర్థం. 44 వ శ్లోకం తరువాత 'శతం వా దక్షిణే పాదే, ద్విశతం వామపాదకే' అని నీడాలో అధికపాఠం ఉన్నది. కుడి పాదమందు వంద, ఎడమ పాద మందు రెండు వందలు గజ్జెలు కట్టవలెనని దీని అర్థం. ఇందుకు సంప్రదాయజ్ఞులే ప్రమాణం.

## నట (= నర్తక) లక్షణం

రూపవాన్ మధురభాషీ కృతీ వాగ్మీ పటు స్తథా ।
కులాంగనాసుతశ్చైవ శాస్త్రజ్ఞో మధురస్వరః ॥ 45

గీతవాద్యాది నృత్యజ్ఞో సిద్ధకః ప్రతిభానవాన్ ।
ఏతాదృశ గుణైర్యుక్తో నట ఇత్యుచ్యతే బుధైః ॥ 46

అర్థం : రూపవాన్, మధురభాషీ, కృతీ, వాగ్మీ, (తథా) నటః = రూపవంతుడు ( = అందగాడు), వినసొంపుగా మాటాడు వాడు, పండితుడు, మాటకారి, సమర్థుడు ; కుల-అంగనా సుతః (చ) (ఏవ), శాస్త్రజ్ఞః, మధుర స్వరః = కులస్త్రీ సుతుడు, (భరత) శాస్త్ర వేత్త, కమ్మని కంఠం కల వాడు; గీతవాద్య-ఆది నృత్యజ్ఞః, సిద్ధకః, ప్రతిభానవాన్ = గీతం వాద్యం మొదలయిన నృత్య విషయాలు తెలిసినవాడు, ఆత్మవిశ్వాసం కలవాడు, ప్రతిభావంతుడు ( = కల్పనాశక్తి కలవాడు); ఏతాదృశ గుణైః యుక్తః, నటః ఇతి, బుధైః ఉచ్యతే = ఇటువంటి ( = పైని చెప్పిన) గుణాలు కలవాడు, నటుడు ( = నర్తకుడు) అని, పండితుల చేత చెప్పబడుతున్నాడు.

తాత్పర్యం : రూపవంతుడు, మధురంగా మాటాడు వాడు, పండితుడు, మాటకారి, కులస్త్రీ సుతుడు, శాస్త్రవేత్త, కమ్మని కంఠం కల వాడు, గీతవాద్యాదులు తెలిసినవాడు, ఆత్మ విశ్వాసం కల వాడు, ప్రతిభావంతుడు — అయిన వానినే పండితులు "నటుడు ( = నర్తకుడు)" అంటారు.

టీక : పై రెండు శ్లోకాలు ఘోష్ పాఠంలో లేవు. జాయన నర్తక లక్షణాన్ని 7 శ్లోకాలలో వర్ణించినాడు (నృత్తరత్నావళి 7 వ అధ్యా-శ్లో. 165-71). భరతముని నటుని ( = నాయకభూమికాధారి) గుణాలను పేర్కొన్నాడు (తె. నా. శా. పుట-854). నర్తకి వలెనే నర్తకుడు కూడా విశిష్టగుణసంపన్నుడు కావలెను.

## పూర్వరంగం

అకృత్వా ప్రార్థనం పాత్ర మాచరేద్యది నాట్యకమ్ ।
తన్నాట్యం నీచ మిత్యాహుః నాట్యశాస్త్రవిచక్షణాః ॥ 47

నీచపాత్రకృతం నాట్యం యది పశ్యంతి మానవాః ।
పుత్రహీనా భవిష్యంతి జాయంతే పశుయోనిషు ॥ 48

తస్మాత్సర్వం సమాలోచ్య పూర్వకైః యదుదాహృతమ్ ।
దేవతా ప్రార్థనాదీని కృత్వా నాట్య ముపక్రమేత్ ॥ 49

అర్థం : పాత్రమ్, ప్రార్థనం,అకృత్వా, నాట్యకమ్, ఆచరేత్ యది = పాత్రము ( = వర్తకి), (ఇష్టదేవతా) ప్రార్థన, చేయక రయే, నాట్యకం( = నృత్యం) చేస్తే; తత్ నాట్యం, నీచమ్ ఇతి, నాట్యశాస్త్ర విచక్షణాః, ఆహుః = ఆ నాట్యం ( = నృత్యం), నీచం అని, నాట్యశాస్త్రవేత్తలు, చెబుతారు ; నీచపాత్రకృతం, నాట్యం, మానవాః, పశ్యంతి యది = నీచపాత్రచేత చేయబడిన, నాట్యం, మానవులు, చూసినట్లయితే ; పుత్రి హీనాః భవంతి, పశుయోనిషు జాయంతే = (వారు) పుత్రివిహీనులు అవుతారు, పశువులుగా జన్మిస్తారు; తస్మాత్, పూర్వకైః, యత్ ఉదాహృతం = అందుచేత, పూర్వులచేత ఏమి చెప్పబడినదో ; సర్వం, సమాలోచ్య, ఆ అన్ని విషయాలను, బాగుగా సమీక్షించుకొని; దేవతాప్రార్థన - ఆదీని, కృత్వా = (ఇష్ట) దేవతా ప్రార్థనాదులను, చేసి ; నాట్యం, ఉప క్రమేత్ = నాట్యం, ప్రారంభించవలెను.

తాత్పర్యం : నర్తకి, ప్రార్థన చేయకుండా నాట్యం ( = నృత్యం) చేస్తే, అది 'నీచ నాట్యం' అవుతుంది. నీచ పాత్రము చేసిన నీచనాట్యం చూసిన మానవులు అపుత్రకులు అవుతారు. పశువులుగా జన్మిస్తారు. కావున పూర్వులు చెప్పిన సర్వ విషయాలను చక్కగా అవగాహన చేసుకొని, దేవతా ప్రార్థనాదులను సక్రమంగా నిర్వహించి, నాట్యం ప్రారంభించవలెను.

టీక : పై మూడు శ్లోకాలు కూడా ఘోష్ పాఠంలో లేవు. ఇందులో పూర్వరంగ ప్రాముఖ్యం విశదీకరించబడింది. పూర్వరంగ విధులను గూర్చి నాట్యశాస్త్రంలో ఒక ప్రత్యేక అధ్యాయం ఉంది (5 వ అధ్యా.). క్రమంగా విపులమైన ఆ కార్యక్రమం, సంక్షిప్తమైనది. కాని, ఇష్టదేవతా ప్రార్థన మాత్రం తప్పనిసరిగా చేయటం ఆచారమైంది.

నీచ పాత్రము లేదా 'నాట్యవర్తిక' ఇంతకుముందు 38.39 శ్లోకాలలో వర్ణితమైంది.

> విఘ్నేశం మురజాధిపం చ గగనం స్తుత్వా మహీం ప్రార్థయేత్ ।
> తత్తద్వాద్యకదంబకస్య విధినా పూజావిధాన మానయేత్ ॥ 50
> అలప్యాతిమనోహరాన్ బహువిధీన్ సంపాద్య భూయ స్తథా ।
> గుర్వాజ్ఞా మవలంబ్య పాత్ర ముచితం శృంగార మేవారభేత్ ॥ 51

అర్థం : మురజ-అధిపం విఘ్నేశం, గగనం (చ), స్తుత్వా= మృదంగ అధిపతి (అయిన) వినాయకుని, ఆకాశాన్ని, స్తుతించి (=ప్రార్థించి); మహీం ప్రార్థయేత్ = భూమిని ప్రార్థించవలెను; (తరువాత) విధినా, తత్ తత్ వాద్యకదంబకస్య, పూజా విధానమ్, ఆనయేత్ = విధిపూర్వకంగా, ఆయా వాద్య సమూహం యొక్క, పూజావిధిని, ఆచరించవలెను; అతిమనోహారాన్, అలప్య = మనోజ్ఞములైన (స్వరాలను), ఆలపించి; తథా = పిమ్మట ; బహు విధీన్, భూయః సంపాద్య = అనేక విధాలైన విధులను, అధికంగా సంపాదించి (=నిర్వహించి); గురు-అజ్ఞామ్, అవలంబ్య = గురువు (=నాట్యాచార్యుని), అనుమతిని, అనుసరించి; పాత్రం, ఉచితం శృంగారమ్ ఏవ, ఆరభేత్ = నర్తకి, యథోచితమైన శృంగార (అభినయ) మునే, ఆరంభించవలెను.

తాత్పర్యం : మృదంగాధిపతి అయిన వినాయకుని, ఆకాశాన్ని, భూమిని వరుసగా ప్రార్థించి, ఆయా వాద్యాలను యథా విధిగా పూజించి, పిమ్మట మనోజ్ఞంగా ఆలాపనచేసి, తక్కిన విధు లన్నింటినీ నిర్వహించి, నాట్యాచార్యుని అనుమతి పొంది, సమ యానుగుణమైన శృంగారాభినయంతో నాట్యం (=నృత్యం) ప్రారంభించవలెను.

టీక : పై 50, 51 శ్లోకాలు 'నీడా' పాఠంలో లేవు.

"గుర్వాజ్ఞా మవలంబ్య పాత్ర ముచితం శృంగార మే వార భేత్" అన్నదానికి "యథోచితంగా ఆహార్యం సమకూర్చు కొనుటకు ఆచార్యుని అనుమతి పొందవలెను" అన్న అర్థం వస్తున్నది ఘోష్ ఆంగ్లానువాదంలో.

వినాయకుడు 'మురజ - అధిపతి' గా ఇచ్చట వర్ణితుడైనాడు. ధనంజయుడు తన దశరూపక ప్రారంభంలో వినాయక స్తుతిచేస్తూ "వినాయకుని కంఠం నీలకంఠుని తాండవసమయంలో మృదంగం అవుతున్న"దని చెప్పినాడు-

"నమ స్తస్మైగణేశాయ యత్కంఠఃపుష్కరాయతే ।
మదాభోగ ఘనధ్వానో నీలకంఠస్యతాండవే ॥"

**భరతకులభాగ్యకలికే భావరసానందపరిణతాకారే ।**
**జగదేకమోహనకలే జయజయ రంగాధి దేవతే దేవి ॥** 52

అర్థం : భరతకుల, భాగ్యకలికే = భరతకుల (= నటవంశ)ం యొక్క, భాగ్యవిధాత్రి !; భావ-రస-ఆనంద పరిణత-ఆకారే = భావాలవల్ల, రసాలవల్ల ఆనందంగా పరిణమించే స్వరూపంకలదానా!; జగత్-ఏకమోహనకలే = జగత్తునంతటి సమ్మోహపర్చగల ఏకైక కళామూర్తి !; రంగ-అధిదేవతే, దేవి, జయజయ = రంగస్థల అధిదేవతా! ఓ దేవీ! జయించుము, జయించుము (= నీకు జయమగునుగాక!)

తాత్పర్యం : ఓ రంగస్థల అధిదేవతా ! ఓ దేవీ ! భరతకుల భాగ్యవిధాత్రి ! భావరసాలవల్ల కలిగే ఆనందం మూర్తీభవించిన దానా ! జగత్తునంతటినీ సమ్మోహపర్చగల ఏకైక కళామూర్తీ ! నీకు జయమగును గాక !

టీక : ఈ శ్లోకం నీడా పాఠంలో లేదు. అంతేకాదు చంద్రశేఖరుని భరతసారంలోతప్ప అధి దేవతాస్తుతి ఇంక ఏ గ్రంథంలోనూ కన్పట్టలేదు.

50 వ శ్లోకంలో వినాయకుని, ఆకాశాన్ని, భూమిని ప్రార్థించవలెనని చెప్పబడింది. ఇది ఇప్పటికీ జరుగుతున్న సంప్రదాయమే. ఇంక ఈ శ్లోకంలో రంగస్థల-అధి దేవతా స్తుతి చేయబడింది. గురువుగారి ప్రయత్నం, నర్తకి శ్రమ, వాద్య గాయకుల సహకారం ముప్పేటగా జతపడి, నర్తకి వ్యక్తంచేసే భావరసాలు ప్రేక్షకుల మనస్సులలో ఆనందం కలిగించటానికి హేతువైనది రంగస్థలమే అని సహృదయులకు తెలుసు. అందుచేతనే దానికి ఇంత ప్రశంస !

విఘ్నానాం నాశనం కర్తుం భూతానాం రక్షణాయ చ ।
దేవానాం తుష్టయే చాపి ప్రేక్షకాణాం విభూతయే ॥ 53
శ్రేయసే నాయకస్యాత్ర పాత్ర సంరక్షణాయ చ ।
ఆచార్య శిక్షా సిద్ధ్యర్థం పుష్పాంజలి మథారభేత్ ॥ 54

అర్థం : అథ = ఇచ్చట (= ఈ సందర్భంలో); విఘ్నానాం నాశనం కర్తుం, భూతానాం రక్షణాయ (చ) = విఘ్నాలను నాశనం చేయటానికి, జీవరాశి రక్షణ కొరకు; దేవానాం తుష్టయే (చ) (అపి), ప్రేక్షకాణాం విభూతయే = దేవతల యొక్క తుష్టి (= ఆనందం) కొరకు, ప్రేక్షకుల యొక్క ఐశ్వర్య వృద్ధికొరకు ; నాయకస్య శ్రేయసే, పాత్ర సంరక్షణాయ (చ) = (సభా) నాయకుని శ్రేయస్సు కొరకు, నర్తకి క్షేమం కొరకు ; ఆచార్య శిక్షాసిద్ధి - అర్థం = ఆచార్యుడు ఇచ్చిన శిక్షణ ఫలించటం కొరకు; అథ, పుష్పాంజలిమ్, ఆరభేత్ = అప్పుడు (నర్తకి), పుష్పాంజలిని, ఆరంభించవలెను.

తాత్పర్యం : విఘ్నాల నాశనం, సమస్త జీవరాశి రక్షణ, దేవతల ఆనందం, ప్రేక్షకుల సంపద, సభానాయకుని శ్రేయస్సు, నర్తకి క్షేమం, ఆచార్యుని శిక్షణ ఫలవంతం కావటం - వీటిని దృష్టిలో పెట్టుకొని, నర్తకి 'పుష్పాంజలి' నిర్వహించవలెను.

టీక : 53, 54 శ్లోకాలు కూడా నీడా పాఠంలో లేవు. 'పుష్పాంజలి' ని సమర్పించటంవల్ల లభించే సత్ఫలితాలు ఇచ్చట వివరించబడినాయి. నృత్య ప్రారంభంలో అంజలి (= దోసిలి) నిండుగా పుష్పాలు ధరించి, రంగ స్థలాన్ని, ప్రేక్షకులను ఆరాధించే సంప్రదాయం ఈ నాడూ ఉంది. ఈ 'పుష్పాంజలి' సమర్పణము అలరిపు (= అలరింపు) పేర నేటి నృత్యాలలో కూడా ఉంది.

## నృత్యవిధానం : అభినయం

ఏవం కృత్వా పూర్వరంగం నృత్యం కార్యం తతఃపరమ్ ।
నృత్యం గీతాభినయనం భావతాలయుతం భవేత్ ॥ 55

అర్థం : పూర్వరంగం, ఏవం, కృత్వా = పూర్వరంగ విధిని, ఇట్లా (= ఇంతకుముందు వివరించిన విధంగా) చేసి ; తతః పరమ్,

నృత్యం, కార్యం = ఆట పిమ్మట, నృత్యం, చేయదగినది ; గీత-అభినయనం, నృత్యం, భావతాలయుతం భవేత్ = గీతాల అభినయ రూపమైన, నృత్యం, భావతాల సహితం అవుతుంది.

తాత్పర్యం : పూర్వరంగాన్ని యథావిధిగా నిర్వహించి, నృత్యం ప్రారంభించవలెను. గీతాల అభినయరూపమైన నృత్యం భావ-తాళములను అనుసరించి ఉంటుంది.

టీక : భావ-తాలయుతంగా గీతాలను అభినయించటమే నృత్యం అవుతుంది. ఈ శ్లోకం - నీడా పాఠంలో లేదు.

కంఠేనా ఒ ఒ లంబయే ద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్ ।
చక్షుర్భ్యాం దర్శయే ద్భావం పాదాభ్యాం తాల మాచరేత్॥ 56

యతో హ స్త స్తతో దృష్టిః యతో దృష్టి స్తతో మనః ।
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః॥ 57

అర్థం: వర్తకి-గీతం = పాటను;కంఠేన-ఆలంబయేత్ = కంఠంతో ఆలాపించవలెను ; అర్థం = (ఆ పాటలోని) అర్థాన్ని; హస్తేన ప్రదర్శయేత్ = హస్తాలతో ప్రదర్శించవలెను ; భావం = (ఆ పాటలోని) భావాన్ని, చక్షుర్భ్యాం దర్శయేత్ = కన్నులతో ప్రదర్శించవలెను ; తాలం = (తదనుకూలంగా) తాళాన్ని ; పాదాభ్యాం, ఆచరేత్ = పాదాలతో వేయవలెను.

(ఆ వర్తకి యొక్క — ) హస్తః యతః = చేయి ఎక్కడనో ( = ఎటు ప్రయుక్త మవుతుందో), తతః దృష్టిః = అక్కడనే దృష్టి (ప్రయుక్తం కావలెను) ; దృష్టిః యతః = దృష్టి ఎక్కడనో ( = ఎటు ఉన్నదో), తతః మనః = అక్కడనే మనస్సు (లగ్నం కావలెను) ; మనః యతః = మనస్సు ఎక్కడనో, తతః భావః = అక్కడనే భావం (వ్యక్తం కావలెను); భావః యతః = భావం ఎక్కడనో, తతః రసః = అక్కడనే రసం (నిష్పన్న మవుతుంది).

తాత్పర్యం : నర్తకి గీతాన్ని కంఠంతో ఆలాపిస్తూ, అర్థాన్ని హస్తాలతో ప్రదర్శిస్తూ, భావాలను కన్నులతో ప్రదర్శిస్తూ, తాళాన్ని పాదాలతో పాటించవలెను.

ఆ నర్తకి యొక్క హస్తం ఏ స్థానంలో ఉన్నదో, దృష్టి తదనుగుణంగా ఉండవలెను. దృష్టి ఎక్కడ ఉన్నదో ఆమె మనస్సు అక్కడ లగ్నం కావలెను. మనస్సు ఎక్కడ లగ్నమైనదో తదను గుణంగా భావం వ్యక్తం కావలెను. భావం ఎక్కడ వ్యక్తమవు తుందో అక్కడ రసం తప్పక నిష్పన్నమవుతుంది.

టీక : 'కంఠేన' కు బదులు 'ఆస్యేన' అని మ్యాన్ పాఠం. రెండూ ఒకే అర్థంలో ప్రయుక్తమైనవని చెప్పవచ్చు. అయినా 'కంఠేన' అన్న పాఠమే ఉత్తమం. పాడుతూ నృత్యం చేయటం తెలుగుదేశపు ప్రత్యేకత. 56 వ శ్లోకభావం కొన్ని తెలుగు కావ్యాలలో చోటు చేసుకొన్నది. కోడవిగోపరాజు క్రింది విధంగా దీనిని అనుసరించినాడు :

కం॥ "తనువున గీతాలంబన

మును, జేతుల నర్థవ్యక్షితమును, నేత్రయుగం

బున భావముఁ, బదములఁ దా

ళనిర్ణయమ్మును మెఱయఁగ లాస్యము నెఱపెన్ ॥"

-ఊర్వశీ నృత్య వర్ణన - సింహాసన ద్వాత్రింశిక-I. 1-188

55, 56 శ్లోకాలను మాత్రు భూతయ్య కవి క్రింది విధంగా అనుసరించినాడు :

సీ॥ చెలువొంద గీతంబు చెన్నుమీఱఁగఁ బాడి

యర్థంబుఁ గరముల నమరఁ బట్టి

వరుఁగఁ గన్నులయందు భావంబుఁ దగనుంచి

పదములఁ దాళంబుఁ బరఁగఁ దీర్చి

హస్తంబు పొడచూపునచట దృష్టియు నుంచి

మది దృష్టి గల చోట మనసు నిల్పి

మనసు నిల్పిన యెడ వెనయ భావము నుంచి

భావంబుతో రసంబలరఁ జేసి

గీ॥ యెలమి నివి యెల్ల నొక్కటై మెలఁగుచుండ
నట్టిదేచూడ నిలలోన నభినయంబు
నెనసి భరతజ్ఞు లిది మెత్తు రింపు మీఱ
రాక్షసవిరామ ! కస్తురి రంగధామ !

– తెలుగు అభినయ దర్పణము - I–19 ప.

58 వ శ్లోకాన్ని విన్నకోట పెద్దన క్రింది విధంగా అనుసరించినాడు :

"కనుఁగొన మెప్పు కంఠమున గానముం, బాణుల మంజులార్థకల్పనమును, దృగ్విశేషంబున భావములుం, జరణక్రమంబులన్
దనరు లయప్రపూర్ణమగు తాళము గ్రాలఁగఁ బాత్ర యొప్పు, రంజనముగ నాడె నింపు వెదజల్లుచు విశ్వనృపాలు సన్నిధిన్॥

— కావ్యాలంకార చూడామణి - 2 - 57

'పలనాటి వీర చరిత్ర'లో శ్రీనాథుడు రాజాస్థాననృత్యాన్ని విపులంగా వర్ణించినాడు (పుటలు - 18 - 19). రాజాస్థాన నృత్యాలను గూర్చిన వివరణమునకు నృత్త రత్నావళి యందున్న నా పీఠిక ను చూడవలెను (పుటలు. 40-48).

## అభినయ ప్రాధాన్యం

తత్ర త్వభినయ స్యైవ ప్రాధాన్య మితి కథ్యతే ।
అభిపూర్వక ణీఞ్ ధాతో రాభ్యానార్థస్య నిర్ణయః ॥ 58
యస్మా త్పదార్థా న్నయతి తస్మా దభినయః స్మృతః ।

అర్థం: తత్ర(తు) = అక్కడ(= ఆ నృత్యమందు);అభినయస్య- ఏవ = అభినయమునకే ; ప్రాధాన్యం, ఇతి, కథ్యతే = ప్రాధాన్యం, అని, చెప్పబడుతున్నది ;

**అభిపూర్వకణీఞ్ ధాతోః** — 'అభి' అనే (ఉపసర్గ) పూర్వమందు గల 'ణీఞ్' అనే ధాతువునకు; ఆఖ్యాన- అర్థస్య నిర్ణయం — 'చెప్పటం' అని అర్థ నిర్ణయం; యస్మాత్, పద-అర్థాన్ - నయతి — ఎందుచేత, పదాలయొక్క అర్థాలను నడిపిస్తుందో (— తెలియ జేస్తుందో); తస్మాత్ - అందువల్ల (ఇది); అభినయః స్మృతః — 'అభినయం' అని చెప్పబడింది.

తాత్పర్యం : నృత్యమునందు అభినయమునకే ప్రాధాన్యం. సంస్కృత భాషలో అభిపూర్వక ణీఞ్ ధాతువునకు 'చెప్పటం' అని అర్థం. పదాల యొక్క అర్థాలను తెలియజేసేది (— చెప్పేది) కాన, ఇది 'అభినయం' అనబడినది.

టీక : అభినయమును నిర్వచిస్తున్న శ్లోకం (58 వ శ్లో. చివరి పాదం, 59 వ శ్లో. మొదటి పాదం) 'ఘోష్' పాఠంలో లేవు. ఇది క్రింది నాట్యశాస్త్ర శ్లోకాన్ని అనుసరించి ఉంది.

"అభిపూర్వస్తు ణీఞ్ ధాతు రాభిముఖ్యార్థ నిర్ణయే।
యస్మాత్ ప్రయోగం నయతి తస్మా దభినయః స్మృతః॥

— (నా.శా. 8 వ అధ్యా. 7 శ్లో.)

-"'అభి' పూర్వకమగు ణీఞ్ (— నీ) ధాతువు 'అభిముఖ్యము' అనెడి అర్థమునందు ప్రయుక్తము'. ప్రయోగమును పొందించును అనగా రూపకార్థములను సామాజిక హృదయములకు అందజేయును కాన ఇది 'అభినయము' అనబడినది" (తె. నా. శా. పుటలు. 267-68). కాగా రస భావాదులను వ్యక్తం చేసే చేష్టా విశేషం అభినయమని సారాంశం.

ఇతర గ్రంథాలలో అభినయ శబ్ద వ్యుత్పత్తి:

అభివ్యంజ న్విభావానుభావాదీన్ నాటకాశ్రయాన్॥ 59

ఉత్పాదయన్ సహృదయే రసజ్ఞానం నిరంతరమ్ ।
అనుకర్తృస్థితో యోఽర్థో ఽభినయః సోఽభిధీయతే ॥ 60

అర్థం : నాటక - ఆశ్రయాన్ = నాటకమును ఆశ్రయించిన; విభావ-అనుభావ- ఆదీన్ = విభావం, అనుభావం మొదలగు వాటిని ; అభివ్యంజన్ = అభివ్యక్తం (= తెలియ) చేస్తూ ; సహృదయే = సహృదయు (= రసజ్ఞు) అందు ; నిరంతరం, రసజ్ఞానం ఉత్పాదయన్ = నిరంతరంగా, రసజ్ఞానమును, ఉత్పాదించుతూ; అనుకర్తృస్థితః = అనుకర్త (= నటుని) యందు ఉండే ; యః అర్థః = ఏర్థం (కలదో); సః, అభినయః, అభిధీయతే = అది (= ఆ అర్థం) ; 'అభినయం' (అని) చెప్పబడుతున్నది.

తాత్పర్యం: నాటకాశ్రయములైన విభావ-అనుభావాదులను వ్యక్తం చేస్తూ, సహృదయులందు రసాన్ని ఉత్పత్తి చేస్తూ, నటుని యందు ఉండే అర్థం (= వ్యాపారం) 'అభినయం' అనబడుతుంది.

టీక : 'గ్రంథాంతరే' (= ఇతర గ్రంథములందు) అంటూ నీడా మంగళం తిరువేంకటాచార్యులవారు వందల కొలది శ్లోకములను అభినయ దర్పణమునందు చేర్చినారు (ఈ అంశాన్ని గ్రంథాంతమందు వారే చెప్పినారు). శ్రీ ఘోష్ ప్రకారం అభినయ దర్పణమందలి శ్లోకాలు 328 మాత్రమే. కాని నీడా మంగళం వేంకటాచార్యుల వారి సంపాదకత్వము నందు 718 శ్లోకములైనవి. ఇంక ఈ రెండింటిని సమన్వయించిన ప్రస్తుత గ్రంథంలో మొత్తం ఎనిమిది వందల శ్లోకాలు పైగా ఉన్నాయి.

## అభినయ భేదాలు

ఆంగికో వాచికః తద్వదాహార్యః సాత్త్వికోఽపరః ।
చతుర్ధాభినయః తత్ర చాంగికోఽంగైర్నిదర్శితః ॥ 61

వాచావిరచితః కావ్య నాటకాదిషు వాచికః ।
ఆహార్యో హారకేయూరవేషాదిభి రలంకృతః ॥ 62

సాత్త్వికః సాత్త్వికైర్భావైః భావజ్ఞేన విభావితః ।

అర్థం : చతుర్ధా అభినయః = అభినయం నాలుగు విధాలు ; ఆంగికః-వాచికః-(తద్వత్) ఆహార్యః-(అపరః) సాత్త్వికః = ఆంగికం - వాచికం - (అట్లాగే) ఆహార్యం-(మరొకటి) సాత్త్వికం ; తత్ర (చ) = అందులో —

అంగైః, నిదర్శితః = అంగ (= అవయవ) ములచేత, చూప బడినది ; ఆంగికః = ఆంగిక (అభినయ)ం; కావ్య-నాటక-ఆదిషు = కావ్యాలు, నాటకాలు మొదలగు వాటిలో ; వాచా విరచితః = వాక్కులచేత విరచితమైనది (= ప్రవృత్తమైనది) ; వాచికః = వాచిక (అభినయ)ం ; హార-కేయూర - వేషాదిభిః = హారాలు, కేయూరాలు, వేష (ధారణ)ం మొదలగు వాటిచేత; అలంకృతః = (శరీరం) అలంకరింపబడటం ; ఆహార్యం = ఆహార్య (అభినయ)ం : సాత్త్వికైః, భావైః = సత్త్వ సంబంధములైన, భావాలతో; భావ జ్ఞేన = భావాలు తెలిసిన వానిచేత ; విభావితః = వ్యక్తం చేయబడి నది ; సాత్త్వికః = సాత్త్విక(అభినయ)ం.

తాత్పర్యం ; అభినయం నాలుగు విధాలు — ఆంగికం, వాచికం, ఆహార్యం, సాత్త్వికం. అవయవ విన్యాసం ఆంగికాభి నయం. వాగ్విన్యాసం వాచికాభినయం. వేష-భూషలు ఆహార్యాభి నయం. సాత్త్వికభావ వ్యక్తీకరణ సాత్త్వికాభినయం.

ఈ నాలుగు అభినయాలు నృత్య-నాట్యాలు రెండింటిలోనూ ఆవశ్యకమే. నాట్యశాస్త్రమందు సగానునకు పైగా ఈ నాలుగు అభినయాల వివరణ ఉన్నది. వీటి స్వరూప స్వభావాలను స్థూలంగా 'తెలుగు నాటక వికాసము' నందు వివరించాను (పుటలు. 21-26). నాటకంలో ఆంగికాభినయం తక్కువగా ఉంటుంది. ఇంక నృత్యంలో దీనికి అధిక ప్రాధాన్యం ఉంది. అందుచేతనే ఈ అభినయదర్పణంలో 'ఆంగికాభినయం' మాత్రమే వివరించబడింది.

## సాత్త్విక భావాలు

స్తంభః స్వేదాంబు రోమాంచః స్వరభంగోఽథ వేపథుః ॥ 63
వైవర్ణ్య మశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః ।

అర్థం : స్తంభః, స్వేదాంబు, రోమాంచః = స్తంభం, చెమట నీరు, గగుర్పాటు; స్వరభంగః, (అథ) వేపధుః = గాద్గద్యం, కంపం ; వైవర్ణ్యం, అశ్రు, ప్రలయః = వెల్లన కావటం (= పాలిపోవటం), కన్నీరు, మూర్ఛ ; (ఇట్లా —) సాత్త్వికాః, అష్టౌ, ఇతి స్మృతాః = సాత్త్విక భావాలు, ఎనిమిది, అని పేర్కొనబడినవి.

తాత్పర్యం : స్తంభం, స్వేదం, రోమాంచం, స్వరభంగం, వేపథువు, వైవర్ణ్యం, అశ్రువు, ప్రలయం - ఈ ఎనిమిది సాత్త్విక భావాలు.

టీక : ' సత్త్వం' అనగా ఇతరుల సుఖ-దుఃఖాలను తనవిగా భావించగల మనస్సు కలిగి ఉండటం. ఇది అభినయానికి ప్రాణం.

అభినయదర్పణం ప్రధానంగా ఆంగికాభినయమునకు ఉద్దిష్టమైనది. అందుచేత తక్కిన మూడు అభినయాలు నామమాత్రంగానే పేర్కొనబడినాయి. సాత్త్వికాభినయ విషయంలో మాత్రం సాత్త్విక భావాల ఎనిమిది పేర్లు మాత్రమే ఇచ్చట చెప్పబడినవి ; కాని లక్షణ-వినియోగాలు ఇచ్చట లేవు. వివరాలకు తె.నా.శా. చూడవలెను (పుటలు. 255-57 ; 655-660).

## అంగ-ఉపాంగ-ప్రత్యంగాలు

తంత్రాంగికోఽంగ ప్రత్యం గోపాంగైః త్రేధా ప్రకాశితః ॥ 64
అంగాన్యత్ర శిరో హస్తౌ వక్షః పార్శ్వౌ కటీతటౌ ।
పాదా వితి షడుక్తాని గ్రీవా మప్యవరే జగుః ॥ 65

అర్థం : తత్ర = అందు (= చతుర్విధాభినయాల)లో ; ఆంగికః = ఆంగికం (= ఆంగికాభినయం) ; అంగ, ప్రత్యంగ, ఉపాంగైః = అంగాలు, ప్రత్యంగాలు, ఉపాంగాలు (అని) ; త్రేధా ప్రకాశితః = మూడు విధాలుగా ఒప్పింది ; అత్ర = ఇందులో ; అంగాని = అంగాలు; శిరః - హస్తౌ - వక్షః - పార్శ్వ-కటీతటౌ - పాదౌ = శిరస్సు, రెండు హస్తాలు, వక్షం (= ఱొమ్ము = ఉరం =

హృదయం), రెండు పార్శ్వాలు (= రెండు ప్రక్కలు), కటీతటాలు (= నడుమునకు రెండు ప్రక్కలు), పాదాలు; — ఇతి, షట్, ఉక్తాని = అని, ఆరు, చెప్పబడినవి. అపరే = ఇతరులు. గ్రీవామ్, అపి, జగుః = గ్రీవం (= మెడ), కూడా, (అంగమే) అని చెప్పారు.

తాత్పర్యం : అంగాలు, ప్రత్యంగాలు, ఉపాంగాలు-అనే భేదాలచేత ఆంగికం (= శారీరకమైన అభినయం) మూడు విధాలు. ఇందులో అంగాలు ఆరు — 1. శిరస్సు, 2. రెండు హస్తాలు, 3. వక్షం, 4. రెండు ప్రక్కలు, 5. నడుము, 6. రెండు పాదాలు. కొందరు గ్రీవం కూడా అంగమే అంటారు.

టీక : వక్షః బదులు కక్షః (= చంకలు) అని నీడా పాఠం. ఇది సరి కాదు. వక్షః (= రొమ్ము) అన్నదే నాట్యశాస్త్ర సమ్మతం.

లక్ష్యమైన 'అభినయ దర్పణం' ప్రధానంగా ఆంగికాభినయానికి సంబంధించింది. అందుచేతనే సాత్త్వికభావాలు నామ మాత్రంగానే పేర్కొనబడినవి. ఇంక వాచిక-ఆహార్యాభినయాల వివరణ ప్రసక్తి లేనేలేదు.

కాగా, 64 వ శ్లోకం రెండవ పాదం నుంచి 70 వరకు ఉన్న ఎనిమిది శ్లోకాలు ఆంగికాభినయానికి ఉపోద్ఘాతం వంటివి. ఇంక మొదటి నుంచి 63 వరకు ఉన్న శ్లోకాలు మొత్తం గ్రంథానికి ఉపోద్ఘాతం అవుతున్నవి.

> ప్రత్యంగా న్యథచ స్కంధే బాహూ పృష్ఠం తథోదరమ్ ।
> ఊరూ జంఘే షడిత్యాహు రపరే మణి బంధకౌ ॥ 66
> జానునీ కూర్పరావేతత్ త్రయ మప్యధికం జగుః ।

అర్థం : అథ = ఇప్పుడు (= ఇంక); ప్రత్యంగాని (చ) = ప్రత్యంగాలు; షట్, ఇతి, ఆహుః = ఆరు, అని, చెబుతారు;

స్కంధౌ-బాహూ-పృష్ఠ - (తథా) ఉదరమ్-ఊరూ-జంఘే = స్కంధాలు (= మూపులు) రెండు, బాహువులు (= భుజాలు) రెండు, పృష్ఠం (= వీపు), ఉదరం (= పొట్ట), ఊరువులు (= తొడలు), జంఘలు = పిక్కలు; అపరే = ఇతరులు; మణిబంధకౌ = మణిబంధాలు (= మణికట్లు); జానునీ = జానువులు (= మోకాళ్ళు); కూర్పరౌ = కూర్పరాలు (= మోచేతులు); ఏతత్, త్రయం అపి = ఈ, మూడింటిని కూడా; అధికం, జగుః = అధికంగా, చెప్పారు. (ఈ మూడింటిని కూడా ప్రత్యంగాలుగా పరిగణించారు).

తాత్పర్యం : ప్రత్యంగాలు ఆరు — 1. స్కంధాలు, 2. బాహువులు, 3. పృష్ఠం, 4. ఉదరం, 5. ఊరువులు, 6. జంఘలు. మణిబంధాలు, జానువులు, కూర్పరాలు-ఈ మూడు కూడా ప్రత్యంగాలే అని కొందరన్నారు.

టీక : 65 వ శ్లోకం తరువాత "గ్రీవాస్యాద ప్యుపాంగంతు స్కంధ ఏవ జగుర్బుధాః" అనే పాదం 'ఘోష్' పాఠంలో అధికంగా ఉంది. "కొందరు పండితులు గ్రీవాన్ని కూడా ప్రత్యంగమంటారు ; మరి కొందరు స్కంధాన్ని ఉపాంగ మంటారు" అని ఘోష్ అనువాదం.

దృష్టి భ్రూ పుట తారాశ్చ కపోలౌ నాసికా హనూ ॥ 67
అధరో దశనా జిహ్వా చుబుకం వదనం తథా ।
ఉపాంగాని ద్వాదశైవ శిరస్యంగాంతరేషు చ॥ 68
పార్ష్ణిగుల్ఫౌ తథాంగుల్యః కరయోః పాదయోః తలే ।
ఏతాని పూర్వశాస్త్రానుసారేణోక్తాని వై మయా ॥ 69

అర్థం : శిరసి-అంగ-అంతరేషు (చ) = శిరస్సు అనే అంగం లోపల; ఉపాంగాని ద్వాదశ-ఏవ = ఉపాంగాలు పన్నెండుమాత్రమే; దృష్టి-భ్రూ-పుట-తారాః (చ)-కపోలౌ-నాసికా-హనూ - అధరః-దశనా-జిహ్వా-చుబుకం- (తథా) వదనం = దృష్టులు (= కంటి

చూపులు), భ్రువులు (=కనుబొమలు), పుటలు (=కనురెప్పలు), తారలు (=కనుగ్రుడ్లు), కపోలాలు (=చెక్కిళ్ళు), నాసిక (=ముక్కు), హనువులు (=దవుడలు), అధరం (=క్రింది పెదవి), దంతాలు, జిహ్వా (=నాలుక), చుబుకం (=గడ్డం), వదనం (=ముఖం); పార్ష్ణి-గుల్ఫౌ-(తథా)అంగుల్యః-కరయోఃపాదయోః తలే=మడమలు, చీలమండలు, వ్రేళ్ళు, అరచేతులు, అరకాళ్ళు; —ఏతాని=ఇవి (=ఈ అయిదు), పూర్వశాస్త్ర-అనుసారేణ= ప్రాచీన శాస్త్రాలను అనుసరించి; మయా ఉక్తాని (వై)=నా చేత (ఉపాంగాలుగా) చెప్పబడినవి.

తాత్పర్యం : శిరస్సులోని ఉపాంగాలు పన్నెండు—1. దృష్టులు, 2. భ్రువులు, 3. పుటలు, 4. తార(క)లు, 5. కపోలాలు, 6. నాసిక, 7. హనువులు, 8. అధరం, 9. దంతాలు, 10. జిహ్వా, 11. చుబుకం, 12. వదనం. మడమలు, చీలమండలు, వ్రేళ్ళు, అరచేతులు, అరకాళ్ళు—ఈ అయిదున్నూ ఇతర అంగాలలోని ఉపాంగాలు. ప్రాచీన శాస్త్రాలను అనుసరించి వీటిని పేర్కొన్నాము.

అంగానాం చలనాదేవ ప్రత్యంగోపాంగయో రపి ।
చలనం ప్రభవే త్తస్మాత్ సర్వేషాం నాత్ర లక్షణమ్॥ 70
నృత్యమాత్రోపయోగ్యాని కథ్యంతే లక్షణైః క్రమాత్ ।
ప్రథమం తు శిరోభేదో దృష్టిభేద స్తతఃపరమ్ ॥ 71
గ్రీవా హస్తౌ తతః పశ్చాత్క్రమేణైవం ప్రదర్శ్యతే ।

అర్థం : అంగానాం, చలనాత్ ఏవ=అంగాల, చలనం (=కదలికల), వల్లనే; ప్రత్యంగ-ఉపాంగయోః, చలనం అపి= ప్రత్యంగాల, ఉపాంగాల, చలనం కూడా (సంభవిస్తుంది); తస్మాత్, సర్వేషాం, లక్షణం, అత్ర, న=అందుచేత, అన్నింటికి, లక్షణం, ఇక్కడ, లేదు (=చెప్పటం లేదు); నృత్య మాత్ర ఉపయోగ్యాని=నృత్యానికి మాత్రమే ఉపయోగించేవి; లక్షణైః, క్రమాత్, కథ్యంతే=లక్షణ సహితంగా, వరుసగా, చెప్పబడుతున్నవి; ప్రథ

మం(తు), శిరోభేదః = మొదట శిరోభేదం; తతఃపరం, దృష్టిభేదం = అటు తరువాత, దృష్టి భేదం ; తతః పశ్చాత్, గ్రీవా-హస్తౌ = అటు పిమ్మట, గ్రీవాభేదం, హస్త భేదం ; ఏవం, క్రమేణ, ప్రదర్శ్యేతే = ఇట్లా, క్రమంగా, ప్రదర్శించబడతాయి (= క్రమంగా వివరిస్తాను).

తాత్పర్యం : అంగాలతో పాటు ప్రత్యంగాలు, ఉపాంగాలు కూడా కదులుతూ ఉంటాయి. అందుచేత ఇచ్చట వీటి లక్షణాలను ప్రత్యేకించి చెప్పటం లేదు. అందునా, నృత్యానికి ఉపయోగపడే వాటి లక్షణమే క్రమంగా చెబుతాను. మొదట శిరోభేదాలు, తరువాత దృష్టిభేదాలు, అటుపిమ్మట గ్రీవాభేదాలు, హస్తభేదాలు క్రమంగా వివరిస్తాము.

టీక : నాట్యశాస్త్రంలోను, అభినయదర్పణంలోను పేర్కొనబడిన అంగ-ఉపాంగ - ప్రత్యంగాలను క్రింది పట్టికలో చూడవచ్చు.

| | నాట్య శాస్త్రంలో | అభినయ దర్పణంలో |
|---|---|---|
| అంగాలు : | శిరస్సు, హస్తాలు, కటి, ఉరం, పార్శ్వాలు, పాదాలు. | శిరస్సు, హస్తాలు, వక్షం, పార్శ్వాలు, కటీతటాలు, పాదాలు. ఇతరులు చెప్పింది-గ్రీవం. |
| ఉపాంగాలు : | నేత్రాలు (=దృష్టులు), కనుబొమలు, నాసిక, అధరం, కపోలాలు, చిబుకం. | దృష్టులు, కనుబొమలు, తారకలు, కపోలాలు, నాసిక, హనువులు, అధరం, దంతాలు, నాలుక, చిబుకం, వదనం—ఇవి శిరస్సులోని ఉపాంగాలు. మడమలు, చీలమండలు, వ్రేళ్లు, అరచేతులు, అరకాళ్లు— ఇవి ఇతర అంగాలలోని ఉపాంగాలు. |

ప్రత్యంగాలు: ప్రత్యేకం ఉపాంగాలని పేరు పెట్టకపోయినా భరతముని క్రిందివాటిని కూడా వివరించినాడు: తారకలు, దర్శనప్రకారాలు, పుటలు (=కను రెప్పలు), అన్యం, ముఖరాగాలు, జఠరం, ఊరువులు, జంఘలు, గ్రీవం. స్కంధాలు, బాహువులు, పృష్ఠం (= వెనుక భాగం), ఉదరం, ఊరువులు, జంఘలు. ఇతరులు చెప్పినవి: మణిబంధాలు, జానువులు, కూర్పరాలు.

---

పితరౌ జగతఃపితరౌ వందే ।

# 3
# శిరో భేదాలు

## శిరస్సుల పేర్లు

సమ ముద్వాహిత మధోముఖ మాలోలితం ధుతమ్ ॥ 72

కంపితం చ పరావృత్త ముత్క్షిప్తం పరివాహితమ్ ।

నవధా కథితం శీర్షం నాట్యశాస్త్రవిశారదైః ॥ 73

అర్థం : సమం - ఉద్వాహితం - అధోముఖం - ఆలోలితం - ధుతం - కంపితం (చ) - పరావృత్తం - ఉత్క్షిప్తం - పరివాహితం = సమం (= సమంగా ఉన్నది), ఉద్వాహితం(= మీదికి ఎత్తబడినది), అధోముఖం (= క్రిందికి వంచబడినది), ఆలోలితం (= చక్రాకారంగా త్రిప్పబడినది), ధుతం (= ఎడమవైపు నుంచి కుడి ప్రక్కకు కదిలినది), కంపితం (= క్రిందు మీదుగా కదిలినది), పరావృత్తం (= ప్రక్కగా మీదికి ఎత్తబడినది), పరివాహితం (= విసనకర్రవలె రెండు ప్రక్కలకు త్రిప్పబడినది) — (అని) ; నాట్యశాస్త్ర విశారదైః = నాట్యశాస్త్ర విద్వాంసుల చేత ; శిరస్సు (= శిరము); నవధా, కథితం = తొమ్మిది విధాలుగా, చెప్పబడింది.

తాత్పర్యం : శిరోభేదాలు తొమ్మిది అని నాట్యశాస్త్ర వేత్తలు చెప్పినారు- 1. సమం, 2. ఉద్వాహితం, 3. అధోముఖం, 4. ఆలోలితం, 5. ధుతం, 6. కంపితం, 7. పరావృత్తం, 8. ఉత్క్షిప్తం, 9. పరివాహితం.

టీక : శిరోభేదాలు తొమ్మిది లేదా శిరస్సు లేదా శిరఃకర్మ తొమ్మిది విధాలు అంటే శిరస్సును తొమ్మిది విధాలుగా, అర్థవంతంగా కదిలించవచ్చు అని అర్థం. ఇట్లాగే తక్కిన అంగ-ఉపాంగ- ప్రత్యంగాల విషయంలో కూడా సంక్షిప్తంగా- హస్తభేదాలు, దృష్టిభేదాలు, జంఘా భేదాలు అంటూ

పేర్కొనటం సంప్రదాయం. భరతముని నాట్యశాస్త్రంలో 13 శిరోభేదాలను వివరించినాడు ; ఇతరులు ఇంకా అనేక భేదాలు పేర్కొన్నారు — 24 భేదాలు ఈ గ్రంథంలోనే తరువాత పేర్కొనబడినాయి. బలరామభరతంలో 11 స్థిరభేదాలు, 13 అస్థిరభేదాలు, 6 ఖండిత భేదాలు — మొత్తం 30 శిరోభేదాలు లక్షణ వినియోగ సహితంగా వివరింపబడినాయి. ఆయా పేర్లు కొన్ని అభినయ దర్పణంలోని పేర్లతో సంవదిస్తున్నాయి ; కాని, నిర్వచన-వినియోగాల వివరణలలో మాత్రం అక్కడక్కడ భేదిస్తున్నాయి. భరతముని 13 శిరోభేదాలను వివరించాక, ఇట్లా పేర్కొన్నాడు : "లోక వ్యవహారంలో ఇంకా అనేక విధాలుగా శిరమును త్రిప్పటం కద్దు. వాటినెల్ల లోకస్వభావానికి అనుగుణంగా ప్రయోగించవలెను". (తె.నా.శా. పుట. 271). ఈ సూచనను అనుసరించే అర్వాచీనులు ఇంకా అనేక భేదాలను పేర్కొనటం సంభావ్యమైంది.

## శిరోభేదాలు

| నా. శా లో (13) | అభి. ద. లో (9) | ఇతర గ్రంథాలలో (24) |
|---|---|---|
| ఆకంపితం | సమం | ధుతం |
| కంపితం | ఉద్వాహితం | విధుతం |
| ధుతం | ఆలోలితం | ఆధూతం |
| విధుతం | ధుతం | అవధూతం |
| పరివాహితం | కంపితం | కంపితం |
| ఆధూతం | పరావృత్తం | ఆకంపితం |
| అవధూతం | ఉత్క్షిప్తం | ఉద్వాహితం |
| అంచితం | పరివాహితం | పరివాహితం |
| నిహంచితం | | అంచితం |
| పరావృత్తం | | నిహంచితం |
| ఉత్క్షిప్తం | | పరావృత్తం |
| అధోగతం | | ఉత్క్షిప్తం |

(పరి) లోలితం

అధోముఖం
లోలితం
తిర్యఙ్నతోన్నతం
స్కంధానతం
ఆరాత్రికం
సమం
పార్శ్వాభిముఖం
సౌమ్యం
ఆలోలితం
తిరశ్చీనం
ప్రకంపితం
సౌందర్యం

---

1. సమశిరస్సు :

నిశ్చలం సమ మాఖ్యాతం యన్నత్యున్నతివర్జితమ్ ।
నృత్యారంభే జపాదౌ చ గర్వే ప్రణయకోపయోః ॥ 74
స్తంభనే నిష్క్రియత్వే చ సమశీర్ష ముదాహృతమ్ ।

అర్థం : యత్ = ఏది (= ఏ శిరస్సు); నతి-ఉన్నతి వర్జితమ్, నిశ్చలం = (క్రిందకు) వంచటం (పైకి) ఎత్తటం లేనిది, చలనం లేనిది (అవుతుందో ఆ శిరస్సు); సమం-ఆఖ్యాతమ్ = సమం (= సమశిరస్సు అని) చెప్పబడింది.

నృత్య-ఆరంభే, జపాదౌ(చ), గర్వే, ప్రణయ-కోపయోః = నృత్య ప్రారంభం, జపం మొదలయినవి, గర్వం, ప్రణయం (= ప్రీతి), కోపం ; స్తంభనే, నిష్క్రియత్వే (చ) = స్తంభనం (= చలనం లేకపోవటం), నిష్క్రియత్వం (= క్రియారహితంగా ఉండటం) — వీటిని అభినయించటంలో; సమశీర్షం, ఉదాహృతం = సమ శిరస్సు, ఉదాహరించబడింది.

తాత్పర్యం : క్రిందకు పైకి కదలిక లేనిదై నిశ్చలంగా, సమంగా ఉన్నది 'సమశిరస్సు'.

నృత్యప్రారంభం, జపం మొదలైనవి, గర్వం, ప్రణయం, కోపం, స్తంభనం, నిష్క్రియత్వం — వీటిని అభినయించటంలో సమ శిరస్సు వినియోగపడుతుంది.

టీక : శీర్ష(క)ము, శిరము, శిరస్సు — ఇవి పర్యాయపదాలు. భరతముని ఈ సమశిరస్సును చెప్పలేదు.

అనువాదం గురించి సూచనలు :

(1) వినియోగం చెప్పేటప్పుడు "ఆరంభే...గర్వే... " అంటూ ప్రతి వినియోగానికి సప్తమీ విభక్తి ప్రయుక్తమవుతున్నది (గ్రంథ మంతటా ఇదే పద్ధతి). అంటే "ప్రారంభమందు... గర్వ మందు... అంటూ అనువాదంలో కూడా సప్తమీ విభక్తిలోనే చెప్ప వలసి ఉంది. కాని, సౌలభ్యం కోసం, "ప్రారంభం...గర్వం..." అంటూ ప్రథమా విభక్తిలో చెప్పి, చివర " — వీటిలో లేదా వీటిని అభినయించటంలో లేదా ప్రదర్శించటంలో" అని అనువదించటం జరిగింది. అంటే ఈ అవస్థలలో లేదా ఈ అవస్థలను వ్యక్తం చేయ టంలో... ఈ శిరస్సు (ఇట్లాగే ఇతర అంగ-ఉపాంగ-ప్రత్యాంగాల విషయంలో కూడా) వినియోగపడుతుంది అని అర్థం. అనువాదమంతా ఇట్లాగే సాగింది.

(2) సంస్కృత శ్లోకాలలో తు,చ, అపి (=కూడా), తథా (=మరియు) మొదలయినవి సాధారణంగా పాదపూరణాలుగా తలంచబడతాయి. అందుచేత వీటిని, అర్థం వివరించేటప్పుడు సంస్కృత భాగంలో కుండలీకరణం చేశాను. ప్రత్యేకంగా అర్థం ఉన్న చోట్ల తప్ప, తక్కిన చోట్ల వీటికి అర్థాలు వ్రాసే ప్రయత్నం చేయలేదు.

(3) అట్లాగే యుజ్యతే, సంయోజ్యం మొదలయిన క్రియల విషయంలో కూడా యథాతథానువాదం చేయలేదు.

పై అంశాలను తప్పక గమనించవలెను.

'జపాదో' అన్నదానికి యోగారూఢుని లక్షణం వివరిస్తున్న భగవద్గీత శ్లోకాన్ని అనంద కుమారస్వామి ఉదాహరించినాడు :

"సమం కాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరం।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥ - VI-13.

## 2. ఉద్వాహిత శిరస్సు :

**ఉద్వాహిత శిరో జ్ఞేయ మూర్ధ్వభాగోన్నతాననమ్ ॥** 75

**ధ్వజే చంద్రే చ గగనే పర్వతే వ్యోమగామిషు ।**

**తుంగవస్తుని సంయోజ్య ముద్వాహితశిరో బుధైః ॥** 76

అర్థం : ఊర్ధ్వభాగ-ఉన్నత - అననమ్ = మీదికి ఎత్తబడిన ముఖం; ఉద్వాహిత శిరః, జ్ఞేయం = 'ఉద్వాహిత శిరస్సు' (అని), తెలియవలెను.

ధ్వజే, చంద్రే (చ), గగనే, పర్వతే, వ్యోమగామిషు, తుంగ వస్తుని = ధ్వజం (= ఎగురుతున్న పతాకం), చంద్రుడు, ఆకాశం, పర్వతం, ఆకాశంలో సంచరిస్తున్న వారు, ఎత్తుగా ఉన్న వస్తువులు — వీటిని చూడటంలో ; ఉద్వాహిత శిరః = ఉద్వాహిత శిరస్సు; బుధైః సంయోజ్యం = విద్వాంసులచేత బాగుగా యోజింపదగును (= ప్రయోగింపదగును).

తాత్పర్యం : మీదికి ఎత్తబడిన శిరస్సు 'ఉద్వాహిత శిరస్సు'.

పతాకం, చంద్రుడు, ఆకాశం, పర్వతం, ఆకాశంలో సంచరించేవారు, ఎత్తుగా ఉన్న వస్తువులు — వీటిని చూడటంలో ఉద్వాహిత శిరస్సు ఉపయోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన 'ఉత్క్షిప్త శిరము'తో సంవదిస్తున్నది.

## 3. అధోముఖ శిరస్సు

అధస్తాన్నమితం వక్త్ర మధోముఖ మితీరితమ్ ।

లజ్జా-ఖేద-ప్రణామేషు దుశ్చింతామూర్ఛయో స్తథా ॥ 77

అధఃస్థితార్థనిర్దేశే యుజ్యతే౽oబునిమజ్జనే ।

అర్థం : అధస్తాత్-నమితం వక్త్రమ్ — క్రిందకు వంచబడిన ముఖం; అధోముఖమ్ ఇతి ఈరితమ్ — అధోముఖం (— అధోముఖ శిరస్సు) అని చెప్పబడింది.

లజ్జా-ఖేద, ప్రణామేషు — సిగ్గు, ఖేదపడటం, నమస్కరించటం; (తథా) దుశ్చింతా, మూర్ఛయోః — దురాలోచన చేయటం, మూర్ఛ చెందటం; అధఃస్థిత-అర్థనిర్దేశే, అంబునిమజ్జనే — క్రిందుగా ఉన్న వస్తువులను చూపటం, నీటిలో మునుగటం — వీటిని అభినయించటంలో; యుజ్యతే — (అధోముఖ శిరస్సు) తగును.

తాత్పర్యం : క్రిందకువంచబడిన ముఖం 'అధోముఖశిరస్సు'.

లజ్జ, ఖేదం, ప్రణామం, దుశ్చింత, మూర్ఛ, క్రిందుగా ఉన్న వస్తువులను నిర్దేశించటం, నీటిలో మునుగటం — వీటిని ప్రదర్శించటంలో అధోముఖ శిరస్సు వినియోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన అధోగత శిరమే. కాని, భరత ముని అంచిత శిరస్సుకు చెప్పిన వినియోగాలు కొన్ని ఇచ్చట చెప్ప బడినవి.

## 4. ఆలోలితశిరస్సు :

మండలాకార ముద్భ్రాంత మాలోలితం శిరో భవేత్ ॥ 78

నిద్రోద్వేగ గ్రహావేశ మదమూర్ఛాసు తన్మతమ్ ।

భ్రమణే వికటోద్దామహాస్యే చాలోలితం శిరః ॥ 79

అర్థం : మండల-ఆకారమ్-ఉద్భ్రాంతమ్ — చక్ర ఆకారంగా త్రిప్పబడినది; ఆలోలితం శిరః భవేత్ — 'ఆలోలిత శిరస్సు' అవు

తుంది. నిద్ర-ఉద్వేగ-గ్రహ-ఆవేశ- మద-మూర్ఛసు = నిద్రముంచు కొని రావటం, గ్రహం ఆవేశించటం, మదం, మూర్ఛ — వీటిని అభిన యించటంలో ; తత్ మతమ్ = ఇది చెప్పబడింది; భ్రమణ,వికట-ఉద్దామ హాస్యే(చ) = గిరగిర తిరగటం, వికటమై పట్టరానిదైన హాస్యం — వీటిని ప్రదర్శించటంలోకూడా;ఆలోలితం శిరః- ఆలోలిత శిరస్సు (తగును).

తాత్పర్యం : చక్రాకారంగా త్రిప్పబడినది 'ఆలోలితశిరస్సు' అవుతుంది. ఉద్వేగంగా వచ్చే నిద్ర, గ్రహం ఆవేశించటం, మదం, మూర్ఛ, భ్రమణం, వెర్రి నవ్వు-వీటిని ప్రదర్శించటంలో ఆలోలిత శిరస్సు వినియోగపడుతుంది.

టీక : 'మద మూర్ఛసు తన్మతమ్' బదులు 'మద మూర్ఛాతురే తథా' (మూర్ఛాతురే = మూర్ఛపడినవాని విషయంలో) అనీ ; 'భ్రమణే వికటోద్దామ హాస్యే'బదులు'భ్రమణేచ వికల్పాదౌ హాస్యే' (వికల్పాదౌ = వికల్పం మొదలగు వాటిలో) అనీ 'నీడా' పాఠాలు. ఇది భరతముని చెప్పిన (పరి) లోలితశిరముతో సంవదిస్తున్నది.

## ౫. ధుతశిరస్సు :

వామదక్షిణభాగేషు చలితం తద్ధుతం శిరః ।
నాస్తితివచనే భూయః పార్శ్వదేశావలోకనే ॥ 80

జనాశ్వాసే విస్మయే చ విషాదేఽ నీప్సితే తథా ।
శీతార్తే జ్వరితే భీతే సద్యఃపీతాసవే తథా ॥ 81

యుద్ధే యత్నే నిషేధే చ అమర్షే స్వాంగవీక్షణే ।
పార్శ్వాహ్వానే చ తస్యోక్తః ప్రయోగో భరతాదిభిః ॥ 82

అర్థం : వామ-దక్షిణభాగేషు, చలితం = కుడి-ఎడమ ప్రక్కలకు,కదలించబడిన; తత్ శిరః = ఆ శిరస్సు; ధుతం = ధుతం( = ధుత శిరస్సు) (అవుతుంది).

నాస్తి - ఇతివచనే = లేదు అనేమాట ; భూయః పార్శ్వదేశ-అవలోకనే = అధికంగా ( = మాటిమాటికి) ప్రక్కలకు

చూడటం; జన-ఆశ్వాసే, విస్మయే (చ)— జనులను ఊరడించటం, ఆశ్చర్యం; విషాదే, అనీప్సితే (తథా)— విషాదం, ఇష్టంలేకపోటం; శీత-ఆర్తే, జ్వరితే, భీతే— చలిబాధ, జ్వరం, భయం; (తథా) సద్యః పీత-ఆసవే— అప్పుడే మద్యం త్రాగిన (—మద్యం త్రాగిన వెంటనే ఉండే) స్థితి; యుద్ధే-యత్నే— యుద్ధ ప్రయత్నం లేదా యుద్ధం, ప్రయత్నం; నిషేధే, అమర్షే, స్వ-అంగవీక్షణే—(వలదని) వారించటం, కోపం, తన అవయవాలను చూచుకోవటం; పార్శ్వ-ఆహ్వానే —ప్రక్కకు పిలవటం — వీటిని అభినయించటంలో; తస్య ప్రయోగః —దాని (—ధుత శిరస్సుయొక్క) ప్రయోగం; భరతాదిభిః ఉక్తః —భరతముని మొదలగువారిచేత, చెప్పబడింది.

తాత్పర్యం : కుడి-ఎడమ ప్రక్కలకు త్రిప్పబడినది 'ధుత శిరస్సు'.

'లేదు' అనే మాట, మాటిమాటికి ప్రక్కలకు చూడటం, జనులను ఊరడించటం, ఆశ్చర్యం, విషాదం, ఇష్టంలేకపోవటం, చలి బాధ (—వణుకు), జ్వరం, భయం, మద్యం త్రాగిన వెంటనే ఉండే స్థితి, యుద్ధం, ప్రయత్నం, నిషేధం, కోపం, తన అవయవాలను చూచుకోవటం, ప్రక్కకు పిలవటం — వీటిని ప్రదర్శించటంలో ధుత శిరస్సు ప్రయుక్తమవుతుందని భరతాదులు చెప్పారు.

టీక : ఇది భరతముని చెప్పిన 'ధుతశిరము'తో కొంత వరకు సంవదిస్తున్నది. 'శీతార్తే, జ్వరితే' బదులు 'శీతార్థే, జ్వలితే'(—చలి అనే అర్థంలో, మండటంలో) అని నీడా పాఠం. 'జనాశ్వాసే' అవటం కంటె 'అనాశ్వాసే' అనటం సమంజసం కాగలదు. చూ. 94 శ్లో॥

## 6. కంపితశిరస్సు :

ఊర్ధ్వాధోభాగచలితం తచ్ఛిరః కంపితం భవేత్ ।
రోషే తిష్ఠేతివచనే ప్రశ్నే, సంజ్ఞోపహూతయోః ॥ 83
ఆవాహనే తర్జనే చ కంపితం వినియుజ్యతే ।

అర్థం : ఊర్ధ్వ-అధోభాగ చలితం— పైకి క్రిందికి, కదల్చ

బడిన; తత్ శిరః = ఆశిరస్సు; కంపితం, భవేత్ = కంపితం (కంపిత శిరస్సు) అవుతుంది.

రోషే, తిష్ఠ-ఇతివచనే, ప్రశ్నే, సంఖ్యా, ఉపహూతయోః = రోషం, ఉండు లేదానిలు అనే మాట, ప్రశ్న, సూచనచేయటం, దగ్గరకు పిలవటం; అవాహనే, తర్జనే (చ = అవాహనం చేయటం, బెదరించటం — వీటిని అభినయించటంలో; కంపితం, వినియుజ్యతే = కంపితం (= కంపితశిరస్సు), వినియోగపడుతుంది.

తాత్పర్యం; పైకి క్రిందికి కదల్చబడిన శిరస్సు 'కంపితశిరస్సు'.

రోషం, ఉండు లేదా నిలు అనే మాట, ప్రశ్న, సూచన చేయటం, దగ్గరకు రమ్మని పిలవటం, అవాహనం, బెదరింపు — వీటిని ప్రదర్శించటంలో కంపితశిరస్సు వినియోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన కంపితశిరముతో కొంత వరకు సంవదిస్తున్నది.

## 7. పరావృత్తశిరస్సు :

> పరాఙ్ముఖీకృతం శీర్షం పరావృత్త మితీరితమ్ ॥ 84
> తత్కార్యం కోపలజ్జాదికృతే వక్త్రాపసారణే ।
> అనాదరే కచే తూణ్యాం పరావృత్తశిరో భవేత్ ॥ 85

అర్థం : పరాఙ్ముఖీకృతం, శీర్షం = ప్రక్కకు త్రిప్పబడిన, శిరస్సు; పరావృత్తం ఇతి-ఈరితమ్ = పరావృత్తం (= పరావృత్తశిరస్సు) అని చెప్పబడింది. కోప-లజ్జా-ఆదికృతే, వక్త్రాపసారణే = కోపం సిగ్గు మొదలయిన వాటి ఫలితంగా, ముఖం వెడగా త్రిప్పుకొనటం లో; తత్ కార్యం = అది (= ఆపరావృత్త శిరస్సు) చేయ (ప్రదర్శించ) తగినది; అనాదరే, కచే, తూణ్యాం = నిరాదరణ, జడ, అంబులపొది -వీటిని అభినయించటంలో (కూడా); పరావృత్త శిరః భవేత్ = పరావృత్తశిరస్సు, అవుతుంది (= వినియోగపడుతుంది).

తాత్పర్యం : ప్రక్కకు త్రిప్పబడిన (= పెడ ముఖంగా ఉన్న) శిరస్సు 'పరావృత్తశిరస్సు'.

కోపం, సిగ్గు మొదలయిన వాటివల్ల పెడముఖం పెట్టడం, నిరాదరణ చూపటం, జడ చూసుకోవటం, అమ్మలపొది చూడటం- వీటిని ప్రదర్శించటంలో పరావృత్త శిరస్సు వినియోగపడుతుంది.

టీక : 'వక్త్రాప్రసారణే' బదులు 'వక్త్రప్రసారణే' అని కూడా పాఠం. ఈ పాదం మొత్తానికి అర్థం ఇట్లా ఉంది: "కోపం, సిగ్గు మొదలయిన వాటివల్ల ముఖం చాచటంలో......"

ఇది భరతముని చెప్పిన పరావృత్త శిరముతో సంవదిస్తున్నది.

## 8. ఉత్క్షిప్తశిరస్సు :

పార్శ్వోర్ధ్వభాగచలిత ముత్క్షిప్తం కథ్యతే శిరః ।
గృహాణాగచ్ఛేత్యాద్యర్థసూచనే పరిపోషణే ॥ 81
అంగీకారే ప్రయోక్తవ్య ముత్క్షిప్తం నామశీర్షకమ్ ।

అర్థం : పార్శ్వ-ఊర్ధ్వభాగ, చలితమ్ = ప్రక్కకు త్రిప్పి పైకి ఎత్తబడినది; ఉత్క్షిప్తం శిరః కథ్యతే = 'ఉత్క్షిప్తశిరస్సు' అని చెప్పబడుతున్నది.

గృహాణ- ఆగచ్ఛ-ఇతి-ఆది-అర్థసూచనే = గ్రహించు, ఇటు రా, ఇట్లాగు, మొదలైన, అర్థాలను సూచించటంలో; పరిపోషణే, అంగీకారే = సమర్థించటం, అంగీకరించడం-వీటిల్లో; ఉత్క్షిప్తం నామ శీర్షకం ప్రయోక్తవ్యమ్ = ఉత్క్షిప్తం అనే పేరుగల శీర్షకం (= శిరస్సు) ప్రయోగించదగినది.

తాత్పర్యం : ఒక ప్రక్కగా మీదికి ఎత్తినది 'ఉత్క్షిప్తశిరస్సు'.

ఇది తీసుకో, ఇటురా, ఇట్లాగు మొదలైన అర్థాలను సూచించటంలో, సమర్థించటంలో, అంగీకరించడంలో ఉత్క్షిప్తశిరస్సు వినియోగపడుతుంది.

టీక : 'గహోణాగచ్ఛేత్యాద్యర్థ సూచనే' బదులు 'గృహోణ గచ్ఛే త్యాద్యర్థే, సూచనే' అని నీడా పాఠం. "తీసుకో, పో అనటం మొదలయినవి, జడ చూపటం" అని ఈ పాఠానికి అర్థం వ్రాయ బడింది.

భరతముని చెప్పిన ఆధూత, ఉద్వాహితశిరములతో ఇది సంవది స్తున్నది.

## 9. పరివాహితశిరస్సు :

పార్శ్వయోః చామర మివ నతంచే త్పరివాహితమ్ ॥ 87

మోహే చ విరహే స్తోత్రే సంతోషే చాఽనుమోదనే ।

విచారే చ ప్రయోక్తవ్యం పరివాహితశీర్షకమ్ ॥ 88

అర్థం : చామరం ఇవ = వింజామరంవలె; పార్శ్వయోఃనతం చేత్ = రెండుప్రక్కలకు, వంగితే (అది); పరివాహితమ్ = పరిహితం (= పరిహితశిరస్సు అవుతుంది).

మోహే (చ), విరహే, స్తోత్రే, సంతోషే (చ), అనుమో దనే, విచారే (చ) = మోహం (= వలపు), విరహం, స్తుతించటం, సంతోషం, ఒప్పుకోవటం, విచారం — వీటిని అభినయించటంలో; పరి వాహిత శీర్షకమ్, ప్రయోక్తవ్యం = పరివాహితశిరస్సు, ప్రయో గించదగినది.

తాత్పర్యం : వింజామరంవలె రెండుప్రక్కలకు వంగినది 'పరి వాహిత శిరస్సు'.

మోహం, విరహం, స్తుతి, సంతోషం, అనుమోద నం, విచారం-వీటిని ప్రదర్శించటంలో పరివాహితశిరస్సు వినియోగ పడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన పరివాహితశిరముతో సంవ దిస్తున్నది.

# గ్రంథాంతర శిరోభేదాలు

ధుతం విధుత మాధూత మవధూతం చ కంపితమ్।
ఆకంపితోద్వాహితే చ పరివాహిత మంచితమ్॥ 89
నిహంచితం పరావృత్త ముత్క్షిప్తాధోముఖే తథా।
లోలితం చేతి విజ్ఞేయం చతుర్దశవిధం శిరః॥ 90
తిర్యఙ్నతోన్నతం స్కంధానత మారాత్రికం సమమ్।
పార్శ్వాభిముఖ మిత్యన్యభేదాన్ పంచ పరే జగుః॥ 91
సౌమ్య మాలోకితం చైవ తిరశ్చీనం ప్రకంపితమ్।
సౌందర్యం పంచధా ప్రోక్తం శిరోభేదా ఇదం క్రమాత్॥ 92
భరతాదిభిరాచార్యైః చతుర్వింశతి రీరితాః।

అర్థం : ధుతం, విధుతం,ఆధూతం,అవధూతం(చ), కంపితం, ఆకంపిత-ఉద్వాహితే(చ), పరివాహితం,అంచితం, నిహంచితం, పరావృత్తం,ఉత్క్షిప్త-అధోముఖే (తథా), లోలితం(చ) = ధుతం, విధుతం, ఆధూతం, అవధూతం,కంపితం, ఆకంపితం,ఉద్వాహితం,పరివాహితం, అంచితం, నిహంచితం, పరావృత్తం, ఉత్క్షిప్తం, అధోముఖం, లోలితం; (ఇట్లా) శిరః, చతుర్దశవిధం. ఇతి, విజ్ఞేయం = శిరస్సు, పదునాలుగు విధాలు, అని, తెలియదగినది.

తిర్యక్-నత-ఉన్నతం, స్కంధానతం, ఆరాత్రికం, సమం, పార్శ్వాభిముఖం = తిర్యఙ్నతోన్నతం, స్కంధానతం, ఆరాత్రికం, సమం, పార్శ్వాభిముఖం; ఇట్లా-పరే, అన్యభేదాన్ = ఇతరులు (= కొందరు) మరి కొన్ని భేదాలు; పంచ, ఇతి, జగుః = ఐదు, అని, చెబుతారు.

సౌమ్యం, ఆలోకితం (చ-ఏవ), తిరశ్చీనం, ప్రకంపితం, సౌందర్యం = సౌమ్యం, ఆలోకితం, తిరశ్చీనం, ప్రకంపితం, సౌందర్యం;

ఇత్థ్యా-పంచధాప్రోక్తం = ఐదు విధాలుగా (మరి కొందరి చేత) చెప్ప బడింది.

ఇదం క్రమాత్ = ఈ క్రమంలో; భరతాదిభిః, ఆచార్యైః = భరతుడు మొదలగు, ఆచార్యుల చేత; శిరోభేదాః. చతుఃవింశతిః, ఈరితాః = శిరోభేదాలు, ఇరవైనాలుగు, చెప్పబడినవి.

తాత్పర్యం : భరతముని మొదలయిన ఆచార్యులు చెప్పిన శిరోభేదాలు మొత్తం ఇరవైనాలుగు: 1. ధుతం (=కదలించినది), 2. విధుతం (=వడిగా కదలించినది, 3. ఆధూతం (=కొంచెంగా కదలించినది), 4. అవధూతం (= క్రిందికికదలించినది), 5. కంపితం (=చలించినది), 6. ఆకంపితం (= మెల్లగాచలించినది), 7. ఉద్వాహితం (=కొంచెంపైకి ఎత్తబడినది), 7. పరివాహితం (=చక్రాకారంగా త్రిప్పబడినది), 9. అంచితం (=వంచబడినది , 10. నిహంచితం (=మూపుచేత తాకబడినది), 11. పరావృత్తం (=పెడ మొగం అయినది), 12. ఉత్క్షిప్తం (=మీదికి ఎత్తబడినది.), 13. అధోముఖం (=క్రిందికి వంచబడినది), 14. లోలితం (=నిలుకడ లేనిది), 15. తిర్యక్-నతోన్నతం (=అడ్డంగా వంచి ఎత్తబడినది), 16. స్కంధానతం (=మూపు మీదికి వంచబడినది), 17. ఆరాత్రికం (=రెండుప్రక్కలకు వంచబడినది), 18. సమం (=సహజ స్థితిలో ఉన్నది), 19. పార్శ్వాభిముఖం (=ఒకప్రక్కకు తిరిగినది), 20. సౌమ్యం (చలనంలేనిది), 21. ఆలోలితం (=అంతటాతిరిగేది), 22. తిరశ్చీనం (=రెండుప్రక్కలకు చూసేది), 23. ప్రకంపితం (=బాగుగా చలింపజేయబడినది), 24. సౌందర్యం (=చూడటానికి అందంగా ఉన్నది).

టీక : ఈ ఇరవైనాలుగు శిరోభేదాలలో కొన్నింటి లక్షణ-వినియోగాలు మాత్రమే ఇంతకు ముందు చెప్పిన లక్షణ-వినియోగాలతో సంవదిస్తున్నవి. "ధుతం విధుతం.........పంచపరే జగుః"-ఈ మూడు శ్లోకాలు సంగీత రత్నాకరంలో యథాతథంగా ఉన్నాయి (చూ. నర్తనాధ్యాయం -శ్లో. 49-51- లక్షణ-వినియోగాలకు-శ్లో. 52-78). మొత్తం మీద ఇందులో 19 భేదాలు చెప్పబడినవి.

## 1. ధుతశిరస్సు :

పర్యాయేణ శనై స్తిర్యగ్గత ముక్తం ధుతం శిరః ॥ 93

శూన్యస్థానే స్థితే చైవ పార్శ్వదేశావలోకనే ।

అనాశ్వాసే విస్మయే చ విషాదే౽ నీప్సితే తథా ॥ 94

ప్రతిషేధే చ తస్యోక్తః ప్రయోగో భరతాదిభిః ।

అర్థం : పర్యాయేణ, శనైః, తిర్యక్-గతం = వరుసగా, మెల్లగా, అడ్డంగా కదల్చబడినది; ధుతం శిరః, ఉక్తమ్ = 'ధుత శిరస్సు' (అని) చెప్పబడింది.

శూన్యస్థానే స్థితే(చపవ), పార్శ్వదేశ - అవలోకనే = శూన్య స్థానమందు (= జనసంచారం లేనిచోట నిలవటం, ప్రక్కలకు చూడటం; అనాశ్వాసే, విస్మయే చ, విషాదే, అనీప్సితే (తథా) = స్థిమితం( = ఊరట)లేకుండటం, ఆశ్చర్యం, విషాదం,ఇష్టం లేకపోవటం;ప్రతిషేధే చ) = నివారించటం; వీటినిఅభినయించటంలో; తస్యప్రయోగః = దాని( = ధుత శిరస్సు యొక్క) వినియోగం; భరతాదిభిః, ఉక్తః = భరతముని మొదలగు వారిచేత, చెప్పబడింది.

తాత్పర్యం : వరుసగా, మెల్లగా, అడ్డంగా కదిల్చితే, అది 'ధుతశిరస్సు' అవుతుంది.

శూన్యస్థానంలో నిలబడటం, ప్రక్కలకుచూడటం, స్థిమితంగా లేక పోవటం, ఆశ్చర్యపడటం, విషాదం, ఇష్టంలేకపోవటం, నివారించటం - ఈ అర్థాలను ప్రదర్శించటంలో ధుతశిరస్సు వినియోగపడు తుందని భరతముని మొదలగువారు చెప్పినారు.

టీక : ఇది భరతముని చెప్పిన ధుతశిరమే. ఇంతకు ముందు చెప్పబడిన 'ధుతశిరస్సు'యొక్క వినియోగాలు, గ్రంథాంతర శిరో భేదాలలోని ధుత-విధుత-ఆధూత-అవధూత శిరస్సుల వినియో గాలలో చోటు చేసుకొన్నవి.

## 2. విధుతశిరస్సు :

ద్రుతగత్యాత తత్రస్మాద్విధుతం తత్ప్రచక్షతే ॥ 95

శీతార్తే జ్వరితే భీతే నద్యః పీతాసవే తథా ।

అర్థం : (అథ) తత్, ద్రుతగతి = అది (= ఆ ధుత శిరస్సు), వడిగా కదిలించబడితే; తస్మాత్ తత్, విధుతం, ప్రచక్షతే = అందువల్ల, అది, విధుతం (= విధుతశిరస్సు) అని చెబుతున్నారు.

శీతార్తే, జ్వరితే, భీతే, (తథా) సద్యఃపీత-ఆసవే = చలి, జ్వరం, భయం, అప్పుడే ఆసవం (= మద్యం) త్రాగిన స్థితి-వీటిని ప్రదర్శించటంలో (విధుత శిరస్సు వినియోగపడుతుంది).

తాత్పర్యం : ధుత శిరస్సును మెల్లగా కాక వేగంగా కదిలిస్తే, అది 'విధుతశిరస్సు' అవుతుంది.

చలి, జ్వరం, భయం, మద్యం త్రాగిన వెంటనే ఉండే స్థితి-వీటిని ప్రదర్శించటంలో విధుతశిరస్సు వినియోగపడుతుంది.

టీక : భరతముని చెప్పిన విధుతశిరము, ఇది ఒక్కటే.

## 3. ఆధూతశిరస్సు :

ఆధూతం తు సకృత్తిర్యగూర్ధ్వనీతశిరో మతమ్ ॥ 96

సర్వేషు స్వాంగవీక్షాయాం పార్శ్వస్థోర్ధ్వ నిరీక్షణే ।

శక్తోఽ స్మీత్యభిమానే చ ప్రయోగః తస్యచోదితః ॥ 97

అర్థం : సకృత్, తిర్యక్, ఊర్ధ్వనీత, శిరః = ఒక పర్యాయం అడ్డంగా, పైకి ఎత్తబడిన, శిరస్సు; ఆధూతం, మతమ్ = ఆధూతం (= ఆధూతశిరస్సు) అని, అభిప్రాయం (= చెప్పబడుతుంది)

సర్వేషు, స్వ-అంగవీక్షాయాం, పార్శ్వస్థ-ఊర్ధ్వనిరీక్షణే = సమస్తం అని అర్థం, స్వీయ అవయవాలను చూచుకొనటం, ప్రక్కకు నిక్కి-చూడటం; శక్తః-అస్మి-ఇతి-అభిమానే (చ) = 'నేను సమర్థుడను' అని గర్వం చూపటం - వీటిని ప్రదర్శించటంలో; తస్య(చ)

ప్రయోగః,ఉదితః = దాని ( = అధూతశిరస్సుయొక్క) ప్ర ( = విని) యోగం, చెప్పబడింది.

తాత్పర్యం:కొంచెం అడ్డంగా పైకి ఎత్తబడిన శిరస్సు 'అధూత శిరస్సు' అవుతుంది.

సమస్తం అనే అర్థం, తన అవయవాలను చూసుకోనటం, ప్రక్కకు నిక్కి చూడటం, 'నేను సమర్థుడను' అని గర్వం చూపటం- వీటిని ప్రదర్శించటంలో అధూతశిరస్సు వినియోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన అధూత లేదా ఉద్వాహిత శిరము.

## 4. అవధూతశిరస్సు :

> యదధః సకృదానీత మవధూతం తదుచ్యతే ।
> స్థిత్యర్థే దేశనిర్దేశే ప్రశ్నసంజ్ఞోపహూతయోః ॥ 98
> ఆలాపే చ ప్రయోక్తవ్య మిద మాహుః మనీషిణః ।

అర్థం : యత్, అధః, సకృత్, ఆనీతం = ఏది ( = ఏ శిరస్సు), ఒకసారి, క్రిందికి, తీసుకొని రాబడిందో ( = వంచబడినదో); తత్, అవధూతం, ఉచ్యతే = అది, అవధూతం ( = అవధూతశిరస్సు)అని, చెప్పబడుతుంది.

స్థితి-అర్థే, దేశనిర్దేశే, ప్రశ్న-సంజ్ఞా-ఉపహూతయోః,ఆలాపే = ఉండటం లేదా నిలవటం అనే అర్థం, ఏదేని స్థలాన్ని నిర్దేశించటం ( = చూపటం), ప్రశ్నించటం, సైగచేయటం, దగ్గరకురమ్మని పిలవటం, సంభాషణ-వీటిని ప్రదర్శించటంలో; ఇదం, ప్రయోక్తవ్యం (ఇతి), మనీషిణః ఆహుః = ఇది ( = అవధూతశిరస్సు), ప్రయోగింపదగినది (అని); మనీషులు ( = మేధావులు), చెబుతారు.

తాత్పర్యం : శిరస్సును ఒకసారి క్రిందికివంచితే, అది 'అవధూత శిరస్సు' అవుతుంది.

స్థితి, స్థల నిర్దేశం, ప్రశ్న, సంజ్ఞ, ఉపహూతి (=దగ్గరకు రమ్మని పిలవటం), ఆలాపం — వీటిని ప్రదర్శించటంలో అవధూత శిరస్సు ప్రయోగింపదగినది అని మనీషులు అంటారు.

టీక : 'సకృత్' అనే అవ్యయానికి 'ఏకవారం' (=ఒకసారి) అని సంగీతరత్నాకరంలోని సుధానిధి వ్యాఖ్య, 'sharply' అని కుమారస్వామి అనువాదం. ఇది భరతముని చెప్పిన అవధూతశిరమే.

## 5. కంపితశిరస్సు :

బహుశోద్ధృతమూర్ధ్వం చ కంపనా త్కంపితం శిరః॥ 99
జ్ఞానాభ్యుపగమే కోపే వితర్కే తర్జనే తథా।
త్వరితే ప్రశ్నవాక్యే చ ప్రయోక్తవ్య మిదం శిరః॥ 100

అర్థం : బహుశ-ఉద్ధృతం-ఊర్ధ్వం (చ), కంపనాత్ = మిక్కిలి పొడవుగా పైకెత్తి, చలింపజేయటంవల్ల ;కంపితంశిరః = కంపితశిరస్సు (అవుతుంది).

జ్ఞాన-అభ్యుపగమే, కోపే, వితర్కే, (తథా) తర్జనే, = తెలిసినట్లు అంగీకరించటం, కోపం, వితర్కం, బెదరింపు; త్వరితే, ప్రశ్నవాక్యే (చ) = వేగం, ప్రశ్నించటం — వీటిని ప్రదర్శించటంలో; ఇదంశిరః, ప్రయోక్తవ్యమ్ = ఈ (కంపిత)శిరస్సు, ప్రయోగింపదగినది.

తాత్పర్యం : శిరస్సును పొడవుగా పైకెత్తి చలింపజేస్తే, అది కంపితశిరస్సు అవుతుంది.

తెలిసినట్లు అంగీకరించటం, కోపం, వితర్కం, బెదరింపు, వేగం, ప్రశ్నించటం — వీటి అర్థాలను అభినయించటంలో కంపిత శిరస్సు తగినది.

టీక : ఇది భరతముని చెప్పిన కంపితశిరముతో సంవదిస్తున్నది.

## 6. ఆకంపితశిరస్సు :

ఆకంపితం తదేవ స్యాత్కంపితం తు శనైః యది ।
పురఃప్రస్థిత నిర్దేశే ప్రశ్నసంజ్ఞోపదేశయోః ॥ 101
ఆవాహనే స్వమనసికథనే తత్ప్రయుజ్యతే ।

అర్థం : తత్ ఏవ = అదే (= కంపితశిరస్సే); శనైః కంపితం (తు) యది, ఆకంపితం = మెల్లగా కదిలించబడితే, ఆకంపిత శిరస్సు అవుతుంది .

పురఃప్రస్థితనిర్దేశే = ఎదురుగాఉన్న దానిని చూపటం: ప్రశ్న సంజ్ఞ-ఉపదేశయోః = ప్రశ్నిస్తున్నట్లుగా సైగచేయటం, ఉపదేశించటం; ఆవాహనే, స్వమనసికథనే = ఆవాహనంచేయటం, తనలో తాను చెప్పుకొనటం (= స్వగతం = ఆత్మగతం - ఈ అర్థాలను ప్రదర్శింపటంలో; తత్, ప్రయుజ్యతే = అది (ఆకంపితశిరస్సు), తగును.

తాత్పర్యం : కంపితశిరస్సే, మెల్లగా కదిలించబడితే, 'ఆకంపితశిరస్సు' అవుతుంది.

ఎదురుగా ఉన్న దానిని నిర్దేశించటం ; ప్రశ్నిస్తున్నట్లుగా సైగ చేయటం, స్వగతం — ఈ అర్థాలను ప్రదర్శించటంలో ఆకంపిత శిరస్సు తగును.

టీక : ఇది భరతముని చెప్పిన ఆకంపితశిరమే. 'స్వమనసికథనే' అనే దానిని 'స్వీయాభిప్రాయం చెప్పటం' అని ఘోష్ ఆంగ్లానువాదం.

## 7. ఉద్వాహితశిరస్సు :

సకృదూర్ధ్వం శిరో నీత ముద్వాహిత శిరో మతమ్ ॥ 102
శక్తోఽహమస్మి కార్యేష్విత్యభిమానే ప్రయుజ్యతే ।

అర్థం : సకృత్, ఊర్ధ్వం-నీతం, శిరః = ఒకసారి పైకెత్తి

బడిన శిరస్సు; ఉద్వాహితశిరః, మతమ్ = ఉద్వాహితశిరస్సు (అవి), సిద్ధాంతం.

అహం, కార్యేషు, శక్తః-అస్మి, ఇతి, అభిమానే = నేను, పనులు నిర్వహించడంలో, సమర్థుడను, అనే, గర్వం (ప్రదర్శించడం) లో; ప్రయుజ్యతే = (ఈ శిరస్సు), వినియోగపడుతుంది.

తాత్పర్యం : ఒకసారి పైకిఎత్తబడిన శిరస్సు 'ఉద్వాహిత శిరస్సు' అవుతుంది.

'పనులు నిర్వహించడంలో నేను సమర్థుడను' అని గర్వం చూపడంలో ఉద్వాహితశిరస్సు ప్రయుక్తమవుతుంది.

టీక : "......నేను సమర్థుడను అని చెప్పటం, గౌరవం" ఇది కుమారస్వామి ఆంగ్లానువాదం. ఈ శిరస్సు భరతముని చెప్పిన ఆధూత లేదా ఉద్వాహిత శిరమునకు సన్నిహితంగా ఉంది.

## 8 పరివాహితశిరస్సు :

వరం మండలికాకారం భ్రామితం పరివాహితమ్ ॥ 103

లజ్జాభావే భ్రమే మౌనే వల్లభానుకృతౌ తథా ।

విస్మయే (చ) స్మితే హర్షే రోమాంచేఽపి ప్రమోదనే ॥ 104

విచారే చ విచారజ్ఞైః కార్యమాహు రిదం శిరః ।

అర్థం:వరం, మండలిక-ఆకారం, భ్రామితం, పరివాహితమ్ = ఎక్కువగా లేదా పూర్తిగా, చక్రాకారంగా, త్రిప్పబడినది, పరివాహిత (శిరస్సు అవుతుంది).

లజ్జా-అభావే, భ్రమే, మౌనే, (తథా) వల్లభ-అనుకృతే = సిగ్గులేమి, భ్రమ, మౌనం, ప్రియుని (చేష్టలు) అనుకరించటం; విస్మయే (చ), స్మితే, హర్షే, రోమాంచే (అపి), ప్రమోదనే, విచారే (చ) = ఆశ్చర్యం, చిరునవ్వు, సంతోషం, పులకాంకురం, సంతోషింపజేయటం, విచారం — వీటి అర్థాలను ప్రదర్శించటంలో;

ఇదం, శిరః, విచారజ్ఞైః, కార్యం,ఆహుః = ఈ (పరివాహిత)శిరస్సు, తెలిసినవారిచేత, చేయ:గినది (అని), చెబుతారు.

తాత్పర్యం : మండల ఆకారంగా త్రిప్పబడిన శిరస్సు 'పరివాహిత శిరస్సు' అవుతుంది.

సిగ్గులేకపోవట:, భ్రమ, మౌనం, ప్రియుని చేష్టలు అనుకరించటం, విస్మయం, చిరునవ్వు, సంతోషం, గగుర్పాటు, ప్రమోదనం, విచారం (=ఆలోచన) - ఈ అర్థాలను అభినయించటంలో పరివాహిత శిరస్సు వినియోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన పరివాహితశిరమునకు సన్నిహితంగా ఉంది.

## 9. అంచిత శిరస్సు :

శిరః స్యాదంచితం కించి త్పార్శ్వయోః నతకంధరమ్॥ 105

దుశ్చింతా మోహ మూర్చాదౌ తత్కార్య మధరేక్షణే।

అర్థం : పార్శ్వయోః, కించిత్, నతకంధరమ్ = రెండు ప్రక్కలకు, కొంచెంగా, వంచబడిన మెడకలది ; అంచితం శిరః, స్యాత్ = అంచిత శిరస్సు, అవుతుంది.

దుశ్చింతా, మోహ, మూర్చాదౌ, అధరేక్షణే = దురాలోచన, మోహం, మూర్ఛ మొదలయినవి, క్రింద ఉన్న వస్తువులను చూడటం - ఈ అర్థాలను ప్రదర్శించటంలో; తత్, కార్యం = అది (= అంచిత శిరస్సు), చేయదగినది.

తాత్పర్యం : రెండు ప్రక్కలకు కొంచెంగా వంచబడిన మెడకలది 'అంచిత శిరస్సు' అవుతుంది.

దురాలోచన, మోహం, మూర్ఛ, క్రింద ఉన్న వస్తువులను చూడటం - వీటిని ప్రదర్శించటంలో అంచిత శిరస్సు ప్రయుక్తమవుతుంది.

టీక : 'పార్శ్వయోః' అనే దానిని - సంగీత రత్నాకర పాఠాన్ని అనుసరించి — 'ఒక ప్రక్కకు' అని కుమారస్వామి అనువాదం. ఇది భరతముని చెప్పిన అంచిత శిరముతో సంవదిస్తున్నది.

## 10. నిహంచిత శిరస్సు :

ఉత్క్షిప్త బాహుశిఖరలగ్నగ్రీవం నిహంచితమ్॥ 106

విలాసే లలితే గర్వే బిబ్బోకే కిలికించితే ।

మోట్టాయితే కుట్టమితే మౌనే స్తంభే చ తద్భవేత్॥ 107

అర్థం : ఉత్క్షిప్త, బాహుశిఖర లగ్న, గ్రీవం, నిహంచితం = పైకి ఎత్తబడిన, బాహు శిఖరం (= మూపు)తో చేర్చబడిన, మెడ (కలది), నిహంచిత (శిరస్సు అవుతుంది).

విలాసే, లలితే, గర్వే, బిబ్బోకే, కిలికించితే, మోట్టాయితే, కుట్టమితే, మౌనే, స్తంభే (చ) = విలాసం, లలితం, గర్వం, బిబ్బోకం, కిలికించితం, మోట్టాయితం, కుట్టమితం, మౌనం, స్తంభం — వీటి అర్థాలను ప్రదర్శించటంలో; తత్ భవేత్ = అది (= ఆ నిహంచిత శిరస్సు), అవుతుంది (= వినియోగపడుతుంది).

తాత్పర్యం : భుజం మూపును పైకి ఎత్తి మెడతో చేరిస్తే, అది 'నిహంచిత శిరస్సు' అవుతుంది.

విలాసం, లలితం, గర్వం, బిబ్బోకం, కిలికించితం, మోట్టాయితం, కుట్టమితం, మౌనం, స్తంభం — వీటి అర్థాలను ప్రదర్శించటంలో నిహంచిత శిరస్సు వినియోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన నిహంచిత శిరమే. విలాసాదులు స్త్రీలకు స్వభావజములైన అలంకారాలు. ఈ సాంకేతిక పదాలకు నాట్యశాస్త్రం నుంచి నిర్వచనాలు ఇస్తున్నాను (తె. నా. శా. పుటలు 657-59) :

విలాసం : శృంగారం ఉద్వేలం కావటంవల్ల స్థాన - ఆసన - గమన విషయాలలో, హస్త-భ్రూ-నేత్ర కర్మలలో అప్రయత్నంగా స్త్రీలలో కన్పించే విశేషం.

లీల : ప్రియుని మీది ప్రీతితో వానివలె మధురంగా మాటాడటం, వాని అలంకారాలను తాము విశిష్టంగా ధరించటం.

విచ్ఛిత్తి : మాల్య-వస్త్ర-భూషణ — చందనాదులను అనాదరంతో స్వల్పంగా ధరించినప్పటికీ, అవి అధికమైన శోభావహములు కావటం.

విభ్రమం : వాక్-అంగ-ఆహార్య-సత్త్వాలకు సంబంధించిన వివిధములైన అర్థాలను మదం లేదా హర్షం లేదా రాగం చేత వ్యత్యస్తంగా చేయటం.

కిలి (= కిల) కించితం = స్త్రీలు హర్షంతో స్మిత-రుదిత-హసిత-భయ-హర్ష-గర్వ-దుఃఖ-శ్రమ-అభిలాషలను మాటిమాటికీ సమ్మిశ్రితం చేయటం.

మోట్టాయితం : ఇతరులు ప్రియుని వార్తలు చెబుతున్నప్పుడు లేదా స్వయంగా చూసినప్పుడు, రతిభావనచేత నాయికలో లీలా-హేలాదులు జనించటం.

కుట్టమితం : ప్రియుడు కేశాలను, లేదా స్తనాలను లేదా అధరాన్ని గ్రహించినప్పుడు అతిహర్ష సంభ్రమాలవల్ల స్త్రీలలో జనించే సుఖ విశేషం (ఇది సుఖమే అయినా కృతక కోపాదులతో దుఃఖరూపంగా వ్యక్తమవుతుంది).

బిబ్బోకం : స్త్రీ తనకు ఇష్టమైన వస్త్రాది అలంకారాలను పొందినప్పటికీ అభిమాన - గర్వాలచేత వాటి మీద అనాదరం చూపటం.

లలితం: స్త్రీలు, హస్త-పాద-అంగ విన్యాసాలను భ్రూ-నేత్ర - ఓష్ఠ కర్మలతో సుకుమారంగా చేయటం.

విహృతం : ప్రేమ పూర్వకంగా మాటాడవలసిన చోట కూడా వ్యాజం చేత లేదా సిగ్గుచేత మాటాడకుండటం.

భావం : ఒక వ్యక్తి యొక్క అంతర భావం ఆ వ్యక్తి దేహం మీద తెలిసేటట్లుగా వ్యక్తం కావటం.

హావం: శృంగారభావం అంగవికారాదుల ద్వారా వ్యక్తం కావటం.

హేల: హావం లలిత-అభినయాత్మకం కావటం (హావం, హేల - ఈ రెండూ అంగజ వికారాలు. హావంలో నాయిక తనలో కలిగిన రతిభావం గుర్తించలేదు ; ఇంక హేలలో నాయిక దానిని గుర్తిస్తుంది).

గర్వం : ఇది వ్యభిచారి భావం.

స్తంభం : ఇది సాత్త్విక భావం.

మౌనం : సమాధానం చెప్పక నిశ్చలంగా ఉండటం.

భావ-హావ-చేష్టలను కుమారస్వామి క్రింది విధంగా వివరించి వాడు :

"Strictly speaking, bhava is mood or feeling unexpressed; hava is the emotion which finds expression; cesta the gesture that expresses it (p. 15 - footnote).

## 11. పరావృత్త శిరస్సు :

పరాఙ్ముఖీకృతం శీర్షం పరావృత్తం శిరో భవేత్ ।
తత్కార్యం కోపలజ్జాది కృతే వక్త్రాపసరణే ॥ 108
పరావృత్తానుకరణే పృష్ఠతః ప్రేక్షణే భవేత్ ।

అర్థం : పరాఙ్ముఖీకృతం, శీర్షం = పెడముఖంగా త్రిప్పబడిన, శిరస్సు ; పరావృత్తం శిరః, భవేత్ = పరావృత్త శిరస్సు, అవుతుంది.

కోప-లజ్జ-ఆదికృతే,వక్త్రా-అపసరణే = కోపం సిగ్గు మొదలయిన వాటివల్ల, పెడమొగం పెట్టటం ; పరావృత్త - అనుకరణే, పృష్ఠతః ప్రేక్షణే = ఒక ప్రక్కకు తిరిగిన దానిని అనుకరించటం, వెనుకకు చూడటం — వీటిని ప్రదర్శించటంలో; తత్, కార్యం, భవేత్ = అది (= పరావృత్త శిరస్సు), చేయదగినది, అవుతుంది.

తాత్పర్యం : పెడ మొగంగా త్రిప్పబడిన శిరస్సు, 'పరావృత్త శిరస్సు' అవుతుంది.

కోపం, సిగ్గు మొదలయిన వాటిచేత పెడ మొగం పెట్టటం, ఒక ప్రక్కకు తిరిగిన దానిని అనుకరించటం, వెనుకకు తిరిగి చూడటం — వీటిని ప్రదర్శించటంలో పరావృత్త శిరస్సు వినియోగపడుతుంది.

టీక : కుమారస్వామి అనువాదం ఇట్లా ఉంది: తత్ కార్యం = ఇది చెయ్యి అని చెప్పటం ; వక్త్ర ప్రసారణే = relaxing the features.

'వక్త్రప్రసారణే' (= ముఖం పొడిగించటం) అన్న పాఠం కంటె 'వక్త్రాపసరణే (= పెడముఖం పెట్టటం) అన్న సంగీత రత్నాకర పాఠం సమంజసంగా ఉంది.

ఇది భరతముని చెప్పిన పరావృత్తశిరమే.

## 12. ఉత్క్షిప్త శిరస్సు :

ఊర్ధ్వవక్త్రం శిరో జ్ఞేయ ముత్క్షిప్తం తత్ప్రచక్షతే॥ 109
దర్శనే తుంగవస్తూనాం చంద్రాది వ్యోమగామినామ్ ।

అర్థం : ఊర్ధ్వ వక్త్రం శిరః, ఉత్క్షిప్తం, జ్ఞేయం = పైకి ఎత్తబడిన ముఖం గల శిరస్సు, ఉత్క్షిప్త (శిరస్సు), అని తెలియవలెను.

తుంగవస్తూనాం, చంద్ర-ఆది వ్యోమగామినామ్ = ఎత్తైన వస్తువులను, చంద్రుడు మొదలగు ఆకాశ సంచారులను ; దర్శనే =

దర్శించటం (=చూడటం) లో; తత్, ప్రచక్షతే=దీనిని (=ఉత్క్షిప్త శిరస్సును), పేర్కొంటారు.

తాత్పర్యం : పైకి ఎత్తబడిన ముఖంగల శిరస్సు 'ఉత్క్షిప్త శిరస్సు' అవుతుంది.

ఎత్తైన (=పొడవుగా ఉన్న) వస్తువులను, చంద్రుడు మొదలగు ఆకాశ సంచారులను చూడటంలో ఉత్క్షిప్త శిరస్సు వినియోగ పడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన ఉత్క్షిప్త శిరము.

## 13. అధోముఖ శిరస్సు:

అధోముఖం శిరో యత్ర తత్ర ప్రాహు రధోముఖమ్॥ 110
లజ్జా ఖేద ప్రణామేషు స్యాదన్వర్థ మధోముఖమ్ ।

అర్థం : యత్ర, శిరః, అధోముఖం=ఎక్కడ, శిరస్సు, అధోముఖం (=క్రిందికి వంచబడిన ముఖం కలది) అవుతుందో; తత్ర, అధోముఖం, ప్రాహుః=అక్కడ (=దానిని) అధోముఖ శిరస్సు (అని), చెబుతారు.

లజ్జా-ఖేద, ప్రణామేషు=సిగ్గు, దుఃఖం, నమస్కారం — వీటి అర్థాలను అభినయించటంలో; అధోముఖం, అన్వర్థమ్, స్యాత్=అధోముఖ (శిరస్సు), అర్థవంతం, అవుతుంది (=వినియోగ పడుతుంది).

తాత్పర్యం : క్రిందికి వంచబడిన ముఖం కల శిరస్సు 'అధోముఖ శిరస్సు'.

లజ్జ, ఖేదం, ప్రణామం — ఈ అర్థాలను ప్రదర్శించటంలో అధోముఖ శిరస్సు వినియోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన అధోగత శిరము.

## 14. లోలిత శిరస్సు:

**శిరః స్యాత్ లోలితం గర్వాధిక్యాత్ శిథిలలోచనమ్ ॥ 111**

**నిద్రాగమ గ్రహావేశ మద మూర్ఛాను తన్మతమ్।**

అర్థం : గర్వ-అధిక్యాత్ శిథిలలోచనం, శిరః = అధిక గర్వంచేత, తేలవేయబడిన కనులుగల, శిరస్సు; లోలితం, స్యాత్ = లోలిత శిరస్సు, అవుతుంది.

నిద్ర - ఆగమ, గ్రహ - ఆవేశ, మద, మూర్ఛాసు = నిద్ర రావటం, దయ్యం సోకటం, మదం, మూర్ఛ — వీటిని ప్రదర్శించటంలో; తత్, మతమ్ = అది (= లోలిత శిరస్సు), సిద్ధాంతం (= ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : అధిక గర్వంచేత తేలవేయబడిన కనులు గల శిరస్సు 'లోలిత శిరస్సు'.

నిద్రరావటం, దయ్యం సోకటం, మదం, మూర్ఛ — వీటి అర్థాలను ప్రదర్శించటంలో లోలిత శిరస్సు ప్రయుక్తమవుతుంది.

టీక : భరతముని చెప్పిన (పరి) లోలిత శిరము యొక్క వినియోగం ఇందలి వినియోగంతో సంవదిస్తున్నది.

## 15. తిర్యఙ్నతోన్నత శిరస్సు :

**తిర్యఙ్నతోన్నతిం ప్రాప్తం శిరః తిర్యఙ్నతోన్నతమ్ ॥ 112**

**బిబ్బోకాదిషు కాంతానాం తత్ప్రయోజ్యం ప్రచక్షతే ।**

అర్థం : తిర్యక్-నత, ఉన్నతిం ప్రాప్తం, శిరః = అడ్డంగా వంగి, ఉన్నతి పొందిన (= పైకి ఎత్తబడిన), శిరస్సు ; తిర్యఙ్నతోన్నతం = తిర్యఙ్నతోన్నతం (అవుతుంది).

కాంతనాం, బిబ్బోకాదిషు = స్త్రీల యొక్క, బిబ్బోకం మొదలగు వాటిలో; తత్, ప్రయోజ్యం, ప్రచక్షతే = అది, ప్రయోగింపదగినదిగా, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : అడ్డంగా వంచి, పైకి ఎత్తిన శిరస్సు 'తిర్య ఙ్నతోన్నత శిరస్సు'.

కాంతల బిబ్బోకాది విషయాలలో ఈ శిరస్సు ప్రయోగింప దగినది.

టీక : ఇచ్చటి వినియోగం, భరతముని చెప్పిన నిహంచిత శిరము యొక్క వినియోగంతో సంవదిస్తున్నది.

## 16 స్కంధానత శిరస్సు :

స్కంధానతం తదాఖ్యాతం స్కంధే యన్నిహితం శిరః ॥ 113

తన్నిద్రా మద మూర్ఛాసు చింతాయాం చ ప్రయుజ్యతే ।

అర్థం : యత్ శిరః, స్కంధే, నిహితం = ఏ శిరస్సు, స్కంధం (= మూపు) మీద, ఉంచబడినది (అవుతుందో); తత్, స్కంధానతం ఆఖ్యాతం = అది, స్కంధానతం (అని) చెప్పబడింది.

తత్ = అది (= స్కంధానత శిరస్సు); నిద్రా - మద - మూర్ఛాసు, చింతాయాం (చ) = నిద్ర, మదం, మూర్ఛ, చింత — వీటిని ప్రదర్శించటంలో; ప్రయుజ్యతే = ప్రయుక్తమవుతుంది.

తాత్పర్యం: భుజం మూపుమీదకు వంగిన శిరస్సు 'స్కంధానత శిరస్సు' అవుతుంది.

నిద్ర, మత్తు, మూర్ఛ, చింత - ఈ అర్థాలను ప్రదర్శించ టంలో ఈ శిరస్సు వినియోగపడుతుంది.

టీక : ఇది భరతముని చెప్పిన 'అంచిత శిరము' నకు దగ్గరగా ఉంది.

## 17. ఆరాత్రికశిరస్సు :

స్కంధే తు కించి దాశ్లిష్య భ్రాంత మారాత్రికమ్ ॥ 114

విస్మయే దృశ్యతే తచ్చ వరాభిప్రాయవేదనే ॥

అర్థం : స్కంధే (తు), కించిత్-అశ్లిష్య, భ్రాంతమ్ = స్కంధం (= బుజంమూపు) మీద కొంచెం తాకించి, త్రిప్పబడినది; ఆ రాత్రికం మతమ్ = 'ఆరాత్రిక శిరస్సు' (అని) చెప్పబడింది.

తత్ (చ) = అది (ఆరాత్రిక శిరస్సు); విస్మయే, పరాభిప్రాయ వేదనే, దృశ్యతే = విస్మయం (= ఆశ్చర్యం)లో, ఇతరుల అభిప్రాయం తెలుసుకొనటంలో, కన్పిస్తున్నది (= ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : బుజంమూపును కొంచెంగా తాకించి, త్రిప్పితే ఆ శిరస్సు 'ఆరాత్రికశిరస్సు' అవుతుంది.

ఆశ్చర్యంలో ఇతరుల, అభిప్రాయం తెలుసుకొనటంలో ఈ శిరస్సు ప్రయుక్తమవుతుంది.

టీక : 'స్కంధే' దీనికి 'రెండుమూపులమీద' అని కుమారస్వామి అనువాదం. దీనిని భరతముని చెప్పలేదు.

## 18. సమశిరస్సు :

**స్వాభావికం సమం శీర్షం స్వభావాభినయాదిషు ॥ 115**

అర్థం : స్వాభావికం, శీర్షం = సహజస్థితిలో (= మార్పు లేకుండా) ఉన్న, శిరస్సు; సమం = సమ (శిరస్సు అవుతుంది).

స్వభావ-అభినయ-ఆదిషు = సహజమైన అభినయం మొదలగు వాటియందు (ఈ శిరస్సు వినియోగపడుతుంది).

తాత్పర్యం : సహజస్థితిలో ఉన్న శిరస్సు 'సమశిరస్సు' అవుతుంది.

పరిస్థితుల సహజస్థితిని అభినయించటంలో సమ శిరస్సు వినియోగపడుతుంది.

టీక : నా. శా. బరోడా ముద్రణలో 'ప్రాకృతశిరము' పేర అధిక పాఠమున్నది; దానితో ఇది సంవదిస్తున్నది. (చూ. తె.నా.శా. పుట. 271- అధస్సూచిక)

## 19. పార్శ్వాభిముఖశిరస్సు :

**పార్శ్వాభిముఖ మన్వర్థం పార్శ్వస్థస్యాఽవలోకనే ।**

అర్థం : పార్శ్వాభిముఖం,అన్వర్థం = పార్శ్వాభిముఖం (అనే పేరు), అర్థవంతమైనది ' = ప్రక్కకు తిరిగిఉన్న శిరస్సు పార్శ్వాభిముఖ శిరస్సు అవుతుంది).

పార్శ్వస్థస్య, అవలోకనే = ప్రక్కల ఉన్నవారిని, చూడటంలో ఇది ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : ప్రక్కకు తిరిగిన శిరస్సు 'పార్శ్వాభిముఖశిరస్సు'.

ప్రక్కల ఉన్న వారిని చూడటంలో ఇది ఉపయోగపడుతుంది.

టీక : దీనిని భరతముని చెప్పలేదు.

## 20. సౌమ్యశిరస్సు:

**నిశ్చలం సౌమ్య మాఖ్యాతం నృత్తారంభే ప్రయుజ్యతే ॥** 116

అర్థం : నిశ్చలం, సౌమ్యం, ఆఖ్యాతం = చలనం లేకుండా ఉన్నది, సౌమ్య (శిరస్సు అని), చెప్పబడింది.

నృత్త-ఆరంభే, ప్రయుజ్యతే = నృత్త ప్రారంభంలో, (ఈ శిరస్సు ప్రయుక్తమవుతుంది

తాత్పర్యం: చలన లేకుండా ఉన్న శిరస్సు 'సౌమ్యశిరస్సు'.

నృత్త ప్రారంభంలో ఇది వినియోగపడుతుంది.

టీక : ఇది, మొదట చెప్పిన 'సమశిరస్సు'తో సంవదిస్తున్నది.

## 21. ఆలోలితశిరస్సు :

**సమంతాల్లాలితం యత్తదాలోలిత మితీరితమ్ ।**
**పుష్పాంజలిక్రమే చారినటనే లవణే తథా ॥** 117
**ఆలోలితస్య శిరసో వినియోగోఽభిధీయతే ।**

అర్థం: యత్, సమంతాత్, లాలితం = ఏది, అంతటా, త్రిప్పబడినది (అవుతుందో); తత్, ఆలోలితం, ఈరితమ్ = అది, ఆలోలిత (శిరస్సు) (అని), చెప్పబడింది.

పుష్పాంజలి క్రమే, చారినటవే, (తథా) లవణే = పుష్పాంజలి అర్పించే విధం, చారినటనం, లావణ్యం-వీటిని ప్రదర్శించటంలో; ఆలోలితస్య శిరసః, వినియోగః, అభిధీయతే = ఆలోలిత శిరస్సు యొక్క, వినియోగం, చెప్పబడుతున్నది.

తాత్పర్యం: అంతటా త్రిప్పబడిన శిరస్సు 'ఆలోలితశిరస్సు'.

పుష్పాంజలివిధిలో, చారినటనంలో, లావణ్య ప్రదర్శనంలో ఈ శిరస్సు ప్రయుక్తమవుతుంది.

టీక: మూలంలో 'సమంతాత్ లాలితం' అనీ 'చారినటవే,లవణే' అనీ ఉంది. ఇది ఆలోలితశిరస్సుకాన 'సమంతాత్ లోలితం' అని ఉండటం సమంజసమనీ, అట్లాగే 'లవణే' అనటంకంటె లవనే (=పుష్పాదులను కోయటం) అని ఉండటం సంభావ్యమనీ డా. పుల్లెల శ్రీ రామచంద్రుడుగారి సూచన.

ఈ నిర్వచనం భరతముని చెప్పిన పరిలోలిత లేదా లోలిత శిరము యొక్క నిర్వచనమునకు దగ్గరగా ఉంది. ఇంతకుముందు చెప్పిన ఆలోలితమునకు దీనికి సంబంధం కన్పించటం లేదు.

## 22. తిరశ్చీనశిరస్సు:

పార్శ్వద్వయాదూర్ధ్వభాగే చలనా త్తిర్యగీరితమ్। 118
లక్షానిరూపణే నృత్తే ముఖచారీయనామని ॥
తత్తదౌచిత్యకాలేషు తిరశ్చీన ముదీరితమ్ ॥ 119

అర్థం : పార్శ్వద్వయాత్, ఊర్ధ్వభాగే, చలనాత్ = రెండు ప్రక్కలమండి (= ప్రక్కకు), పై భాగంలో, చలించటంవల్ల; తిర్యక్ ఈరితమ్ = తిర్యక్కు (= తిరశ్చీన శిరస్సు అని), చెప్పబడింది.

లజ్జానిరూపణే, ముఖచారీయ నామని నృత్తే = సిగ్గును నిరూపించటంలో, ముఖచారి అనే పేరుగల నృత్తంలో; తత్ తత్ ఔచిత్య కాలేషు = అయా (= ఇంకా ఇటువంటి) సందర్భోచిత సమయాలలో: తిరశ్చీనం, ఉదీరితమ్ = తిరశ్చీనం (యొక్క వినియోగం), చెప్పబడింది.

తాత్పర్యం : రెండు ప్రక్కలకు పైపైన చూస్తే, అది 'తిరశ్చీన శిరస్సు' అవుతుంది.

లజ్జ, ముఖచారి నటన, ఇంకా ఇటువంటి వాటిల్లో సమయోచితంగా ఈ శిరస్సు వినియోగపడుతుంది.

టీక : దీనిని భరతముని చెప్పలేదు.

## 23. ప్రకంపితశిరస్సు :

పునఃపునః ప్రచలనా త్పురోభాగే చ పార్శ్వయోః ।
ప్రకంపితశిరః ప్రోక్తం నాట్యశాస్త్రేషు సమ్మతమ్ ॥ 120
అద్భుతాఖ్యరసే గీతే ప్రబంధే భ్రమరే తథా ।
ప్రత్యర్థియుద్ధభావేఽపి ప్రకంపితశిరో భవేత్ ॥ 121

అర్థం : పార్శ్వయోః, పురోభాగే (చ) = రెండు ప్రక్కల, ముందుభాగంలో; పునఃపునః, ప్రచలనాత్ = మాటిమాటికి, చలించటం వల్ల, ప్రకంపితశిరః, ప్రోక్తః = ప్రకంపిత శిరస్సు (అని), చెప్పబడింది; నాట్యశాస్త్రేషు, సమ్మతమ్ = (ఇది) నాట్యశాస్త్రాలలో, అంగీకరించబడింది.

అద్భుత-అఖ్యరసే, గీతే, ప్రబంధే, (తథా) భ్రమరే =

అద్భుతం అనే పేరుగల రసం, గీతం, ప్రబంధం, భ్రమరం; ప్రత్యర్థి యుద్ధభావే (అపి) = శత్రువుతో యుద్ధానికి తలపడటం-ఈఅర్థాలను ప్రదర్శించటంలో ప్రకంపితశిరః, భవేత్ = ప్రకంపితశిరస్సు, (ప్రయుక్తం) అవుతుంది.

తాత్పర్యం : రెండు ప్రక్కలకు, ముందుకు మాటిమాటికి చలింపజేస్తే, అది 'ప్రకంపితశిరస్సు' అవుతుంది.

అద్భుతరసం, గీతం (=పాట), ప్రబంధం(=గ్రంథపఠనం), తుమ్మెద, ప్రత్యర్థితో యుద్ధానికి తలపడటం-ఈ అర్థాలలో ప్రకం పితశిరస్సు చెల్లుతుంది.

టీక : దీనిని భరతముని చెప్పలేదు.

## 24. సౌందర్యశిరస్సు :

> ఊర్ధ్వాధోముఖ విన్యాసాత్ పశ్చాద్భాగేన చాలనాత్ ।
> సౌందర్యాఖ్యశిరః ప్రోక్తం సర్వనాట్యే ప్రశస్యతే ॥ 122
> కారణాభినయే హస్తభ్రమణాఖ్యే చ నర్తనే ।
> సౌందర్యాఖ్యశిరః ప్రోక్తం యోగాభ్యాసేతు యుజ్యతే ॥ 123

అర్థం : ఊర్ధ్వ, అధోముఖ, విన్యాసాత్ =(శిరస్సును) పైకి, క్రిందకు, త్రిప్పటంవల్ల;పశ్చాత్ భాగేన, చాలనాత్ = వెనుకభాగంలో చలింపజేయటంవల్ల ; సౌందర్య-ఆఖ్యశిరః, ప్రోక్తం = 'సౌందర్యం' అనే పేరుగల శిరస్సు చెప్పబడింది; సర్వనాట్యే, ప్రశస్యతే =(ఇది) అన్నివిధములైన నాట్యాలలో, కీర్తింపబడుతున్నది.

కారణ-అభినయే, హస్తభ్రమణ-ఆఖ్యే (చ) నర్తనే =(ఏదేని) కారణం అభినయించటంలో, హస్తభ్రమణం అనే పేరుగల నర్తనంలో; యోగాభ్యాసే (తు) యోగాభ్యాసంలో; సౌందర్య-ఆఖ్యశి, శిరః, ప్రోక్తం = సౌందర్యం అనే పేరుగల, శిరస్సు చెప్పబడింది.

తాత్పర్యం : పైకి క్రిందికి చూడటం, వెనుక(=వీపు)వైపు త్రిప్పటంవల్ల 'సౌందర్యశిరస్సు' ఏర్పడుతుంది.

ఏదేని కారణాన్ని అభినయించటంలో, హస్త భ్రమణం అనే నాట్యంలో, యోగాభ్యాసంలో ఈ సౌందర్యశిరస్సు వినియోగ పడుతుంది.

టీక : దీనిని కూడ భరతముని చెప్పలేదు.

# 4
# దృష్టి భేదాలు

## దృష్టుల పేర్లు

నమ మాలోకితం సాచీ ప్రలోకితనిమీలితే ।
ఉల్లోకితానువృత్తే చ తథాచైవా ఽ వ లోకితమ్ ॥ 124
ఇత్యష్ట దృష్టి భేదాః స్యుః కీర్తితాః పూర్వసూరిభిః ।

అర్థం : సమమ్, ఆలోకితం, సాచీ, ప్రలోకిత-నిమీలితే—సమం, ఆలోకితం, పాచి, ప్రలోకితం, నిమీలితం; ఉల్లోకిత - అనువృత్తే (చ), (తథా) (చ) అవలోకితమ్—ఉల్లోకితం, అనువృత్తం, అవలోకితం- (ఇట్లా) దృష్టి భేదాః, అష్టౌ, స్యుః, ఇతి—దృష్టి భేదాలు, ఎనిమిది, కలవు, అని ; పూర్వ సూరిభిః, కీర్తితాః—పూర్వ విద్వాంసుల చేత, కీర్తించబడినవి (—పేర్కొనబడినవి).

తాత్పర్యం : 1. సమం, 2. ఆలోకితం, 3. సాచి, 4. ప్రలోకితం, 5. నిమీలితం, 6. ఉల్లోకితం, 7. అనువృత్తం, 8. అవలోకితం — ఇట్లా దృష్టి భేదాలు ఎనిమిది అని ప్రాచీన విద్వాంసులు పేర్కొన్నారు.

టీక : నాట్యశాస్త్రాదిది గ్రంథాలలో 36 దృష్టి భేదాలు మూడు భాగాలుగా చెప్పబడినవి — రసదృష్టులు-8 ; స్థాయిభావ దృష్టులు-8; వ్యభిచారిభావ దృష్టులు-20. కాని నందికేశుడు ఎనిమిది భేదాలనే చెప్పినాడు ; కావున ఇది భరతాగమ సంప్రదాయం కాదు; భిన్న సంప్రదాయానికి చెందింది. 'పూర్వసూరిభిః' అనే దానికి 'భరతాగమే' (—నాట్య వేదమందు) అని నీడా పాఠం. అందుచేత 'పూర్వసూరిభిః' అన్న పాఠమే సమంజసం. మరి నందికేశుడు పేర్కొన్న ఆ పూర్వసూరులు ఎవరో ?

ఈ ఎనిమిది భేదాలనే కాక, 'గ్రంథాంతరస్థ భేదాః' అంటూ 44 దృష్టి భేదాలు తరువాత చెప్పబడుతున్నవి. నందికేశుడు చెప్పిన ఎనిమిది దృష్టి భేదాలు ఆతడు చెప్పిన శిరో భేదాలను అనుసరించి ఉండటం సహృదయులు గమనించగలరు.

ఆయా గ్రంథాలలోని శిరో భేదాలను పట్టిక రూపంలో ఇస్తున్నాము.

## దృష్టి భేదాలు

| నా. శా. లో | అభి. ద. లో | ఇతర గ్రంథాలలో |
|---|---|---|
| రస దృష్టులు : | | |
| 1. కాంత | సమం | సమ |
| 2. భయానక | ఆలోకితం | ప్రలోకిత |
| 3. హాస్య | సాచి | స్నిగ్ధ |
| 4. కరుణ | ప్రలోకితం | శృంగార |
| 5. అద్భుత | నిమీలితం | ఉల్లోకిత |
| 6. రౌద్రి | ఉల్లోకితం | అద్భుత |
| 7. వీర | అనువృత్తం | కరుణ |
| 8. బీభత్స | అవలోకితం | విస్మయ |
| స్థాయిభావ దృష్టులు : | | |
| 9. స్నిగ్ధ | | దృప్త |
| 10. హృష్ట | | విషణ్ణ |
| 11. దీన | | భయానక |
| 12. క్రుద్ధ | | సాచి |
| 13. దృప్త | | ద్రుత |

| నా. శా. లో. | అభి. ద. లో. | ఇతర గ్రంథాలలో |
|---|---|---|
| 14. భయాన్విత | | వీర |
| 15. జుగుప్సిత | | రౌద్ర |
| 16. విస్మిత | | దూర |

సంచారి భావ దృష్టులు :

| నా. శా. లో. | అభి. ద. లో. | ఇతర గ్రంథాలలో |
|---|---|---|
| 17. శూన్య | | ఇంగిత |
| 18. మలిన | | విలోకిత |
| 19. శ్రాంత | | వితర్కిత |
| 20. లజ్జాన్విత | | శంకిత |
| 21. గ్లాన | | అభితప్త |
| 22. శంకిత | | అవలోకిత |
| 23. విషణ్ణ | | శూన్య |
| 24. ముకుల | | హృష్ట |
| 25. కుంచిత | | ఉగ్ర |
| 26. అభితప్త | | విభ్రాంత |
| 27. జిహ్మ | | శాంత |
| 28. లలిత | | మీలిత |
| 29. వితర్కిత | | సూచన |
| 30. అర్ధముకుల | | లజ్జిత |
| 31. విభ్రాంత | | మలిన |
| 32. విప్లుత | | త్రస్త |
| 33. ఆకేకర | | మ్లాన |

| నా. శా. శ్లో. | అభి. ద. శ్లో. | ఇతర గ్రంథాలలో |
|---|---|---|
| 34. ఏకోశ | | ముకుళ |
| 35. త్రస్త | | కుంచిత |
| 36. మదిర | | ఆకాశ |
| | | అర్ధముకుళ |
| | | అనువృత్త |
| | | విప్లుత |
| | | జిహ్మ |
| | | ఏకోశ |
| | | మదిర |
| | | హృద్య |
| | | లలిత |

## 1. సమదృష్టి

వీక్షణం సురనారీవత్ సానందం సమవీక్షణమ్॥ 125

నాట్యారంభే తులాయాం చావ్యన్యచింతావినిశ్చయే।
ఆశ్చర్యే దేవతారూపే సమదృష్టి రుదాహృతా॥ 126

అర్థం : సానందం = ఆనందంతో; సురనారీవత్ వీక్షణం = దేవతా స్త్రీ( = అప్సరస)వలె చూడటం(=రెప్పవేయక చూడటం); సమవీక్షణమ్ = 'సమదృష్టి' (అవుతుంది) (వీక్షణం = చూపు).

నాట్యారంభే, తులాయాం (చ), (అపి) అన్య చింతా వినిశ్చయే = నాట్య ప్రారంభం, త్రాసును సూచించటం, ఇతరుల ఆలోచనను నిశ్చయించటం; ఆశ్చర్యే, దేవతారూపే = ఆశ్చర్యం, దేవతా విగ్రహం (దర్శించటం) — వీటియందు; సమదృష్టిః, ఉదాహృతా = సమదృష్టి (ప్రయోగం), చెప్పబడింది.

తాత్పర్యం : ఆనందంతో, అప్సరసవలె రెప్పవేయక చూడటం 'సమదృష్టి' అవుతుంది.

నాట్య ప్రారంభం, ప్రాసను సూచించటం, ఇతరుల ఆలోచ నను ఊహించటం, ఆశ్చర్యం, దేవతారూప దర్శనం — వీటియందు సమదృష్టి వినియుక్తమవుతుంది.

టీక : 'వీక్షితంసురవారీభిః సమానం' (=అప్సరసలతో సమానంగా చూడటం) అని నీడా పాఠం. ఆనందం కలిగినప్పుడే కనులు పెద్దవిచేసి, రెప్పవేయక చూడటం సహజం. అందుచేత 'సురవారీవత్ సానందం' అన్నదే సమంజసం కాగలదు.

## 2. ఆలోకిత దృష్టి

ఆలోకితం భవేదాశుభ్రమణం స్ఫుటవీక్షణమ్ ।
కులాలచక్రభ్రమణే సర్వవస్తు ప్రదర్శనే ॥ 127
యాచ్ఞాయాం చ ప్రయోక్తవ్య మాలోకితనిరీక్షణమ్ ।

అర్థం : ఆశుభ్రమణం, స్ఫుటవీక్షణమ్ = కనుగ్రుడ్లు వడిగా తిరగటం, కళ్ళు విప్ఫారటం (ఉన్నప్పుడు), ఆలోకితం భవేత్ = ఆలోకిత (దృష్టి) అవుతుంది.

కులాల చక్రభ్రమణే = కుమ్మరి సారె తిరగటం; సర్వవస్తు ప్రదర్శనే = చుట్టూఉన్న అన్ని వస్తువులను చూపటం; యాచ్ఞాయాం (చ) = యాచించటం — వీటియందు ; ఆలోకిత నిరీక్షణమ్, ప్రయోక్తవ్యమ్ = ఆలోకిత దృష్టి, ప్రయోగింపదగినది.

తాత్పర్యం : కనుగ్రుడ్లు వడిగా తిరగటం, కనులు విప్ఫార టం జరిగినప్పుడు 'ఆలోకిత దృష్టి' ఏర్పడుతుంది.

కుమ్మరి సారె తిరగటం, చుట్టూ ఉన్న అన్ని వస్తువులను చూపటం, యాచించటం — వీటియందు ఈ దృష్టిని ప్రయోగింప దగును.

టీక : 'యాచ్ఞాయాం' అనే దానికి బదులు 'ఇచ్ఛాయాం' అని నీడా పాఠం — ఇచ్ఛ (= కోరిక) యందు అని దీని అర్థం.

## 3. సాచీ దృష్టి

స్వస్థానే తిర్యగాకార మపాంగవలనం క్రమాత్॥ 128

సాచీదృష్టి రితిజ్ఞేయా నాట్యశాస్త్రవిశారదైః।

ఇంగితే శ్మశ్రుసంస్పర్శే శరలక్ష్యే శుకే స్మృతే॥ 129

సూచనాయాం చ కార్యాణాం నాట్యే సాచీనిరీక్షణమ్।

అర్థం : స్వస్థానే = సహజ స్థానంలో; క్రమాత్, తిర్యక్ ఆకారం, అపాంగవలనం = క్రమంగా, అడ్డంగా తిరిగిన, కడకంటి ప్రసారం (= కటాక్షం); సాచీదృష్టిః ఇతి = 'సాచీ దృష్టి' అని; నాట్యశాస్త్ర విశారదైః, జ్ఞేయా = నాట్య శాస్త్రవేత్తల చేత, తెలియదగినది.

ఇంగితే, శ్మశ్రుసంస్పర్శే, శరలక్ష్యే, శుకే, స్మృతే = ఇష్టం తెలుపటం, మీసం దువ్వటం, బాణం ఎక్కుపెట్టటం, చిలుక (ను ఆదరించటం), స్మరించటం; కార్యాణాం సూచనాయాంచ, నాట్యే = కార్యముల సూచన, నాట్యం; — వీటిని ప్రదర్శించటంలో; సాచీ నిరీక్షణమ్ = సాచీ దృష్టి (ప్రయుక్తమవుతుంది.)

తాత్పర్యం : క్రమంగా, అడ్డంగా తిరిగిన కడకంటి చూపు 'సాచీ దృష్టి' అనబడుతుంది.

ఇష్టం లేదా అభిప్రాయం తెలుపటం, మీసం దువ్వటం లేదా సరిచేయటం, బాణం ఎక్కుపెట్టటం (= గురి చూడటం), చిలుకను దువ్వటం, స్మరణ, నాట్యం, కార్యముల సూచన — వీటిని నిరూపించటంలో సాచీదృష్టి వినియోగపడుతుంది.

టీక : 'అపాంగ వలనం' అనే దానికి 'అపాంగ చలనం' (= కడకంటి కదలిక) అని నీడా పాఠం. 'శరలక్ష్యే శుకే' అనే దానికి 'శరలక్ష్యే ఒం శుకే' అని నీడా పాఠం (శుకమునకు బదులు అంశుకం = వస్త్రం అని అర్థం). 'కార్యాణాం నాట్యే' అనే దానికి 'కులటానాట్యే' అని నీడా పాఠం. కులటా నాట్యమంటే ఏమిటో తెలియరాలేదు. ఇది బహుశః ఇంతకుముందు పేర్కొన్న

నీచ నాట్యం కావచ్చునేమో ? 'నాట్యశాస్త్ర విశారదైః' అనే దానికి 'నాట్యశాస్త్రార్థకోవిదైః' (=నాట్యశాస్త్రం యొక్క అర్థాలు తెలిసిన వారు) అని నీడా పాఠం.

## 4. ప్రలోకితదృష్టి

ప్రలోకితం పరిజ్ఞేయం చలనాత్ పార్శ్వభాగయోః ॥ 180

ఉభయోః పార్శ్వయోః వస్తునిర్దేశే చ ప్రసంజితే ।

చలనే బుద్ధిజాడ్యే చ ప్రలోకితనిరీక్షణమ్ ॥ 181

అర్థం : పార్శ్వ భాగయోః, చలనాత్ = ఇరుప్రక్కలకు, చలించటం వల్ల; ప్రలోకితం, పరిజ్ఞేయం = ప్రలోకితదృష్టి (అని), తెలియవలెను.

ఉభయోః పార్శ్వయోః, వస్తునిర్దేశే, ప్రసంజితే = రెండు ప్రక్కలఉన్న,వస్తువులను నిర్దేశించటం, వాటినిగూర్చి ప్రసంగించటం; చలనే, బుద్ధిజాడ్యే (చ) = చలనం, బుద్ధిజాడ్యం ( = కలవరపాటు) — వీటిని నిరూపించటంలో; ప్రలోకితనిరీక్షణమ్ = ప్రలోకిత దృష్టి (ఉపయుక్తమవుతుంది).

తాత్పర్యం : రెండుప్రక్కలకు చలించటంవల్ల 'ప్రలోకిత దృష్టి' అవుతుంది.

రెండుప్రక్కల ఉన్న వస్తువులను చూపటం, వాటిని గూర్చి ప్రసంగించటం, చలనం,కలవరపాటు- అనే అర్థాలలో ప్రలోకితదృష్టి ప్రయుక్తమవుతుంది.

టీక : వస్తునిర్దేశే ప్రసంజితే అనే దానికి 'వస్తుదర్శనే సూచనే తథా'అని నీడా పాఠం. 'ఉభయపార్శ్వములందున్న వస్తువులను చూడటం, సూచించటం' అని అర్థం.

'ప్రసంజితే' అనేదానికి "excessive affection"అని ఘోష్ అనువాదం.

### 5. నిమీలితదృష్టి

దృష్టేరర్ధవికాసే నిమీలితాదృష్టి రీరితా ।
ఋషివేషే పారవశ్యే జపే ధ్యానే నమస్కృతే ॥ 132

ఉన్మాదే సూక్ష్మదృష్టౌ నిమీలితాదృష్ట రీరితా ।

అర్థం: దృష్టేః, అర్ధవికాసే = దృష్టి, సగమే వికసించి నప్పుడు, (= కన్ను సగం తెరచిచూడటం); నిమీలితాదృష్టిః, ఈరితా = నిమీలిత దృష్టి చెప్పబడినది.

ఋషివేషే, పారవశ్యే, జపే, ధ్యానే, నమస్కృతే = ఋషివేషం, పరవశత్వం, జపం, ధ్యానం, నమస్కారం; ఉన్మాదే, సూక్ష్మ దృష్టౌ (చ) = ఉన్మాదం, సూక్ష్మదృష్టి- వీటిని నిరూపించటంలో నిమీలితాదృష్టిః ఈరితా = 'నిమీలితదృష్టి' చెప్పబడినది.

తాత్పర్యం : దృష్టి సగమే కనిపించినప్పుడు అది 'నిమీలితదృష్టి' అవుతుంది.

ఋషివేషం, పారవశ్యం, జపం, ధ్యానం, నమస్కారం, ఉన్మాదం, సూక్ష్మదృష్టి-ఈ అర్థాలలో నిమీలితదృష్టి తగును.

టీక : 'మీలితదృష్టి' అని ఘోష్ పాఠం. కాని వారి ఆంగ్లానువాదంలో 'నిమీలితదృష్టి' అనియేఉన్నది. 'నిమీలిత' అన్నదే ప్రసిద్ధమైనపేరు. 'ఋషివేషే' అనేదానికి 'ఆశీవిషే' (= పాముువిషమందు) అని ఘోష్ పాఠం.

### 6. ఉల్లోకితదృష్టి

ఉల్లోకితమితి జ్ఞేయ మూర్ధ్వభాగే విలోకనమ్ ॥ 133
ధ్వజాగ్రే గోపురే దేవమండపే పూర్వజన్మని ।

ఔన్నత్యే చంద్రికాదావప్యుల్లోకిత నిరీక్షణమ్ ॥ 134

అర్థం : ఊర్ధ్వభాగే, విలోకనమ్ = పైకి, నిక్కి చూడటం; ఉల్లోకితం ఇతి, జ్ఞేయం = ఉల్లోకిత (దృష్టి)అని, తెలియవలెను.

ధ్వజాగ్రే, గోపురే, దేవమండపే, పూర్వజన్మని, ఔన్నత్యే, చంద్రికాదౌ (అపి) = ధ్వజాగ్రం (= జెండాకొన), గోపురం, దేవమండపం (= దేవాలయం లేదా పరివేషం), పూర్వజన్మస్మరణ, ఔన్నత్యం (= ఎత్తు), చంద్రిక (వెన్నెల) మొదలైనవి— వీటిని నిరూపించటంలో; ఉల్లోకిత నిరీక్షణమ్ = 'ఉల్లోకితదృష్టి' (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం: పైకి నిక్కిచూడటం 'ఉల్లోకితదృష్టి' అవుతుంది.

ధ్వజాగ్రం, గోపురం, దేవమండపం, పూర్వజన్మస్మరణ, ఎత్తు, వెన్నెల మొదలగువాటి యందు ఈ దృష్టి చెల్లుతుంది.

టీక: 'ఊర్ధ్వభాగే విలోకనమ్' అనే దానికి 'ఊర్ధ్వ భాగోన్నతాననమ్' అని నీడా పాఠం, 'పైకి ఎత్తబడిన ముఖం కలది' అని అర్థం.

## 7. అనువృత్తదృష్టి

ఊర్ధ్వాధో వీక్షణం వేగా దనువృత్త మితీరితమ్ ।
కోప దృష్టౌ ప్రియామంత్రేఽప్యనువృత్తనిరీక్షణమ్ ॥ 135

అర్థం: వేగాత్ = వేగంవల్ల; ఊర్ధ్వ-అధోవీక్షణం = పైకి కిందకు చూడటం; అనువృత్తమ్ ఇతి, ఈరితమ్ = అనువృత్తం (=అనువృత్తదృష్టి)' అని, చెప్పబడినది.

కోపదృష్టౌ, ప్రియ-ఆమంత్రే(అపి) = కోపంగా చూడటం, ప్రీతితో లేదా మిత్రులను పిలవటం— వీటిని నిరూపించటంలో; అనువృత్తనిరీక్షణమ్ = 'అనువృత్తదృష్టి' (ప్రయుక్తమవుతుంది.)

తాత్పర్యం: వేగంగా పైకి, క్రిందకు చూడటం 'అనువృత్తదృష్టి' అవుతుంది.

కోపంగా చూడటం, ప్రీతితో పిలవటం లేదా మిత్రులను పిలవటం — వీటియందు ఈ దృష్టి ప్రయుక్తమవుతుంది.

## 8. అవలోకితదృష్టి

అధస్తాద్దర్శనం యత్తదవలోకిత ముచ్యతే ।
ఛాయాలోకే విచారే చ చర్యాయాం పతనక్రమే ॥ 136
స్వాంగావలోకనే యానేఽ ప్యవలోకిత ముచ్యతే ।

అర్థం : యత్, అధస్తాత్ దర్శనం = ఏది, క్రిందికిచూడటమో; తత్, అవలోకితం, ఉచ్యతే = అది అవలోకితం (= అవలోకితదృష్టి) (అని), చెప్పబడుతున్నది.

ఛాయా-ఆలోకే, విచారే (చ), చర్యాయాం, పతనక్రమే, స్వ-అంగావలోకనే, యానే (అపి) = నీడను చూడటం, విచారం (= ఆలోచన), పనిచేయటం, పతనం వలని క్రమ, స్వీయ అవయవాలను చూచుకొనటం, నడక-వీటియందు; అవలోకితం, ఉచ్యతే = అవలోకితదృష్టి, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : క్రిందికి చూడటం 'అవలోకితదృష్టి' అవుతుంది.

నీడను చూడటం, ఆలోచన,పనిచేయటం, పతనంవలని క్రమ, స్వీయఅవయవములను చూసుకొనటం,నడక-వీటిని నిరూపించటంలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : 'చర్య' అనే దానికి 'వ్యాయామం' అని ఘోష్ అనువాదం. 'చర్యాయాం' అనేదానికి 'శయ్యాయాం' (= పడకయందు) అని నీడా పాఠం. 'పతనక్రమే' అనే దానికి 'పతనక్రమే' (= పతన విధానమందు) అని నీడా పాఠం.

## గ్రంథాంతర దృష్టిభేదాలు

సమా ప్రలోకితా స్నిగ్ధా శృంగారోల్లోకితాఽ ద్భుతా ॥ 137
కరుణా విస్మయా దృష్టా విషణ్ణా చ భయానకా ।
సాచీ ద్రుతా వీరరౌద్రే దూరేంగితవిలోకితాః ॥ 138

వితర్కితా శంకితా చ అభితప్తావలోకితా ।
శూన్యా హృష్టోగ్రవిభ్రాంతాః శాంతా మీలితసూచనే ॥ 139
లజ్జితా మలినా త్రస్తా మ్లానా ముకుళకుంచితే ।
ఆకాశార్ధముకుళా అనువృత్తా చ విప్లుతా ॥ 140
జిహ్మా వికోశా మదిరా హృద్యా లలితసంజ్ఞికా ।
చతుశ్చత్వారింశదితి దృష్టి భేదాః ప్రకీర్తితాః ॥ 141

అర్థం : 1. సమా, 2. ప్రలోకితా, 3. స్నిగ్ధా, 4. శృంగారా, 5. ఉల్లోకితా, 6. అద్భుతా, 7. కరుణా, 8. విస్మయా, 9. దృప్తా 10. విషణ్ణా(చ), 11. భయానకా, 12. సాచీ, 13. ద్రుతా, 14. వీరా, 15. రౌద్రా, 16. దూరా, 17. ఇంగితా, 18. విలోకితా, 19. వితర్కితా, 20. శంకితా, 21. అభితప్తా, 22. అవలోకితా, 23. శూన్యా, 24. హృష్టా, 25. ఉగ్రా, 26. విభ్రాంతా, 27. శాంతా, 28. మీలితా, 29. సూచనా, 30. లజ్జితా, 31. మలినా, 32. త్రస్తా, 33. మ్లానా, 34. ముకుళా, 35. కుంచితా, 36. ఆకాశా, 37. అర్ధ ముకుళా, 38. అనువృత్తా(చ), 39. విప్లుతా, 40, జిహ్మా, 41. వికోశా, 42. మదిరా, 43. హృద్యా, 44. లలిత సంజ్ఞికా = 1. సమ, 2. ప్రలోకిత, 3. స్నిగ్ధ, 4. శృంగార, 5. ఉల్లోకిత, 6. అద్భుత, 7. కరుణ, 8. విస్మయ, 9. దృప్త, 10. విషణ్ణ, 11. భయానక, 12. సాచి, 13. ద్రుత, 14. వీర, 15. రౌద్ర, 16. దూర, 17. ఇంగిత, 18. విలోకిత, 19. వితర్కిత, 20. శంకిత, 21. అభితప్త, 22. అవలోకిత, 23. శూన్య, 24. హృష్ట, 25. ఉగ్ర, 26, విభ్రాంత, 27. శాంత, 28. మీలిత, 29. సూచన, 30, లజ్జిత, 31. మలిన, 32. త్రస్త, 33. మ్లాన, 34. ముకుళ, 35. కుంచిత, 36. ఆకాశ, 37. అర్ధముకుళ, 38. అనువృత్త, 39. విప్లుత, 40. జిహ్మ, 41. వికోశ, 42. మదిర, 43. హృద్య, 44. లలిత. —

(శ్లో॰: దృష్టిభేదాః = దృష్టి భేదాలు; చతుఃచత్వారిం శత్ ఇతి = నలభై నాలుగు అని; ప్రకీర్తితాః = కీర్తింప (= చెప్ప)బడినవి.

తాత్పర్యం : దృష్టిభేదాలు నలభై నాలుగు అని చెప్పబడినవి— సమ, ప్రలోకిత, స్నిగ్ధ, శృంగార, ఉల్లోకిత, అద్భుత, కరుణ, విస్మయ, దృప్త, విషణ్ణ, భయానక, సాచి, ద్రుత, వీర, రౌద్ర, దూర, ఇంగిత, విలోకిత, వితర్కిత, శంకిత, అభితప్త, అవలోకిత, శూన్య, హృష్ట, ఉగ్ర, విభ్రాంత, శాంత, మీలిత, సూచన, లజ్జిత, మలిన, త్రస్త, మ్లాన, ముకుళ, కుంచిత, ఆకాళ, అర్ధముకుళ, అనువృత్త, విప్లుత, జిహ్మ, వికోశ, మదిర, హృద్య, లలిత.

టీక : ఇతర గ్రంథాలలోనివి అంటూ చెప్పిన ఈ భేదాలు కొన్ని భరతాదులు చెప్పిన రస-స్థాయి భావ- వ్యభిచారి భావ దృష్టులతో సంవదిస్తున్నవి (చూ. తె. నా. శా. పుటలు-271-77). అభినయంలో దృష్టులకు అధికమైన ప్రాధాన్యం ఉంది. అయినా భరతాదుల వలె నందికేశ్వరుడు దృష్టులను విస్తరంగా వివరించలేదు.

## 1. సమదృష్టి

**వీక్షణం సురనారీణా మివ దృష్టిః సమా భవేత్ ।**

**సమాధిషు ప్రయోక్తవ్యమితి నాట్యవిదో విదుః ॥** 142

అర్థం: సురనారీణామ్ ఇవ వీక్షణం = దేవతాస్త్రీలవలె (= రెప్పపాటులేకుండా) చూడటం; సమాదృష్టిః భవేత్ = 'సమదృష్టి' అవుతుంది.

సమాధిషు ప్రయోక్తవ్యమ్ ఇతి = (దీనిని) సమాధులయందు (సమాధి = నిలకడగా చూడటం) ప్రయోగింపదగును అని; నాట్యవిదః విదుః = నాట్యవేత్తలు, తెలిసికొందురు.

తాత్పర్యం : దేవతా స్త్రీలవలె రెప్పపాటు లేకుండా చూడటం 'సమదృష్టి' అవుతుంది. సమాధి విషయంలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఈ నిర్వచనం కంటె ఇంతకు ముందు చెప్పిన 'సమ దృష్టి' నిర్వచనం సమగ్రంగా ఉన్నది. 'సమాధిషు' అనేదానికి 'సామాన్య పరిస్థితులలో' అని కుమారస్వామి అనువాదం. ఏకాగ్రతతో లేదా "నిలకడగా చూచుటయందు" అనే అర్థం సమంజసం.

## 2. ప్రలోకితదృష్టి

ప్రలోకితా పరిజ్ఞేయా దర్శనం పార్శ్వభాగయోః ।

ఉభయోః పార్శ్వయోః వస్తుదర్శనాదిషు యుజ్యతే ॥ 143

అర్థం : పార్శ్వ భాగయోః, దర్శనం = ఇరుప్రక్కలను (చూచే)చూపు; ప్రలోకితా, పరిజ్ఞేయా = ప్రలోకిత (దృష్టి అని), తెలియవలె.

ఉభయోః, పార్శ్వయోః = ఇరుప్రక్కలందును ఉన్న; వస్తు దర్శనాదిషు = వస్తువులను చూడటంలో; యుజ్యతే = (ప్రలోకిత దృష్టి) తగును.

తాత్పర్యం : ఇరు ప్రక్కలకు చూడటం 'ప్రలోకితదృష్టి' అవుతుంది.

రెండు ప్రక్కలందున్న వస్తువులను చూడటంలో ఈ దృష్టి వినియోగపడుతుంది.

టీక : ఈ నిర్వచనం ఇంతకు ముందు చెప్పిన ప్రలోకితదృష్టి నిర్వచనంతో సంవదిస్తున్నది; అచ్చట వినియోగం అధికంగా చెప్ప బడింది.

## 3. స్నిగ్ధదృష్టి

సహర్షా సాభిలాషా చ మనోజ్ఞాఽంతఃప్రకాశినీ ।

స్మరోద్రేకా భవేత్ స్నిగ్ధా స్నిగ్ధాదిషు నియుజ్యతే ॥ 144

అర్థం : సహర్షా, సాభిలాషా(చ)=సంతోషంతో, అభిలాష (=కోరిక)తో కూడినది; మనోజ్ఞా, అంతఃప్రకాశినీ = మనోజ్ఞ

మైనది, అంతర్వికాసం కలది; స్మర-ఉద్రేకా = మన్మథ ఉద్రేకంకలది; స్నిగ్ధా భవేత్=స్నిగ్ధ(దృష్టి) అవుతుంది.

స్నిగ్ధ-ఆదిషునియుజ్యతే = స్నేహితులు లేదాస్నిగ్ధ (= ఆదరంకల) విషయాలు మొదలగు వాటి నిరూపణలో (ఈ దృష్టి) ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : సంతోషంతో అభిలాషతో కూడినది, మనోజ్ఞమైనది, లోలోపల వికసించినది, మన్మథోద్రేకం కలది 'స్నిగ్ధదృష్టి' అవుతుంది.

స్నిగ్ధాది విషయాలలో ఈ దృష్టి వినియోగపడుతుంది.

టీక : 'స్నిగ్ధదృష్టి'ని భరతాదులు రతిస్థాయిభావదృష్టిగా పేర్కొన్నారు. నిర్వచన శ్లోకాలు భిన్నంగా ఉన్నప్పటికీ ఇంచుమించుగా అర్థంలో సంవదిస్తున్నవి. ఈ దృష్టిలో ఒక కనుబొమ మాత్రమే ఉత్క్షిప్తమవుతుందని కీర్తిధరాదులు చెప్పినట్లు సంగీత రత్నాకరంలో చెప్పబడింది.

## 4. శృంగార దృష్టి

హర్షోత్పన్నప్రమోదోత్థా కామం కామవశంవదా।

శృంగారదృష్టిః కాంతానాం భ్రూక్షేపాపాంగసంభవా॥ 145

భవే న్మనోభవావిష్టకామినీవీక్షణాదిషు ।

అర్థం : హర్ష - ఉత్పన్న, ప్రమోదోత్థా = హర్ష (= సంతోషం), వలన పుట్టిన, సుఖవిశేషం కలిగినది; కామం, కామవశంవదా= మిక్కిలిగా, మన్మథవశమైనది; కాంతానాం భ్రూక్షేప-అపాంగ సంభవా = మనోహరలైన స్త్రీల, బొమముడుల వల్ల కటాక్షాలవల్ల కలిగినది; శృంగార దృష్టిః = 'శృంగార దృష్టి' (అవుతుంది).

మనోభవ-ఆవిష్ట, కామినీ, వీక్షణాదిషు = మన్మథావేశంతో ఉన్న, కామినులు, చూపులు మొదలగు వానియందు; భవేత్ = (శృంగార దృష్టి ఉపయుక్తం) అవుతుంది.

తాత్పర్యం : హర్షం తోడి ముఖంచేత కలిగినది, మిక్కిలిగా మన్మథవశమైనది, మనోహరలైన స్త్రీల భ్రూమముదులవల్ల, కటాక్షాల వల్ల ఏర్పడినది 'శృంగార దృష్టి' అవుతుంది.

మన్మథావిష్టులైన కామినుల చూపుల విషయంలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది భరతాదులు చెప్పిన 'శృంగార రసదృష్టి'. అన్నింటను అర్థాలు సంవదిస్తున్నవి. సంగీత రత్నాకరంలో కటాక్షనిర్వచనం ఇట్లా ఉంది.

"యద్గతాగత విశ్రాంతి వైచిత్ర్యేణ వివర్తనమ్।
తారకాయః కలాభిజ్ఞాస్తం కటాక్షం ప్రచక్షతే॥"

—తారకలను అటు ఇటు త్రిప్పటాన్ని, విచిత్ర పద్ధతిగా విలుకడ కలిగించటాన్ని కళాభిజ్ఞులు 'కటాక్షం' అంటారు.

## ౫. ఉల్లోకిత దృష్టి

ఉల్లోకితా పరిజ్ఞేయా ఊర్ధ్వభాగావలోకనమ్॥ 146
దర్శనే తుంగవస్తూనాం పూర్వజన్మని యుజ్యతే।

అర్థం : ఊర్ధ్వభాగ-అవలోకనమ్ = మీది భాగం (= పైకి) చూడటం ; ఉల్లోకితా, పరిజ్ఞేయా = 'ఉల్లోకిత (దృష్టి)' అని తెలియవలెను. తుంగవస్తూనాం, దర్శనే = ఎత్తుగా ఉన్న వస్తువులను, చూడటంలో; పూర్వజన్మని = పూర్వ జన్మ స్మరణలో; యుజ్యతే = (ఉల్లోకిత దృష్టి) తగును.

తాత్పర్యం : పైకి చూడటం 'ఉల్లోకిత దృష్టి' అవుతుంది.

ఎత్తుగా ఉన్న వస్తువులను చూడటంలో, పూర్వజన్మ స్మరణలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది, ఇంతకుముందు చెప్పిన ఉల్లోకిత దృష్టి సమానమే ; అచ్చట వినియోగం అధికంగా చెప్పబడింది.

## 6. అద్భుత దృష్టి

కించిత్ కుంచిత పక్ష్మాంతా విస్మయోత్క్షిప్తభ్రూలతా॥ 147

సవికాసా సమాదృష్టి రద్భుతేతి ప్రకీర్త్యతే।

ఏషా తు భావతత్త్వజ్ఞై రద్భుతాదిషు కీర్తితా॥ 148

అర్థం : కించిత్, కుంచిత, పక్ష్మాంతా = కొంచెంగా, వంచబడిన, రెప్పల కొనలతో; విస్మయ-ఉత్క్షిప్త, భ్రూలతా = ఆశ్చర్యంతో పైకి ఎత్తబడిన,కనుబొమలతో;సవికాసా, సమాదృష్టిః = వికాసంతో కూడుకొన్న (= ప్రకాశవంతమైన), సమదృష్టి; అద్భుతా, ఇతి. ప్రకీర్త్యతే = "అద్భుత (దృష్టి)" అని కీర్తింపబడుతున్నది.

ఏషా(తు) = ఈ (అద్భుత దృష్టి); అద్భుతాదిషు = ఆశ్చర్యం మొదలగు వానియందు (ప్రయుక్తమవుతుందని); భావతత్త్వజ్ఞైః, కీర్తితా = భావముల తత్త్వం తెలిసిన వారిచేత, కీర్తింపబడినది.

తాత్పర్యం : రెప్పల కొనలు కొంచెం వంచి, ఆశ్చర్యంవల్ల కను బొమలు పైకెత్తి, వికాసంతో చూచే సమదృష్టి 'అద్భుతదృష్టి' అవుతుంది.

ఆశ్చర్యం మొదలగు విషయములందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'అద్భుత' అనే రసదృష్టి; భరతుని నిర్వచనంతో ఇది సంవదిస్తున్నది.

## 7. కరుణ దృష్టి

విస్రస్తార్ధవికాసా స్యాదశ్రుమంథరతారకా।

నాసావలోకినీ దృష్టిః కరుణా కరుణే రసే॥ 149

అర్థం : విస్రస్తా, అర్ధవికాసా, అశ్రుమంథరతారకా, నాసావలోకినీ = దిగువకు వ్యాపించినది, సగం తెరువబడినది, కన్నీళ్ళతో

మెల్లగా తిరుగుతున్న తారకలు కలది, నాసాగ్రం మీద నిలిచినది; కరుణాదృష్టిః స్యాత్ = 'కరుణ దృష్టి', అవుతుంది.

కరుణేరసే = కరుణరసమందు (ఈ దృష్టి ప్రయుక్తమవు తుంది).

తాత్పర్యం : క్రిందకు వ్రాలి, సగం తెరువబడి, కన్నీళ్ళతో మెల్లగా తిరుగుతున్న తారకలు కలిగి, నాసాగ్రమందు నిలిచిన చూపు 'కరుణ దృష్టి' అవుతుంది.

ఇది కరుణరసమందు ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'కరుణ' అనే రసదృష్టి. భరతాదుల నిర్వచనంతో చాలావరకు సంవదిస్తున్నది.

## 8. విస్మయ దృష్టి

ఉద్ధతా రచనా ఉత్కర్షం సమా వికసితా తథా।
విస్పష్టపుటయుగ్మా చ విస్మయా విస్మయాదిషు ॥ 150

అర్థం : అత్యర్థం, ఉద్ధతా చనా = విక్కిలిగా, ఔద్ధత్యం (= నిక్కు) చూపేది; సమా, వికసితా (తథా) = సమంగా ఉన్నది, వికసించినది; విస్పష్ట పుటయుగ్మా (చ) = బాగా తెరువబడిన రెండు రెప్పలు కలది; విస్మయా = విస్మయ (దృష్టి అవుతుంది).

విస్మయాదిషు = (ఈ దృష్టి) విస్మయం ( = ఆశ్చర్యం) మొద లగు వాటియందు (ఉపయోగిస్తుంది).

తాత్పర్యం : ఎక్కువగా నిక్కును చూపేది, సమంగా ఉన్నది, వికసించినది, బాగుగా తెరిచిన రెండు రెప్పలు కలది 'విస్మయ దృష్టి' అవుతుంది.

ఇది విస్మయాదులందు ఉపయోగపడుతుంది.

టీక : ఇది 'విస్మిత' అనే స్థాయి భావదృష్టి. (విస్మయం

అద్భుతరసానికి స్థాయిభావం. 'ఉద్ధతరచనా ఽ త్యర్థం' అనే దానికి బదులు 'భృశ ముద్వృత్తతారాశ్చ' అని నాట్య శాస్త్రంలోనూ, 'ఉద్వృత్తతారకా' అని సంగీత రత్నాకరంలోనూ, ఉన్నది. 'మీదికి త్రిప్పబడిన తారకలు కలది' అనే ఈ అర్థమే సమంజసంగా ఉంది.

## 9. దృప్తదృష్టి

స్థిరా వికాసనహితా నిశ్చలీకృత తారకా ।
స్వసన్ని వేశినీ దృప్తా దృష్టి రుత్సాహగోచరా ॥ 151

అర్థం: స్థిరా, వికాసనహితా, నిశ్చలీకృతతారకా, స్వసన్నివేశినీ = నిలకడకలది, వికాసంతో కూడినది, చలించనితారకలు కలది, స్వస్థానమందు నిలిచినది; దృప్తాదృష్టిః = 'దృప్తదృష్టి' (అవుతుంది).

ఉత్సాహగోచరా = (ఈ దృష్టి) ఉత్సాహమందు గోచరిస్తుంది.

తాత్పర్యం : నిలుకడకలది, వికసించినది, నిశ్చలంగా ఉన్న తారకలు కలది, సహజ స్థానమందున్నది 'దృప్తదృష్టి' అవుతుంది.

ఇది ఉత్సాహమందు ప్రయుక్తమవుతుంది.

టీక : ఉత్సాహం వీరరసానికి స్థాయిభావం. ఈ స్థాయి భావ దృష్టినే భరతాదులు 'దృప్తదృష్టి' అన్నారు. "సత్త్వముద్గిరతీ" అన్నది వారు చెప్పిన ప్రధానలక్షణం. సంపద్విపదులందు వికారత్వం పొందటం సత్త్వం: దానిని విడనాడటం (అంటే — స్థైర్యం కలిగి ఉండటం) అని 'దృప్త' పదాన్ని సింహభూపాలుడు వ్యాఖ్యానించినాడు. 'తృప్త' ( = satisfaction) అని కుమారస్వామి స్వీకరించిన పాఠం సరికాదు.

## 10. విషణ్ణదృష్టి

విస్తారితపుటద్వంద్వా విస్రస్తాంతనిమేషకా ।
స్తబ్ధతారా మనాక్ దృష్టి ర్విషణ్ణేతి నిగద్యతే ॥ 152
విషాదేదైవ చింతాయాం దృష్టి రేషాప్రకీర్తితా ।

అర్థం : విస్తారిత, పుట ద్వంద్వా = విస్తరించిన, రెండు రెప్పలు కలది; విప్రస్త-అంతనిమేషణా = చివర జారిపోయిన రెప్పపాటు కలది;మనాక్ స్తబ్ధతారా = కొంచెంగా నిశ్చలమయిన తారకలుకలది; విషణ్ణా దృష్టిః, ఇతి, నిగద్యతే = 'విషణ్ణదృష్టి' అని, చెప్పబడు తున్నది.

ఏషాదృష్టిః = ఈ(విషణ్ణ) దృష్టి విషాదే(చ) (ఏవ), చింతా యాం = విషాదమునందు, చింతయందు; ప్రకీర్తితా = చెప్పబడినది.

తాత్పర్యం : విస్తరించిన రెప్పలు, తొలగిన రెప్పపాటు, కొంచెం నిశ్చలంగా ఉన్న తారకలు కలది 'విషణ్ణదృష్టి'.

విషాదమునందు, చింతయందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : 'విషాదిని' అని నాట్యశాస్త్ర బరోడా ముద్రణ పాఠం. ఇది 'సంచారి భావ దృష్టి'. 'విప్రస్తాంతని మేషణా' అనే దానికంటె సంగీతరత్నాకరాన్ని అనుసరించి 'విప్రస్తాంతా, నిమేషిణీ' అనేదే సరిఅయిన పాఠం కావాలి. 'తొలగిన కటాక్షాలు, రెప్పపాటు కలది' అని దీని అర్థం.

## 11. భయానక దృష్టి

> స్తబ్ధోద్వృత్తపుటాఽత్యర్థం చంచలా ఫుల్లతారకా ॥ 153
> భయానకా భవేత్ దృష్టి ర్భృశం భీతే భయానకే ।

అర్థం : స్తబ్ధ-ఉద్వృత్త, పుటా = చలనంలేని, మీదికి ఎత్త బడిన, కనురెప్పలు కలది; అత్యర్థం, చంచలా, ఫుల్ల తారకా = బాగా, చలించుతున్నది, వికసించిన తారకలు కలది; భయానకా, భవేత్ = భయానక (దృష్టి), అవుతుంది.

భృశంభీతే, భయానకే = ఈ (దృష్టి) మిక్కిలిగా భయపడ టంలో, భయానక రసంలో (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : చలనంలేని, మీదికి ఎత్తబడిన కనురెప్పలుకలది, బాగా చలించుతూ, వికసించిన తారకలు కలది 'భయానక దృష్టి' అవుతుంది.

మిక్కిలి భయపడటం, భయానకరసం-వీటి యందు ఈ దృష్టి ప్రయుక్తమవుతుంది

టీక : ఇది 'భయానక' అనే రసదృష్టి.

## 12. సాచీదృష్టి

సాచీదృష్టి రితి జ్ఞేయా అపాంగ చలనక్రమాత్ ॥ 154

ఇంగితాది ష్వియం ప్రోక్తా భరతాగమవేదిభిః ।

అర్థం : అపాంగ, చలన క్రమాత్ = కడకంటిచూపు, క్రమంగా చలించటంవల్ల ; సాచీదృష్టిః, ఇతి, జ్ఞేయా = 'సాచీదృష్టి' అని, తెలియదగినది.

ఇయం = ఇది ( = ఈ సాచీదృష్టి) ఇంగితాదిషు, ప్రోక్తా = ఇంగితం (=ఇష్టాన్ని) తెలపటం మొదలగు వాటియందు, చెప్పబడినది.

తాత్పర్యం : కడకంటి చూపు (=కటాక్షం)తో చూడటం 'సాచీదృష్టి' అవుతుంది. ఇష్టాన్ని తెలపటం మొదలగు వాటియందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన సాచీదృష్టి నిర్వచనంతో ఇది సంవదిస్తున్నది; అచ్చట వినియోగం అధికంగా చెప్పబడినది.

## 13. ద్రుతదృష్టి

తారాద్వయస్య చలనా ద్దుతదృష్టిరుదాహృతా ॥ 155

ఏతస్యా వినియోగస్తు సంభ్రమాదిషు కీర్తితా।

అర్థం: తారాద్వయస్య,చలనాత్ = రెండుతారకలు, చలించటం వల్ల ; ద్రుతదృష్టిః, ఉదాహృతా = 'ద్రుతదృష్టి' (అని) చెప్పబడినది.

వీతపాహ్యా. వినియోగః (తు)=ఈ దృష్టి యొక్క, విని యోగం; సంభ్రమాదిషు, కీర్తితా = సంభ్రమం మొదలగు వాటి యందు, కీర్తింపబడినది.

తాత్పర్యం : రెండు తారకలు చలించితే 'ద్రుతదృష్టి' అవుతుంది.

సంభ్రమం మొదలగు వాటియందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : దీనిని భరతముని పేర్కొనలేదు.

## 14. వీరదృష్టి

దీప్తా వికసితా ఫుల్లా మధ్యా గాంభీర్యశాలినీ ॥ 156
వీరా వీరరసే యోజ్యా అక్షుబ్ధా సమతారకా ।

అర్థం : దీప్తా, వికసితా, ఫుల్లా, మధ్యా, గాంభీర్యశాలినీ, అక్షుబ్ధా, సమతారకా = కాంతిమంతమైనది, తేటగా ఉన్నది, విప్ఫారినది, ఉగ్రమూ శాంతమూ కాక మధ్యస్థంగా ఉండేది, గంభీరంగా ఉండేది (= లోపలి అభిప్రాయం తెలియరానిది), కలకలేనిది, తారకలు సమంగా ఉన్నది; వీరా=వీర(దృష్టి అవుతుంది).

వీరరసే, యోజ్యా = (ఈ దృష్టి) వీరరసమునందు, తగినది.

తాత్పర్యం : దీప్తం, వికసితం, ఫుల్లం, మధ్యస్థం, గంభీరం, అక్షుబ్ధం, సమతారకం అయిన చూపు 'వీరదృష్టి' అవుతుంది.

ఇది వీరరసమందు ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'వీర' అనే రసదృష్టి.

## 15. రౌద్రదృష్టి

అస్నిగ్ధా లోహితా క్రూరా నిస్తబ్ధపుటతారకా ॥ 157
భ్రుకుటీకుటిలోద్వృత్తా రౌద్రా రౌద్రే దృగుచ్యతే।

అర్థం : అస్నిగ్ధా, లోహితా, క్రూరా, నిస్తబ్ధపుటతారకా,

భ్రుకుటీకుటిలా, ఉద్వృత్తా=స్నిగ్ధం కానిది (=ప్రేమలేనిది), ఎర్ర నైనది, క్రూరమైనది, చలించని కనురెప్పలు తారకలు కలది, బొమముడి వంకరైనది, మీదకు ఎత్తబడినది; రౌద్రా దృక్, ఉచ్యతే='రౌద్ర దృష్టి' అని చెప్పబడుతున్నది.

రౌద్రే=(ఈ దృష్టి) రౌద్ర (రస) మందు (తగును).

తాత్పర్యం : ప్రేమలేనిది, ఎర్రగా ఉన్నది, క్రూరమైనది, చలించని రెప్పలు తారకలు కలది, వంకరగా మీదకు ఎత్తబడిన బొమముడి కలది, 'రౌద్రదృష్టి' అవుతుంది.

ఇది రౌద్రరసంలో వినియోగపడుతుంది.

టీక : ఇది రౌద్రరసదృష్టి. భరతాదులు దీనిని 'రౌద్రి అన్నారు.

## 16. దూరదృష్టి

కించిదూర్ధ్వవికాసేన దూరదృష్టి రుదాహృతా ॥ 158

దూరావలోకనే ప్రోక్తా భావశాస్త్రవిచక్షణైః ।

అర్థం : కించిత్, ఊర్ధ్వవికాసేన=కొంచెం మీదకు తెరవ బడటంచేత; దూరదృష్టిః, ఉదాహృతా='దూరదృష్టి', చెప్ప బడింది.

(ఈ దృష్టి)—భావశాస్త్ర, విచక్షణైః=భావముల విధానం, తెలిసినవారిచేత; దూర-అవలోకనే, ప్రోక్తా=దూరంగా ఉన్న వారిని లేదా వాటిని చూడటంలో, చెప్పబడినది.

తాత్పర్యం : కొంచెం మీదకు తెరువబడిన చూపు 'దూర దృష్టి'.

దూరమందున్న వా(రి)టిని చూడటంలో ఇది వినియోగ పడుతుంది.

టీక : దీనిని భరతముని పేర్కొనలేదు.

## 17. ఇంగితదృష్టి

సహర్షేంగితదృష్టిః స్యాత్ కటాక్షచలన క్రమాత్ ॥ 159

ఇంగితాదిష్వియం భావవేత్తృభిః సముదాహృతా।

అర్థం : సహర్షా = హర్షంతో కూడినది; కటాక్ష, చలన క్రమాత్ = కటాక్షం, క్రమంగా చలించటంవల్ల; ఇంగిత దృష్టిః, స్యాత్ = 'ఇంగిత దృష్టి' అవుతుంది.

ఇయం = ఇది (= ఈ ఇంగిత దృష్టి); భావవేత్తృభిః = భావములు తెలిసిన వారి చేత; ఇంగితాదిషు = ఇంగితం (= అభిప్రాయం తెలుపటం) మొదలైన వాటి యందు; సముదాహృతా = చెప్పబడినది.

తాత్పర్యం : హర్షంతో కూడిన కడకంటిచూపులు క్రమంగా చలించటం 'ఇంగిత దృష్టి' అవుతుంది.

ఇది ఇంగితం మొదలైన వాటి యందు ప్రయుక్తమవుతుంది.

టీక : 'ఇంగితం' అనగా మనస్సులోని భావం. దానిని తెలిపే చేష్టకూడ ఇంగితమే అవుతుంది. ఈ దృష్టినికూడ భరతముని చెప్పలేదు.

## 18. విలోకిత దృష్టి

వీక్షణం పృష్ఠభాగే యత్తద్విలోకిత ముచ్యతే ॥ 160

ఇయం దృష్టి ర్భవేత్ పశ్చాద్దేశ వృత్త్యవలోకనే।

అర్థం ; పృష్ఠభాగే, వీక్షణం, యత్ = వెనుక భాగమందు, చూడటం, ఏదో; తత్, విలోకితం, ఉచ్యతే = అది, 'విలోకిత (దృష్టి)' (అని) చెప్పబడుతున్నది.

ఇయం, దృష్టిః = ఈ దృష్టి;పశ్చాత్-దేశ వృత్తి-అవలోకనే=

వెనుక భాగమునందున్న వాటిని లేదా కదలికలను చూడటంలో (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : వెనుకకు చూడటం 'విలోకిత దృష్టి' అవుతుంది.

వెనుక భాగమందున్న వాటిని చూడటంలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : భరతాదులు ఈ దృష్టిని చెప్పలేదు.

## 19. వితర్కిత దృష్టి

వికాసితోద్వృత్తపుటా తథైవోత్ఫుల్లతారకా ॥ 161

త్రాసితా సమతారా చ దృష్టి ర్జేయా వితర్కితా ।

ఏషా తు భావశాస్త్రజ్ఞై రూహాదిషు నియుజ్యతే ॥ 162

అర్థం : వికాసితా, ఉద్వృత్త పుటా, (తథా) (ఏవ) ఉత్ఫుల్ల తారకా, త్రాసితా, సమతారా (చ) = తేటగా ఉన్నది, మీదకు ఎత్తబడిన కనురెప్పలు కలది, విరిసిన తారకలు కలది, కొంచెంగా భయపడినది, తారకలు స్థిరంగా ఉన్నది ; వితర్కితా దృష్టిః, జ్ఞేయా = 'వితర్కిత దృష్టి' (అని) తెలియదగినది.

ఏషా (తు) = ఇది; భావశాస్త్రజ్ఞైః = భావముల విధి తెలిసిన వారిచేత ; ఊహాదిషు నియుజ్యతే = ఊహించటం మొదలగు వాటి యందు ఉపయోగించబడుతున్నది.

తాత్పర్యం : వికసించినది, మీదకు ఎత్తబడిన కనురెప్పలు కలది, విరిసిన తారకలు కలది, కొంచెంగా భయపడినట్లున్నది, సమ తారకలు కలది 'వితర్కిత దృష్టి' అవుతుంది.

ఊహించటం మొదలగు వాటి యందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'వితర్కిత' అనే సంచారిభావదృష్టి. భరతాదులు 'క్రిందికి చూచుట' ను ఒక లక్షణంగా చెప్పినారు.

## 20. శంకిత దృష్టి

కించిత్ చలా స్థిరా కించి దున్నతా తిర్యగాయతా ।

గూఢా చకితతారా చ శంకితా దృష్టి రుచ్యతే ॥ 163

శంకాదిషు ప్రయోక్తవ్యా ప్రోక్తా నాట్యవిశారదైః ।

అర్థం : కించిత్‌చలా, కించిత్ స్థిరా = కొంచెం చలనం కలది, కొంచెం నిలుకడగలది ; తిర్యగాయతా = మీదకు చూచేది, అడ్డంగా తిరిగినది ; గూఢా, చకిత తారా (చ) = మరుగువడేది, బెదురు తున్న తారకలు కలది ; శంకితా దృష్టిః, ఉచ్యతే = 'శంకిత దృష్టి' (అని), చెప్పబడుతున్నది.

(ఈ దృష్టి) శంక ఆదిషు, ప్రయోక్తవ్యా = శంక మొదలగు వాటియందు, ప్రయోగింపదగినది (అని); నాట్య విశారదైః, ప్రోక్తా = నాట్యవేత్తలచేత, చెప్పబడినది.

తాత్పర్యం : కొంచెం చలనం కొంచెం నిలుకడ కలది, మీదకూ అడ్డంగానూ చూచేది, మరుగుపడేది, బెదరే తారకలు కలది 'శంకిత దృష్టి' అవుతుంది.

శంక మొదలగు వాటి యందు ఇది ప్రయోగింపదగినది.

టీక : ఇది 'శంకిత' అనే సంచారిభావదృష్టి.

## 21. అభితప్త దృష్టి

పుటప్రచలనం యత్ర తారకే దర్శనాలసే ॥ 164

అభితప్తా భవేత్ దృష్టిః నిర్వేద ప్రముఖే ష్వియమ్ ।

అర్థం : యత్ర = ఎక్కడ ; పుట ప్రచలనం = రెప్పల కద లిక (ఉంటుందో) ; దర్శన-అలసే తారకే = దర్శనాలసములగు తార

కలు (ఉన్నవో అక్కడ అది); అభితప్తా దృష్టిః, భవేత్ 'అభితప్త దృష్టి', అవుతుంది.

ఇయమ్ = ఇది; నిర్వేద ప్రముఖేషు = నిర్వేదం మొదలగు వాటియందు (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : రెప్పల కదలికలు, అలసిపోయిన తారకలు కలిది 'అభితప్త దృష్టి'.

నిర్వేదం మొదలగు వాటి యందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'అభితప్త' అనే సంచారి భావదృష్టి. సంగీతరత్నాకరంలో వినియోగమునందు నిర్వేదంతో పాటు అభిఘాతం (= కొట్టటం), ఉపతాపం (= రోగం) కూడ చెప్పబడినవి.

## 22. అవలోకిత దృష్టి

**అధస్తాత్ దర్శనం యత్తదవలోకిత ముచ్యతే ॥ 165**

**వినియోగో భవేదస్యా విచార పతనాదిషు ।**

అర్థం : యత్, దర్శనం = ఏ, చూపు ; అధస్తాత్ = క్రిందుగా ఉండునో; తత్ = అది (= ఆ చూపు); అవలోకితం, ఉచ్యతే = 'అవలోకిత దృష్టి', (అని) చెప్పబడుతున్నది.

అస్యా, వినియోగః = దీని యొక్క, వినియోగం ; విచార, పతనాదిషు = విచారం (= ఆలోచన), పతనం — వీటియందు (అవుతుంది).

తాత్పర్యం : క్రిందిచూపు 'అవలోకిత దృష్టి'.

విచారం, పతనం — వీటి యందు ఇది వినియోగపడుతుంది.

టీక: ఇంతకుముందు చెప్పిన 'అవలోకిత దృష్టి', ఇది ఒక్కటే. అచ్చట వినియోగ మధికంగా చెప్పబడినది.

## 23. శూన్య దృష్టి

సమతారా పుటా బాహ్యే విష్కంపా శూన్యదర్శనా ॥ 166

బాహ్యార్థాగ్రహణే చేయం శూన్యదృష్టి రుదాహృతా ।

అర్థం : సమతారా, పుటా = సమంగా ఉన్న తారకలు, కను రెప్పలు కలది ; బాహ్యే = వెలుపలికి ప్రసరించినది ; విష్కంపా = చలనం లేనిది (అయిన చూపు) ; శూన్యదర్శనా = 'శూన్య దృష్టి' అవుతుంది.

ఇయం, శూన్య దృష్టిః = ఈ, శూన్య దృష్టి; బాహ్యార్థ = అగ్రహణే (చ) = బాహ్యార్థములను (= ఎదురుగా ఉన్న వాటిని) గ్రహించలేని స్థితియందు ; ఉదాహృతా = చెప్పబడినది.

తాత్పర్యం : సమంగా ఉన్న తారకలు కనురెప్పలు కలది, చలనంలేనిది 'శూన్య దృష్టి' అవుతుంది.

ఎదురుగా ఉన్న వాటిని గ్రహించలేని స్థితిని ఇది వ్యక్తం చేస్తుంది.

టీక : ఇది 'శూన్య' అనే సంచారిభావదృష్టి.

## 24. హృష్ట దృష్టి

చంచలా దృశ్యతే యా తు రుచిరా చ నిమేషభాక్ ॥ 167

ఈషత్ సంకోచితా దృష్టిః హృష్టా హాసే ప్రయుజ్యతే ।

అర్థం : యా (తు) = ఏది ; చంచలా, రుచిరా (చ), నిమేషభాక్, ఈషత్ సంకోచితా = చలించుతున్నది, మనోహరమైనది, రెప్పపాటుకలది, కొంచెంగా ముడుచుకొన్నది (అవుతుందో అది), హృష్టా దృష్టిః = 'హృష్ట దృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి)-హాసే, ప్రయుజ్యతే = హాసమునందు, ప్రయుక్తమవుతుంది.

తాత్పర్యం : చలించుతున్నది, అందంగా ఉన్నది, రెప్పపాటు కలది, కొంచెం ముడుచుకొన్నది అయిన చూపు 'హృష్ట దృష్టి' అవుతుంది.

ఇది హాసమునందు ప్రయోగింపబడుతుంది.

టీక : ఇది భరతాదులు చెప్పిన 'హృష్ట' అనే స్థాయి భావ దృష్టిని పోలి ఉంది. చూపులో హాసం వ్యక్తం కావలెనని వారు చెప్పినారు.

## 25. ఉగ్ర దృష్టి

సమ్యగ్వికసితా కించిదపాంగద్వయశోణిమా ॥ 168

ఉగ్రదృష్టిః సమాఖ్యాతా ఉగ్రాదిషు నియుజ్యతే ।

అర్థం : సమ్యక్, వికసితా = బాగుగా, వికసించినది ; కించిత్, అపాంగద్వయ శోణిమా = కొంచెంగా, రెండు కనుకొనలందును ఎరుపుకలది; ఉగ్ర దృష్టిః, సమాఖ్యాతా = 'ఉగ్ర దృష్టి' (అని), చెప్పబడినది.

(ఈ దృష్టి) — ఉగ్రాదిషు నియుజ్యతే=ఉగ్రత్వం (= భయంకరం) మొదలైన వాటియందు ఉపయుక్తమవుతున్నది.

తాత్పర్యం : బాగుగా వికసించిన కనురెప్పలు, ఎర్రబడిన రెండు కంటి కొనలు కలది ఉగ్ర దృష్టి అవుతుంది.

ఇది ఉగ్రత్వం మొదలగు వాటి యందు ప్రయుక్తమవుతుంది.

టీక : దీనిని భరతాదులు పేర్కొనలేదు.

## 26. విభ్రాంత దృష్టి

చలత్తారా చ విభ్రాంతా దృష్టి ర్విస్రంబదర్శనా ॥ 169

మధ్యే చ వికలోత్ఫుల్లా విభ్రాంతా సంభ్రమాదిషు ।

అర్థం : చలత్, తారా (చ) = చలిస్తున్న, తారకలు కలది ; విభ్రాంతా = భ్రమించుతున్నది (= తిరుగుతున్నది); విస్రంభ దర్శనా = ప్రీతికరమైన చూపుకలది ; మధ్యే (చ) వికలా, ఉత్ఫుల్లా = నడుమ నడుమ వెలవెలపాటు, (మరల) తేటదనం కలది ; విభ్రాంతా = 'విభ్రాంత దృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) — సంభ్రమాదిషు = సంభ్రమం (= తొట్రుపాటు) మొదలగు వాటిలో (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : చలిస్తున్న తారకలు కలది, ప్రీతికరమైనది, నడుమ నడుమ వెలవెలపాటు మరల తేటదనంకలది 'విభ్రాంత దృష్టి' అవుతుంది.

ఇది సంభ్రమం మొదలగు వాటి యందు ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'విభ్రాంత' అనే సంచారి భావదృష్టి. ఈ చూపులో ఆకులపాటు ప్రధానం.

## 27. కాంత దృష్టి

క్రమమాణపుటా స్నా కించిచ్చంచలలోచనా ॥ 170

చలత్తారా కృతాపాంగా దృష్టిః కాంతా శమాదిషు ।

అర్థం : క్రమమాణపుటా = కదులుతున్న పడుతున్న వాలుతున్న కనుబొమలు కలిగినది ; స్నా = క్షీణించినది ; కించిత్, చంచలలోచనా = కొంచెంగా, చలిస్తున్న కనులు (= చూపులు) కలది ; చలత్ తారా = చలిస్తున్న తారకలు కలది ; కృతాపాంగా = అపాంగంగా చేయబడినది (= కడకంటి చూపులు కలది) ; కాంతా దృష్టిః = 'కాంత దృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) శమాదిషు = శమం మొదలగు వాటియందు (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : క్రమమూణమవుతున్న పుటలు, కొంచెంగా చలిస్తున్న కనులు, చలించుతున్నవి కడకన్నులను చేరినవి అయిన తారకలు కలది 'శాంత దృష్టి' అవుతుంది.

శమ. మొదలగు వాటి యందు ఇది వినియోగపడుతుంది.

టీక : ఇది రస దృష్టి. 'శాంత దృష్టి' నిర్వచనం నాట్యశాస్త్రమందు కుండలీకరణ మందున్నది; ఆ నిర్వచనం దీనితో భేదిస్తున్నది. భరతముని అష్ట (= ఎనిమిది) రసాలనే వివరించినాడు. తరువాతి వారు శాంతాన్ని తొమ్మిదవ రసంగా చేర్చారు. అప్పటి నుంచీ రసాలు తొమ్మిది ( = నవరసాలు) అయినవి. కాగా, 'శాంతరస దృష్టి'ని అర్వాచీనులు పేర్కొన్నారు.

## 28. (ని) మీలిత దృష్టి

దృష్టే రర్ధవికాసేన మీలితా దృష్టి రీరితా ॥ 171
పారవశ్యాదిభావేషు ప్రయోక్తవ్యా నిమీలితా ।

అర్థం : దృష్టేః = దృష్టి యొక్క; అర్ధ వికాసేన = సగం తెరువబడటంచేత (= సగం తెరువబడిన చూపు); మీలితా దృష్టిః, ఈరితా = 'మీలితా దృష్టి' అని, చెప్పబడింది.

నిమీలితా = నిమీలిత (దృష్టి); పారవశ్యాది భావేషు = పరవశత్వం మొదలగు భావములందు; ప్రయోక్తవ్యా = ప్రయోగింపదగినది.

తాత్పర్యం : సగం తెరువబడిన చూపు' (ని) మీలితదృష్టి; పరవశత్వం మొదలగు భావములందు దీని వినియోగం.

టీక : ఇది ఇంతకు ముందు చెప్పిన నిమీలిత దృష్టియే. అచ్చట వినియోగ మధికంగా చెప్పబడింది. మొదటి పాదంలో 'మీలితా' అని ఉండగా, రెండవ పాదంలో 'నిమీలితా' అని ఉంది; అంటే రెండు విధాలుగా కూడా ఈ దృష్టి ప్రసిద్ధమన్న మాట.

## 29. సూచనా దృష్టి :

**హస్తాభియోగచలనాత్ కించిత్ ముకుళితాకృతిః ॥ 172**

**సూచనాదృష్టి రాఖ్యాతా సూచనాదిషు యుజ్యతే ।**

అర్థం : హస్త - అభియోగ చలనాత్ = చేతి సైగను అనుసరించి ; కించిత్, ముకుళిత - ఆకృతిః = కొంచెంగా, మూయ బడిన రూపం కలది ; సూచనా దృష్టిః = 'సూచనాదృష్టి' (అవుతుంది అని) ; ఆఖ్యాతా = చెప్పబడింది.

(ఈ దృష్టి) సూచనాదిషు = సూచన చేయటం మొదలగు వాటియందు ; యుజ్యతే = తగును.

తాత్పర్యం : చేతిసైగను అనుసరిస్తూ కొంచెం మూయబడిన కనులుకలది 'సూచనా దృష్టి' అవుతుంది.

సూచన చేయటం మొదలగు వాటి యందు ఇది వినియోగ పడుతుంది.

టీక : భరతాదులు దీనిని పేర్కొనలేదు.

## 30. లజ్జితా దృష్టి

**పతితోర్ధ్వపుటా వ్రీడాభరతః చ్యుతతారకా ॥ 173**

**కించిత్ కుంచితపక్ష్మాగ్రా లజ్జితా లజ్జితాదిషు ।**

అర్థం : వ్రీడా భరతః = వ్రీడా (= సిగ్గు) భారంచేత ; పతిత - ఊర్ధ్వపుటా = క్రిందకు వ్రాలిన మీది రెప్పలు కలది ; చ్యుతతారకా = క్రిందికి వ్రాలిన తారకలు కలది ; కించిత్, కుంచిత, పక్ష్మాగ్రా = కొంచెంగా, ముడుచుకొన్న, రెప్పల కొనలుకలది ; లజ్జితా = 'లజ్జిత దృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) లజ్జితాదిషు = సిగ్గుపడటం మొదలైన వాటి యందు (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : సిగ్గుచేత క్రిందకు వ్రాలిన మీది రెప్పలు తారకలు కలది, కొంచెంగా ముడుచుకొన్న రెప్పల కొనలు కలది 'లజ్జిత దృష్టి' అవుతుంది.

సిగ్గుపడటం మొదలగు వాటి యందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది భరతాదులు చెప్పిన 'లజ్జాన్విత' అనే సంచారి భావదృష్టితో సంవదిస్తున్నది.

## 31. మలిన దృష్టి

**మలినాంతా చలత్పక్ష్మా కించిన్ముకుళితాకృతిః ॥** 174

**అక్షిభ్యాం కృష్టతారా దృఙ్మనా దృశ్యతే స్త్రియామ్ ।**

అర్థం : మలిన - అంతా = నల్లని కనుల కొనలు కలది ; **చలత్ పక్ష్మా** = చంచలములైన రెప్పలు కలది ; ముకుళిత - ఆకృతిః = కొంచెంగా ముడుచుకొన్న రూపం కలది ; అక్షిభ్యాం, కృష్ట తారా = కనులచేత, ఆకర్షించబడిన తారకలు కలది; మలినాదృక్ = 'మలినదృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) స్త్రియాం దృశ్యతే = స్త్రీలయందు కనబడుతున్నది.

తాత్పర్యం : నల్లని కనుల కొనలు చంచలములైన రెప్పలు కలది, కొంచెంగా ముడుచుకొన్నది, కనులలోనికి ఆకర్షించబడిన తారకలు కలది 'మలినదృష్టి' అవుతుంది.

ఇది స్త్రీలయందు కన్పడుతుంది.

టీక : ఇది 'మలిన' అనే సంచారిభావదృష్టి. ఇది స్త్రీల విహృతమందు వినియోగపడుతుందని సంగీతరత్నాకరకారుడు పేర్కొన్నాడు. ప్రియునితో చక్కగా సంలాపం చేయవలసిన సమయమందు కూడా అసంలాపం (= అసంబద్ధ ప్రలాపం) చేయటం 'విహృత' మనబడుతుంది.

## 32. త్రస్త దృష్టి

అంతర్వికసితా పూర్వం పశ్చాద్విరళతారకా ॥ 175

త్రస్తా త్రాసే మదే దృష్టిః సమోద్వృత్తపుటద్వయా ।

అర్థం : పూర్వం=తొలుత ; అంతః - వికసితా =లోపల వికసించినది ; పశ్చాత్ =పిమ్మట ; విరళతారకా =చలిస్తున్న తారకలు కలది ; సమ-ఉద్వృత్త పుటద్వయా =సమంగా, మీదకు ఎత్తబడిన, రెండు రెప్పలు కలది ; త్రస్తా దృష్టిః='త్రస్త దృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) త్రాసే,మదే=త్రాసం (=బెదరటం),మదం — వీటిని ప్రదర్శించటంలో ప్రయుక్తమవుతుంది.

తాత్పర్యం : తొలుత లోలోపల వికసించినదై తరువాత బాగుగా చలిస్తున్న తారకలు కలది, సమంగా మీదకు ఎత్తబడిన రెండు కనురెప్పలు కలది 'త్రస్త దృష్టి' అవుతుంది.

ఇది బెదరటం, మత్తుగా ఉండటం - వీటియందు ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'త్రస్త' అనే సంచారిభావదృష్టి.

## 33. మ్లాన దృష్టి

శిథిలా చార్ధచలనాత్ క్రమా న్నిర్భుగ్నతారకా ॥ 176

పక్ష్మాగ్రభ్రూపుటా మ్లానా యోజ్యా మ్లానాదికేష్వియమ్ ।

అర్థం : శిథిలా (చ)=సడలినది ; అర్ధచలనాత్ =సగం (=కొంచెం) కదలికతో ; క్రమాత్ =క్రమంగా ; నిర్భుగ్న తారకా, పక్ష్మాగ్రభ్రూపుటా =సోలుతున్న తారకలు ; రెప్పల మీది వెంట్రుకలు, కనుబొమలు, కనురెప్పలు కలది ; మ్లానా= 'మ్లాన దృష్టి' (అవుతుంది).

ఇయమ్ = ఇది ; మ్లానాదికేషు = మ్లానం (= వాడినది) మొదలగు వాటియందు ; యోజ్యా = ప్రయోగింపదగినది.

తాత్పర్యం : శిథిలమై సగం కదలికతో క్రమంగా సోలు తున్న తారకలు, రెప్పల మీది వెంట్రుకలు, కనుబొమలు కలది 'మ్లాన దృష్టి' అవుతుంది.

మ్లానం మొదలగు వాటి యందిది ప్రయుక్తమవుతుంది.

టీక : దీనిని భరతాదులు పేర్కొనలేదు.

## 34. ముకుళ దృష్టి

స్ఫురదాసక్త పక్ష్మాగ్రా సౌమ్యా మిళితతారకా ॥ 177

మీలితోర్ధ్వపుటా దృష్టి రానందే ముకుళా భవేత్ ।

అర్థం : స్ఫురత్ - ఆసక్త, పక్ష్మాగ్రా = కదలుతూ, దగ్గరగా కలసి ఉన్న రెప్పల మీది వెంట్రుకలు కలది ; సౌమ్యా = సౌమ్యంగా ఉన్నది; మిళిత తారకా = కలిసిపోయిన (= కనిపించని) తారకలు కలది ; మీలిత - ఊర్ధ్వపుటా = మూయబడిన, పై రెప్పలు కలది - ముకుళా దృష్టిః భవేత్ = 'ముకుళ దృష్టి' అవుతుంది.

(ఈ దృష్టి) ఆనందే = ఆనందము నందు (వినియోగ పడుతుంది).

తాత్పర్యం : కదులుతూ దగ్గరగా కలిసి ఉన్న రెప్పల మీది వెంట్రుకలు కలది, సౌమ్యంగా ఉన్నది, తారకలు కనిపించనిది, పై రెప్పలు మూయబడినది 'ముకుళ దృష్టి' అవుతుంది.

టీక : ఇది 'ముకుల' లేదా 'ముకుళ' అనే సంచారి భావ దృష్టి (ముకుళం = మొగ్గ).

## ౩౮. కుంచిత దృష్టి

కించిత్ కుంచిత పక్ష్మాగ్ర పుటా ఉ త్వర్థంనికుంచితా ॥ 178

తారాభ్యాం కుంచితా దృష్టి రసూయావిష్టతాదిషు ।

అర్థం : కించిత్, కుంచిత, పక్ష్మాగ్రపుటా = కొంచెంగా, వ్రాలిన, వెంట్రుకల కొనలతోడి రెప్పలు కలది; తారాభ్యాం, అత్యర్థం, నికుంచితా = తారకలు, బాగా, వ్రాలినది; కుంచితా దృష్టిః = 'కుంచిత దృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) అసూయ - అనిష్టత - అదిషు = అసూయ, ఇష్టం లేక పోవటం మొదలగు వాటియందు (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : కొంచె గా వ్రాలిన వెంట్రుకల కొనలుగల కనురెప్పలు, బాగుగా క్రిందకు వ్రాలిన తారకలు కలది 'కుంచిత దృష్టి' అవుతుంది.

అసూయ, ఇష్టం లేకపోవటం మొదలగు వాటియందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'కుంచిత' అనే సంచారి భావదృష్టి.

## ౩౯. ఆకాశ దృష్టి

ఆకాశదృష్టి రాకాసే బహువ్యావృత తారకా ॥ 179

ఏషా ప్యా ఉఉ కాశ సంచారి వస్త్వాదిషు నియుజ్యతే ।

అర్థం : ఆకాశే = ఆకాశమునందు; బహువ్యావృతతారాకా = బాగా ప్రసరింప చేయబడిన తారకలు కలది; ఆకాశ దృష్టిః = 'ఆకాశదృష్టి' (అవుతుంది).

ఏషా (అపి) = ఇది; ఆకాశ సంచారి వస్తు - ఆదిషు = ఆకాశము వందు సంచరించే వస్తువులు మొదలగు వాటియందు; నియుజ్యతే = వినియోగించబడుతుంది.

తాత్పర్యం : ఆకాశం వైపు ప్రసరించిన - తారకలతో ఆకాశం వైపు నిలిపిన చూపు 'ఆకాశ దృష్టి'.

ఆకాశము నందు సంచరించే వస్తువులు మొదలగు వాటి యందు ఇది వినియోగపడుతుంది

టీక : దీనిని భరతాదులు పేర్కొనలేదు.

## 37. అర్ధముకుళ దృష్టి

నస్మితా చ భవేత్తారా కించి దున్మిషితౌపుటౌ ॥ 180

స్యా దర్ధముకుళా దృష్టి ర్వానందాహ్లాదగోచరా ।

అర్థం : నస్మితా (చ) తారా = చిరునవ్వుతో కూడిన తారకలు ; కించిత్ - ఉన్మిషితౌపుటౌ = కొంచెంగా వికసించిన పుటలు కలది ; అర్ధముకుళా దృష్టిః భవేత్ = 'అర్ధముకుళ దృష్టి' అవుతుంది.

(ఈ దృష్టి) ఆనంద - ఆహ్లాదగోచరా, స్యాత్ = ఆనందం, ఆహ్లాదం - వీటి విషయంలో కన్పడుతుంది.

తాత్పర్యం : చిరునవ్వు చిందిస్తూ, కొంచెంగా వికసించిన పుటలు కలది 'అర్ధముకుళ దృష్టి'.

ఆనందం, ఆహ్లాదం - వీటియందు ఇది వినియోగపడుతుంది.

టీక : ఇది 'అర్ధముకుళ' అనే సంచారిభావదృష్టి (అర్ధముకుళం = సగం విరిసిన మొగ్గ).

## 38. అనువృత్త దృష్టి

అనువృత్తా యదుక్తం తత్ భూయో భూయో నిరీక్షణం ॥ 181

త్వరాదిషు ప్రయోక్తవ్యా కలితా భావకోవిదైః ।

అర్థం : యత్ = ఏది ; భూయోభూయో, నిరీక్షణం = మాటిమాటికి చూడటమో ; తత్ = అది (= ఆ చూపు) ; అనువృత్తా, ఉక్తం = 'అనువృత్త (దృష్టి)' (అని), చెప్పబడింది.

(ఈ దృష్టి) భావకోవిదైః = భావముల విధి తెలిసిన వారి చేత ; త్వరాదిషు = తొందర పాటు మొదలగు వాటియందు ; ప్రయో క్తవ్యా = ప్రయోగింపదగినది (అని) ; కలితా = సమ్మతింప బడినది.

తాత్పర్యం : మాటిమాటికి చూడటం 'అనువృ త్త దృష్టి'. ఇది తొందరపాటు మొదలగు వాటి యందు ప్రయు క్త మవుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పబడిన 'అనువృ త్త దృష్టి'తో ఇది సంవది స్తున్న ది.

## 39. విప్లుత దృష్టి

స్ఫురితోత్ఫుల్లపతితపుటా దృక్ విప్లుతా భవేత్ ॥ 182
ఏషా తు సర్వ వస్తూనాం సౌందర్యాద్యవలోకనే ।

అర్థం : స్ఫురిత - ఉత్ఫుల్ల - పతిత పుటా = అదురుతూ, వికసించినదై, వ్రాలిన రెప్పలు కలది ; విప్లుతా, భవేత్ = 'విప్లుత (దృష్టి)', అవుతుంది.

ఏషా (తు) = ఇది; సర్వవస్తూనాం = అన్ని వస్తువులయొక్క; సౌందర్య - ఆది - అవలోకనే = సౌందర్యం మొదలగు వాటిని చూడటంలో (ప్రయు క్తమవుతుంది).

తాత్పర్యం : అదురుతూ, వికసించినదై, వ్రాలిన రెప్పలు కలది 'విప్లుత దృష్టి' (అవుతుంది).

అన్ని వస్తువులలో సౌందర్యం మున్నగువాటిని చూడటం లేదా భావించటంలో ఇది ప్రయు క్తమవుతుంది.

టీక : ఇది 'విప్లుత' అనే సంచారిభావదృష్టి. నిర్వచనాలు సంవదిస్తున్నప్పటికీ ఇది ఆవేగ- సంభ్రమ- విభ్రమములందు ప్రయు క్తమవుతుందని నాట్యశాస్త్రంలోనూ, ఆ ర్తి-దుఃఖ-ఉన్మాద-

చాపల్యములందు ప్రయోజ్యమగునని సంగీత రత్నాకరంలోనూ పేర్కొనబడింది.

## 40. జిహ్మ దృష్టి

ఆకుంచితపుటా గూఢతిర్యఙ్మంథరలోకినీ ॥ 183

జిహ్మాదృ గ్గూఢతారా స్యా ద్గూఢార్థాదిషు యుజ్యతే ।

అర్థం : ఆకుంచితపుటా = బాగుగా కుంచితాలైన రెప్పలు కలది; గూఢ-తిర్యక్-మంథరలోకినీ = పైకి తెలియకుండా, అడ్డంగా, మెల్లగా, చూచేది; గూఢతారా = కనిపించని తారకలు కలది· జిహ్మా దృక్, స్యాత్ = 'జిహ్మాదృష్టి' అవుతుంది.

(ఈ దృష్టి) — గూఢ-అర్థాదిషు = గూఢములైన అర్థములు మొదలగు వాటియందు; యుజ్యతే = తగును.

తాత్పర్యం : బాగుగా కుంచితాలైన రెప్పలు కలది, పైకి కనిపించకయే అడ్డంగా మెల్లగా చూచేది, తారకలు కనిపించనిది 'జిహ్మాదృష్టి' అవుతుంది.

ఇది గూఢములైన అర్థములు మొదలగు వాటియందు వినియోగపడుతుంది.

టీక : ఇది 'జిహ్మా' అనే సంచారిభావ దృష్టి. అసూయా-జడత- ఆలస్యములందు కూడ ఇది వినియోగపడుతుందని నాట్యశాస్త్ర- సంగీత రత్నాకరములు పేర్కొన్నవి.

## 41. వికోశ దృష్టి

అనిమేషా చలత్తారా వ్యాకోచితపుటద్వయా ॥ 184

వికోశాఖ్యా భవే ద్దృష్టిః హర్షాదిషు నియుజ్యతే ।

అర్థం : అనిమేషా = రెప్పపాటులేనిది; చలత్ తారా = చలించుతున్న తారలు కలది; వ్యాకోచిత పుటద్వయా = వ్యాపించిన రెండు రెప్పలు కలది; వికోశ- ఆఖ్యా, దృష్టిః, భవేత్ = 'వికోశం' అనే పేరు గల, దృష్టి, అవుతుంది.

(ఈ దృష్టి)— హర్షాదిషు — సంతోషం మొదలగువాటి యందు (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : రెప్పపాటులేనిది, చలించుతున్న లేదా నిలుకడ లేని తారకలు వ్యాపించిన రెప్పలు కలది 'వికోశ దృష్టి' అవుతుంది.

ఇది సంతోషం మొదలగువాటియందు ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'వికోశ' అనే సంచారిభావదృష్టి.

## [illegible] మదిర దృష్టి

**అంచితా మార్గితా మధ్యా ఘూర్ణాక్షీ కుంచితా చలా ।** 185
**మునినా కీర్తితా దృష్టి ర్మదిరా తరుణే మదే ॥**

అర్థం : అంచితా = సూటిగాలేనిది; మార్గితా — దిక్కులు చూచేది; మధ్యా — మధ్యస్థమయినది; ఘూర్ణ-అక్షీ — కలతపడిన కనులు కలది; కుంచితా — క్రిందకు వ్రాలినది; చలా = బెదరుతున్నది (అయిన చూపు); మదిరా దృష్టి — 'మదిరదృష్టిః' (అని); మునినా కీర్తితా — భరతమునిచేత కీర్తింప (= పేర్కొన)బడింది.

ఈ దృష్టి— తరుణేమదే — తరుణ (= తక్కాల) మదమందు (చెల్లుతుంది).

తాత్పర్యం : సూటిగాలేనిది, దిక్కులు చూచేది, మధ్యస్థమైనది, కలతపడిన కనులు కలది, క్రిందకు వ్రాలినది, బెదరుతున్నది 'మదిరదృష్టి' అవుతుందని భరతమునిచేత పేర్కొనబడినది.

ఇది తరుణ మదమందు ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది 'మదిర' అనే సంచారిభావదృష్టి. తరుణ-మధ్య-అధమ భేదాలచేత మదిరదృష్టి మూడు విధాలని భరతాదులు పేర్కొన్నారు. ఇచ్చట తరుణమదమందు ప్రయుక్తమగు దృష్టి మాత్రమే పేర్కొనబడినది (తరుణమదమనగా మత్తుయొక్క ప్రారంభదశ). మధ్య-అధమ మదములకు చూ. తె. నా. శా. పుట 276.

## 43. హృద్య దృష్టి

అవ్యవస్థిత సంభ్రాంతా మనాక్ లులితతారకా ॥ 186

ఆకుంచితపుటా హృద్యా మధ్యమాదిషు యుజ్యతే ।

అర్థం : అవ్యవస్థిత, సంభ్రాంతా = నిలుకడ లేనిది, తడబాటు కలది; మనాక్, లులిత, తారకా = కొంచెంగా, చలిస్తున్న, తారకలు కలది; ఆకుంచిత, పుటా = బాగుగా కుంచితములైన, రెప్పలు కలది: హృద్యా = 'హృద్యదృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) — మధ్యమాదిషు = మధ్యస్థం మొదలైనవాటి విషయంలో; యుజ్యతే = తగును.

తాత్పర్యం : నిలుకడ లేనిగి, తడబాటుకలది, కొంచెంగా చలించుతున్న తారకలు కలది, బాగా కుంచితములైన రెప్పలు కలది 'హృద్య దృష్టి' అవుతుంది.

ఇది మధ్యస్థములైనవాటి విషయంలో ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది ఇంచుమించుగా 'మధ్యమ మదిరదృష్టి' నిర్వచన మునకు సరిపోతున్నది. 'మధ్యమాదిషు' అనేదానికి 'in mediocre things' అని కుమారస్వామి అనువాదం.

## 44. లలిత దృష్టి

భ్రూక్షేపకుంచితాపాంగా స్మితేనాఽనంగసంభవా ॥ 187

వికాసేనాఽన్వితా దృష్టిః లలితా లలితాదిషు ।

అర్థం : భ్రూక్షేప-కుంచిత-అపాంగా = కనుబొమల కదలిక చేత, కుంచితములైన కటాక్షములుకలది, అనంగసంభవా = మన్మథ హేతుకమైనది, స్మితేన వికాసేన- అన్వితా = చిరునవ్వుతో కూడినది, తేటదనం కలది, లలితాదృష్టిః = 'లలితదృష్టి' (అవుతుంది).

(ఈ దృష్టి) — లలితాదిషు — లలితములైనవాటియందు (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : కనుబొమల కదలికచేత కుంచితములైన కటాక్షాలు కలది, మన్మథ హేతుకమైన చిరునవ్వుతో కూడినది, పేటదనం కలది 'లలితదృష్టి' అవుతుంది.

ఇది లలితములైనవాటియందు ప్రయుక్తమవుతుంది.

టీక : దీనిని భరతాదులు పేర్కొనలేదు.

# 5
# భ్రూ - గ్రీవా భేదాలు

## గ్రంథాంతర భ్రూభేదాలు

**సహజా పతితోత్క్షిప్తా చతురా రేచితా తథా ॥** 188

**కుంచితేతి షడేవాఽత్ర భ్రూచాతుర్యవతిక్రియాః ।**

అర్థం : సహజా, పతితా, ఉత్క్షిప్తా, చతురా, రేచితా (తథా), కుంచితా ఇతి = సహజ, పతిత, ఉత్క్షిప్త, చతుర, రేచిత, కుంచిత,- అని; షట్ (ఏవ) (అత్ర) భ్రూ-చాతుర్యవతి క్రియాః = కనుబొమల, చతురత్వంగల వానిలో, క్రియలు (= భ్రూభేదాలు) ఆరు విధాలు.

తాత్పర్యం : 1. సహజ, 2. పతిత, 3. ఉత్క్షిప్త, 4. చతుర, 5. రేచిత, 6. కుంచిత-అనే భేదాలచేత భ్రువులు (= కనుబొమలూ) ఆరు విధాలు. ('భ్రూ' అనే ఏకవచనం తెలుగులో భ్రువు = కను బొమ అవుతుంది).

టీక : భ్రూభేదాల లక్షణ - వినియోగాలు ఈ గ్రంథంలో లేవు. అందుచేత వేంకటాచార్యులుగారు ఇతర గ్రంథాలలోని లక్షణ వినియోగాలను ఇందులో చేర్చినారు.

భరతాదులు ఏడు భ్రూభేదాలు చెప్పినారు. అంటే ఇక్కడ చెప్పబడిన ఆరు భేదాలనేకాక, భ్రుకుటి (= బొమముడి) అనే ఇంకో భేదాన్ని కూడా చెప్పినారు. నాసిక పైభాగంలో రెండు కనుబొమలు ముడిపడటం వల్ల భ్రుకుటి ఏర్పడుతుంది.

### 1. సహజ భ్రువు

**సహజాస్యాత్ స్వభావభ్రూర్వికారరహితా ముఖే ॥** 189

**సహజాదిషు యుక్తేత ఇతి భావవిదో విదుః ।**

అర్థం : ముఖే వికారరహితా = ముఖంలో ఏవికారం లేనిదై ; స్వభావభ్రూః = స్వాభావికంగాఉండే భ్రువు(= కనుబొమ); సహజా, స్యాత్ = 'సహజభ్రువు', అవుతుంది.

(ఈ భ్రువు) సహజాదిషు = సహజస్థితి మొదలగు వాటి యందు; యుజ్యేత,ఇతి = ఉపయోగించవలెను అని;భావవిదః, విదుః = భావవేత్తలు, ఎరుగుదురు.

తాత్పర్యం : ముఖమందు ఏవికారం లేనిదై, సహజస్థితిలో ఉన్నది 'సహజభ్రువు' అవుతుంది.

ఇది సహజ ( = అకుటిలములైన) భావములందు వినియుక్త మవుతుంది.

టీక : ఇది భరతాదులు చెప్పినదే; దీనిని 'స్వాభావికభ్రువు' అని కూడా అంటారు.

## 2. పతితభ్రువు

అచంచలభ్రూయుగం చ పతనాత్ పతితా మతా ॥ 190
జుగుప్సాయాం విస్మయే చాసూయాయాం భవే దసౌ ।

అర్థం : అచంచల, భ్రూయుగం (చ) = చలించని, కను బొమల జంట; పతనాత్ = వాలటం వల్ల ; పతితా, మతా = 'పతిత భ్రువు' అని సిద్ధాంతం.

అసౌ = ఇది; జుగుప్సాయాం, విస్మయే (చ), అసూయాయాం = జుగుప్స ( = రోత), విస్మయం, అసూయ - వీటియందు; భవేత్ = అవుతుంది ( = వినియోగపడుతుంది).

తాత్పర్యం : చలించని కనుబొమలను క్రిందకు వాల్చితే అది 'పతితభ్రువు' అవుతుంది.

జుగుప్స, విస్మయం, అసూయ - వీటిని నిరూపించటంలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది భరతుని 'పాతనభ్రువు'. గుణం ఉన్నచోటకూడా దోషం ఎంచటం 'అసూయ'; గుణాన్ని కనుగొని, ప్రకాశింప చేయటం 'వాత్సల్యం'.

### 3. ఉత్క్షిప్తభ్రువు

ఏకా వా సా ద్వితీయా వా యదుత్క్షిప్తవతీతరామ్ ॥ 191

ఉత్క్షిప్తా సా భవేత్ స్త్రీణాం కోపే సత్యవచస్యపి ।

శృంగారభావే లీలాయాం భ్రూరేషా వినియుజ్యతే ॥ 192

అర్థం : ఏకా వా ద్వితీయా వా = (కనుబొమలు రెండింటిలో) ఒకటి కాని, రెండుకాని; ఉత్క్షిప్తవతీతరామ్ యత్ = బాగుగా పైకి ఎత్తబడితే; సా, ఉత్క్షిప్తా,భవేత్=అది, 'ఉత్క్షిప్తభ్రువు' అవుతుంది.

స్త్రీణాంకోపే = స్త్రీల కోపం; సత్యవచసి (అపి) = సత్య వచనం; శృంగారభావే = శృంగార భావం; లీలాయాం=లీల - వీటి యందు; ఏషా, భ్రూ, వినియుజ్యతే = ఈ, భ్రువు వినియోగించ బడుతున్నది.

తాత్పర్యం : కనుబొమలు రెండింటిలో ఒకటి కాని, రెండు కానీ బాగా పైకి ఎత్తబడితే, అది 'ఉత్క్షిప్తభ్రువు' అవుతుంది.

ఈ భ్రువు స్త్రీల కోపం, సత్యవచనం, శృంగారభావం, లీల — వీటిని నిరూపించటంలో ప్రయుక్తమవుతుంది.

టీక : ఇది భరతుని 'ఉత్క్షేపభ్రువు'; విస్మయ-హర్ష-రోషము లందు రెండు కనుబొమలను పైకి ఎత్తవలెనట !

### 4. చతురభ్రువు

ద్వితీయసహితా స్తోకా స్ఫురితా మదమంథరా ।

చతురా ముఖసంస్పర్శే హృదానందే చ సంభ్రమే ॥ 193

అర్థం : ద్వితీయసహితా — రెండు కనుబొమలు కూడినది; స్తోకా, స్ఫురితా — కొంచెం మెల్లగా, చలించేది; మదమంథరా — మద భారంతో కూడినది; చతురా — 'చతురభ్రువు' (అవుతుంది).

(ఈ భ్రువు) ముఖస్పర్శే — ముఖాన్ని తాకటం; హ్లాద- ఆనందే (చ) = మనోల్లాసం; సంభ్రమే = తొట్రుపాటు- వీటియందు (వినియుక్తమవుతుంది).

తాత్పర్యం: కనుబొమల కూడికతో కొంచెం మెల్లగా చలించుతూ, మత్తుగా ఉండేది 'చతురభ్రువు' అవుతుంది.

ముఖాన్ని తాకటం, మనోల్లాసం, సంభ్రమం - వీటియందు ఇది వినియోగపడుతుంది.

టీక : అన్నింటను ఇదే పేరు.

## 5. రేచితభ్రువు

**లావణ్యమధురాక్షిప్తా యద్యేకా రేచితా మతా ।**
**రహస్యశ్రవణే సాధుకలనే పదవీక్షణే ॥** 194

అర్థం : ఏకా=ఒకటి (ఒక కనుబొమ); లావణ్య-మధురా = లావణ్యంతో, మధురంగా ఉన్నది; ఆక్షిప్తా యది = త్రోయ బడినది అయితే (అది); రేచితా మతా = 'రేచితభ్రువు' (అని) సిద్ధాంతం.

ఈ భ్రువు— రహస్యశ్రవణే—రహస్యమును వినటం; సాధు కలనే = సాధు ( = మంచిది) అని అనటం; పదవీక్షణే = స్థానమును పరికించటం - వీటి యందు (ప్రయుక్తమవుతుంది.)

తాత్పర్యం : ఒక కనుబొమ అందం గానూ, ఇంపుగానూ, పైకి త్రోయబడితే అది 'రేచితభ్రువు' అవుతుంది.

రహస్యం వినటం, 'మంచిది' అని అనటం, స్థానమును పరికించటం - వీటిని నిరూపించటంలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : అన్నింటను ఇదే పేరు.

## 6. కుంచితభ్రువు

ఏకా వా సా ద్వితీయా వా కుంచితా కుంచితా మతా ।

మోట్టాయితే కుట్టమితే విలాసే కిలికించితే ॥ 195

అర్థం : సా = అది (= కనుబొమ); ఏకావా ద్వితీయావా కుంచితా = ఒకటి కాని, రెండుకాని, కుంచితమైతే; కుంచితా, మతా = 'కుంచితభ్రువు' అని), సిద్ధాంతం.

(ఈ భ్రువు) — మోట్టాయితే, కుట్టమితే, విలాసే, కిలికించితే = మోట్టాయితం, కుట్టమితం, విలాసం, కిలికించితం - వీటియందు (వినియోగపడుతుంది).

తాత్పర్యం : కనుబొమ ఒకటి కాని, రెండు కనుబొమలు కాని వంచబడితే అది 'కుంచితభ్రువు' అవుతుంది.

ఇది మోట్టాయితం, కుట్టమితం, విలాసం, కిలికించితం - వీటియందు వినియోగపడుతుంది.

టీక : అన్నింటను ఇదే పేరు. మోట్టాయితాదులు ఇంతకు ముందే వివరించబడినవి. 'కుంచితాంచితవా' మూల పాఠం. అది అర్థవంతంగా లేదు; అందుచేత పై విధంగా సవరించబడింది.

## గ్రీవాభేదాలు

సుందరీ చ తిరశ్చీనా తథైవ పరివర్తితా ।

ప్రకంపితా చ భావజ్ఞైః జ్ఞేయా గ్రీవా చతుర్విధా ॥ 196

అర్థం : సుందరీ (చ), తిరశ్చీనా, (తథా ఏవ) పరివర్తితా, ప్రకంపితా (చ) = సుందరి, తిరశ్చీన, పరివర్తిత, ప్రకంపిత (లేదా సుందరం, తిరశ్చీనం, పరివర్తితం, ప్రకంపితం)- ఇట్లా; గ్రీవా చతుర్విధా = గ్రీవ (= గ్రీవం = మెడ) నాలుగువిధాలు (అని); భావజ్ఞైః = భావవిదులచేత; జ్ఞేయా = తెలియదగినది.

తాత్పర్యం : 1. సుందరి, 2. తిరశ్చీనం, 3. పరివర్తితం 4. ప్రకంపితం- అనే భేదాలచేత గ్రీవం నాలుగు విధాలు (= గ్రీవా భేదాలు నాలుగు) అని భావవిదులు తెలియవలెను.

టీక : భరతాదులు తొమ్మిది విధములగు గ్రీవాభేదాలను నిర్వచించి, గ్రీవాకర్మ అంతా శిరః కర్మను అనుసరించి ఉంటుందని చెప్పినారు. కాగా ఇచ్చట చెప్పిన నాలుగు భేదాలు భిన్న సంప్రదాయానికి చెందినవని చెప్పదగును.

భరతముని చెప్పిన గ్రీవా భేదాలు— 1. సమ, 2. నత, 3. ఉన్నత, 4. త్ర్యస్ర, 5. రేచిత, 6. కుంచిత, 7. అంచిత, 8. వలిత, 9. వివృత్త (చూ. తె. నా. శా. పుటలు 284-85), నంది కేశుడు చెప్పిన నాలుగు భేదాలు వీటి కంటె భిన్నమైనవి.

## 1. సుందరీగ్రీవ

తిర్యక్ప్రచలితా గ్రీవా సుందరీతి నిగద్యతే ।
స్నేహారంభే తథా యత్నే సమ్యగర్థేఽపి చ స్మృతా ॥ 137
సరసత్వేఽనుమోదే చ సా గ్రీవా సుందరీ మతా ।

అర్థం : తిర్యక్ ప్రచలితా గ్రీవా = అటునిటు అడ్డంగా, కదలించబడిన, గ్రీవ; సుందరీ, ఇతి = సుందరీగ్రీవ అని; నిగద్యతే = చెప్పబడుచున్నది.

సా సుందరీ గ్రీవా = ఆ సుందరీగ్రీవ; స్నేహ- ఆరంభే = స్నేహ ప్రారంభం, (తథా) యత్నే = ప్రయత్నం, సమ్యగర్థే (అపి) (చ) = 'మంచిది' అనే అర్థం, స్మృతౌ = స్మృతికి తెచ్చుకోనటం, సరసత్వే = సరసత్వం, అనుమోదే (చ) = అంగీకారం — వీటియందు; మతా = చెప్పబడింది (= అంగీకరించబడింది).

తాత్పర్యం : అటునిటు అడ్డంగా కదలించబడిన మెడ సుందరీ గ్రీవ అవుతుంది.

స్నేహ ప్రారంభం, ప్రయత్నం, మంచిది అనటం, జ్ఞప్తికి తెచ్చుకోనటం, సరసత్వం, అంగీకారం- వీటియందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : 'స్మృతౌ' అనే దానికి బదులుగా 'విస్తృతే' (= విస్తారమునందు) అని ఘోష్ పాఠం.

## 2. తిరశ్చీనగ్రీవ

పార్శ్వద్వయోర్ధ్వభాగే తు చలితా సర్పయానవత్ ॥ 198
సా గ్రీవా తు తిరశ్చీనేత్యుచ్యతే నాట్యకోవిదైః ।
ఖడ్గభ్రమే సర్పగత్యాం తిరశ్చీనా ప్రయుజ్యతే ॥ 199

అర్థం : పార్శ్వద్వయ-ఊర్ధ్వ భాగే (తు) = ఇరు ప్రక్కల ఊర్ధ్వ (= పై) భాగమందు; సర్పయానవత్, చలితా, సా గ్రీవా = సర్పగతివలె, కదలికకల, ఆ గ్రీవ; (తు) తిరశ్చీనా, ఇతి = తిరశ్చీన (గ్రీవ) అని; నాట్యకోవిదైః = నాట్యవేత్తలచేత; ఉచ్యతే = చెప్పబడుతున్నది.

తిరశ్చీనా = ఈ తిరశ్చీన అనే (గ్రీవ); ఖడ్గభ్రమే = కత్తి త్రిప్పటం; సర్పగత్యాం = పామునడక- వీటిని నిరూపించటంలో ప్రయుజ్యతే = ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : ఇరు ప్రక్కల పైభాగమందు పాముకదలికవలె మెడ తిరిగితే అది తిరశ్చీనగ్రీవ అవుతుంది.

కత్తి త్రిపుటంలో, పామునడకలో ఇది వినియోగ పడుతుంది.

టీక : 'ఖడ్గభ్రమే' బదులు "ఖడ్గశ్రమే" (= కత్తిసాములో) అని ఘోష్ పాఠం.

## 3. పరివర్తితగ్రీవ

సవ్యాపసవ్యచలితా గ్రీవా యత్రార్ధచంద్రవత్ ।
సా హి నాట్యకలాభిజ్ఞైః విజ్ఞేయా పరివర్తితా ॥ 200

శృంగారనటనే కాంతా కపోలద్వయచుంబనే ।
నాట్యతంత్రకలాభిజ్ఞైః ప్రయోజ్యా పరివర్తితా ॥ 201

అర్థం : అర్ధ చంద్రవత్ = అర్ధచంద్రాకారంగా; అపసవ్య, సవ్య చలితా = కుడి, ఎడమలకు కదలించబడుతుందో; యత్ర = ఎక్కడ (= ఏది); సా(హి) గ్రీవా = ఆగ్రీవ; నాట్యకలాభిజ్ఞైః = నాట్యకల తెలిసినవారిచేత; 'పరివర్తితా = పరివర్తిత (గ్రీవ' అని); విజ్ఞేయా = తెలియదగినది.

పరివర్తితా = (ఈ) పరివర్తిత (అనే గ్రీవ); శృంగారనటనే = శృంగారాభినయమందు; కాంతా కపోలద్వయచుంబనే = ప్రియురాలి రెండు చెక్కిళ్ళను ముద్దుపెట్టుకొనుటయందు; నాట్యతంత్ర కలాభిజ్ఞైః = నాట్యతంత్రం తెలిసినవారిచేత; ప్రయోజ్యా = ప్రయోగింపదగినది.

తాత్పర్యం : అర్ధచంద్రాకారంగా కుడి ఎడమలకు కదలించ బడినది పరివర్తిత గ్రీవ అవుతుంది.

ఇది శృంగారాభినయమందు, ప్రియురాలి రెండు చెక్కిళ్ళను ముద్దుపెట్టుకొనుటయందు ప్రయుక్తమవుతుంది.

టీక : భరతముని చెప్పిన 'రేచితగ్రీవ'కు ఇది కొంత సన్నిహితంగా ఉంది.

## 4. ప్రకంపితగ్రీవ

**పురఃపశ్చాత్ ప్రచలనాత్ కపోతీకంఠకంపవత్ ।**
**ప్రకంపితేతి సా గ్రీవా నాట్యశాస్త్రే ప్రశస్యతే ॥ 202**

**యుష్మదస్మదితి ప్రోక్తే దేశీనాట్యే విశేషతః ।**
**దోలాయాం మణితే చైవ ప్రయోక్తవ్యా ప్రకంపితా ॥ 203**

అర్థం : కపోతీకంఠ కంపవత్ = ఆడుపావురం మెడయొక్క కదలికలవలె; పురఃపశ్చాత్ ప్రచలనాత్ = ముందుకు వెనుకకు కదలటంవల్ల; సా గ్రీవా = ఆ మెడ; ప్రకంపితా, ఇతి = ప్రకంపిత (గ్రీవ) అని; నాట్యశాస్త్రే ప్రశస్యతే = నాట్యశాస్త్రమందు ప్రశంసింపబడుతున్నది.

ప్రకంపితా = ప్రకంపిత (అనే ఈ గ్రీవ); యుష్మత్-అస్మత్-ఇతి = నువ్వు, నేనుఅని చెప్పటంలో; విశేషతః దేశీనాట్యే = విశేషంగా, దేశీ నాట్యంలో; దోలాయాం = ఉయ్యాల విషయంలో; మణితే(చ) (ఏవ) = మణితమునందును; ప్రయోక్తవ్యా = ప్రయోగింపదగినది.

**తాత్పర్యం :** ఆడుపావురం తన మెడను ముందువెనుకలకు కదలించినట్లుగా కదులుతున్న మెడ ప్రకంపితగ్రీవ అవుతుంది.

నీది నాది అని చెప్పటం, అధికంగా దేశీనాట్యం, ఉయ్యాల, మణితం-వీటిని నిరూపించటంలో ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : 'నాట్యశాస్త్రే ప్రశస్యతే' అనటానికి బదులు 'ప్రోక్తానాట్యవిశారదైః' (=నాట్య విశారదుల చేత చెప్పబడినది) అనే నీడా పాఠమే సమంజసం. 'మణితం' అంటే ఆడుపావురం చేసే ధ్వని వంటి ధ్వని (=అవ్యక్తమైన ధ్వని). 'మణితే' అనటానికి బదులు 'గణితే'(=లెక్కపెట్టటంలో)అన్న నీడా పాఠం సమంజసం కాదు.

# 6
# అసంయుతహస్తాలు

## ద్వాదశహస్తప్రాణాలు

ప్రసారణం కుంచితం చ రేచితం పుంఖితం తథా।
అపవేష్టితకం చాపి ప్రేరితోద్వేష్టితే తథా॥ 204
వ్యావృత్తః పరివృత్తశ్చ సంకేతః తదనంతరమ్।
చిహ్నం పదార్థటీకేతి ప్రాణా ద్వాదశహస్తజాః॥ 205

అర్థం : ప్రసారణం, కుంచితం (చ), రేచితం, పుంఖితం (తథా), అపవేష్టితకం (చ) (అపి), ప్రేరిత-ఉద్వేష్టితే (తథా), వ్యావృత్తః, పరివృత్తః (చ), సంకేతః (తదనంతరమ్) చిహ్నం, పదార్థటీకా, ఇతి = ప్రసారణం, కుంచితం, రేచితం, పుంఖితం, అపవేష్టితకం, ప్రేరితం, ఉద్వేష్టితం, వ్యావృత్తం, పరివృత్తం, సంకేతం, (దాని తరువాత) చిహ్నం, పదార్థటీక-అని; ద్వాదశ ప్రాణాః, హస్తజాః = పన్నెండు ప్రాణాలు హస్తం నుంచి పుట్టినవి (= హస్తాలకు సంబంధించినవి).

తాత్పర్యం : 1. ప్రసారణం, 2. కుంచితం, 3. రేచితం, 4. పుంఖితం, 5. అపవేష్టితకం, 6. ప్రేరితం, 7. ఉద్వేష్టితం, 8. వ్యావృత్తం, 9. పరివృత్తం, 10. సంకేతం, 11. చిహ్నం, 12. పదార్థటీక-ఈ పన్నెండు హస్తప్రాణాలు.

టీక : భరతముని ఉత్కర్షణం మొదలయిన ఇరవై హస్త కర్మలను, ఉత్తానం మొదలయిన ఐదు హస్త ప్రచారాలను వివరించి నాడు కాని హస్త ప్రాణాలంటూ ప్రత్యేకంగా వివరించలేదు (చూ.

తె. నా. శా. పుటలు 308-311). ప్రక్షిప్తంగా తలచి, ఘోష్ ఈ భాగాన్ని అనువదించలేదు.

## 1. ప్రసారణం

ప్రసారణ మితి జ్ఞేయ మంగుళీనాం ప్రసారణాత్ ।

అర్థం : అంగుళీనాం, ప్రసారణాత్ = వ్రేళ్ళ యొక్క, ప్రసారణం (= చాచటం) వల్ల; ప్రసారణం, ఇతి, జ్ఞేయం = 'ప్రసారణం' అని తెలియవలెను.

తాత్పర్యం : వ్రేళ్ళను చాచటం 'ప్రసారణం'.

## 2. కుంచితం

కుంచనా దంగుళీనాం చ కుంచితం సముదీరితమ్ ॥ 206

అర్థం : అంగుళీనాం, కుంచనాత్ (చ,=వ్రేళ్ళ యొక్క, కుంచనం, (= ముడువటం) వల్ల; కుంచితం, సముదీరితమ్ = 'కుంచితం' (అని), చెప్పబడింది.

తాత్పర్యం : వ్రేళ్ళను ముడువటం లేదా వంచటం 'కుంచితం అవుతుంది.

## 3. రేచితం

అంగుళీనాం ప్రచలనాత్ రేచితం పరికీర్తితమ్ ।

అర్థం : అంగుళీనాం, ప్రచలనాత్ = వేళ్ళ యొక్క, ప్రచలనం (= ఎక్కువ కదలికల) వల్ల; రేచితం, పరికీర్తితం = 'రేచితం' (అని), చెప్పబడింది.

తాత్పర్యం : వ్రేళ్ళను ఎక్కువగా కదలించటం 'రేచితం'.

## 4. పుంఖితం

పురోభాగే కుంచితో వా రేచితో వా ప్రసారితః ॥ 207

యో హస్తస్తు పతకాది ర్నామ్నాఽసౌ పుంఖితో భవేత్ ।

అర్థం: యః పతాకాది హస్తః (తు) = పతాకం మొదలయిన ఏ హస్తం (యొక్క వ్రేళ్ళు); పురోభాగే, కుంచితః వా, రేచితః వా, ప్రసారితః = ముందు భాగంలో, వంచటం కాని, కదలించటం కాని, చాచటం కాని, చేయబడినదో; అసౌ, పుంఖితః నామ్నా, భవేత్ = అది (అ = హస్తం), 'పుంఖితం' అనే పేరు కలది, అవుతుంది.

తాత్పర్యం: పతాకం మొదలయిన హస్తాల వ్రేళ్ళను ముందు భాగంలో వంచటం లేదా కదలించటం, లేదా చాచటం 'పుంఖితం' అవుతుంది.

## 5. అపవేష్టిత(క)ం

అధస్తాత్ గమనం యస్య హస్తస్య నామ్నా ఉపవేష్టితః ॥ 208

అర్థం: యస్య హస్తస్య అధస్తాత్ గమనం = ఏ హస్తం యొక్క (వ్రేళ్ళు), క్రిందికి వెళ్ళటం (జరుగుతుందో); నామ్నా, అపవేష్టితః = (అది) పేరుచేత అపవేష్టితం (అవుతుంది).

తాత్పర్యం: చేతి వ్రేళ్ళను క్రిందికి చాచటం 'అపవేష్టిత(క)ం' అవుతుంది.

## 6. ప్రేరితం

పశ్చాద్భాగే కుంచితో వా రేచితో వా ప్రసారితః ।
యో హస్తః కథితః సోఽయం ప్రేరితః పూర్వసూరిభిః ॥ 209

అర్థం: యః, హస్తం = ఏ, హస్తం (యొక్క వ్రేళ్ళు); పశ్చాత్ భాగే = వెనుక భాగంలో; కుంచితఃవా, రేచితఃవా, ప్రసారితః = వంచటం కానీ, కదలించటం కాని, చాచటం కాని చేయబడినవో; సః, అయం, పూర్వ సూరిభిః, ప్రేరితః కథితః = ఆ,యీ, హస్తం (యొక్క కార్యం), ప్రాచీన విద్వాంసుల చేత, ప్రేరితం (అని) చెప్పబడింది.

తాత్పర్యం : వెనుక భాగంలో చేతి వ్రేళ్ళను వంచటం లేదా కదలించటం, లేదా చాచటం 'ప్రేరితం' అవుతుందని ప్రాచీన విద్వాంసులు చెప్పారు.

## 7. ఉద్వేష్టితం

హస్తానా మూర్ధ్వభాగే యద్గమనం చాస్తి నర్తనే ।

తదుద్వేష్టిత మిత్యాహుః భరతాగమవేదినః ॥ 210

అర్థం : నర్తనే = నృత్యంలో; ఊర్ధ్వభాగే,హస్తానాం, యత్ గమనం, తత్ = పై భాగంలో, హస్తాల యొక్క, ఏ గమనం (= పోవటం లేదా చాచటం) కలదో, దానిని; భరతాగమవేదినః = భరతవేద వేత్తలు; ఉద్వేష్టితం, ఇతి, ఆహుః = 'ఉద్వేష్టితం' అని, చెబుతారు.

తాత్పర్యం : నృత్యంలో హస్తాలను పైకి చాచటం 'ఉద్వేష్టితం' అని భరతశాస్త్రవేత్తలు అంటారు (ఇందులో అరచేతులు పైకి ఉంటాయి).

## 8. వ్యావృత్తం

ఉదగ్రతః పార్శ్వభాగే హస్తో వ్యావృత్తకో భవేత్ ।

అర్థం : పార్శ్వభాగే = పార్శ్వభాగంలో;ఉదగ్రతః = మీదకు ఎత్తటం వల్ల; హస్తః వ్యావృత్తకః భవేత్ = హస్తం వ్యావృత్తకం అవుతుంది.

తాత్పర్యం : చేతిని ప్రక్కగా పైకిఎత్తటం 'వ్యావృత్తకం' అవుతుంది.

## 9. పరివృత్తం

పార్శ్వాభ్యాం చ పురోభాగే యో హస్తో నటనే కృతః ॥ 211

పరివృత్తః సమాఖ్యాతః నామ్నా హస్తవిశారదైః ।

అర్థం : నటనే = నటనంలో; పార్శ్వాభ్యాం, పురోభాగే =

పార్శ్వ భాగాలనుంచి, ముందరికి; యః, హస్తః, కృతః = ఏ హస్తం చేయ (= తీసుకొని రా)బడిందో (అది); నామ్నా, పరివృత్తః = పేరు చేత, పరివృత్తం (అని); హస్త విశారదైః, సమాఖ్యాతః = హస్త(అభినయంలో) పండితులైన వారిచేత, చక్కగా చెప్పబడింది.

తాత్పర్యం : పార్శ్వ భాగాలనుంచి హస్తాన్ని ముందుకు తీసుకొని రావటం 'పరివృత్తం' అవుతుందని శాస్త్రవేత్తలు చెప్పినారు.

## 10. సంకేతం

ఊహావిధానరచనా వినా స్థూలోక్తిపూర్వకమ్ ॥ 212

యో హస్తో నియమం ప్రాప్తః సః సంకేతః ఉదాహృతః ।

అర్థం : యః, హస్తః = ఏ హస్తం: స్థూల-ఉక్తి పూర్వకం = ముందు చెప్పిన మాటలు ఆధారంగా; ఊహా విధాన రచనా, వినా = ఊహించి తెలుసుకొనే విధానం, లేకుండానే; నియమం ప్రాప్తః = నియమం (= తెలుసుకోవలసిన అర్థం), పొందితే (= తెలిస్తే); సః, సంకేతః, ఉదాహృతః = అది, సంకేతం (అని), చెప్పబడింది.

తాత్పర్యం : మాటలతో నిమిత్తం లేకుండా సైగలచేతనే తెలియజేయటం 'సంకేతం' అవుతుంది.

## 11. చిహ్నం

ప్రత్యక్షాణాం పరోక్షాణాం వస్తూనాం నాట్యకర్మణి ॥ 213

స్థావరత్వం జంగమత్వ మీయుషామపి తాదృశమ్ ।

తదాకారప్రకటనం తన్ముఖస్య నిరీక్షణమ్ ॥ 214

తత్స్థానదర్శనం చాఽపి తద్వ్యజానాం చ దర్శనమ్ ।
తదాయుధప్రకటనం తద్గతార్థనివేదనమ్ ॥ 215

తద్వ్యాప్తదర్శనం చాపి తచ్చేష్టాదర్శనం తథా ।
అష్టలక్షణ మిత్యేతచ్చిహ్నమిత్యభిధీయతే ॥ 216

అర్థం : నాట్యకర్మణి = నాట్య కర్మలో (= నృత్యప్రదర్శనలో); ప్రత్యక్షాణాం, పరోక్షాణాం = ప్రత్యక్షంగా (లేదా) పరోక్షంగా (ఉన్న); స్థావరత్వం, జంగమత్వం, ఈయుషామ్ (అపి) = స్థిరత్వం (లేదా), చలనం పొందిన; వస్తూనాం = వస్తువులయొక్క; తాదృశమ్ = అట్టిస్థితి; తత్, ఆకార, ప్రకటనం = ఆవస్తువుల, ఆకారం, తెలుపటం; తత్ ముఖస్య, నిరీక్షణం = వాటి ముఖం, చూడటం; తత్, స్థాన, దర్శనం (చ) (అపి) = అవి, ఉండేచోటు, చూపటం; తత్, ధ్వజానాం (చ), దర్శనమ్ = వాటి, చిహ్నాలను, చూపటం; తత్, ఆయుధప్రకటనం = వాటి, ఆయుధాలను తెలియజెప్పటం; తత్, గత-అర్థనివేదనం = వాటి, ప్రయోజనాలను తెలుపటం; తత్, వ్యాప్తి,దర్శనం = వాటి విస్తరణ, చూపటం; తత్,చేష్టాదర్శనం = వాటి, చేష్టలను నిరూపించటం; — ఇతి, అష్టలక్షణం, ఏతత్ = ఇట్లా, ఎనిమిది లక్షణాలు గల,ఇది;చిహ్నం, ఇతి, అభిధీయతే = 'చిహ్నం' అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : నృత్య ప్రదర్శనలో ప్రత్యక్ష-పరోక్ష వస్తువుల స్థావర-జంగమత్వాలను తెలిపే చిహ్నములు (= గుర్తులు) ఎనిమిది: 1. వాటి ఆకారాలను చూపటం, 2. వాటి ముఖాలను చూపటం, 3. అవి ఉండే తావులను చూపటం, 4. వాటి చిహ్నాలను చూపటం, 5. వాటి ఆయుధాలను తెలుపటం, 6. వాటి ప్రయోజనాలను తెలియజెప్పటం, 7. వాటి వ్యాప్తిని తెలుపటం, 8. వాటి చేష్టలను నిరూపించటం — ఈ ఎనిమిది లక్షణాలుగల హస్తప్రాణం 'చిహ్నం' అనబడుతుంది.

## 12. పదార్థటీక

పదనాం కథితానాం స్యా దర్థనిర్వాహతా యది ।
ఇయం పదార్థటీకేతి కథితా భరతాదిభిః ॥ 21

అర్థం : కథితానాం, పదానాం = చెప్పబడుతున్న, పదాల (= చెబుతున్న మాటల)యొక్క; అర్థనిర్వాహతా, స్యాత్ యది = అర్థాలను అభివ్యక్తం చేయటం, జరిగితే; ఇయం = ఇది; భరతాదిభిః,

పదార్థటీక, ఇతి, కథితా = భరతముని ప్రభృతులచేత, 'పదార్థటీక' అని, చెప్పబడింది.

తాత్పర్యం : చెప్పే మాటల అర్థాలను హస్త ప్రదర్శనచేత తెలియజెప్పటం 'పదార్థటీక' అవుతుంది.

టీక : "ఆకృతి, చేష్ట, చిహ్నం, జాతి అనువానిని బట్టి బాగుగా ఆలోచించియు, స్వయంగా తర్కించుకొనియు బుధులు హస్తాభినయం చేయవలెను. అభినయమందు హస్తము ప్రదర్శింపజాలని అర్థమే లేదు." (తె. నా. శా. పుట. 308) అని భరతముని చేసిన సూచనను అనుసరించి, అర్వాచీనులు ఈ హస్త ప్రాణాలను కల్పించి ఉంటారు. భరతముని చెప్పిన హస్తప్రచారాల ప్రయోజనానికి, ఈ హస్తప్రాణాల ప్రయోజనం సన్నిహితంగా ఉంది.

## హస్త భేదాలు

**అథేదానీం తు హస్తానాం లక్షణం ప్రోచ్యతే మయా ।**

**అసంయుతాః సంయుతా శ్చ ద్వేధా హస్తాః ప్రకీర్తితాః ॥** 218

**తత్రాసంయుతహస్తానా మాదౌ లక్షణ ముచ్యతే ।**

అర్థం : అథ, ఇదానీం (తు) = ఇంక, ఇప్పుడు; మయా, హస్తానాం, లక్షణం, ప్రోచ్యతే = నాచేత, హస్తాలయొక్క, లక్షణం, చెప్పబడుతున్నది; అసంయుతాః, సంయుతాః (చ) = అసంయుతాలు, సంయుతాలు (అని); హస్తాః, ద్వేధా, ప్రకీర్తితాః = హస్తాలు, రెండు విధాలుగా, కీర్తింపబడినవి; తత్ర, అసంయుత హస్తానాం, లక్షణం, ఆదౌ, ప్రోచ్యతే = అందులో, అసంయుత, హస్తాలయొక్క, లక్షణం, ముందుగా, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఇప్పుడు హస్తాల లక్షణం వివరిస్తాను. అసంయుత హస్తాలు (= సంయుతం కానివి లేదా విడివిడిగా ఉన్నవి), సంయుతహస్తాలు (= రెండు హస్తాలు కలిసినవి) అనే భేదాలతో హస్తాలు రెండు విధాలు. ముందుగా అసంయుత హస్తాల లక్షణం చెబుతున్నాను.

టీక : చివరి పాదము నీడా పాఠంలో లేదు.

ప్రతి హస్తానికి నందికేశ్వరుడు చెప్పిన లక్షణ-వినియోగాలతో పాటు, వేరే గ్రంథాలలో ఉన్న లక్షణ-వినియోగాలను కూడా చేర్చి చెప్పినారు నీడామంగళం తిరువేంకటాచార్యులుగారు. ఆ విధంగా తెలుగులిపి గ్రంథం బాగా పెరిగింది. ఈ గ్రంథంలో ఉన్న భేదాలను తెలియజేయటానికి 'నీడాపాఠం' అని పేర్కొంటు న్నాను. అట్లాగే మన్ మోహన్ ఘోష్ సంపాదకత్వంలో, ఆంగ్లాను వాద సహితంగా, వెలువడిన గ్రంథంలో ఉన్న భేదాలను తెలుప టానికి 'ఘోష్ పాఠం' అని పేర్కొంటున్నాను.

ఒక విశేష విషయం- శ్రీబహుజనపల్లి సీతారామాచార్యుల వారు తమ 'శబ్దరత్నాకరం' (తెలుగు - తెలుగు నిఘంటువు)లో సంయుత-అసంయుత హస్తాలు చాలా వాటికి, వచనంలో నిర్వచ నాలు ఇచ్చారు. ఒక ఉదాహరణ : బొటనవ్రేలిని వంచి, చూపుడు వ్రేలి మొదటఁ గూర్చి, వ్రేళ్ళన్ని చక్కఁగాఁ జాఁచి పట్టినది - పతాకహస్తం.

## అసంయుతహస్తాల పేర్లు

పతాకః త్రిపతాకోఽర్ధపతాకః కర్తరీముఖః ॥ 219

మయూరాఖ్యోఽర్ధచంద్రశ్చారాలః శుకతుండకః ।
ముష్టిశ్చ శిఖరాఖ్యశ్చ కపిత్థః కటకాముఖః ॥ 220

సూచీ చంద్రకలా పద్మకోశః సర్పశిరా స్తథా ।
మృగశీర్షః సింహముఖః కాంగులశ్చాలపద్మకః ॥ 221

చతురో భ్రమరశ్చైవ హంసాస్యో హంసపక్షకః ।
సందంశో ముకుల శ్చైవ తామ్రచూడః త్రిశూలకః ॥ 222

ఇత్యసంయుత హస్తానా మష్టావింశతి రీరితా ।

అర్థం : పతాకః, త్రిపతాకః, అర్ధపతాకః, కర్తరీముఖః, మయూర-ఆఖ్యః, అర్ధచంద్రః (అపి), అరాలః, శుకతుండః, ముష్టిః (చ), శిఖర-ఆఖ్యః, కపిత్థః, కటకాముఖః, సూచీ, చంద్రకలా, పద్మకోశః, సర్పశిరః (తథా), మృగశీర్షః, సింహాముఖః, కాంగులః (చ), అలపద్మకః, చతురః, భ్రమరః (చ) (ఏవ), హంసాస్యః, హంసపక్షకః, సందంశః, ముకులః (చ) ఏవ), తామ్రచూడః, త్రిశూలకః = పతాకం, త్రిపతాకం, అర్ధపతాకం, కర్తరీముఖం, మయూరం (అనే పేరుకలది), అర్ధచంద్రం, అరాలం, శుకతుండం, ముష్టి, శిఖరం (అనే పేరుకలది), కపిత్థం, కటకాముఖం, సూచి, చంద్రకల, పద్మకోశం, సర్పశిరం, మృగశీర్షం, సింహాముఖం, కాంగులం, అలపద్మకం, చతురం, భ్రమరం, హంసాస్యం, హంసపక్షం, సందంశం, ముకులం, తామ్రచూడం, త్రిశూలకం; ఇతి = అని; అసంయుతహస్తానాం, అష్టావింశతిః, ఈరితా = అసంయుత హస్తాల యొక్క, ఇరవై ఎనిమిది (భేదాలు), చెప్పబడినవి.

తాత్పర్యం: అసంయుతహస్తాలు ఇరవై ఎనిమిది: 1. పతాకం, 2. త్రిపతాకం, 3. అర్ధపతాకం, 4. కర్తరీముఖం, 5. మయూరం, 6. అర్ధచంద్రం, 7. అరాలం, 8. శుకతుండ(క)ం, 9. ముష్టి, 10. శిఖరం, 11. కపిత్థం, 12. కటకాముఖం, 13. సూచి, 14. చంద్రకల, 15. పద్మకోశం, 16. సర్పశిరం, 17. మృగశీర్షం, 18. సింహాముఖం, 19. కాంగులం, ( = లాంగూలం), 20. అలపద్మ(క)ం ( = సోలపద్మకం), 21. చతురం, 22. భ్రమరం, 23. హంసాస్యం, 24. హంసపక్షం, 25. సదంశం, 26. ముకులం, 27. తామ్రచూడం, 28. త్రిశూలకం.

టీక : భరతముని ఇరవై నాలుగు అసంయుత హస్తాలు చెప్పగా నందికేశ్వరుడు ఇరవై ఎనిమిది అసంయుత హస్తాలు చెప్పినాడు. అర్ధపతాకం, మయూరం, చంద్రకల, సింహాముఖం,

త్రిశూలం — ఈ 'అయిదు' ఇందులోని క్రొత్త పేర్లు, నా. శా.లోని 28 వ హస్తం 'ఊర్ణనాభం' ఇందులో చేరలేదు. సూచీముఖం అనేది ప్రసిద్ధమైన పేరు; కాని, ఇచ్చట 'సూచి' అని మాత్రమే పేర్కొనబడింది. కాంగూలం,అలపద్మం అనేవి ప్రసిద్ధమైన పేర్లుకాగా లాంగూలం, సోల పద్మకం అని నీడా పాఠాలు.

ఇచ్చట చెప్పబడిన ఇరవై ఎనిమిది మాత్రమే కాక ఇంకో ఆరు అసంయుతహస్తాలు తరువాత చెప్పబడినవి— ఊర్ణనాభం, బాణం, అర్ధసూచి(క), వ్యాఘ్రః, కటకం, పల్లి. ఈ ఆరింటిలో ఊర్ణనాభ, బాణహస్తాలు రెండూ నీడా పాఠంలో మాత్రమే ఉన్నాయి; వ్యాఘ్ర-కటక-పల్లీ హస్తాలు మూడు ఘోష్ పాఠంలో మాత్రమే ఉన్నాయి ; ఇంక అర్ధసూచి(క) రెండు పాఠాలలోనూ ఉంది.

నాట్య శాస్త్రంలో వలెనే ఇచ్చట కూడా ప్రతిహస్తానికి లక్షణ-వినియోగాలు చెప్పబడినవి. అంతే కాదు 'గ్రంథాంతరస్థం' అంటూ ప్రతి హస్తానికి, వేరొక సంప్రదాయాన్ని అనుసరించి కూడా మరల లక్షణ-వినియోగాలు చెప్పబడినవి. నాట్యశాస్త్రంలో రసాలకు మాత్రమే వర్ణ- దైవతాలు రెండే చెప్పబడివవి (చూ. తె. నా. శా. పుట. 201). కాని, ఇచ్చట లక్షణ భాగంలో ఆయా హస్తాల యొక్క జనన, జాతి, వర్ణ, ఋషి, అధిదైవతాలను చెప్పటం విశేషం.

ఇంకొక విశేషం — మధ్యలో చేర్చిన అర్ధపతాకాది అయిదు పేర్లు కాక, తక్కిన హస్తాల పేర్లు అన్నీ నాట్యశాస్త్రంలో చెప్పబడిన వరుసలోనే ఉన్నాయి. చాలా హస్తాల నిర్వచనాలు నాట్యశాస్త్రంలోని నిర్వచనాలను అనుసరించే ఉన్నాయి. భేదం ఉన్నప్పుడు, ఆ విషయాన్ని ఆయా హస్తాలక్రింద టీకలలో విశదం చేశాను. ఆయా అంశాలను పట్టిక రూపంలో చూడవచ్చు.

## అసంయుత హస్తాలు

| నా. శా. లో (24) | అభి. ద. లో. (28) | టీక |
| --- | --- | --- |
| పతాక | పతాక | 1. అర్ధపతాక, మయూర, |
| త్రిపతాక | త్రిపతాక | చంద్రకలా, సింహ |
| | అర్ధపతాక | ముఖ, త్రిశూల హస్తాలు |
| కర్తరీముఖ | కర్తరీముఖ | నా.శా.లో లేవు. |
| | మయూర | 2. ఊర్ణనాభం నందికేశుడు |
| అర్ధచంద్ర | అర్ధచంద్ర | చెప్పలేదు. |
| అరాల | అరాళ | 3. హంసాస్యం, సందంశం, |
| శుకతుండ | శుకతుండ | తామ్రచూడం, కటకా |
| ముష్ఠి | ముష్టి | ముఖం - ఈ నాలుగింటి |
| శిఖర | శిఖర | నిర్వచనాలు తప్ప తక్కి- |
| కపిత్థ | కపిత్థ | నవి నాట్య శాస్త్రంలోని |
| కటకాముఖ | కటకాముఖ | నిర్వచనాలతో సమా |
| సూచీముఖ | సూచీ | నంగానే ఉన్నాయి. |
| | చంద్రకళ | 4. ఇతర గ్రంథాల నుంచి |
| పద్మకోశ | పద్మకోశ | చెప్పిన హస్తాల విష |
| సర్పశిర | సర్పశీర్ష | యంలో జనన-జాతి- |
| మృగశీర్షక | మృగశీర్ష | వర్ణ - అధిదైవతాలే కాక |
| | సింహముఖ | వినియోగాలు కూడా |
| కాంగూల | లా(కా)ంగూల | చాలా అధికంగా చెప్ప |
| అలపద్మ | సో (అ)ల పద్మ | బడినవి. |
| ఛతుర | చతుర | |
| భ్రమర | భ్రమర | |
| హంసాస్య | హంసాస్య | |
| హంసపక్ష | హంసపక్ష | |
| సందంశ | సందంశ | |
| ముకుల | ముకుళ | |
| ఊర్ణనాభ | | |
| తామ్రచూడ | తామ్రచూడ | |
| | త్రిశూల | |

## 1. పతాక హస్తం :




అంగుళ్యః కుంచితాంగుష్ఠః సంశ్లిష్టాః ప్రసృతా యది॥ 223

స పతాకకరః ప్రోక్తో నృత్యకర్మ విశారదైః ।
నాట్యారంభే వారివాహే వనే వస్తు నిషేధనే ॥ 224

కుచస్థలే నిశాయాం చ నద్యా మమరమండలే ।
తురగే ఖండనే వాయౌ శయనే గమనోద్యమే ॥ 225

ప్రతాపే చ ప్రసాదే చ చంద్రికాయాం ఘనాతపే ।
కవాటపాటనే సప్తవిభక్త్యర్థే తరంగకే ॥ 226

వీథిప్రవేశభావే ఽపి సమత్వే చాంగరాగకే ।
ఆత్మార్థే శపథే చాపి తూష్ణింభావనిదర్శనే ॥ 227

తాలపత్రే చ ఖేటే చ ద్రవ్యాదిస్పర్శనే తథా ।
ఆశీర్వాదక్రియ యాం చ నృపశ్రేష్ఠస్య భావనే ॥ 228

తత్ర తత్రేతివచనే సింధౌ చ సుకృతిక్రమే ।
సంబుద్ధేతు పురోగే ఽపి ఖడ్గరూపస్యధారణే ॥ 229

మాసే సంవత్సరే వర్షదినే సమ్మార్జనే తథా ।
ఏ మర్థేషు యుజ్యంతే పతాకహస్తభావనాః

అర్థం : కుంచిత-అంగుష్ఠః = వంచిన బొటన వ్రేలు (కలది) అంగుళ్యః, సంశ్లిష్టాః, ప్రసృతాః, యది = (తక్కిన నాలుగు) వ్రేళ్ళు, దగ్గరగా చేరినవి, చాపినవి, అయితే; సః, పతాకకరః = అది, పతాక హస్తం (అని); నృత్యకర్మ విశారదైః, ప్రోక్తః = నృత్యకర్మలో విశారదులైన వారిచేత, చెప్పబడినది.

నాట్యారంభే, వారివాహే, వనే, వస్తు నిషేధనే = నాట్య

ప్రారంభం, మేఘాన్ని నిరూపించటం, వనం, వస్తువులను నిషేధించటం (=వలదనటం); కుచస్థలే, నిశాయాం (చ), నద్యాం, అమర మండలే=కుచస్థలం (రొమ్ము), రాత్రి, నది, దేవతా సమూహం (దేవతా నివాసం - ఘోష్); తురగే, ఖండనే, వాయౌ, శయనే, గమనోద్యమే=గుఱ్ఱం, ఖండించటం, వాయువు, పండుకొనటం, వెళ్ళేడి ప్రయత్నం; ప్రతాపే (చ), ప్రసాదే (చ), చంద్రికాయాం, ఘన-ఆతపే=ప్రతాపం, అనుగ్రహం, వెన్నెల, ఎఱ్ఱని ఎండ; కవాటపాటనే, సప్తవిభక్త్యర్థే, తరంగకే=తలుపులు తెరవటం (తలుపు తట్టటం - కుమారస్వామి), ఏడు విభక్తుల అర్థం చెప్పటం, అలలు; వీథీప్రవేశభావే (అపి), సమత్వే (చ), అంగరాగకే=వీథిలో ప్రవేశించటం, సమత్వం (సమంగా ఉండటం - నీడా), గంధాదులను శరీరం మీద పూయటం; ఆత్మార్థే, శపథే (చ) (అపి), తూష్ణీం భావనిదర్శనే=నేను అనే అర్థం, శపథం చేయటం, ఊరక ఉండటం; ఆశీర్వాద క్రియాయాం (చ), నృపశ్రేష్ఠస్యభావనే=ఆశీర్వదించటం అనే క్రియ, రాజులలో శ్రేష్ఠుడు అనేభావన; తాళపత్రే, (చ) ఖేటే (చ), ద్రవ్యాది స్పర్శనే (తథా)=తాళపత్రం (=తాటాకు), డాలు (చపేటే=చెంప పెట్టు - నీడా), వస్తువులను తాకటం; తత్ర తత్ర - ఇతివచనే, సింధౌ (చ), సుకృతిక్రమే=అక్కడనే అక్కడనే అని అనటం, సముద్రం, మంచిపనుల క్రమం; సంబుద్ధేత్రు), పురోగే (అపి), ఖడ్గ రూపస్య ధారణే=సంబోధించటం, ముందుపోవటం, కత్తి యొక్క రూపం చూపటం; మాసే, సంవత్సరే, వర్షదినే, (తథా) సమ్మార్జనే=నెల,సంవత్సరం, వర్షం పడుతున్న రోజు (వర్షే, దినే=వర్షం, రోజు - నీడా), తుడవటం (కళ్లాపి చల్లటం - కుమారస్వామి); ఏవం, అర్థేషు=ఇటువంటి (=పైన పేర్కొన్నటువంటి), అర్థాలను ప్రదర్శించటంలో; పతాక హస్తభావనాః, యుజ్యంతే=పతాకహస్తంయొక్క ఆలోచనలు, తగును.

తాత్పర్యం : బొటన వ్రేలు వంచి, తక్కిన నాల్గు వ్రేళ్ళను దగ్గరగాచేర్చి,చాచివట్లయితే, ఆ హస్తం 'పతాకహస్తం' అవుతుంది.

నాట్య ప్రారంభం, మేఘం, వనం, వస్తువులను నిషేధించటం, బొమ్మ, రాత్రి, నది, దేవతా సమూహం, అశ్వం, ఖండనం, వాయువు, శయనించటం, వెళ్ళే ప్రయత్నం, ప్రతాపం, అనుగ్రహం, వెన్నెల, ఎర్రని ఎండ, తలుపులు తెరవటం లేదా తట్టటం, ఏడు విభక్తులను చెప్పటం, అలలు, వీధిలో ప్రవేశించటం, సమత్వం, గంధాదులు పూసుకొనటం, 'నేను' అనటం, శపథం, తూష్ణీంభావం, ఆశీర్వాదం, రాజశ్రేష్ఠుడనటం, తాలపత్రం, డాలు లేదా చెంప పెట్టు, వస్తువులను తాకటం, అక్కడనే అక్కడనే అనటం, సముద్రం, మంచి పనులని చెప్పటం, సంబోధన, ముందుపోవటం, కత్తి యొక్క రూపం నిరూపించటం, మాసం, సంవత్సరం, వర్షం, రోజు లేదా వర్షపురోజు, తుడవటం లేదా కల్లాపి చల్లటం — ఇటువంటి వాటిని ప్రదర్శించటంలో పతాక హస్తం వినియోగపడుతుంది.

టీక : భరతముని చెప్పిన పతాక హస్తం, ఇది ఒక్కటే. అన్ని హస్తాలలోనూ ప్రధానమైనది, ప్రథమంగా ఉండేది పతాక హస్తమే. ఈ హస్తంలోని వ్రేళ్ళు చిరు మార్పులు పొందితే, పెక్కు ఇతర హస్తాలు ఏర్పడతాయి; పతాకంలోని అనామిక వంగితే త్రిపతాకం అవుతుంది. పతాక హస్తంలోని అరచేయి దొప్పగా అయితే సర్పశీర్షం అవుతుంది — ఇట్లాగే మరికొన్ని హస్తాలు ఏర్పడతాయి.

కథాకలి సంప్రదాయంలో మాత్రం 'పతాక', 'త్రిపతాక' అయింది; త్రిపతాక, పతాక అయింది. ఈ సంప్రదాయంలో త్రిపతాక హస్తానికి (అంటే భరతుని — పతాక హస్తానికి) అసంయుత హస్తంగా ఎక్కువ వినియోగం లేదట !

## వేరే గ్రంథంలో పతాక హస్తం :

సంలగ్నః తర్జనీమూలే యత్రాంగుష్ఠో నికుంచితః ॥ 280

ప్రసారిత తలాంగుల్యః పతాకః ప్రభవేత్ కరః ।
ఏకాకినా పురా ధాత్రా పరబ్రహ్మసమాగమే ॥ 281

జయేతి స్తుతివేళాయాం పతాకస్యో ఉ ఉ కృతిః కరః ।
యతో ఖేజే తతో లోకే పతాక ఇతి విశ్రుతః ॥ 282

అతఏవ సమస్తానాం హస్తానా మయమాదిమః ।
పతాకో బ్రహ్మణోజాతః శ్వేతవర్ణో ఋషిః శివః ॥ 283

బ్రహ్మజాతిః భవేత్తస్య పరబ్రహ్మ ఉ ధి దైవతమ్ ।
జయేతివచనే మేఘే నిషేధే విపినే నిశి ॥ 284

యాహీతివచనే యానే వాహే మరుతి వక్షసి ।
పురఃపుణ్యేదాతిశయే ప్రవాహే విబుధాలయే ॥ 285

హాహాకారే చంద్రికాయా మాతపే సురమండలే ।
అర్గళాపుటనే కుడ్యే ఖండనే పరితోషణే ॥ 286

కపోలే చందనాలేపే కృపాణే వారివారణే ।
సమూహే సైన్యసన్నాహే సమయే భయవారణే ॥ 287

అపాశ్రయే అవచయే పిధానే శయనే భువి ।
జ్వాలాసు వర్షధారాసు తరంగే పక్షిపక్షకే । 288

ప్రభువిజ్ఞాపనే ఉ త్రేతివాక్యే యాదృశితాదృశి ।
చపేటే వస్తుసంస్పర్శే సరస్యా మంగమర్దనే ॥ 289

వ్యాజస్తుతే ప్రతాపే చ దేవతానాంనివేదనే ।

పార్శ్వశ్లేషే పతాకాయాం ప్రవాతే వసనాంచలే ॥ 240

శైత్యే తాపే ధాళధళ్యే ఛాయాయాం వత్సరే ఋతౌ ।
అయనే వాసరే పక్షే మాసే స్వచ్ఛే మహాకులే ॥ 241

సమాసన్నే పాలయేతిలాలయేతిచభాషణే ।
బ్రహ్మజాతౌ శుభ్రవర్ణే పతాకో ఽ యం నియుజ్యతే ॥ 242

అర్థం: యత్ర = ఎక్కడ(= ఏ హస్తంలో); అంగుష్ఠః, నికుంచితః = బొటన వ్రేలు, వంచబడినదై ; తర్జనీమూలే, సంలగ్నః = చూపుడు వ్రేలు మొదట, చేర్చబడుతుందో; ప్రసారితతల - అంగుల్యః = అరచేయి, (తక్కిన) వ్రేళ్ళు చాచి ఉంటాయో (ఆ హస్తం నుంచి) ; పతాకః కరః, ప్రభవేత్ = పతాక హస్తం పుడుతుంది (= అది పతాక హస్తం అవుతుంది).

పురా = పూర్వం ; ఏకాకినా, ధాత్రా = ఒంటరి అయిన, ధాత (= బ్రహ్మ) చేత ; పరబ్రహ్మ, సమాగమే = పరబ్రహ్మ యొక్క, సందర్శనంలో (= ఒంటరిగా బ్రహ్మ, పరబ్రహ్మను సందర్శించినప్పుడు) ; స్తుతి, వేళాయాం = స్తోత్రం చేసే, సమయంలో ; జయ, ఇతి = జయ (జయ), అని ; పతాకస్య, ఆకృతిః కరః = పతాక (= జెండా) యొక్క, ఆకారంగా ఉన్న హస్తం ; యతః, ధృతః, తతః = ఎప్పుడు, పొందెనో (= పట్టెనో), అప్పటి నుంచి (ఆ హస్తం) ; లోకే, పతాక, ఇతి, విశ్రుతః = లోకంలో, పతాక (హస్తం), అని, ప్రసిద్ధిపొందింది; అతః ఏవ, అయం = అందుచేతనే, అది (= ఆ పతాక హస్తం) ; సమస్తానాం, హస్తానాం, ఆదిమః = అన్ని హస్తాలకు, మొదటిది (అయింది).

పతాకః, బ్రహ్మణః, జాతః = పతాక (హస్తం), బ్రహ్మవల్ల, పుట్టింది; వర్ణః, శ్వేతః = రంగు, తెలుపు ; ఋషిః, శివః = ఋషి, శివుడు ; బ్రహ్మ, జాతిః = బ్రాహ్మణ, జాతి (కి చెందింది) ; బ్రహ్మ, అధిదైవతమ్ = పరబ్రహ్మము అధిదైవతం.

జయ - ఇతివచనే, మేఘే, నిషేధే, విపినే, నిశి = జయ (జయ) అని చెప్పటం, మేఘం, నిషేధం, అడవి, రాత్రి ; యాహి - ఇతి వచనే, యానే, వాహే, మరుతి, వశుని = పో అని చెప్పటం, నడక, వాహనం (గుర్రం - నీడా), గాలి, బొమ్మ ; పురః, పుణ్యే (చ), అతిశయే, ప్రవాహే, విబుధాలయే = ఎదుట, పుణ్యం, అతిశయం, ప్రవాహం, దేవ (విద్వాంసుల - కుమారస్వామి) లోకం ; హాహా కారే, చంద్రికాయాం, ఆతపే, సురమండలే = హాహాకారం, వెన్నెల, ఎండ, దేవతా సమూహం (దేవలోకం - కుమారస్వామి); అర్గళాపుటనే, కుడ్యే, ఖండనే, పరితోషణే = గడియ తీయటం (అడ్డు తొలగించటం - కుమారస్వామి), గోడ, నరకటం, సంతోష పర్చటం ; కపోలే, చందనాలేపే, కృపాణే, వారివారణే = చెక్కిలి, గంధం పూయటం, కత్తి, నీటికి అడ్డుకట్టవేయటం ; సమూహే, సైన్య సన్నాహే, సమయే, భయవారణే = గుంపు, సైన్యాన్ని ఆయత్తపర్చటం, నియమం లేదా ప్రతిజ్ఞ (హద్దు-కుమారస్వామి), భయం పోగొట్టటం (దీనినే అభయముద్ర అంటారు); అపాశ్రయే, అపచయే, పిధానే, శయనే, భువి = ఆశ్రయం లేకపోవటం, తరిగి పోవటం, కప్పటం, శయనించటం, భూమి; జ్వాలాను, వర్ష ధారాసు, తరంగే, పక్షిపక్షకే = మంటలు, వానధారలు, అల, పక్షిరెక్క ; ప్రభు విజ్ఞాపనే, అత్ర-ఇతివాక్యే, యాదృశితాదృశి = ప్రభువుకు విజ్ఞప్తి చేయటం, ఇక్కడ అని చెప్పటం, ఎట్టిదో అట్టిది అనటం; చపేటే, వస్తు సంస్పర్శే, సరస్యాం, అంగమర్దనే = చెంపపెట్టు, వస్తువులను తాకటం, సరస్సు, అవయవాలను మర్దించటం; వ్యాజస్తుతౌ, ప్రతాపే(చ), దేవతానాం నివేదనే = వ్యాజస్తుతి( = కపటస్తోత్రం), ప్రతాపం, దేవతా నివేదనం; పార్శ్వాశ్లేషే, పతాకాయాం, ప్రవాతే, వసనాంచలే = ప్రక్కలను కౌగిలించటం, పతాక, పెద్దగాలి, కొంగు; శైత్యే, తాలే, ధాళధళ్యే, ఛాయాయాం, వత్సరే. ఋతౌ = చలి, ఉక్క, తళతళ, నీడ, సంవత్సరం, ఋతువు; అయనే, వాసరే, పక్షే, మాసే, స్వచ్ఛే, మహాకులే = అయనం ( = 6 మాసాల కాలం), దివం, పక్షం, మాసం, స్వచ్ఛత, గొప్పవంశం; సమాసన్నే, పాలయ-

ఇతి-లాలయ-ఇతి(చ) భాషణే = సమీపించటం, పాలించు-లాలించు అని అనటం; బ్రహ్మజాతౌ, శుభ్రవర్ణే = బ్రాహ్మణజాతి, తెలుపు రంగు — ఈ అర్థాల నన్నింటిని నిరూపించటంతో; అయం, పతాకః, నియుజ్యతే = ఈ, పతాక (హస్తం), వినియోగపడుతున్నది.

తాత్పర్యం : హస్తంలోని బొటనవ్రేలును వంచి, చూపుడు వ్రేలు మొదట చేర్చి, అరచేతిని తక్కిన నాలుగు వ్రేళ్ళను చాచినచో 'పతాక హస్తం' ఏర్పడుతుంది.

పూర్వం, ధాత ఒంటరిగా పరబ్రహ్మను సందర్శించి, పతాక ఆకారంగా హస్తం పట్టి, 'జయజయ' అని స్తుతించినప్పుడు 'పతాక హస్తం' జన్మించింది. అందుచేతనే ఇది అన్ని హస్తాలకు మొదటి హస్తం అయింది. కాగా పతాకహస్తం బ్రహ్మవల్ల పుట్టింది. రంగు తెలుపు. ఋషి శివుడు. బ్రాహ్మణ జాతి. అధిదైవతం పరబ్రహ్మ.

జయజయ అని చెప్పటం, మేఘం, నిషేధించటం, అడవి, రాత్రి, 'పో' అని చెప్పటం, నడక, గుఱ్ఱం, గాలి, రొమ్ము, ఎదుట, పుణ్యం, అతిశయం, ప్రవాహం, దేవలోకం లేదా విద్వాంసులు, హాహాకారం, వెన్నెల, ఎండ, దేవతా సమూహం లేదా దేవలోకం, గడియ తీయటం లేదా అడ్డు తొలగించటం, గోడ, నరకటం, సంతోషపర్చటం, చెక్కిలి, గంధం పూయటం, కత్తి, నీటికి అడ్డుకట్ట వేయటం, గుంపు, సైన్యాన్ని ఆయత్తపరచటం, నియమం లేదా ప్రతిజ్ఞ, భయం పోగొట్టటం, ఆశ్రయం లేకపోవటం, తరిగిపోవటం, కప్పటం, భూమి, మంటలు, వానధార, అల, పక్షి రెక్క, ప్రభువునకు విజ్ఞప్తి చేయటం, ఇక్కడ అని చెప్పటం, ఎట్టిదో అట్టిది అనటం, చెంపపెట్టు, వస్తువులను తాకటం, సరస్సు, అవయవాలను మర్దించట, వ్యాజస్తుతి, ప్రతాపం, దేవతలకు నివేదనం, ప్రక్కలను కౌగిలించటం, పతాక, పెద్దగాలి, కొంగు, చలి, ఉక్క, తళతళ, నీడ, సంవత్సరం, ఋతువు, అయనం (= 6 నెలలు), దినం, పక్షం, మాసం, స్వచ్ఛత, గొప్పవంశం, సమీపించటం, పాలించు- లాలించు

అనటం, శయనించటం, బ్రాహ్మణజాతి,శుభ్రవర్ణం — ఈ అర్థాలను నిరూపించటంలో పతాకహస్తం వినియోగపడుతుంది.

టీక : నందికేశుడు చెప్పిన పతాక లక్షణం, ఈ లక్షణం సమానమే. అంతేకాక పతాకహస్తం యొక్క పుట్టుక, జాతి, ఋషి, రంగు, అధిదేవత- ఇవి అధికంగా చెప్పబడినవి. ఇట్లాగే చాలావరకు తక్కిన హస్తాలకు కూడా ఇవి చెప్పబడినవి. నందికేశుడు చెప్పిన వినియోగాలు 41 మాత్రమే ఉన్నాయి. ఈ గ్రంథాంతర వినియోగాలు 70 వరకు ఉన్నాయి. శుభంకరుడు తన 'హస్త ముక్తావళి' లో 213 వినియోగాలు చెప్పి, వాటిని సూచించే విధానం కూడా విశదం చేసినాడు. కుంచితమైన అంగుష్ఠం, తర్జని యొక్క మొదట ఉండాలని ఇచ్చట అధికంగా చెప్పబడింది.

## 2. త్రిపతాక హస్తం :



స ఏవ త్రిపతాకః స్యాత్ వక్రితానామికాంగులిః।
మకుటే వృక్షభావే చ వజ్రే తద్ధరవాసవే ॥ 243

కేతకీకుసుమే దీపే వహ్నిజ్వాలావిజృంభణే ।
కపోలే పత్రలేఖాయాం బాణార్థే పరివర్తనే ॥ 244
స్త్రీపుంసయోః సమాయోగే యుజ్యతే త్రిపతాకకః ।

అర్థం : సః, ఏవ = అదే (= ముందు చెప్పిన పతాక హస్తమే); అనామికా-అంగులిః, వక్రితా = అనామిక (= ఉంగరపు వ్రేలు) వంచబడినది (అయితే); త్రిపతాకః, స్యాత్ = (అది) త్రిపతాక (హస్త)ం, అవుతుంది.

మకుటే, వృక్ష భావే (చ), వజ్రే, తద్ధరవాసవే = కిరీటం, వృక్షం అనే భావన, వజ్రం, వజ్రధారి అయిన ఇంద్రుడు; కేతకీ కుసుమే, దీపే, వహ్నిజ్వాలావిజృంభణే = మొగలిపువ్వు, దీపం, అగ్నిజ్వాలలు పైకి లేవటం; కపోలే, పత్రలేఖాయాం, బాణార్థే, పరివర్తనే = కపోలం (= చెక్కిలి) (కపోతం = పావురం-ఘోష్),

(వక్షఃస్థలం మొదలైన చోట్ల) మకరికాది పత్రరచన, బాణం, పరివర్తనం (చుట్టూ తిరగటం-ఘోష్,మార్పు-నీడా); స్త్రీపుంసయోః, సమాయోగే = స్త్రీ పురుషుల కలయిక (ఈ వినియోగం ఘోష్‌లో లేదు) — ఈ అర్థాలను అభినయించటంలో; త్రిపతాకః, యుజ్యతే = త్రిపతాకహస్తం, వినియోగపడుతుంది (పతాకం = జెండా).

తాత్పర్యం : పతాక హస్తంలోని అనామికను వంచితే, అది 'త్రిపతాక హస్తం' అవుతుంది.

కిరీటం, వృక్షభావన, వజ్రాయుధం, ఇంద్రుడు, మొగలిపువ్వు, దీపం, అగ్నిజ్వాలలు పైకిలేవటం, చెక్కిలి, కపోలం లేదా పావురం, మకరికా పత్రరచన, బాణం, పరివర్తనం, స్త్రీ-పురుష సమాయోగం — ఈ అర్థాలను - ప్రదర్శించటంలో త్రిపతాకహస్తం వినియోగపడుతుంది.

టీక : భరతముని చెప్పిన త్రిపతాక హస్తం, ఇదీ ఒక్కటే. కథాకళి సంప్రదాయంలో దీనిని 'పతాకహస్తం' అంటారు.

## వేరే గ్రంథంలో త్రిపతాక హస్తం :

పతాకేఽ నామికా వక్రా త్రిపతాకకరో భవేత్ ॥ 245

శక్రేణాఽఽదౌ యతో వజ్రం పస్పర్శేఽనామికాం వినా ।
పతాకస్యత్రిభాగేన త్రిపతాక ఇతి స్మృతః ॥ 246

పానవాత్త్రిపతాకోఽయం జజ్ఞే తస్య ఋషిర్గుహః ।
రక్తవర్ణో క్షత్రజాతి రధిదేవో మహేశ్వరః ॥ 247

ఆవాహనేఽవతరణే వదనోన్నమనే నతౌ ।
స్పర్శే శుభానాం ద్రవ్యాణా మంకనే ఽనాదరే ఖలే ॥ 248

సన్దేహే మకుటే వృక్షే పానవే కులిశాయుధే ।
అలకాపనయే దీపే తిలకోష్ణీషధారణే ॥ 249

కటుగంధరవాలాప్తై ర్నానాకర్ణన్యసంవృతౌ ।
అశ్వనమ్మార్జనే బాణే కేతక్యాంపత్రలేఖనే ॥ 250

పాతే ఖగవిశేషాణాం కిలికిలావిజృంభణే ।
క్షత్రజాతౌ రక్తవర్ణే త్రిపతాకో నియుజ్యతే ॥ 251

అర్థం : పతాకే, అనామికా, వక్రా = పతాక (హస్తం)లో, అనామిక (= ఉంగరపు వేలు), వంచబడినది (అయితే); త్రిపతాక కరః, భవేత్ = త్రిపతాకహస్తం అవుతుంది.

ఆదౌ,యతః = పూర్వం, ఎందువల్ల ; శక్రేణ = ఇంద్రునిచేత; అనామికాంవినా, పతాకస్యత్రిభాగేన = అనామికనువదలి, పతాక హస్తంలోని మూడుభాగాల (= వేళ్ళ) చేత; వజ్రం, పస్పర్శే, త్రిపతాకః, ఇతి,స్మృతః = వజ్రాయుధం, పట్టుకొనబడిందో, (అందు వల్ల) త్రిపతాక (హస్త)ం, అని, స్మరింపబడింది.

అయం, త్రిపతాకః, వాసవాత్, జజ్ఞే = ఈ, త్రిపతాక (హస్త)ం, ఇంద్రునివల్ల, జన్మించింది; తస్య, ఋషిః, గుహః = దాని యొక్క, ఋషి, గుహుడు (= కుమారస్వామి); రక్త, వర్ణః = ఎరుపు, రంగు; క్షత్ర, జాతిః = క్షత్రియ, జాతి; అధిదేవః, మహేశ్వరః = అధిదేవుడు, మహేశ్వరుడు.

ఆవాహనే, అవతరణే, వదన-ఉన్నమనే, నతౌ = ఆవాహనం, అవతరణం (= దిగటం), ముఖంపైకెత్తటం క్రిందికి వంచటం; శుభానాం ద్రవ్యాణాం స్పర్శే, అంకనే, అనాదరే, ఖలే = మంగళప్రదాలైన వస్తువులను తాకటం, గుర్తించటం, అనాదరం, దుర్జనుడు; సందేహే, ముకుటే, వృక్షే, వాసవే, కులిశాయుధే = సందేహం, కిరీటం, వృక్షం, ఇంద్రుడు, వజ్రాయుధం; అలక-అపనయే, దీపే, తిలక-ఉష్ణీషధారణే = ముంగురులను పైకి త్రోయటం, దీపం, బొట్టుపెట్టుకొనటం, తలపాగ ధరించటం; కటు

గంధ-రవ-ఆలాపైః, నాసా-కర్ణస్య సంవృతౌ = భరింపరాని వాసన, కర్ణకఠోరమైన శబ్దం- మాటలవల్ల, ముక్కు చెవులు మూసుకొనటం; అశ్వసమ్మార్జనే, బాణే, కేతక్యాం,పత్రలేఖనే = గుఱ్ఱాన్ని తోమటం, బాణం, మొగలిపువ్వు, మకరికాది పత్రరచన; ఖగ విశేషాణాం పాతే, కీలికీలా విజృంభణే = కొన్ని పక్షుల యొక్క పతనం, అగ్ని జ్వాలలు పైకి లేవటం; క్షత్రిజాతౌ, రక్తవర్ణే = క్షత్రియజాతి, ఎరుపురంగు — ఈ అర్థాలను ప్రదర్శించటంలో; త్రిపతాకః నియుజ్యతే = త్రిపతాక (హస్త)ం నియోగింపబడుతున్నది.

తాత్పర్యం : పతాకహస్తంలోని అనామికను వంచితే, త్రిపతాకహస్తం ఏర్పడుతుంది.

పూర్వం, ఇంద్రుడు అనామికను వదలి పతాకంయొక్క త్రి( = మూడు) భాగాలతోను వజ్రాయుధాన్ని ధరించటంచేత త్రిపతాకహస్తం ఏర్పడింది. ఇది ఇంద్రునివల్ల జన్మించింది. దీనికి ఋషిగుహుడు. రంగుఎరుపు. క్షత్రియజాతి. మహేశ్వరుడు అధిదేవత.

ఆవాహనం, అవతరణం, వదనం పైకెత్తటం లేదా దించటం, మంగళప్రదములైన వస్తువులను స్పృశించటం, గుర్తించటం లేదా లెక్కించటం, దుర్జనుడు, సందేహం, కిరీటం, వృక్షం, ఇంద్రుడు, వజ్రాయుధం, ముంగురులు దిద్దటం, దీపం, బొట్టుపెట్టుకొనటం, తలపాగ ధరించటం, భరింపరాని వాసనవల్ల కర్ణకఠోరాలైన శబ్దాలవల్ల, మాటలవల్ల ముక్కు చెవి మూసుకొనటం, గుర్రమును తోమటం, బాణం, మొగలిపువ్వు, మకరికాది పత్రరచన, కొన్ని పక్షులయొక్క పతనం, అగ్నిజ్వాలల విజృంభణ, క్షత్రియ జాతి, ఎరుపురంగు- వీటిని నిరూపించటంలో త్రిపతాకహస్తం వినియోగపడుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన త్రిపతాకహస్తం, ఇదీ ఒక్కటే. ఇక్కడ జన్మాదులు అధికంగా చెప్పబడినవి.

## 3. అర్ధపతాక హస్తం :




త్రిపతాకే కనిష్ఠాచేత్ వక్రితాఽర్ధపతాకకః ।
పల్లవే ఫలకే తీరేఽప్యుభయో రితి వాచకే ॥ 252

క్రకచే ఛురికాయాం చ ధ్వజే గోపురశృంగయోః ।
యుజ్యతేఽర్ధపతాకోఽయం తత్తత్కర్మ ప్రయోగతః॥ 253

అర్థం : త్రిపతాకే, కనిష్ఠా, వక్రితాచేత్ = త్రిపతాక (హస్తం)లో, చిటికెనవ్రేలు, వంచబడినది అయితే (అది); అర్ధపతాక(క) (హస్తం అవుతుంది).

పల్లవే, ఫలకే, తీరే (అపి), ఉభయోః ఇతి వాచకే = చిగురు, పలక, తీరం (=గట్టు), ఇద్దరు అని చెప్పటం; క్రకచే, ఛురికాయాం (చ), ధ్వజే, గోపుర-శృంగయోః = అంపం, చురకత్తి, ధ్వజం, గోపురం, కొమ్ము — వీటి అర్థాలను ప్రదర్శించటంలో; తత్ తత్ కర్మ, ప్రయోగతః = ఆయా కర్మల, ప్రయోగాన్ని అనుసరించి; అయం, అర్ధపతాకః, యుజ్యతే = ఈ, అర్ధపతాక (హస్తం) యోజింపబడుతుంది.

తాత్పర్యం : త్రిపతాక హస్తంలోని చిటికెన వ్రేలిని వంచితే, అర్ధపతాక హస్తం ఏర్పడుతుంది.

చిగురు, పలక, తీరం, ఇద్దరు అని చెప్పటం, అంపం, చురకత్తి, ధ్వజం, గోపురం, కొమ్ము - వీటిని ప్రదర్శించటంలో అర్థానుసారంగా అర్ధపతాక హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : దీనిని భరతముని చెప్పలేదు. దీనికి గ్రంథాంతర లక్షణ-వినియోగాలు కూడా లేవు. త్రిపతాకలో అనామిక వక్రంకాగా, ఇందులో కనిష్ఠిక కూడా వక్రం అవుతుంది.

## 4. కర్తరీముఖ హస్తం :



అస్యైవ చాపి హస్తస్య తర్జనీ చ కనిష్ఠికా ।
బహిః ప్రసారితే ద్వే చేత్ స కరః కర్తరీముఖః ॥ 254

స్త్రీ పుంసయోస్తు విశ్లేషే విపర్యాసపదే ఽపి వా ।
లుంఠనే నయనాంతే చ మరణే భేదభావనే ॥ 255

విద్యుదర్థే ఽప్యేకశయ్యా విరహే పతనే తథా ।
లతాయాం యుజ్యతే యస్తు స కరః కర్తరీముఖః ॥ 256

అర్థం: అస్య - ఏవ (చ) (అపి), హస్తస్య = దాని (= త్రిపతాక హస్తం) యొక్క: తర్జనీ (చ) - కనిష్ఠికా ద్వే = చూపుడు వ్రేలు, చిటికెన వ్రేలు అనే రెండూ; బహిః, ప్రసారితే చేత్ = వెలుపలికి చాపబడితే; సః కరః, కర్తరీ ముఖః = ఆ హస్తం, కర్తరీ ముఖ (హస్తం) అవుతుంది.

స్త్రీ పుంసయోః (తు) విశ్లేషే, విపర్యాసపదే (అపి) (వా) = స్త్రీ - పురుషుల ఎడబాటు, వ్యతిరేకత లేదా వెనుకకు తిరగటం; లుంఠనే, నయన - అంతే (చ), మరణే, భేదభావనే = దొంగిలించటం, కనుకొలకులు, మరణం, భేదించటం; విద్యుత్ - అర్థే (అపి), ఏకశయ్యా విరహే, పతనే (తథా), లతాయాం = మెఱుపు, విరహంతో ఒంటరిగా శయనించటం, క్రిందపడటం, లత - — వీటి అర్థాలను ప్రదర్శించటంలో; యః కరః, యుజ్యతే = ఏ హస్తం, ప్రయుక్తమైనదో; సః, కర్తరీముఖః = అది (= ఆ హస్తం), కర్తరీముఖం అవుతుంది (కర్తరి = కత్తెర).

తాత్పర్యం : త్రిపతాక హస్తంలోని తర్జనిని, కనిష్ఠికను వెలుపలికి చాచితే, 'కర్తరీముఖ హస్తం' ఏర్పడుతుంది.

స్త్రీ పురుషుల ఎడబాటు, వ్యతిరేకత లేదా వెనుకకు

తిరగటం, దొంగిలించటం, కనుకొలకులు, మరణం, భేదించటం, మెఱుపు, విరహంతో ఒంటరిగా శయనించటం, క్రిందపడటం, తీగె - వీటి అర్థాలను అభినయించటంలో కర్తరీముఖ హస్తం వినియోగ పడుతుంది.

టీక : అస్య - ఏవ అన్నదానికి 'అర్ధ పతాకం' అని నీడా అర్థం వ్రాశారు ; కాని దీనికి 'త్రిపతాకం' అన్న అర్థమే సమంజసం. భరతముని చెప్పిన కర్తరీముఖం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో కర్తరీ హస్తం :

త్రిపతాకే బహిర్యాతా తర్జనీ యది కర్తరీ ।
శశాంకశేఖరః పూర్వం జటాధరవధం ప్రతి ॥ 257

చక్రం లిలేఖ తర్జన్యా నిక్షిప్య భువి మధ్యమామ్ ।
తదాప్రభృతి కర్తర్యుత్పన్నేతి మునిభిః స్మృతా ॥ 258

కర్తరిః శంకరాజ్జాతః ఋషిః పర్జన్యదేవతా ।
క్షత్రజాతిః తామ్రవర్ణః చక్రపాణి రధీశ్వరః ॥ 259

పాదాలక్తక నిర్మాణే పతనే లేఖ్యవాచకే ।
దంపత్యోఃవిరహే చైవ విపర్యాసే రమాధవే ॥ 260

చపలాయా మేకశయ్యావియోగే మహిషే మృగే ।
చామరే శైలశృంగే చ వారణే వృషభే గవి ॥ 261

కేశపాశస్య శోధిన్యాం క్షత్రియే తామ్రవర్ణకే ।
కర్తర్యాం గోపురే సో ఽ యం కర్తరీ వినియుజ్యతే ॥ 262

అర్థం : త్రిపతాకే, తర్జనీ, బహిః యాతా యది = త్రిపతాక (హస్తం) లోని, చూపుడు వ్రేలు, వెలుపలికి వస్తే (అది) ; కర్తరీ = కర్తరీ (ముఖహస్తం అవుతుంది).

పూర్వం, శశాంకశేఖరః = పూర్వం, ఇందుశేఖరుడు (=శివుడు) ; జటాధరవధం ప్రతి=జటాధర (రాక్షస) సంహారం నిమిత్తం ; భువి, మధ్యమాం, నిక్షిప్య=భూమిలో, నడిమి వ్రేలును, జొన్పి ; తర్జన్యా, చక్రం, లిలేఖ=చూపుడు వ్రేలితో, చక్రాన్ని, గీసినాడు ; తదా ప్రభృతి, కర్తరీ, ఉత్పన్నా, ఇతి, మునిభిః, స్మృతా = అప్పటినుంచే, కర్తరీ (ముఖహస్తం), జన్మించింది, అని, మునిచేత, తలంచబడింది ; కర్తరిః, శంకరాత్, జాతః=(ఇట్లా) కర్తరీ (ముఖహస్తం), శంకరునివల్ల, జన్మించింది; ఋషిః, పర్జన్య దేవతా=ఋషి, పర్జన్య దేవుడు (=వర్షాధిపతి) ; క్షత్ర, జాతిః= క్షత్రియ, జాతి ; తామ్ర, వర్ణః=రాగి, రంగు ; చక్రపాణిః, అధీశ్వరః=చక్రపాణి (=విష్ణువు), అధిదేవత.

పాద - అలక్తక నిర్మాణే, పతనే, లేఖ్యవాచకే=కాళ్ళకు లత్తుక (=పారాణి) పెట్టటం, క్రింద పడటం, వ్రాసిన దానిని చదవటం ; దంపత్యోః విరహే (చ) (ఏవ), విపర్యాసే, రమాధవే=దంపతుల యొక్క విరహం, వ్యత్యాసం, విష్ణువు ; చపలాయాం, ఏకశయ్యా వియోగే, మహిషే, మృగే= మెఱుపు, ఏకశయ్యా విరహం, మహిషం, మృగం (=లేడి); చామరే, శైలశృంగే (చ), వారణే, వృషభే, గవి=వింజామరం, కొండ శిఖరం, ఏనుగు, వృషభం (=ఎద్దు), ఆవు ; కేశపాశస్య శోధిన్యాం, క్షత్త్రియే, తామ్రవర్ణకే=దువ్వెన, క్షత్రియుడు, రాగి రంగు ; కర్తర్యాం, గోపురే=కత్తెర, గోపురం - వీటి అర్థాలను ప్రదర్శించటంలో ; సః, అయం, కర్తరీ వినియుజ్యతే= ఆయీ కర్తరీ (ముఖ హస్తం) వినియోగపడుతున్నది.

తాత్పర్యం : త్రిపతాక హస్తంలోని తర్జనిని వెలుపలికి చాపితే, అది 'కర్తరీ (ముఖ) హస్తం' అవుతున్నది.

పూర్వం శివుడు, జటాధరాసురుని సంహరించే నిమిత్తం

భూమిలో నడిమి వ్రేలును జొన్పి, చూపుడు వ్రేలుతో చక్రం గీసి నాడు. అప్పటినుంచీ కర్తరీ ముఖ హస్తం ఉత్పన్నమైనదని ముని అభిప్రాయం. కాగా కర్తరీ ముఖహస్తం శంకరునివల్ల జన్మించింది. ఋషి పర్జన్యదేవుడు. క్షత్రియ జాతి. విష్ణువు అధిదైవం.

కాళ్ళకు లత్తుక పెట్టటం, క్రిందపడటం, వ్రాసిన దానిని చదవటం, దంపతుల విరహం, వ్యత్యాసం, విష్ణువు, మెఱుపు, ఒంటరిగా లేదా ఒకే శయ్యమీదపరుండి విరహం అనుభవించటం, మహిషం, లేడి, వింజామర, కొండశిఖరం, ఏనుగు, ఎద్దు, ఆవు, దువ్వెన, క్షత్రియుడు, రాగిరంగు, కత్తెర, గోపురం — వీటిని అభినయించటంలో కర్తరీ (ముఖ) హస్తం వినియోగపడుతుంది.

టీక : ఇచ్చట పేర్కొనబడిన ముని భరతముని కాదగును. కాని, నాట్య శాస్త్రంలో ఈ కథ లేదు. 'కర్తరి' అనటం కంటే 'కర్తరీ ముఖం' అనటం సర్వ సాధారణం. ఇంతకు ముందు తర్జనితో పాటు కనిష్ఠిక కూడా వెలుపలికి రావాలని ఉంది. కాని, ఇక్కడ ఒక్క తర్జని మాత్రమే చెప్పబడింది.

## 5. మయూర హస్తం :




అస్మిన్ననామికాంగుష్ఠౌ శ్లిష్టౌ చాన్యాః ప్రసారితాః ।
మయూర హస్తః కథితః కరటీకావిచక్షణైః ॥ 263

మయూరాస్యే లతాయాం చ శకునే వమనే తథా ।
అలకస్యాపనయనే లలాటతిలకేషు చ ॥ 264

నేత్రస్యోదకవిక్షేపే శాస్త్రవాదే ప్రసిద్ధకే ।
ఏవ మర్థేషు యుజ్యంతే మయూరకరభావనాః ॥ 265

అర్థం : అస్మిన్ = అందు (= ఆ కర్తరీ ముఖహస్తం) లో ; అనామికా - అంగుష్ఠౌ, శ్లిష్టౌ (చ) = ఉంగరపు వ్రేలు, బొటన వ్రేలు(చివరలు)కలియగా; అన్యాః, ప్రసారితాః = తక్కిన వ్రేళ్ళు, పైకి ప్రసారితాలు అయితే (అది); మయూర హస్తం, కరటీకా

విచక్షణైః, కథితః=మయూర హస్తం (అవుతుంది అని), కర (=హస్తము) లను వ్యాఖ్యానించటంలో నేర్పరులైన వారి చేత, చెప్పబడింది.

మయూర-ఆస్యే, లతాయాం (చ), శకునే, (తథా) వమనే= నెమిలి ముఖం, తీగె, పక్షి, కక్కటం ; అలకస్య - అపనయనే, లలాట- తిలకేషు (చ)=ముంగురులు సరిదిద్దటం,లలాటం, తిలకం నేత్రస్య - ఉదక విక్షేపే, శాస్త్రవాదే, ప్రసిద్ధకే=కన్నీరు (కొన గోటితో) పైకి చిమ్మటం (నద్యుదకస్య నిక్షేపే=నదీజలాన్ని నిక్షేపించటం - ఘోష్), శాస్త్ర చర్చ, ప్రసిద్ధ విషయం ; ఏవం, అర్థేషు=ఈ విధాలైన, అర్థాలలో (=పైన చెప్పిన అర్థాలను ప్రదర్శించటంలో) ; మయూర కరభావనాః, యుజ్యంతే=మయూర హస్త విన్యాసాలు, యోజింపబడినవి (మయూరం=నెమిలి).

తాత్పర్యం : కర్తరీ ముఖ హస్తంలోని అనామికా- అంగుష్ఠాల చివరలు సంశ్లిష్టాలు, తక్కిన వ్రేళ్ళు ప్రసారితాలు అయితే అది 'మయూర హస్తం' అవుతుంది.

నెమిలి ముఖం, తీగె, పక్షి, కక్కటం,ముంగురులు సరిదిద్దటం లేదా పైకి త్రోయటం, లలాటం, తిలకం, కన్నీరు గోటితో విదలించటం, శాస్త్ర చర్చ, ప్రసిద్ధ విషయం - ఈ అర్థాలను అభినయించటంలో మయూర హస్తం వినియోగపడుతుంది.

టీక : దీనికి గ్రంథాంతర లక్షణ వినియోగాలు చెప్పలేదు. ఈ హస్తం నాట్య శాస్త్రంలో లేదు.

## 6. అర్ధచంద్ర హస్తం




అర్ధచంద్రకరః సో ఽ యం పతాకే ఽం గుష్ఠసారణాత్ ।
చంద్రే కృష్ణాష్టమీభాజి గళహస్తార్థకే ఽ పి చ ॥ 266
భల్లాయుధే దేవతానామభిషేచన కర్మణి ।
భుక్పాత్రే చోద్భవే కట్యాం చింతాయా మాత్మవాచకే ॥ 267
ధ్యానే చ ప్రార్థనే చా పి అంగానాంస్పర్శనే తథా ।
ప్రాకృతానాం నమస్కారే ఽ వ్యర్ధచంద్రో నియుజ్యతే ॥ 268

అర్థం : పతాకే, అంగుష్ఠ సారణాత్ = పతాక హస్తంలోని అంగుష్ఠాన్ని (దూరంగా) చాచటంవల్ల; అయం సః అర్ధచంద్రకరః = ఈయది, అర్ధ చంద్ర హస్తం (అవుతుంది) (అర్ధచంద్రుడు = సగం చంద్రుడు లేదా నెలవంక).

కృష్ణ- అష్టమీ భాజిచంద్రే, గళహస్తార్థకే (అపి) (చ) = కృష్ణ పక్షంలోని అష్టమినాటి చంద్రుడు, మెడపట్టి గెంటటం (దీనినే అర్ధచంద్ర ప్రయోగం అంటారు) ; భల్ల ఆయుధే, దేవతానామ్ అభిషేచన కర్మణి = భల్లము అనే ఆయుధం, దేవతను అభిషేకించ టం ; భుక్ పాత్రే (చ), ఉద్భవే, కట్యాం, చింతాయాం, ఆత్మ వాచకే = భుజించే పాత్ర (= కంచం), పుట్టుక, కటి ( = మొల), చింత, తన్ను తాను చెప్పుకొనటం ; ధ్యానే (చ), ప్రార్థనే (చ) (అపి), (తథా) అంగానాం స్పర్శనే = ధ్యానం, ప్రార్థించటం, అవయవాలను స్పృశించటం ; ప్రాకృతానాం నమస్కారే (అపి) =

సామాన్యులు (సామాన్యులకు - కుమారస్వామి) చేసే నమస్కారం (సలాం చేయటం - నీడా)—వీటి అర్థాలను ప్రదర్శించటంలో ; అర్ధచంద్రః, నియుజ్యతే = అర్ధచంద్ర (హస్త)ం, విధింపబడుతున్నది.

తాత్పర్యం : పతాక హస్తంలోని బొటన వ్రేలిని దూరంగా చాచితే, అది 'అర్ధచంద్రహస్తం' అవుతుంది.

కృష్ణ పక్షంలోని అష్టమినాటి చంద్రుడు, మెడపట్టి గెంటటం, భల్లాయుధం, దేవతాభిషేచనం, కంచం, పుట్టుక, మొల, చింత, తన్నుతాను చెప్పుకొనటం, ధ్యానం, ప్రార్థించటం, అవయవాలను తాకటం, ప్రాకృతులు లేదా ప్రాకృతులకు చేసే నమస్కారం - వీటి అర్థాలను ప్రదర్శించటంలో అర్ధచంద్ర హస్తం విధింపబడింది.

టీక : భరతముని చెప్పిన అర్ధచంద్ర హస్తం, ఇదీ ఒక్కటే. బొటన వ్రేలికి, తక్కిన వ్రేళ్ళకు మధ్యభాగం ధనురాకారంగా వంపు దేరి ఉండాలని భరతముని చెప్పినాడు.

## వేరే గ్రంథంలో అర్ధచంద్ర హస్తం :

పతాకే విరళాంగుష్ఠే సో ఽర్ధచంద్రకరో భవేత్ ।
భూషణేచ్ఛావతః శభో రతసీముకుళాకృతిః ॥ 269

జాతః చంద్రాదర్ధచంద్రః ఋషి రస్యా ఽత్రిరుచ్యతే ।
వైశ్యజాతిః గౌరవర్ణో మహాదేవో ఽధిదేవతా ॥ 270

వలయే మణిబంధే చ దర్పణన్యాసరూపణే ।
ఆశ్చర్యే చ ప్రయాసే దావ్యమితే నిఖిలేషు చ ॥ 271

తాళమానే మౌళిబంధనిర్మాణే బాలపాదపే ।
ఖేదాత్కపోలవహనే గజకర్ణనిరూపణే ॥ 272

యువార్థే చ సమర్థే చ శశాంకే ప్రాకృతానతౌ ।
అభిషేకే భ్రూలతాయా మంశుకే కార్ముకే ఒధికే ॥ 273
కటిపట్టదృఢీకారే కలశారచనే ఒంగకే ।
చరణాభినయే బాలవహనే వక్ష్యమాంగకే ॥ 274
గౌరవర్ణో వైశ్యజాతా వర్ధచంద్రో నియుజ్యతే ।

అర్థం : పతాకే, విరళ - అంగుష్ఠే = పతాక హస్తంలో, బొటనవ్రేలు ఎడంగా ఉంటే; సః, అర్ధచంద్రకరః, భవేత్ = అది, అర్ధచంద్ర హస్తం, అవుతుంది.

అర్ధచంద్రః = అర్ధ చంద్ర (హస్తం) ; భూషణ - ఇచ్ఛాభవతః, శంభోః చంద్రాత్, జాతః = ఆభరణాల మీద కోరికగల, శంభుని యొక్క, (తలమీది) చంద్రుని వల్ల, జన్మించింది ; అతసీముకుళ, ఆకృతిః = (ఇది) అవిసె మొగ్గ, ఆకారం కలది ; అస్య, ఋషిః, అత్రిః, ఉచ్యతే = దీని యొక్క, ఋషి, అత్రి (మహర్షి అని), చెప్ప బడుతున్నది ; వైశ్యజాతిః = వైశ్యజాతి ; గౌరవర్ణః = గౌరవర్ణం ; మహాదేవః, అధిదేవతా = మహాదేవుడు, అధిదేవత.

వలయే, మణిబంధే (చ), దర్పణస్య నిరూపణే = కంకణం, మణికట్టు, అద్దం చూపటం ; ఆశ్చర్యే (చ), ప్రయాసే (చ) (అపి), అమితే, నిఖిలేషు (చ) = ఆశ్చర్యం, ప్రయాసం (ప్రయత్నం — కుమారస్వామి), మితంలేమి, సర్వస్వం ; తాళమానే, మౌళిబంధ నిర్మాణే, బాలపాదపే = తాళం వేయటం, సిగముడి వేయటం, లేతచెట్టు ; ఖేదాత్ కపోల వహనే, గజకర్ణ నిరూపణే = దుఃఖం వల్ల చెక్కిలి మీద చేయి చేర్చటం, ఏనుగు చెవులను నిరూపించటం ; యువార్థే (చ), సమర్థే (చ), శశాంకే, ప్రాకృతానతౌ = యౌవనవంతుడు, సమర్థుడు, చంద్రుడు, ప్రాకృతులకు (= సామాన్యులకు) నమస్కరించటం ; అభిషేకే, భ్రూలతాయాం, అంశుకే, కార్ముకే, అధికే = అభిషేకం, కనుబొమ, పల్చని వస్త్రం, ధనుస్సు, ఆధిక్యం ; కటిపట్ట దృఢీకారే, కలశారచనే, అంగకే =

నడుముకట్టు బిగించటం, కుండలు చేయటం, శరీరం ; చరణ - అభి నయే, బాలవహనే, పశ్చిమాంగకే = పాదాభినయం, బిడ్డను ఎత్తు కొనటం, వీపు ; గౌరవర్ణే, వైశ్యాజాతౌ = గౌరవర్ణం, వైశ్యజాతి — ఈ అర్థాలను ప్రదర్శించటంలో ; అర్ధ చంద్రః, నియుజ్యతే = అర్ధ చంద్ర (హస్త)ం, విధింపబడుతున్నది.

తాత్పర్యం : పతాక హస్తంలోని అంగుష్ఠం తక్కిన వ్రేళ్ళకు ఎడంగా ఉంటే, ఆ హస్తం 'అర్ధ చంద్ర హస్తం అవుతుంది.

ఆభరణాల మీద ప్రీతిగల శివుని యొక్క తలమీది చంద్రుని వల్ల ఇది జన్మించింది. అవిసె మొగ్గ ఆకారంలో ఉంటుంది. ఋషి అత్రిమహాముని. వైశ్య జాతి. గౌరవర్ణం. మహాదేవుడు అధిదేవత.

కంకణం, మణి కట్టు, అద్దం చూడటం, ఆశ్చర్యం, ప్రయాసం లేదా ప్రయత్నం, మితం లేమి, సర్వం, తాళం వేయటం, సిగ ముడి వేయటం, లేత చెట్టు, దుఃఖంతో చెక్కిలి మీద చేయి చేర్చటం, ఏనుగు చెవులు, యువకుడు, సమర్థుడు, చంద్రుడు, ప్రాకృతులకు నమస్కరించటం, అభిషేకం, కనుబొమ, పల్చని వస్త్రం, ధనుస్సు, ఆధిక్యం, నడుము కట్టు బిగించటం, కుండలు చేయటం, శరీరం, పాదాభినయం, బిడ్డను ఎత్తుకొనటం, వీపు, గౌరవర్ణం, వైశ్యాజాతి- వీటి అర్థాలను ప్రదర్శించటంలో అర్ధ చంద్ర హస్తం వినియోగ పడుతుంది.

టీక : 'గజకర్ణ నిరూపణే...' 'యువార్థే...' ఈ రెండు పాదాలకు మధ్య ఒక పాదం మూలంలో లోపించింది. నీడా అను వాదంలో మాత్రం "తప్పుచేసిన వారిని వెడల గొట్టటం, నొసటి చెమట తుడవటం" అని అధికంగా ఉంది ; కాగా దీని సంస్కృత మూలం లోపించినదన్న మాట. ఇంతకు ముందు చెప్పిన అర్ధచంద్ర హస్తం, ఇదీ ఒక్కటే.

## 7. అరాళ హస్తం :




పతాకే తర్జనీ వక్రా నామ్నా సోఽయ మరాలకః ॥ 275
విషామృతాది పానేషు ప్రచండపవనే ఽ పిచ ।
యుజ్యతే ఽ రాలహస్తో ఽ యం భరతాగమకోవిదైః ॥ 276

అర్థం : పతాకే, తర్జనీ, వక్రా = పతాక హస్తంలోని, తర్జని, వంచబడినది (అయితే); నామ్నా, అయం సః, అరాలకః = పేరు చేత, అది 'అరాలక (హస్తం)' అవుతుంది.

విష - అమృత - ఆది పానేషు = విషం అమృతం మొదలయినవి త్రాగటం; ప్రచండపవనే (అపి) (చ) = ప్రచండంగా వీచే గాలి — వీటిని నిరూపించటంలో; అయం, అరాల హస్తః, భరత - ఆగమకోవిదైః, యుజ్యతే = ఈ, అరాళ హస్తం, నాట్య వేదవేత్తల చేత, యోజింపబడుతున్నది (అరాళం = వంకరగా ఉన్నది).

తాత్పర్యం : పతాక హస్తంలోని తర్జనిని వంచితే, అరాల హస్తం ఏర్పడుతుంది. విషం, అమృతం మొదలయినవి త్రాగటం, ప్రచండంగా వీచే గాలి — వీటిని ప్రదర్శించటంలో అరాల హస్తం ప్రయుక్తమవుతుందని నాట్య శాస్త్రవేత్తల మతం.

టీక : చివరి పాదం ఘోష్ పాఠంలో లేదు. తర్జని ధనురాకారంగా వక్రం కావాలనీ. అంగుష్ఠం కూడా కొంచెం వక్రం కావాలనీ భరతముని చెప్పినాడు (అయితే రెండూ కలియరాదు).

## వేరే గ్రంథంలో అరాళ హస్తం :



పతాకాంగుష్ఠ తర్జన్యౌ వక్రితౌ స్యాత్ అరాళకః ।
సప్తానాం జలధీనాం య ఆపోశనకృతే పురా ॥ 277
అరాళః కుంభజాత్ జాతః స ఏవ ఋషిః ఉచ్యతే ।
పాటలాంశు ర్మిశ్రజాతి ర్వాసుదేవోఽధిదేవతా ॥ 278
ఏవ మేత స్యానుపూర్వ్యం వదంతి భరతాదయః ।
ఆపోశనే బ్రాహ్మణానామాశీర్వచన కర్మణి ॥ 279
విటానాంప్రియవైముఖ్యే కేశానాం చ విశీర్ణకే ।
ఆయాహిశ్రీఘ్ర మిత్యుక్తౌ సంధ్యాకర్మ ప్రదక్షిణే ॥ 280
లలాటస్వేదహరణే కజ్జలాలేపనే దృశోః ।
ఏవమాదిషు యుజ్యంతే అరాళకర భావనాః ॥ 281

అర్థం : పతాక - అంగుష్ఠ - తర్జన్యౌ, వక్రితౌ = పతాక హస్తంలోని అంగుష్ఠం, తర్జని, వంచబడినవి (అయితే, ఆ హస్తం) ; అరాళకః స్యాత్ = అరాళ (క హస్త) ం అవుతుంది.

పురా = పూర్వం ; సప్తానాం, జలధీనాం = ఏడు, సముద్రాల యొక్క; ఆపోశవ కృతే=ఆపోశనం కొరకు (హస్తం పట్టిన); కుంభజాత్, అరాళః, జాతః = అగస్త్యునివల్ల, అరాళ హస్తం, పుట్టినది ; సః ఏవ, ఋషిః ఉచ్యతే = (దీనికి) అతడే (= అగస్త్యుడే), ఋషి (అని), చెప్పబడుతున్నది ; పాటల - అంశుః = పాటల వర్ణం; మిశ్రజాతిః = మిశ్రజాతి (కి చెందింది) ; వాసుదేవః, అధిదేవతా =

వాసుదేవుడు, అధిదేవత; ఏతస్య, ఆనుపూర్వ్యం = ఈ హస్తం యొక్క, ఆనుపూర్విని ; ఏవం, భరతాదయః, వదంతి = ఇటువంటిది (అని), భరతుడు మొదలగు వారు, చెప్పుచున్నారు.

బ్రాహ్మణానాం అపోశనే, ఆశీర్వచన కర్మణి = బ్రాహ్మణుల యొక్క అపోశనం, ఆశీర్వచన క్రియ ; విటానాం ప్రియ వైముఖ్యే, కేశానాం (చ) విశీర్ణకే = ప్రియల యెడ విటులు చూపే విముఖత్వం, జుట్టు చిక్కుతీయటం ; ఆయాహి శీఘ్రం ఇతి - ఉక్తౌ, సంధ్యాకర్మ ప్రదక్షిణే = వేగంగా రా అని చెప్పటం, సంధ్యా వందన సమయంలోని ప్రదక్షిణ ; లలాట స్వేదవారణే, దృశోః కజ్జలాలేపనే = నొసట పట్టిన చెమట తుడువటం, కనులకు కాటుక పెట్టుకొనటం ; ఏవమాదిషు, అరాళకర భావనాః, యుజ్యంతే = ఇటువంటి పనులలో, అరాళహస్త ప్రయోగాలు, తగును.

తాత్పర్యం : పతాక హస్తంలోని అంగుష్ఠాన్ని, తర్జనిని వంచితే, 'అరాళ (క) హస్తం' ఏర్పడుతుంది. పూర్వం సప్త సముద్రాలను అపోశనం చేస్తున్న అగస్త్యునివల్ల ఇది పుట్టింది. పాటల వర్ణం. మిశ్రజాతి. వాసుదేవుడు అధిదేవత — ఇట్లా ఈ హస్తం యొక్క అనుపూర్విని భరతాదులు చెప్పుచున్నారు.

బ్రాహ్మణుల అపోశనం, ఆశీర్వచనం, ప్రియురాండ్ర మీద విటుల వైముఖ్యం, జుట్టు చిక్కుతీయటం, వేగంగా రమ్మనటం, సంధ్యావందన సమయ ప్రదక్షిణం, నొసలు మీది చెమట పోగొట్టటం, కనులకు కాటుక పెట్టుకొనటం మొదలయిన వాటిని నిరూపించటంలో అరాల హస్తం తగును.

టీక : భరతముని చెప్పిన అరాల హస్తం, ఇదీ ఒక్కటే. హస్తాలకు జనన - జాతి - వర్ణ - అధిదేవతలను భరతముని చెప్ప లేదు. 'భరతాదులు' అనటం ఈ సంప్రదాయానికి బలం సంపాదించు కొనటానికి మాత్రమే.

## 8. శుకతుండ హస్తం :



అస్మి న్ననామికా వక్రా శుకతుండకరో భవేత్ ।
బాణప్రయోగే కుంతార్థే మర్మోక్తా వుగ్రభావనే ॥ 282
శుకతుండకరో జ్ఞేయో భరతాగమవేదిభిః ।

అర్థం : అస్మిన్, అనామికా, వక్రా = దాని (= అరాళ హస్తం) లోని, అనామిక, వంచబడినది (అయితే) ; శుకతుండ కరః, భవేత్ = (అది) శుకతుండ హస్తం, అవుతుంది.

బాణ ప్రయోగే, కుంత-అర్థే, మర్మ - ఉక్త్యౌ, ఉగ్రభావనే = బాణ ప్రయోగం, ఈటె అనే అర్థం, మర్మపుమాట, తీక్ష్ణ భావం — వీటిని ప్రదర్శించటంలో ; భరతాగమ వేదిభిః = నాట్య వేదవేత్తల చేత ; శుకతుండకరః, జ్ఞేయః = శుకతుండ హస్తం, తెలిసికొనవలసినది (= ప్రయోగింపదగినది) (శుకతుండం = చిలుక ముక్కు).

తాత్పర్యం : అరాళ హస్తంలోని అనామికను వంచితే, 'శుక తుండ హస్తం' ఏర్పడుతుంది.

బాణప్రయోగం, ఈటె అనే అర్థం, మర్మపు మాట, తీక్ష్ణ భావం - వీటిని అభినయించటంలో శుకతుండ హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : చివరి రెండు పాదాలు ఘోష్ పాఠంలో క్రింది విధంగా ఉన్నాయి.

బాణప్రయోగే కుంతార్థే వాఽఽ లయస్య స్మృతిక్రమే ।
మర్మోక్త్యాముగ్ర భావేషు శుకతుండో నియుజ్యతే ॥

ఇందులో 'ఆలయస్య స్మృతిక్రమే' (=సొంత ఇంటి విష యం జ్ఞప్తికి తెచ్చుకొనటం) అధికంగా ఉంది.

భరతముని చెప్పిన శుకతుండ హస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో శుకతుండ హస్తం :

వక్రౌ పతాకతర్జన్యనామికౌ శుకతుండకః ॥ 283

నటయిత్వా ప్రేమకోపం నాథం ప్రతి సదాశివమ్ ॥

దుర్గాయాః శుకతుండాఖ్యో దుర్వాసో ఋషి రుచ్యతే ॥ 284

ద్విజాన్వయః శోణవర్ణో దేవతా ఽ న్యమరీచికః ।

బ్రహ్మాస్త్రే స్యాత్ ముఖాగ్రే చ కౌటిల్యే పరివర్తనే ॥ 285

భిండిపాలే చ భావ్యర్థే క్రమణే కలహే ఽ పి చ ।

అనాదరే ప్రేమకోపే ఆశయే చ విసర్జనే ॥ 286

ద్యూతాక్షపాతే కుంతార్థే శుకశారి నిరూపణే ।

ఉగ్రభావే చ మర్మోక్తౌ తామ్రే బ్రాహ్మణ జాతిజః ॥ 287

శుకతుండకరో భావనేతృభిః పరికీర్తితః ।

అర్థం: పతాక తర్జనీ - అనామికౌ వక్రౌ = పతాక హస్తం లోని తర్జని, అనామిక వంచబడినవి (అయితే); శుకతుండః = శుక తుండ (హస్త)ం ఏర్పడుతుంది.

నాథం, సదాశివం, ప్రతి = నాథుడైన, సదాశివుని, యెడ; ప్రేమకోపం, నటయిత్వా = ప్రణయ కోపం, నటించి (న); దుర్గాయాః, శుకతుండ - ఆఖ్యః ఉచ్యతే = దుర్గాదేవి వల్ల, శుక తుండం అనే పేరుగల (హస్తం జనిమించినదని), చెప్పబడుతున్నది; ఋషిః దుర్వాసః = ఋషి, దుర్వాసుడు; ద్విజ-అన్వయః = బ్రాహ్మణ, జాతి; శోణ, వర్ణః = ఎరుపు, రంగు; అన్యదేవతా; మరీచికః = దీని యొక్క (అధి) దేవత మరీచిక (= ఎండమావి).

బ్రహ్మాస్త్రే, ముఖ-అగ్రే (చ), కౌటిల్యే, పరివర్తనే-స్యాత్ = బ్రహ్మాస్త్రం, ముఖం చివర (=ముక్కు, వంకర, మార్పు (= వెనుదిరుగుట - కుమారస్వామి) — (వీటిని నిరూపించటంలో ఈ హస్తం) అవుతుంది; ఖిండిపాలే (చ), భావి-అర్థే, క్రమణే, కలహే (అపి) (చ) = ఖిండిపాలం (అనే ఆయుధం), జరుగబోవు దాని సూచన, అతిక్రమించటం (= దాటటం), కలహం; అనాదరే, ప్రేమకోపే, ఆశయే (చ), విసర్జనే = అనాదరం, ప్రణయకోపం, అభిప్రాయం, విడుపు; ద్యూత-అతపాతే, కుంత-అర్థే, శుకశారి నిరూపణే = జూదంలో పాచికలు వేయటం, ఈటె అనే అర్థం, చిలుకలు గోరువంకలు సూచింపబడటం ; ఉగ్రభావే (చ), మర్మ - ఉక్తౌ, తామ్రే = తీక్ష్ణమైన భావం, మర్మపుమాట, తామ్రవర్ణం — వీటి అర్థాలను నిరూపించటంలో; బ్రహ్మణ జాతిజః, శుకతుండ కరః = బ్రహ్మణ జాతికి చెందిన, శుకతుండ హస్తం ; భావనేతృభిః, పరికీర్తితః = భావవేత్తల చేత, కీర్తింపబడింది.

తాత్పర్యం : పతాక హస్తంలోని అనామికను, తర్జనిని వంచితే శుకతుండ (క) హస్తం ఏర్పడుతుంది. నాథుడైన సదా శివుని మీద ప్రణయకోపం నటించిన దుర్గాదేవివల్ల ఈ శుకతుండ హస్తం జన్మించింది. దుర్వాసుడు ఋషి. ద్విజ జాతి. రక్తవర్ణం. అధిదేవత మరీచిక.

బ్రహ్మాస్త్రం, ముక్కు, వంకర, మార్పు లేదా వెనుదిరగటం, ఖిండిపాలం, భావిసూచన, దాటటం, కలహం, అనాదరం, ప్రణయ కోపం, అభిప్రాయం, విడుపు, పాచికలు వేయటం, ఈటె, చిలుకలు, గోరువంకలు, తీక్ష్ణభావం, మర్మపు మాట, తామ్ర వర్ణం - ఈ అర్థాలను నిరూపించటంలో భావవేత్తలు బ్రాహ్మణ జాతిదైన శుకతుండ హస్తం ప్రయోగిస్తారు.

టీక : ఇంతకుముందు చెప్పిన శుకతుండ హస్తం, ఇదీ ఒక్కటే.

## 9. ముష్టి హస్తం :



మేలనా దంగుళీనాం చ కుంచితానాం తలాంతరే ॥ 288

అంగుష్ఠశ్చోపరియుతో ముష్టిహస్తోఽయ మీర్యతే ।

స్థిరే కచగ్రహే దార్ఢ్యే వస్త్వాదీనాంచ ధారణే ॥ 289

మల్లానాంయుద్ధభావే చ ముష్టిహస్తోఽయ ముచ్యతే ।

అర్థం : తలాంతరే, కుంచితానాం = అరచేతిలోనికి, వంగిన; అంగుళీనాం (చ), మేలనాత్ = నాలుగు వేళ్ళను, దగ్గరగా చేర్చటం వల్ల ; ఉపరియుతః, అంగుష్ఠః = (ఆ నాలుగు వేళ్ళ) పైని చేర్చిన, అంగుష్ఠం (వల్ల) ; అయం, ముష్టి హస్తః, ఈర్యతే = (ఇట్లా ఏర్పడిన) ఇది, ముష్టి హస్తం (అని), చెప్పబడుతున్నది.

స్థిరే, కచగ్రహే, దార్ఢ్యే, వస్త్వాదీనాంచ ధారణే = స్థిరత్వం, సిగ లేదా జడ పట్టుకొనటం, దృఢత్వం, వస్తువులు మొదలగు వాటిని ధరించటం ; మల్లానాం, యుద్ధభావే (చ) = మల్లురు, యుద్ధం చేయటం అనే భావన — వీటి అర్థం ప్రదర్శించటంలో ; అయం, ముష్టి హస్తః, ఉచ్యతే = ఈ, ముష్టి హస్తం, చెప్పబడుతున్నది (ముష్టి = పిడికిలి).

తాత్పర్యం : నాలుగు వేళ్ళను దగ్గరకుచేర్చి, అరచేతిలోనికి వంచి, వాటిపై బొటన వ్రేలు చేర్చితే, అది 'ముష్టి హస్తం' అవుతుంది.

స్థిరత్వం, కచగ్రహణం, దృఢత్వం, వస్తువులు మొదలగు వాటిని పట్టుకొనటం, మల్లయుద్ధం — వీటిని అభినయించటంలో ముష్టిహస్తం ఉపయోగపడుతుంది.

టీక : నిర్వచనంలోని రెండవపాదం 'నీడా పాఠం'లో ఇట్లా

ఉంది — 'అంగుష్ఠేనోపరియుతో ముష్టిహస్తోఽయముచ్యతే'. అర్థం సమానమే. భరతముని చెప్పిన ముష్టిహస్తం, ఇదీ ఒక్కటే.

కథాకళి సంప్రదాయంలో ముష్టి హస్తం రెండు విధాలుగా ఉంది — 1. బొటనవ్రేలు తర్జని మీదనే ఉన్న స్థితి ; 2. బొటనవ్రేలు, లోపలి నుంచి నడిమివ్రేలు ఉంగరపు వ్రేలు మధ్యగా పైకి వచ్చిన స్థితి. మొదటి విధమే ఇచ్చట చెప్పబడింది.

## వేరే గ్రంథంలో ముష్టి హస్తం :

మధ్యోపరికృతాంగుష్ఠో ముష్టిః ముష్ట్యాకృతిః కరః ॥ 290
మధుకైటభయోః యుద్ధే జాతో విష్ణో రయం కరః ।
అమరేంద్రో ఋషి ర్నీలః శూద్రః చంద్రోఽధిదేవతా ॥ 291
ఆలంబనే మధ్యభావే ఫలే సంకేతభావనే ।
శస్త్రార్థే బలిదానే చ ప్రణామే ప్రాకృతైః కృతే ॥ 292
ఊరు సంవహనే ఘంటాగ్రహణే ఽతిప్రధావనే ।
లాఘవే మల్లయుద్ధే చ ఖేటకాదిగ్రహే స్థిరే ॥ 293
కచాకర్షే ముష్టిఘాతే గదాకుంతాదిధారణే ।
నీలవర్ణే శూద్రజాతౌ ముష్టిహస్తోఽయ ముచ్యతే ॥ 294

అర్థం : మధ్య - ఉపరికృతః, అంగుష్ఠః = నడిమి వ్రేలి మీద ఉంచబడిన, అంగుష్ఠం (కలది) ; ముష్టి - ఆకృతిః, ముష్టిః కరః = ముష్టి (= పిడికిలి) ఆకారంగా ఉన్నది, ముష్టిహస్తం (అవుతుంది).

మధుకైటభయోః, యుద్ధే = మధు కైటభుల (నబడే రాక్షసుల) తోడి యుద్ధంలో ; అయం, కరః, విష్ణోః, జాతః = ఈ, హస్తం, విష్ణువు వల్ల జనించింది ; అమరేంద్రః, ఋషిః = ఇంద్రుడు, ఋషి; నీలః, శూద్రః, చంద్రః అధిదేవతా = నీలపురంగు, శూద్రజాతి, చంద్రుడు అధిదేవత.

ఆలంబనే, మధ్యభావే, ఫలే, సంకేత భావనే = ఆలంబనం (= పట్టు), మధ్యస్థం అనే భావం (నడుము - కుమారస్వామి), ప్రయోజనం (ఫలం-కుమారస్వామి), సంకేతం అనే భావం (అంగీకారం - కుమారస్వామి); భద్ర-అర్థే, బలిదానే (చ), ప్రాకృతైః కృతే ప్రణామే = క్షేమం అనే అర్థం, బలి ఇవ్వటం, ప్రాకృత జనం చేసే నమస్కారం; ఊరు సంవహనే, ఘంటాగ్రహణే, అతిప్రధావనే = తొడలు పిసకటం (= కాళ్ళుపట్టటం) (గట్టిపట్టు - నీడా), గంట పట్టుకొనటం, వడిగా పరుగెత్తటం; లాఘవే, మల్లయుద్ధే (చ), ఖేట - ఆదిగ్రహే, స్థిరే = నైపుణ్యం, మల్లయుద్ధం, డాలు మొదలగు వాటిని పట్టుకొనటం, నిలుకడ; కచ-ఆకర్షే, ముష్టి ఘాతే, గదాకుంతాది ధారణే = జుట్టు పట్టుకొనటం లేదా సవరించటం, పిడికిలి పోటు, గద ఈటె మొదలయిన వాటిని ధరించటం; నీలవర్ణే, శూద్రజాతౌ = నీలవర్ణం, శూద్ర జాతి — ఈ అర్థాలను, ప్రదర్శించటంలో; అయం, ముష్టిహస్తః, ఉచ్యతే = ఈ,ముష్టిహస్తం చెప్పబడుతున్నది.

తాత్పర్యం : అంగుష్ఠాన్ని నడిమి వ్రేలి మీద ఉంచగా, పిడికిలి ఆకారంగా ఉన్నది 'ముష్టిహస్తం' అవుతుంది. మధుకైటభులతో యుద్ధం చేస్తున్న విష్ణువువల్ల ఈ హస్తం జన్మించింది. ఋషి ఇంద్రుడు. నీలవర్ణం. శూద్రజాతి. చంద్రుడు అధిదేవత.

ఆలంబనం, మధ్యస్థ భావం, ఫలం, సంకేతం, క్షేమం, బలి, ప్రాకృత జనంచేసే నమస్కారం, ఊరు సంవహనం, ఘంటాగ్రహణం, వడిగా పరుగెత్తటం, నైపుణ్యం, మల్లయుద్ధం, డాలు మొదలగు వాటిని పట్టుకొనటం, నిలుకడ, కచాకర్షణ, ముష్టిఘాతం, గదకుంతాదులను ధరించటం, నీలవర్ణం, శూద్రజాతి — ఈ అర్థాలను ప్రదర్శించటంలో ముష్టిహస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన ముష్టిహస్తం, ఇదీ ఒక్కటే.

## 10. శిఖర హస్తం :



చేన్ముష్టి రున్నతాంగుష్ఠః స ఏవ శిఖరః కరః ।
మదనే కార్ముకే స్తంభే నిశ్చయే పితృకర్మణి॥295
ఓష్ఠే ప్రవిష్టరూపే చ రదనే ప్రశ్నభావనే ।
లింగే నాస్తీతివచనే స్మరణేఽభినయాంతరే॥ 296
కటిబంధాకర్షణే చ పరిరంభవిధౌ ధవే ।
శక్తితోమరయోః మోక్షే ఘంటానాదే చ పేషణే ॥ 297
శిఖరో యుజ్యతే సోఽయం భరతాగమవేదిభిః ।

అర్థం : ముష్టిః, ఉన్నత-అంగుష్ఠః, చేత్ = ముష్టి (హస్తం), పైకి ఎత్తబడిన అంగుష్ఠం కలది, అయితే; సఏవ, శిఖరః కరః = అదే, శిఖరహస్తం (అవుతుంది).

మదనే, కార్ముకే, స్తంభే, నిశ్చయే, పితృకర్మణి = మన్మథుడు, ధనుస్సు, స్తంభం, నిశ్చయం (నిశ్శబ్దే = నిశ్శబ్దంలో-నీడా) పితృకర్మ (పితృతర్పణే = పితృతర్పణంలో-నీడా); ఓష్ఠే, ప్రవిష్టరూపే (చ), రదనే, ప్రశ్నభావే = పెదవి, ప్రవేశించేవిధం, దంతం, ప్రశ్నించటం; లింగే, నాస్తి-ఇతివచనే, స్మరణే, అభినయాంతరే = లింగం (అంగే = అవయవంలో-నీడా), లేదు అనేమాట, జ్ఞప్తికి తెచ్చుకొనటం, అభినయంలో మార్పు; కటిబంధ-ఆకర్షణే (చ), పరిరంభ విధౌ, ధవే = నడుముకట్టు లాగటం, కౌగిలించుకొనే పద్ధతి, భర్త; శక్తితోమరయోః మోక్షే, ఘంటానాదే (చ), పేషణే = శక్తితోమరం (మొదలయిన ఆయుధాలను) ప్రయోగించటం, ఘంటానాదం, పిండిచేయుటం - ఈ అర్థాలను అభినయించటంలో; సఃఅయం, శిఖరః, భరతాగమవేదిభిః, యుజ్యతే = ఆయీ, శిఖరహస్తం, భరతవేదవేత్తలచేత, వినియోగింపబడుతున్నది. (శిఖరం = కొండ కొన).

తాత్పర్యం : ముష్టి హస్తంలోని అంగుష్ఠం పైకి ఎత్తబడితే శిఖరహస్తం ఏర్పడుతుంది.

మన్మథుడు, ధనస్సు, స్తంభం, నిశ్చయం లేదా నిశ్శబ్దం, పితృ కర్మ లేదా పితృ తర్పణం, పెదవి, ప్రవేశించేవిధం, దంతం, ప్రశ్నించటం, లింగం (= చిహ్నం) లేదా అంగం, లేదు అనే మాట, జ్ఞప్తికి తెచ్చుకోనటం, అభినయంమార్పు, నడుముకట్టుకొనటం, కౌగిలించుకొనటం, భర్త, శక్తితోమరములను ప్రయోగించటం, ఘంటానాదం, పిండిచేయటం - ఈ అర్థాలను అభినయించటంలో శిఖర హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : శక్తితోమరయోః...అనే పాదం ఘోష్ పాఠంలో లేదు. భరతముని చెప్పిన శిఖరహస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో శిఖర హస్తం :

ముష్టి రూర్ధ్వకృతాంగుష్ఠః స ఏవ శిఖరః కరః ॥ 298

సుమేరుం కార్ముకీకృత్య తన్మధ్యే చంద్రశేఖరః ।
హస్తేన యేన జగ్రాహ సోఽ భవత్ శిఖరః కరః ॥ 299

శిఖరో మేరుధనుషో జాతః తస్య ఋషిః జినః ।
గంధర్వజాతిః శ్యామాంశుః అధీశో రతివల్లభః ॥ 300

పితౄణాం తర్పణే స్థైర్యే కుటుంబస్థాపనే ఽపి చ ।
నాయకే శిఖరే మిత్రే తిర్యక్ చేత్ దంతధావనే ॥ 301

వ్యజనేతాలవృంతస్య భేదే కిమితిభాషణే ।
శృంగారవయసఃపానే చతుస్సంఖ్యావిభావనే ॥ 302

శక్తితోమరయోఃమోక్షే ఫలాంశకపరిగ్రహే ।
విలాసినీనమ్రభావే లజ్జాయాం కార్ముకే స్మరే ॥ 303

పురుషే నిశ్చయే స్తంభే ఘంటానాదే చ నర్తనే ।
నాస్తీతివచనే దానే స్థాయిభావే వినాయకే ॥ 304

మహిషాసురమర్దన్యాం పీఠాంకే హాయవల్గనే।
అర్ధచంద్రాది తిలకే కబరీచిహ్నధారణే॥ 305
ఇంద్రనీలే గాథభావే శిఖరః సంప్రయుజ్యతే।

అర్థం: ముష్టిః, ఊర్ధ్వ కృత-అంగుష్ఠః = ముష్టి (హస్తం), పైకి చాచిన అంగుష్ఠం కలది (అయితే); సఃఏవ కరః శిఖరః = ఆ హస్తమే, శిఖర (హస్తం అవుతుంది).

(పూర్వం త్రిపురాసుర సంహార సమయంలో); చంద్రశేఖరః సుమేరుం, కార్ముకీకృత్య = శివుడు, మేరు పర్వతాన్ని, ధనస్సుగా చేసుకొని; యేనహస్తేన తత్-మధ్యే, జగ్రాహ = ఏ హస్తంతో, దాని నడిమి భాగాన్ని, పట్టుకొనెనో; సః శిఖరః కరః అభవత్ = అది (= ఆ హస్తం), శిఖరహస్తం, అయింది; మేరు ధనుషః, శిఖరః జాతః = మేరువు ధనస్సుగా కల శివునినుండి, శిఖర (హస్తం) జన్మించింది; తస్య, ఋషిః జినః = దానియొక్క, ఋషి, జినుడు; గంధర్వజాతిః, శ్యామ-అంశుః, అధిశః రతివల్లభః = గంధర్వజాతి, శ్యామవర్ణం, అధిదేవత రతివల్లభుడు (= మన్మథుడు).

పితౄణాం తర్పణే, స్థైర్యే, కుటుంబస్థాపనే (అపి) (చ) = పితృదేవతలకు తర్పణమివ్వటం, స్థిరత్వం, కుటుంబాన్ని నిలుపట ; నాయకే, శిఖరే, మిత్రే, తిర్యక్ చేత్ దంతధావనే = నాయకుడు, శిఖరం, మిత్రుడు, అడ్డంగాపడితే దంతధావనం (= పళ్ళు తోమట ); తాలవృంతస్యవ్యజనే, భేదే, కిమ్-ఇతి భాషణే = విసన కఱ్ఱ యొక్క (= తో) విసరటం, భేదం ఏమిటి ? అని అడగటం; భృంగారపయసః పానే, చతుః సంఖ్యావిభావనే = పాత్ర నుండి నీళ్ళు త్రాగటం, నాలుగు (అని) లెక్క పెట్టటం, శక్తి-తోమరయోః మోక్షే, ఫలాంశక పరిగ్రహే = శక్తి తోమరం మొదలగు ఆయుధాలను ప్రయోగించట , ఫలాంశమును పరిగ్రహించటం; విలాసినీ నమ్రభావే, లజ్జాంశ ం కార్ముకే, స్మరే = విలాసవతుల నమ్రభావం (= అణుకువ), సిగ్గు, విల్లు, మన్మథుడు; పురుషే, నిశ్చయే, స్తంభే, ఘంటా

నాదే (చ), వర్తనే = భర్త, నిశ్చయం, స్తంభం, ఘంటానాదం, నర్తనం: న- అస్తి ఇతివచనే, దానే, స్థాయిభావే, వినాయకే = లేదు అనేమాట, దానం, నిలుకడ, వినాయకుడు; మహిషాసురమర్దన్యాం, వీరాంశే, హయవల్గనే = మహిషాసుర మర్దని, వీరుడు, అశ్వగతి; అర్ధచంద్ర - ఆది తిలకే, కబరీ చిహ్నధారణే, ఇంద్రనీలే, గాఢ భావే = అర్ధచంద్ర తిలకం మొదలగు తిలకములు, కొప్పుగురుతును చూపటం, ఇంద్రనీలమణి, దృఢత్వం - ఈ అర్థములందు; శిఖరం సంప్రయుజ్యతే = శిఖర (హస్తం) ప్రయోగింపబడుతున్నది.

తాత్పర్యం: ముష్టిహస్తమందలి అంగుష్ఠాన్ని పైకి చాచినట్లు అయితే, అది శిఖరహస్తం అవుతుంది.

పూర్వం త్రిపురాసుర సంహార సమయంలో శివుడు మేరు పర్వతాన్ని ధనస్సుగా చేసికొని ఏ హస్తంతో దాని నడిమి భాగ మును పట్టుకొనెనో, అది 'శిఖర హస్తం' అయినది. మేరువు ధను స్సుగా గల శివుని నుంచి శిఖర హస్తం జన్మించింది. ఋషి జినుడు. గంధర్వజాతి. శ్యామవర్ణం. అధిదేవత మన్మథుడు.

పితృదేవతలకు తర్పణమివ్వటం, స్థిరత్వం, కుటుంబాన్ని నిలు పటం, నాయకుడు, శిఖరం, మిత్రుడు, (అడ్డంగా పట్టితే) దంతధా వనం, విసనకర్ర విసరటం, భేదం ఏమిటి అని అడగటం, చెంబు నుండి నీళ్ళు త్రాగటం, నాలుగు అని లెక్కించటం, శక్తి తోమరము మొదలగు ఆయుధాలను ప్రయోగించటం, ఫలాంశమును పరిగ్రహిం చటం, విలాసవతుల అణకువ, సిగ్గు, విల్లు, మన్మథుడు, భర్త, నిశ్చ యం, స్తంభం, ఘంటానాదం, నర్తనం, లేదు అనే మాట, దానం, నిలుకడ, వినాయకుడు, మహిషాసురమర్దని, వీరుడు, అశ్వగతి, అర్ధ చంద్ర తిలకం మొదలయినవి, కొప్పు గుర్తు, ఇంద్రనీల మణి, దృఢ త్వం — ఈ అర్థములందు శిఖర హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : ఇంతకు ముందు చెప్పిన శిఖర హస్తం, ఇదీ ఒక్కటే.

## 11. కపిత్థ హస్తం :



అంగుష్ఠమూర్ధ్ని శిఖరే వక్రితా యది తర్జనీ ॥ 306

కపిత్థాఖ్యః కరః సోఽయం కీర్తితో నృత్తకోవిదైః ।

లక్ష్మ్యాం చైవ సరస్వత్యాం వేష్టనే తాలధారణే ॥ 307

గోదోహనే ఽప్యంజనే చ లీలాకుసుమధారణే ।

చేలాంచలాదిగ్రహణే పటస్యైవావగుంఠనే ॥ 308

ధూపదీపార్చనే చాపి కపిత్థః సంప్రయుజ్యతే ।

అర్థం : శిఖరే, అంగుష్ఠమూర్ధ్ని = శిఖర (హస్త) మందలి, అంగుష్ఠం మీద; తర్జనీ, వక్రితాయది = చూపుడువ్రేలు, వంచబడినది అయితే; సః అయం = అదే (= ఆ హస్తమే); నృత్తకోవిదైః = నృత్తవేత్తలచేత ; కపిత్థ-ఆఖ్యః, కరః, కీర్తితః = 'కపిత్థం' అనే పేరు గల, హస్తం (అవుతుంది అని), కీర్తింపబడినది.

లక్ష్మ్యాం (చ) (ఏవ), సరస్వత్యాం, వేష్టనే, తాలధారణే = లక్ష్మి, సరస్వతి, చుట్టటం, తాళం పట్టటం ; గోదోహనే (అపి), అంజనే (చ), లీలాకుసుమ ధారణే = ఆవును పాలు పిదకటం, కాటుక (పెట్టుకొనటం), వినోదంగా పూలు (= పూలచెండు) ధరించటం (లీలాత్తసుమధారణే = విలాసంగా గ్రహించబడిన పూలు ధరించటంలో - నీడా) ; చేలాంచల- ఆది గ్రహణే, పటస్య-ఏవ-అవగుంఠనే, ధూప-దీప-అర్చనే (చ (అపి) = కొంగు) మొదలగు వాటిని పట్టుకొనటం, వస్త్రంతో ముసుగు వేసికొనటం, ధూప-దీపాలతో అర్చించటం — ఈ అర్థములందు; కపిత్థః, సంప్రయుజ్యతే = కపిత్థ (హస్త)ం, ప్రయోగింపబడుతున్నది (కపిత్థం = వెలగపండు).

తాత్పర్యం: శిఖరహస్తమందలి అంగుష్ఠంమీదకు తర్జనివంగితే అది కపిత్థ హస్తం అవుతుందని నృత్త కోవిదులు కీర్తించినారు.

లక్ష్మి, సరస్వతి, చుట్టటం, తాళం పట్టుకొనటం, పాలు పిదుకటం, కాటుక పెట్టుకొనటం, వినోదంగా పూలచెండు ధరించటం.

కొంగు మొదలగు వాటిని పట్టుకొనటం, వస్త్రంతో ముసుగు వేసికొనటం, ధూప-దీపములతో పూజించటం — ఈ అర్థములందు కపిత్థ హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : 'వేష్టనే తాలధారణే' అనేదానికి 'నటానాం తాల ధారణే' (= నటుల యొక్క తాళాధారణ మందు) అని ఘోష్ పాఠం.

భరతముని చెప్పిన కపిత్థహస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో కపిత్థ హస్తం :

శిఖరాంగుష్ఠ తర్జన్యో లగ్నౌచేత్కపిత్థకః ॥ 309

సముద్రమథనే పూర్వం మందరాకర్షణోచితః ।
జాతః కపిత్థః శ్రీవిష్ణోః నారదః ఋషిః ఉచ్యతే ॥ 310

ఋషి జాతిః గౌరవర్ణః పద్మగర్భో ఽధిదేవతా ।
మంథానాకర్షణే లక్ష్మ్యాం ధూపదీపనివేదనే ॥ 311

వరాటకానాం విక్షేపే వహనే ఽంకుశవజ్రయోః ।
క్షేపణ గ్రహణే తాలధారణే నాట్యదర్శనే ॥ 312

లీలాబ్జధారణే వాణ్యాం జపదామనిరూపణే ।
పేషణే యావకాదీనాం చేలాంచలసమాహృతౌ॥ 313

ఋషిజాతౌ గౌరవర్ణే కపిత్థో ఽయం నియుజ్యతే ।

అర్థం : శిఖర-అంగుష్ఠ-తర్జన్యౌ = శిఖరహస్తంలోని బొటన ప్రేలు, చూపుడువేలు; లగ్నౌ చేత్, కపిత్థకః = కలిస్తే (అది), కపిత్థ (క) (హస్తం అవుతుంది).

పూర్వం = పూర్వకాలంలో; సముద్రమథనే = (పాల) సముద్రాన్ని మథించటంలో; మందర-ఆకర్షణ, ఉచితః = మందర పర్వతాన్ని లాగటానికి, తగినట్లుగా;విష్ణోః, జాతః, కపిత్థః = విష్ణువు

వల్లి, కపిత్థ (హస్తం), జన్మించింది; నారదః, ఋషిః, ఉచ్యతే— నారదుడు, ఋషి (అని), చెప్పబడుతున్నది; ఋషిజాతిః, గౌరవర్ణః, అధిదేవతా పద్మగర్భః— ఋషిజాతి, గౌరవర్ణం, అధిదేవత పద్మగర్భుడు.

మంథాన-ఆకర్షణే, లక్ష్మ్యాం, ధూపదీపనివేదనే—కవ్వాన్ని పట్టుకొని చిలుకటం, లక్ష్మి, ధూపదీపాలను నివేదించటం; వరాటకానాం విక్షేపణే, అంకుశవజ్రయోః వహనే= గవ్వలను వేయటం, అంకుశాన్ని వజ్రాన్ని ధరించటం; క్షేపణ గ్రహణే, తాలధారణే, నాట్యదర్శనే—ఒడిసెల గ్రహించటం లేదా త్రిప్పటం, తాలం పట్టటం, నాట్యం చూపటం; లీల-అబ్జధారణే, వాణ్యాం, జపదామ నిరూపణే—విలాసంగా పద్మాన్ని చేతపట్టటం, సరస్వతి, జపమాల; యావక-ఆదీనాం పేషణే, చేల-అంచల సమాహృతౌ= యవలు (లత్తుక-నీడా) మొదలగు వాటిని మెదపటం. కొంగుపట్టి లాగటం; ఋషిజాతౌ, గౌరవర్ణే—ఋషిజాతి, గౌరవవర్ణం — ఈ అర్థాలను నిరూపించటంలో; అయం, కపిత్థః, నియుజ్యతే—ఈ కపిత్థ (హస్త , నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : శిఖర హస్తమందలి అంగుష్ఠం, తర్జని కలిస్తే కపిత్థ (క) హస్తం అవుతుంది. పూర్వం పాలసముద్ర మథన సమయంలో, మందర పర్వతమును లాగుటకు తగినట్లుగా విష్ణువు వలన కపిత్థ హస్తం జన్మించిం. ఋషి నారదుడు. ఋషిజాతి. గౌరవర్ణం. అధిదేవత పద్మగర్భుడు.

కవ్వంపట్టి చిలుకటం, లక్ష్మి, ధూప-దీపములను సమర్పించటం, గవ్వలాట, అంకుశమును వజ్రమును ధరించటం, ఒడిసెల త్రిప్పటం, తాలంపట్టటం, నాట్యం చూపటం, విలాసంగా పద్మాన్ని చేతిలో ధరించటం, సరస్వతి, జపమాల, యవలు లేదా లత్తుక మొదలగు వాటిని మెదపటం, కొంగు పట్టిలాగటం, ఋషిజాతి, గౌరవర్ణం — ఈ అర్థములందు కపిత్థ హస్తం వినియోగపడుతున్నది.

టీక : ఇంతకు ముందు చెప్పిన కపిత్థ హస్తం, ఇదీ ఒక్కటే

## 12. కటకాముఖ హ_స్తం :



కపిత్థే తర్జనీ చోర్ధ్వం మిశ్రితాంగుష్ఠమధ్యమా ॥ 314
కటకాముఖ హస్తో ఽయం కీ_ర్తితో భరతాగమైః ।
కుసుమావచయే ముక్తాస్రక్దామ్నాంధారణే తథా ॥ 315
శరమధ్యాకర్షణే చ నాగవల్లీప్రదానకే ।
12 అ.ద కస్తూరికాదివస్తూనాం పేషణే గంధవాసనే ॥ 316
వచనే దృష్టిభావే ఽపి కటకాముఖ ఇష్యతే ।



అర్థం : కపిత్థే = కపిత్థ (హ_స్త) మందలి ; తర్జనీ (చ), మిశ్రిత-అంగుష్ఠ మధ్యమా = చూపుడు వ్రేలు (చివర), బొటవ వ్రేలితోను నడిమి వ్రేలితోను కలిసినట్లయితే ; ఽయం, కటకాముఖ హ_స్తః = అది (= ఆ హ_స్తం), 'కటకాముఖ హ_స్తం' (అవుతుంది అని) ; భరతాగమైః, కీ_ర్తితః = భరతవేదం చేత కీర్తించబడినది.

కుసుమ - అపచయే, ముక్తాస్రక్దామ్నాం ధారణే (తథా) = పూవులు కోయటం, ముత్యాల దండలు పూలదండలు ధరించటం ; శరమధ్య-ఆకర్షణే (చ), నాగవల్లీ ప్రదానకే = వింటి మధ్య భాగాన్ని (శరమందాకర్షణే = బాణమును మెల్లగా - నీడా) ఆకర్షించటం, తములపాకు మడుపు లివ్వటం ; కస్తూరిక - ఆది వస్తూనాం పేషణే, గంధవాసనే = కస్తూరి మొదలగు వస్తువులను మెదపటం, గంధాదులను పూయటం ; వచనే, దృష్టిభావే (చ) = మాట, చూపు అనే వాటిలో ; కటకాముఖః, ఇష్యతే = కటకాముఖ (హ_స్త)ం, కోరబడుతున్నది. (కటకా ముఖం = చేతికడియం లోని లింకు).

తాత్పర్యం : కపిత్థ హస్తమందలి తర్జని చివర బొటన వ్రేలితో నడిమి వ్రేలితో కలిస్తే, అది కటకాముఖ హస్తం అవుతుందని భరతవేదం కీర్తిస్తున్నది.

పూవులు కోయటం, ముత్యాల దండలు పూలదండలు ధరించటం, వాటి మధ్య భాగమును లేదా బాణమును మెల్లగా లాగటం, తములపాకు మడుపు లందివ్వటం, కస్తూరి మొదలగు వస్తువులను మెదపటం, గంధాదులను పూయటం, మాట, చూపు — ఈ అర్థములందు కటకాముఖ హస్తం వినియోగపడుతుంది.

టీక : నాట్యశాస్త్రంలో తర్జని కూడా బొటన వ్రేలితో కలియాలన్న అంశం లేదు.

## వేరే గ్రంథంలో కటకాముఖ హస్తం :




అత్యంగుష్ఠయుతః క్షిప్తః కపిత్థః కటకాముఖః ॥ 317

అభ్యస్యతో ధనుర్విద్యాం గుహా దీశ్వరసన్నిధౌ ।
కటకాముఖహస్తో ఽభూ ద్భార్గవో ఋషిః ఉచ్యతే ॥ 318

దేవజాతిః స్వర్ణవర్ణో రఘురామో ఽస్య దేవతా ।
ముక్తాస్రజాం పుష్పదామ్నాం చామరాణాం చ ధారణే ॥ 319

ఆకర్షణే శరాదీనాం దర్పణాభిముఖగ్రహే ।
ఖలీనవహనే వృంతభేదనే దంతధావనే ॥ 320

కుసుమాపచయే నాగవల్లీదళవరిగ్రహే ।
కస్తూరికాదినిష్పేషే వారస్త్రీణాంనిగూహనే ॥ 321

ధనురాకర్షణే చక్రధారణే వ్యజనగ్రహే ।
స్వర్ణవర్ణే దేవజాత్యాం యుజ్యతే కటకాముఖః ॥ 322

అర్థం : కపిత్థః, అత్యంగుష్ఠయుతః క్షిప్తః = కపిత్థ (హస్త)ంలో, బొటనవ్రేలు పైకి ఎత్తి పట్టినది — అయితే (అది); కటకాముఖః = కటకాముఖ (హస్త)ం అవుతుంది.

ఈశ్వర సన్నిధౌ, ధనుర్విద్యాం అభ్యస్యతః = ఈశ్వరుని సన్నిధిలో, ధనుర్విద్యను అభ్యసిస్తున్న ; గుహాత్ = కుమారస్వామి వల్ల ; కటకాముఖ హస్తః, అభూత్ = 'కటకాముఖ హస్తం' జన్మించినది; భార్గవః, ఋషిః, ఉచ్యతే = (దీనికి) భార్గవుడు, ఋషి (అని), చెప్పబడుతున్నది; దేవజాతిః = దేవజాతి; స్వర్ణ వర్ణః = స్వర్ణ (=బంగారు) రంగు ; అస్య దేవతా, రఘురామః = దీని యొక్క అధిదేవత, రఘురాముడు.

ముక్తాస్రజాం, పుష్పదామ్నాం, చామరాణాం (చ) ధారణే = ముత్యాలసరం, పూలదండ, వింజామరం ధరించటం; శరదీనాం ఆకర్షణే, దర్పణ-అభిముఖగ్రహే = బాణం మొదలగువాటిని ఆకర్షించటం, దర్పణాన్ని అభిముఖంగా పట్టుకొనటం ; ఖలీనవహనే, వృంతభేదనే, దంతధావనే = కళ్ళెం పట్టటం, తొడిమ త్రుంచటం, పండ్లు తోమటం ; కుసుమ-అపచయే, నాగవల్లీ దళపరిగ్రహే = పూలుకోయటం, అకుమడుపులు అందుకొనటం ; కస్తూరికాది నిష్పేషే, వారస్త్రీణాంనిగూహనే = కస్తూరి మొదలగు వస్తువులను మెదపటం, వేశ్యల కౌగిలింత : ధనుః- ఆకర్షణే, చక్రధారణే, వ్యజనగ్రహే = విల్లు ఎక్కుపెట్టటం, చక్రాయుధం ధరించటం, విసనకర్ర పట్టుకొనటం ; స్వర్ణవర్ణే, దేవజాత్యాం = బంగారు రంగు, దేవజాతి — ఈ అర్థాలను నిరూపించటంలో ; కటకాముఖః, యుజ్యతే = కటకాముఖ (హస్త)ం వినియోగపడుతుంది.

తాత్పర్యం: కపిత్థహస్తమందలి అంగుష్ఠాన్ని పైకి బాగా చాచితే, అది కటకాముఖ హస్తమవుతుంది. ఈశ్వరుని సన్నిధిలో ధనుర్విద్య అభ్యసిస్తున్న కుమారస్వామివలన ఈ హస్తం జన్మించినది. ఋషి

భార్గవుడు. దేవజాతి. స్వర్ణవర్ణము. అధిదేవత రఘురాముడు.

ముత్యాలసరం, పూలదండ, వింజామరం, బాణము మొదలగు వాటినిఆకర్షించటం,దర్పణమును అభిముఖంగాపట్టుకొనటం, కళ్ళెం పట్టటం, తొడిమ త్రుంచటం, పండ్లు తోమటం, పూలుకోయటం, ఆకుమడుపు లందుకొనటం, కస్తూరి మొదలగు వస్తువులనుమెదపటం, వేశ్యల కౌగిలింత, విల్లు ఎక్కుపెట్టటం, చక్రాయుధం ధరించటం, విసనకర్ర పట్టుకొనటం, స్వర్ణవర్ణం, దేవజాతి - ఈ అర్థములందు కటకాముఖ హస్తం తగును.

టీక : ఇ ఇంతకు ముందు చెప్పిన కటకాముఖ హస్తం కంటె భిన్నంగా ఉంది.

## 13. సూచీహస్తం :



ఊర్ధ్వప్రసారితా యత్ర కటకాముఖతర్జనీ ।
సూచీ హస్తః స విజ్ఞేయో భరతాగమకోవిదైః ॥ 323

ఏకార్థే ఒపి పరబ్రహ్మభావనాయాం శతే ఒపి చ ।
రవౌ నగర్యాం లోకార్థే తథేతి వచనే ఒపి చ 324

యచ్ఛబ్దే ఒపి తచ్ఛబ్దే వ్యజనార్థే ఒపి తర్జనే ।
కార్శ్యే శలాకే వపుషి ఆశ్చర్యే వేణిభావనే ॥ 325

ఛత్రే సమర్థే పాణౌ చ రోమాల్యాం భేరీవాదనే ।
కులాలచక్రభ్రమణే రథాంగే మండలే తథా ॥ 326
వివేచనే దినాంతే చ సూచీహస్తః ప్రకీర్తితః ।

అర్థం : యత్ర = ఎందు ( = ఏ హస్తమందు), కటకాముఖ తర్జనీ, ఊర్ధ్వ ప్రసారితా = కటకాముఖ (హస్త) మందలి చూపుడు వ్రేలు, పొడుగుగా చాచబడుతుందో; సః, సూచీ హస్తః = అది, 'సూచీ హస్తం' (అని); భరతాగమకోవిదైః = భరత వేదవేత్తలచేత; విజ్ఞేయః = తెలియదగినది.

ఏక అర్థే (అపి), పరబ్రహ్మ భావనాయాం, శతే (అపి) (చ) — ఒకటి అనటం, పరబ్రహ్మభావన,నూరు; రవౌ, నగర్యాం, లోక-అర్థే, తథా-ఇతివచనే (అపి) (చ) — సూర్యుడు, నగరం, లోకం, అట్లే- అనటం; యత్ శబ్దే(అపి) తత్‌శబ్దే,వ్యజనార్థే (అపి), తర్జనే — ఏది? అది అనటం, విసనకర్ర (విజనార్థే = నిర్మానుష్యం అనటంలో-ఘోష్), భయపెట్టటం; కార్శ్యే, శలాకే, వపుషి, ఆశ్చర్యే, వేణి భావనే — సన్న పడటం, శలాక, దేహం, అశ్చర్యం, జడ; ఛత్రే, సమర్థే, పాణౌ, రోమాల్యాం, భేరివాదనే — గొడుగు,సమర్థత, పాణి (కోణే — కోణం — మూల-నీడా), రోమరాజి,భేరిని మ్రోగించటం; కులాలచక్ర భ్రమణే, రథాంగే, మండలే (తథా) = కుమ్మరి సారె తిరగటం, రథచక్రం యొక్క అంచు (రథాంగే, మండలే — బండి చక్రమందు, సముహామందు-నీడా); వివేచనే, దిన- అంతే (చ) — వివేచన, సాయంకాలం - ఈ అర్థాలను ప్రదర్శించటంలో, సూచీహస్తః ప్రకీర్తితః = సూచీహస్తం, కీర్తింపబడినది. (సూచి — — సూది; సూచీముఖం — సూదిమొన)

తాత్పర్యం : కటకాముఖ హస్తమందలి తర్జని పైకి ప్రసారితమైతే అది 'సూచీ హస్తం' అవుతుందని భరతాగమకోవిదులు తెలియవలెను.

ఒకటి, పరబ్రహ్మ, నూరు, సూర్యుడు, నగరం, లోకం, ఆవిధం (అనటం), ఏది- అది అనటం, విసన కర్ర లేదా నిర్మానుష్యం, భయపెట్టటం, సన్నపడటం, శలాక, దేహం, ఆశ్చర్యం, జడ, గొడుగు, సమర్థత. పాణి లేదా కోణం, రోమరాజి, భేరిని మ్రోగించటం, కుమ్మరి సారె తిరగటం, రథచక్రం యొక్క అంచు లేదా బండి చక్రం, సమూహం, వివేచన, సాయంకాలం — ఈ అర్థాలందు సూచీహస్తం చెప్పబడినది.

టీక : భరతముని చెప్పిన సూచీముఖహస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో సూచీ హస్తం :

సూచీముఖో భవే దూర్ధ్వం కటకాముఖతర్జనీ ॥ 327

అహ మేక ఇతి బ్రహ్మా నిర్దేశ మకరో ద్యతః ।
తస్మా ద్వివరించినో జాతః సూచిః అస్య ఋషి రవిః ॥ 328

దేవజాతిః శ్వేతవర్ణో విశ్వకర్మా ఽధిదేవతా ।
శ్లాఘాయాం సత్యవచనే దూరదేశనిరూపణే ॥ 329

ప్రాణార్థే చ పురోగే ఽపి ఏకసంఖ్యా నిరూపణే ।
సంధ్యాయాం విజనే నాశే సాధువాదే నిరీక్షణే ॥ 330

తథేతివచనే లోకే పరబ్రహ్మ నిరూపణే ।
ఏకార్థే ఽపి శలాకాయాం రథాంగభ్రమణే రవౌ ॥ 331

ఉదయాస్తమయే బాణే గూఢనాయకదర్శనే ।
శిలీముఖే చ యచ్ఛబ్దే తచ్ఛబ్దే లోహనాళయోః ॥ 332

తర్జనే నీచసంబుద్ధౌ శ్రవణే విరహే స్మృతా ।
భ్రమణే చంచ్వాం శ్వేతవర్ణే దర్శనే సూచికః కరః ॥ 333

అర్థం : కటకాముఖ, తర్జనీ = కటకాముఖ (హస్త)మందలి, చూపుడువ్రేలు; ఊర్ధ్వం భవేత్, సూచీముఖః = పైకి ఎత్తబడితే (అది), సూచీముఖ హస్తం (అవుతుంది).

యతః = ఎందువల్ల; బ్రహ్మా, అహమ్, ఏకః, ఇతి, నిర్దేశం, అకరోత్ = (పూర్వకాలమందు) బ్రహ్మ, నేను, ఒక్కడనే, అని, నిర్దేశం చేసెనో; తస్మాత్ = అందువల్ల, వివరించినః, సూచిః, జాతః = బ్రహ్మ నుంచి, సూచీహస్తం, జన్మించినది; అస్య, ఋషిః, రవిః = దానియొక్క, ఋషి, రవి; దేవజాతిః = దేవజాతి; శ్వేత

వర్ణః = తెలుపురంగు; అధిదేవతా, విశ్వకర్మా = అధిదేవత, విశ్వకర్మ.

శ్లాఘాయాం,సత్యవచనే,దూరదేశ నిరూపణే = శ్లాఘించటం, నిజం, దూరాన్ని చూపటం; ప్రాణార్థే(చ), పురోగే (అపి), ఏక సంఖ్యానిరూపణే = ప్రాణం అనటం, ముందుపోవువానిని చూపటం, ఒకటి అని నిర్దేశించటం; సంధ్యాయాం, విజనే, నాశే, సాధువాదే, నిరీక్షణే = సంధ్యాకాలం, ఏకాంత ప్రదేశం, తూడు, బాగు అనటం, నిరీక్షించటం; తథా-ఇతివచనే, లోకే, పరబ్రహ్మ నిరూపణే = అల్లే అనటం, లోకం, పరబ్రహ్మమును నిరూపించటం; ఏక-అర్థే (అపి, శలాకాయాం, రథాంగ భ్రమణే, రవౌ = ఒక్కటే అనటం, శలాక, చక్రం త్రిప్పటం (లేదా చక్రం తిరగటం), సూర్యుడు; ఉదయ-అస్తమయే, బాణే, గూఢనాయకదర్శనే = ఉదయం, అస్తమయం, బాణం, గూఢంగా ఉన్న నాయకుని (రహస్యమును, నాయకుని-స్వామి) దర్శించటం; శిలీముఖే, యత్ శబ్దే తత్ శబ్దే, లోహనాళయోః = బాణం యొక్క అలుగు, ఏది-అది అనటం, లోహం, నాళం (= గడియ); తర్జనే, నీచసంబుద్ధౌ, శ్రవణే, విరహే, స్మృతౌ = బెదరించటం, తక్కువ వారిని పిలువటం, వినటం, విరహం, స్మృతి; ఘ్రాణే, చంచ్వాం, శ్వేతవర్ణే, దర్శనే = ముక్కు, పక్షిముక్కు, తెలుపు రంగు, చూడటం- అనే అర్థాలలో; సూచికః, కరః = సూచిక (= సూచీ) హస్తం (ప్రయుక్తమవుతుంది).

టీక : కటకాముఖ హస్తమందలి తర్జని పైకి ఎత్తబడితే అది 'సూచీహస్తం' అవుతుంది. పూర్వకాలమందు బ్రహ్మ 'నేను ఒక్కడనే' అని నిర్దేశించినప్పుడు, ఆ బ్రహ్మ వలన సూచీ హస్తం జన్మించినది. ఋషి రవి. దేవజాతి. తెలుపురంగు. అధిదేవత విశ్వకర్మ.

శ్లాఘించటం, నిజం, దూరమును చూపటం, (నా) ప్రాణం అనటం, ముందు పోవువానిని చూపటం, ఒకటి అని నిర్దేశించటం, సంధ్యాకాలం, ఏకాంత ప్రదేశం, (తామర) తూడు, బాగు అనటం, నిరీక్షించటం, అల్లే అనటం,లోకం, పరబ్రహ్మమును నిరూపించటం,

ఒక్కచే అనటం, శలాక, చక్రం త్రిప్పటం లేదా చక్రం తిరగటం, సూర్యుడు, ఉదయం, అస్తమయం, బాణం, గూఢంగా ఉన్న నాయకుని లేదా రహస్యముగు నాయకుని దర్శించటం, బాణంయొక్క అలుగు, ఏది అనటం, లోహం, వాళం (=గడియ), బెదరించటం, తక్కువవారిని పిలువటం, వినటం, విరహం, స్మృతి, ముక్కు, పతీ ముక్కు, తెలుపురంగు, చూడటం — ఈ అర్థములందు సూచీహస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : ఇంతకు ముందు చెప్పిన సూచీహస్తం, ఇదీ ఒక్కచే·

## 14. చంద్రకలాహస్తం :


14 అది

సూచ్యా మంగుష్ఠ మోక్షే తు కర శ్చంద్రకలా భవేత్।
ఏషా చంద్రకలా చంద్రకలాయా మేవ యుజ్యతే॥ 334

చంద్రే ముఖే చ ప్రాదేశే తన్మాత్రాకారవస్తుని ।
శివస్య ముకుటే గంగానద్యాం చ లగుడే ఽపి చ॥ 335

ఏషాం చంద్రకలా చైవ వినియోజ్యా విధీయతే ।

అర్థం : సూచ్యాం, అంగుష్ఠమోక్షే (తు) = సూచీ హస్త మందలి, బొటన వ్రేలిని విడిచి వేస్తే (=చాచితే) (అది); చంద్రకలా కరః భవేత్ = చంద్ర కలాహస్తం, అవుతుంది.; ఏషా, చంద్రకలా = ఈ, చంద్రకలా (హస్తం; చంద్రకలాయాం ఏవ, యుజ్యతే = కలా మాత్ర చంద్రుని విషయంలో, ప్రయుక్తమవుతుంది.

చంద్రే,ముఖే, ప్రాదేశే, తన్మాత్ర-ఆకారవస్తుని = చంద్రుడు, ముఖం, చూపుడువ్రేలు-బొటనవ్రేలు మధ్యదూరం. ప్రాదేశమంత ఆకారంగల వస్తువులు; శివస్యముకుటే, గంగానద్యాం (చ), లగుడే (అపి) (చ) = శివజటాజూటం, గంగానది, దండం; ఏషాం = పైని

పేర్కొన్న వాటిని (నిరూపించటంలో); చంద్రకలా (చ) (ఏవ) = చంద్రకలాహస్తమే; వినియోజ్యా, విధీయతే = వినియోగింపదగినదిగా, విధింపబడుతున్నది (కల = చంద్రునిలోని 16వ భాగం).

తాత్పర్యం : సూచీ హస్తమందలి బొటన వ్రేలును చాచితే చంద్రకలా హస్తం అవుతుంది.

ఈ చంద్రకలాహస్తం కలామాత్ర చంద్రుని నిర్దేశించటంలో ప్రయుక్తమవుతుంది. చంద్రుడు, ముఖం, ప్రాదేశం(= చూపుడు వ్రేలు- బొటనవ్రేలు మధ్యగల దూరం), ప్రాదేశమంత ఆకారంగల వస్తువులు, శివజటాజూటం, గంగానది, దండం-ఈ అర్థాలలో చంద్ర కలా హస్తం విధింపబడినది.

టీక : ఇది నాట్య శాస్త్రంలో లేదు. ఇందుకు గ్రంథాంతర లక్షణ వినియోగాలు కూడా లేవు వినియోగానికి చెందిన మూడు పాదాలు నీడా పాఠంలో లేవు.

## 15. పద్మకోశహస్తం :




అంగుళ్యో విరళాః కించిత్ ।
కుంచితా స్తల నిమ్నగాః ॥ 336

పద్మకోశాభిధో హస్తః తన్నిరూపణముచ్యతే।
ఫలే బిల్వకపిత్థాదౌ స్త్రీణాం చ కుచకుంభయోః॥ 337

అవర్తే కందుకే స్థాల్యాం భోజనే పుష్పకోరకే ।
సహకారఫలే పుష్పవర్షే మంజరికాదిషు ॥ 338

జపాకుసుమభావే చ ఘంటారూపే విధానకే ।
వల్మీకే కమలేఽవ్యండే పద్మకోశో విధీయతే ॥ 339

అర్థం: అంగుళ్యః = వ్రేళ్ళు; విరళాః, కించిత్ కుంచితాః = ఎడంగా ఉన్నవి, కొంచెం వంచబడినవి; తలనిమ్నగాః = అరచేయి పల్లంవైపు (వంగి) ఉన్నవి (అయితే); పద్మకోశ-అభిధః, హస్తః = పద్మకోశం అనే పేరుగల, హస్తం (ఏర్పడుతుంది); తత్-నిరూపణం, ఉచ్యతే = దాని నిరూపణం (= స్వరూపం), చెప్పబడుతున్నది.

ఫలే, బిల్వకపిత్థ-అదౌ, (స్త్రీణాం(చ)కుచకుంభయోః=పండు, మారేడు వెలగ మొదలగు పండ్లు, స్త్రీల కుంభాల వంటి స్తనాలు; అవర్తకే, కందుకే, స్థాల్యాం, భోజనే, పుష్పకోరకే = గుండ్రంగా తిరుగటం (వర్తులే = వట్రువ-నీడా), బంతి లేదా పూలచెండు, కంచం, భుజించటం (స్వల్పభోజనే=అల్పాహారం — నీడా), పూమొగ్గ; సహకార ఫలే, పుష్పవర్షే, మంజరిక-ఆదిషు = మామిడిపండు, పూలవాన, పూగుత్తి మొదలగునవి; జపాకుసుమభావే (చ), ఘంటా, రూపే, విధానకే = మంకెనపువ్వు, ఘంటారూపం, ఏనుగు తినటానికి) పెట్టే ముద్దలు(ఘంటారూపవిధానకే=ఘంటారూపాన్ని చూపించటం-నీడా); వల్మీకే, కమలే, (అపి), అండే = పాముపుట్ట, పద్మం, (కుముదే = నల్ల కలువ-నీడా), గ్రుడ్డు; వీటి అర్థాలను నిరూపించటంలో; పద్మకోశః, అభిధీయతే = పద్మకోశ (హస్తం) చెప్పబడుతున్నది (పద్మకోశము = వికసిస్తున్న తామరమొగ్గ)

తాత్పర్యం: (ఐదు) వ్రేళ్ళు ఎడం ఎడంగా ఉన్నవి, అర చేతిలోనికి కొంచెంగా వంగినవి అయితే 'పద్మకోశహస్తం' ఏర్పడుతుంది.

పండు, మారేడు వెలగ మొదలగు పండ్లు, స్త్రీల కుచ కుంభములు, గుండ్రంగా తిరుగటం లేదా వట్రువ, బంతి లేదా పూల చెండు, కంచం, భుజించటం లేదా అల్పాహారం, పూమొగ్గ, మామిడిపండు, పూలవాన, పూగుత్తి, మంకెనపువ్వు, ఘంటారూపం, ఏనుగునకు పెట్టే తిండి ముద్ద లేదా ఘంటారూపం చూపించటం,

పద్మం లేదా నల్లగలువ, పాము పుట్ట, గ్రుడ్డు- ఈ అర్థములందు పద్మకోశహస్తం విధింపబడినది.

టీక : నాట్య శాస్త్రంలోని పద్మకోశహస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో పద్మకోశ హస్తం :

వరశ్వేతాంబుజాకారః పద్మకోశో ఽభిధీయతే ।
చక్రార్థే పద్మనికరైః శంభుపూజాం వితన్వతః ॥ 340

నారాయణాత్ పద్మకోశోజాతః పద్మధరో ఋషిః ।
యక్షాన్వయః కిన్నరాంశో అధిదేవో ఽస్యభార్గవః ॥ 341

ఖండాయాం ధాళధళ్యే చ హేమరౌప్యాదిభాజనే ।
ధమ్మిల్లే చ మిళార్థే చ లావణ్యే సాధువాదనే ॥ 342

ఘంటాయాం కందుకే పద్మే వల్మీకే వర్తులే స్తనే ।
నారికేళే చూతఫలే కర్ణికారే చ దర్పణే ॥ 343

శాఖానతౌ పుష్పవర్షే కలశే ఽండవికాసనే ।
బిల్వే కపిత్థే యుజ్యేత పద్మకోశాహ్వయః కరః ॥ 344

అర్థం : వర శ్వేత - అంబుజ - ఆకారః, పద్మకోశః, అభిధీయతే = శ్రేష్ఠమైన తెల తామర పూవు ఆకారంగా ఉండేది, పద్మకోశ (హస్త)మని చెప్పబడుతున్నది.

చక్రార్థే, పద్మనికరైః, శంభుపూజాం, వితన్వతః, నారాయణాత్ =(పూర్వం) చక్రాయుధం కోసం, తామర పూలతో, శివ పూజ, చేస్తున్న, నారాయణుని ( = విష్ణువు) వల్ల ; పద్మకోశః, జాతః = పద్మకోశ (హస్త)ం, ఒన్మించింది : పద్మధరః ఋషిః, యక్ష-అన్వయః, కిన్నర-అంశః = పద్మధరుడు ఋషి, యక్షజాతి,

కిన్నెరవర్ణం; అస్య-అధిదేవః, భార్గవః=దీని యొక్క అధిదేవత, భార్గవుడు.

శుండాయాం, ధాళధళ్యే (చ), హేమరౌప్య-అదిభాజనే= ఏనుగు తొండం, ధళధళమనే కాంతి, బంగారు వెండి మొదలగు పాత్రములు; ధమ్మిల్లే (చ), మితార్థే (చ), లావణ్యే, సాధు వాదనే=కొప్పు, కొలది అనటం, లావణ్యం, బాగు అనటం; ఘంటాయాం, కందుకే, పద్మే, వల్మీకే, వర్తులే, స్తనే=ఘంట, బంతి (=పుట్టచెండు), పద్మం, పుట్ట, గుండ్రదన, స్తనం; నారికేళే, చూతఫలే, కర్ణికారే (చ), దర్పణే=కొబ్బరికాయ, మామిడిపండు, కొండగోగు పువ్వు, అద్దం; శాఖ-అవతా, పుష్పవర్షే, కబళే, అ ద వికాసనే=వంగిన కొమ్మ, పూలవాన, కబళం =అన్నం ముద్ద), గ్రుడ్డు పగలటం; బల్వే, కపిత్థా=మారేడు పండు, వెలగపండు; —వీటిని ప్రదర్శించటంలో; పద్మకోశ - ఆహ్వాయః, కరః, యుజ్యేత=పద్మకోశం అనే పేరుగల, హస్తాన్ని, ప్రయోగించ వలెను.

**తాత్పర్యం** : పద్మకోశ హస్తం శ్రేష్ఠమైన, తెల్ల తామర పూవు ఆకారంగా ఉంటుంది.

పూర్వం (సుదర్శన) చక్రాయుధం కొరకు తామరపూవులతో శివుని పూజించిన విష్ణువు వలన పద్మకోశ హస్తం జన్మించినది. పద్మధరుడు ఋషి. యక్షజాతి. కిన్నెరవర్ణం. అధిదేవత భార్గవుడు.

ఏనుగు తొండం, ధళధళ కాంతి, బంగారు వెండి మొదలగు పాత్రలు, కొప్పు, కొలది అనటం, లావణ్యం, బాగు అనటం, ఘంట, బంతి, పద్మం, పుట్ట, గుండ్రదన, స్తనం, కొబ్బరి కాయ, మామిడి పండు, కొండగోగు పువ్వు, అద్దం, వంగిన కొమ్మ లేదా కొమ్మ వంపు, పూలవాన, కబళం, గ్రుడ్డు పగలటం, మారేడు పండు, వెలగ పండు — ఈ అర్థములందు పద్మకోశ హస్తాన్ని ప్రయోగించవలెను

టీక : ఇచ్చట నిర్వచనం విశదంగా లేదు ; తామర పూవు ఆకారంగా ఉంటుందని మాత్రమే పేర్కొనబడింది. ఇంతకుముందు చెప్పిన నిర్వచనాన్ని ఇక్కడ అన్వయించుకోవచ్చు.

## 16. సర్పశీర్ష హస్తం :



పతాకా నమితాగ్రా చేత్ సర్పశీర్షకరో భవేత్ ।
చందనే భుజగే మంద్రే ప్రోక్షణే పోషణాదిషు ॥ 345
దేవస్యోదకదానేషు ఆస్ఫాలే గజకుంభయోః ।
భుజస్థానే మల్లానాం తు యుజ్యతే సర్పశీర్షకరః ॥ 346

అర్థం : పతాకా నమిత - అగ్రాచేత్ = పతాక హస్తం వంగిన చివరలు కలది అయితే (పతాకతల నిమ్నత్వాత్ = పతాక హస్తం లోని అరచేయి పల్లంకావటం వల్ల - నీడా); సర్పశీర్షకరః భవేత్ = సర్పశీర్ష హస్తం ఏర్పడుతుంది.

చందనే, భుజగే, మంద్రే, ప్రోక్షణే, పోషణ-ఆదిషు = గంధం, పాము, మంద్రస్వరం (మందే — మెల్లగా అనటం - నీడా), నీళ్ళుచిలుకరించటం, పోషించటం మొదలైనవి;దేవస్య-ఉదకదానేషు, గజకుంభయోః ఆస్ఫాలే = దేవతలకు (దేవర్షులకు — నీడా) తర్పణం విడువటం, ఏనుగు కుంభ స్థలాలను చరచటం (ఏనుగు చెవులను ఆడించటం-స్వామి) ; మల్లానాం భుజస్థానే = మల్లుర భుజాలు (మల్లురు భుజాలను చరచటం-నీడా) — వీటి అర్థాలను నిరూపించటంలో; సర్పశీర్షకరః యుజ్యతే = సర్పశీర్ష (క) హస్తం చెల్లుతుంది (సర్పశీర్షం = పాముపడగ).

తాత్పర్యం : పతాక హస్తం (వేళ్ళ) చివరలు లోనికి వంగితే లేదా పతాక హస్తం అరచేయి పల్లంగా అయితే, అది సర్పశీర్ష (క) హస్తం అవుతుంది.

గంధం, పాము, మంద్రస్వరం లేదా మాంద్యం, నీళ్ళు చిలకరించటం, పోషించటం, దేవతలకు లేదా దేవర్షులకు తర్పణం విడువటం, ఏనుగు కుంభస్థలాన్ని చరచటం లేదా ఏనుగు చెవులను ఆడించటం, మల్లుర భుజములు లేదా మల్లురు భుజాలను చరచటం — ఈ అర్థాలను ప్రదర్శించటంలో సర్పశీర్ష హస్తం ఉపయుక్తమవుతుంది.

టీక : నాట్యశాస్త్రంలోని సర్పశిరహస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో సర్పశీర్షహస్తం :

పతాకే నిమ్నమధ్యత్వం సర్పశీర్ష ఇతి స్మృతః ।
నిరీక్ష్య నిర్జరాన్ భీతాన్ కరవిన్యాసపూర్వకమ్ ॥ 347

బలిం వంచయితుం ఖర్వో భవేయ మితి భాషతః ।
వామనా త్సర్పశీర్షో ఽయం వాసవో ఋషి రుచ్యతే ॥ 348

హరి ద్వర్ణో దేవజాతిః కాలకంఠో ఽధిదేవతా ।
కుంకుమే పంకభావే ఽపి ప్రాణాయామనిరూపణే ॥ 349

ముఖప్రక్షాళనవిధౌ దానవేళావివేచనే ।
చందనే చ గజే ఖర్వే మల్లాస్ఫాలే చ లాలనే ॥ 350

క్షీరే నీరే చ కాశ్మీరే లజ్జాయాం గోప్యకే శిశౌ ।
ప్రతిమాయాం పయఃపానే లీనే సత్పరిభాషణే ॥ 351

దేవజాతౌ హరిద్వర్ణే యుక్తమిత్యుత్తరీకృతౌ ।
పటవాసపరిక్షేపే చందనాదివిలేపనే ॥ 352

కుచాదిగ్రహణేస్త్రీణాం సర్పశీర్షో నియుజ్యతే । 353

అర్థం : పతాకే, నిమ్న మధ్యత్వం = పతాక హస్తమందలి, అరచేయి పల్లంగా అయితే, (అది); సర్పశీర్షః, ఇతి, స్మృతః = సర్పశీర్ష (హస్తం) అని, స్మరింపబడింది.

భీతాన్, నిర్జరాన్, నిరీక్ష్య = (పూర్వం బలిచక్రవర్తికి) భయపడి (తన్ను శరణు చొచ్చి)న, దేవతలను, చూచి; బలిం, వంచయితుం, ఖర్వః, భవేయమ్, ఇతి = బలిని, వంచించుటకు, వామనుడను, అగుదును, అని; కరవిన్యాస పూర్వకమ్, భాషతః, వామనాత్ = హస్త విన్యాస పూర్వకంగా, చెబుతున్న, వామనుని వలన; అయం, సర్పశీర్షః = ఈ, సర్పశీర్ష (హస్త)ం (జన్మించినది); వాసవః, ఋషిః ఉచ్యతే = ఇంద్రుడు, ఋషి,(అని) చెప్పబడుతున్నది; హరిత్ వర్ణః = పసుపురంగు; దేవ, జాతిః = దేవజాతి; అధిదేవతా, కాలకంఠః = అధిదేవత, కాలకంఠుడు.

కుంకుమే, పంకభావే (అపి), ప్రాణాయామనిరూపణే = కుంకుమ, బురద, ప్రాణాయామం చేయటం; ముఖప్రక్షాళనవిధౌ, దానవేళానివేచనే = మొగం కడుగుకొనటం, దాన సమయాన్ని నిరూపించటం, చందనే (చ), గజే, ఖర్వే, మల్ల-అస్ఫాలే (చ), లాలనే = గంధం, ఏనుగు, పొట్టివాడు, మల్లురు భుజాలను చరచటం, బుజ్జగించటం; క్షీరే, నీరే (చ), కాశ్మీరే, లజ్జాయాం, గోప్యకే, శిశౌ = పాలు, నీరు, కుంకుమ పువ్వు, సిగ్గు, దాచదగిన వస్తువు, శిశువు (శిశువును దాచటం, - స్వామి); ప్రతిమాయాం, పయః పానే, లీనే, సత్పరి భాషణే = బొమ్మ, నీళ్ళు త్రాగటం, ఐక్యం కావటం (వ్రేలాడటం - స్వామి) మంచిది అనటం; దేవజాతౌ, హరిత్ వర్ణే, యుక్తమ్ ఇతి ఉత్తరీకృతౌ = దేవ జాతి, పసుపురంగు, తగును అని సమాధానం చెప్పటం; పటవాస పరిక్షేపే, చందనాది విలేపనే = బుక్కా మొదలగు వాటిని చల్లటం, గంధం మొదలగు వాటిని పూయటం; స్త్రీణాం, కుచాదిగ్రహణే = స్త్రీల, కుచములు మొదలగు వాటిని పట్టుకొనటం — ఈ అర్థాలలో; సర్పశీర్షః, నియుజ్యతే = సర్పశీర్ష (హస్త)ం, నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : పతాక హస్తమందలి అరచేయి పల్లం కావటం వల్ల సర్పశీర్ష (హస్తం) ఏర్పడుతుంది.

పూర్వ కాలమందు, బలిచక్రవర్తికి భయపడి తన్ను శరణు చొచ్చిన దేవతలను చూచి,బలిని వంచించటానికి వామనుడనగుదునని హస్తవిన్యాసపూర్వకంగా చెప్పిన వామనుని (=విష్ణువు)వలన సర్ప శీర్ష హస్తం జన్మించినది. ఇంద్రుడు ఋషి. పసుపురంగు. దేవజాతి. అధిదేవత కాలకంఠుడు.

కుంకుమ, బురద, ప్రాణాయామం చేయటం, మొగం కడిగి కొనటం, దాన సమయమును నిరూపించటం, గంధం, ఏనుగు, పొట్టివాడు, మల్లురు భుజములను చరచటం, బుజ్జగించటం, పాలు, నీరు, కుంకుమపువ్వు, సిగ్గు, దాచదగిన వస్తువు, శిశువులేదా శిశువును దాచటం, బొమ్మ, నీళ్ళు త్రాగటం, ఐక్యంకావటం లేదా వ్రేలా డటం, మంచిది అనటం, దేవజాతి, పసుపురంగు, తగును అని సమా ధానం చెప్పటం, బుక్కా మొదలగు వాటిని చల్లటం, గంధాదులను పూయటం, స్త్రీల కుచాదులను పట్టుకొనటం- ఈ అర్థములందు సర్ప శీర్ష హస్తం ఉపయుక్తమవుతుంది.

టీక : ఇంతకు ముందు చెప్పిన సర్పశీర్షహస్తం, ఇదీ ఒక్కటే.

## 17. మృగశీర్ష(క)హస్తం :



అస్మిన్ కనిష్ఠికాంగుష్ఠే ప్రసృతే మృగశీర్షకః ॥ 353
స్త్రీణామర్థే కపోలే చ చక్రమర్యాదయో రపి ।
భీత్యాం వివాదే నేపథ్యే ఆహ్వానే చ త్రిపుండ్రకే ॥ 354
మృగముఖే రంగవల్ల్యాం పాదసంవాహనే తథా ।
సర్వసమ్మేళనే కార్యే మందిరే ఛత్రధారణే ॥ 355
సోపానే పదవిన్యాసే ప్రియాహ్వానే తథైవ చ ।
సంచారే చ ప్రయుజ్యేత భరతాగమకోవిదైః ॥ 356

అర్థం : అస్మిన్ = దానియందు (=సర్పశీర్ష హస్తమందలి); కనిష్ఠిక - అంగుష్ఠే, ప్రసృతే = చిటికెన వ్రేలిని బొటన వ్రేలిని, చాచినట్లయితే (అది); మృగశీర్షకః = మృగశీర్ష(క) (హస్తం) (అవుతుంది).

స్త్రీణాం - అర్థే, కపోలే(చ), చక్ర-మర్యాదయోః (అపి) = స్త్రీ విషయం, చెక్కిలి, చక్రం, మర్యాద (= హద్దు) (క్రమమర్యాదయోః = క్రమం, మర్యాద-వీటి యందు - నీడా); భీత్యాం, వివాదే, నేపథ్యే, ఆహ్వానే, త్రిపుండ్రకే = వెరపు, తగువు, వేష ధారణ సామగ్రి (అలంకారం- నీడా), ఆహ్వానం (ఆవాసే = ఉండే చోటు - నీడా), త్రిపుండ్రం (= విభూతి) (పెట్టుకొనటం); మృగ ముఖే, రంగవల్ల్యాం, పాదసంవాహనే (తథా) = లేడిముఖం (ముఖాముఖే = ఎదురెదురునందు - నీడా), ముగ్గు, పాదాలు ఒత్తటం; సర్వసమ్మేళనే కార్యే, మందిరే, ఛత్రధారిణే = అన్నింటిని సమకూర్చుకొనటం, ఇల్లు (సర్వస్వే మిలనే, కామమందిరే = అన్నింటిని కూర్చుకొనటం, యోని - ఘోష్), ఛత్రధారణే = గొడుగు పట్టుకొనటం; సోపానే, పదవిన్యాసే, ప్రియ - ఆహ్వానే, (తథా) (ఏవ) (చ), సంచారే (చ) = మెట్లు, అడుగులు వేయటం, ప్రియులను లేదా ప్రియలను పిలునటం, సంచారం (= తిరుగటం); భరత-ఆగమ కోవిదైః ప్రయుజ్యేత = (మృగశీర్ష హస్తం, భరత వేదవేత్తల చేత ప్రయోగింపదగును. (మృగశీర్షం = లేడి తల).

తాత్పర్యం : సర్పశీర్ష హస్తమందలి చిటికెన వ్రేలిని, బొటన వ్రేలిని చాచితే మృగశీర్ష హస్తమవుతుంది.

స్త్రీ విషయం, చెక్కిలి, చక్రం లేదా క్రమం, హద్దు, వెరపు, తగువు, వేషధారణ సామాగ్రి లేదా అలంకారం, ఆహ్వానం, లేదా ఆవాసం (= ఉండే చోటు = ఇల్లు), త్రిపుండ్రం, లేడి ముఖం లేదా ఎదురెదురు, ముగ్గు, పాదములు ఒత్తటం, అన్నింటిని సమకూర్చుకొనటం, ఇల్లు లేదా యోని, గొడుగు పట్టుకొనటం, మెట్లు, అడుగులు వేయటం, ప్రియులను

లేదా ప్రియలను పిలువటం, సంచారం - ఈ అర్థాలను నిరూపించటంలో మృగశీర్ష హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : 'మందిరే' అని తరువాత ఉన్నది కాన 'ఆవాసే' అన్న దాని కంటె 'ఆహ్వానే' అననదే సమంజసం కాగలదు. 'సర్వ సమ్మేళనే కార్యే' అననదే సమంజసంగా కన్పట్టుతున్నది. చివరి రెండు పాదములకు బదులు, ఘోష్ పాఠం క్రింది విధంగా ఉంది:

సంచారే చ ప్రియాహ్వానే యుజ్యతే మృగశీర్షకః ।

నాట్యశాస్త్రంలోని మృగశీర్షక హస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో మృగశీర్ష హస్తం :



ఊర్ధ్వగ శ్చతురాంగుష్ఠో మృగశీర్షకరః స్మృతః ।
శివం ప్రతి తపఃకర్తుం ధారయిత్వా
త్రిపుండ్రకమ్॥ 357

మృగశీర్షో ఒభవత్ గౌర్యాః ఋషిరస్య
మృకండుజః

17 అ, ఆ ఋషిజాతిః శుభ్రవర్ణో ఒధిదేవ స్తు మహేశ్వరః॥358

భిత్తౌ విచారే సమయే ఆవాసే ఛత్రధారణే ।
పద్మిన్యా మపి శంఖిన్యాం హస్తిన్యాం మందవాచకే॥ 359

లేపనే చందనాదీనాం స్త్రీణామభినయక్రమే ।
తిరస్కరిణ్యాం సోపానే సాక్షాత్కారే ఒపి చ క్రమే॥ 360

త్రిపుండ్రధారణే చైవ వితర్కే చ మృగాననే ।
అస్మదర్థే శరీరే చ సంజ్ఞాపూర్వనమాహృతౌ ॥ 361

ఋషిజాతౌ శుభ్రవర్ణే మృగశీర్షకరః స్మృతః ।

అర్థం : చతుర-అంగుష్ఠః = చతుర హస్తమందలి బొటన వ్రేలు ; ఊర్ధ్వగః = పైకి వెళ్ళినది (= చాపబడినది) (అయితే) ; మృగశీర్షకః, స్మృతః = మృగశీర్ష (క) (హస్త)ం అని తలచ (= చెప్ప) బడింది.

శివం ప్రతి, తపః, కర్తుం = శివుని గూర్చి, తపస్సు, చేయటం కొరకు ; త్రిపుండ్రమ్, ధారయిత్వా = త్రిపుండ్రాన్ని ధరించి(న) ; గౌర్యాః = గౌరి (= పార్వతి) వలన ; మృగశీర్షః, అభవత్ = మృగశీర్ష (హస్త)ం, జన్మించినది ; అస్య, ఋషిః, మృకండుజః = దీని యొక్క, ఋషి, మార్కండేయుడు ; ఋషి జాతిః = ఋషి జాతి ; శుభ్రవర్ణః = తెలుపు రంగు ; అధిదేవః (తు), మహేశ్వరః = అధిదేవత, మహేశ్వరుడు.

భిత్తౌ, విచారే, సమయే, ఆవాసే, ఛత్రధారణే = గోడ, విచారం (= వివేచన), సమయం, నివాస స్థానం, గొడుగుపట్టటం ; పద్మిన్యాం (అపి), శంఖిన్యాం, హస్తిన్యాం, మందవాచకే = పద్మిని, శంఖిని, హస్తిని — ఈ జాతి స్త్రీలు, మెల్లగా చెప్పటం ; చందనాదీనాం లేపనే, స్త్రీణాం అభినయక్రమే = గంధం మొదలగు వాటిని పూయటం, స్త్రీలుచేసే అభినయం ; తిరస్కరిణ్యాం, సోపానే, సాక్షాత్కారే (అపి) (చ), క్రమే = తెర, మెట్లు, సాక్షాత్కారం, క్రమం ; త్రిపుండ్రధారణే (చ) (ఏవ), వితర్కే (చ), మృగాననే = త్రిపుండ్రములను ధరించటం, వితర్కం, మృగం యొక్క ముఖం ; అస్మత్-అర్థే, శరీరే (చ), సంజ్ఞా పూర్వ సమాహ్వానే = నేను అనే అర్థం, దేహం, సైగతో పిలవటం ; ఋషి జాతౌ, శుభ్రవర్ణే = ఋషి జాతి, తెలుపు రంగు — ఈ అర్థాలను ప్రదర్శించటంలో మృగశీర్ష కరః, స్మృతః = మృగశీర్ష హస్తం, తలంచ (= చెప్ప) బడినది.

తాత్పర్యం : చతురహస్త మందలి బొటన వ్రేలను పైకి చాచితే అది 'మృగశీర్ష హస్తం' అవుతుంది.

శివుని గూర్చి తపస్సు చేయటం కొరకు త్రిపుండ్రం ధరించిన గౌరి దేవివలన మృగశీర్ష హస్తం జన్మించినది. ఋషి మార్కండేయుడు. ఋషిజాతి. తెలుపు రంగు. అధిదేవత మహేశ్వరుడు.

గోడ, విచారం లేదా వివేచన, సమయం, నివాస స్థానం, గొడుగు పట్టటం, పద్మిని శంఖిని హస్తిని జాతి స్త్రీలను నిరూపించటం, మెల్లగా చెప్పటం, గంధం మొదలగు వాటిని పూయటం, స్త్రీలుచేసే అభినయం, తెర, మెట్లు, సాక్షాత్కారం, క్రమం, త్రిపుండ్రములు ధరించటం, వితర్కం, లేడిముఖం, నేను అనే అర్థం, దేహం, సైగచేసి పిలువటం, ఋషి జాతి, తెలుపురంగు — ఈ అర్థములందు మృగశీర్ష హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : అంగుష్ఠంతో పాటు కనిష్ఠిక కూడా వెలుపలికి ప్రసారితం కావాలని నాట్యశాస్త్ర నిర్వచనం.

ఇంతవరకు, ఈ గ్రంథంలో చతుర హస్తం నిర్వచింపబడలేదు; కావున, ముందు చెప్పబోయే చతుర హస్తాన్ని పేర్కొని, అందులో మార్పు చేయటంవల్ల మృగశీర్ష హస్తం ఏర్పడుతుందని చెప్పటం సంప్రదాయం కాదు. ఇక్కడ చెప్పిన నిర్వచన-వినియోగాలు భిన్న సంప్రదాయానికి చెందినవి.

## 18 సింహముఖహస్తం :



18 అ.ద

మధ్యమానామికాగ్రాభ్యామంగుష్ఠో మిశ్రితో యది॥ 362
శేషౌ ప్రసారితౌ యత్ర స సింహముఖ ఈరితః।
విద్రుమే మౌక్తికే చైవ సుగంధేఽలక
సంస్పర్శనే॥ 363
ఆకర్ణనే చ పృషతి మోక్షార్థే హృదిసంస్థితః।
హోమే శశే గజే దర్భచలనే పద్మదామని॥ 364
సింహాసనే వైద్యపాకే శోధనే సింహవక్త్రకః।

అర్థం : యత్ర=ఎక్కడ ( = ఏ హస్తమందు) ; మధ్యమ-అనామికా-అగ్రాభ్యాం=నడిమి వ్రేలు, ఉంగరపు వ్రేలు యొక్క చివరలతో ; అగుష్ఠః, మిశ్రితః=బొటన వ్రేలు, కలిసినది ; శేషౌ, ప్రసారితౌ యది=తక్కిన రెండు వ్రేళ్ళు చాచబడినవి అయితే ; సః=అది ( = ఆ హస్తం); సింహాముఖః, ఈరితః = సింహ ముఖ (హస్త)ం, అని చెప్పబడినది.

విద్రుమే, మౌక్తికే (చ) (ఏవ), సుగంధే, అలకసంస్పర్శనే= పగడం, మంచి ముత్యం, సువాసన, ముంగురులు దిద్దటం; ఆకర్ణనే (చ), పృషతి, (హృది సంస్థితః) మోక్ష-అర్థే=వినటం, నీటి బొట్టు, (హస్తం రొమ్ముమీద ఉన్నప్పుడు) మోక్ష విషయం ; హోమే, శశే, గజే, దర్భచలనే, పద్మదామని = హోమం, కుందేలు, ఏనుగు, దర్భను విదలించటం, పద్మాలదండ ; సింహ-ఆననే, వైద్యపాకే శోధనే=సింహం యొక్క ముఖం, మందుల తయారీ, శోధించటం (వైద్యపాకే, శోధనే=వైద్యుడు మందులను వండటం, శోధించటం-ఘోష్) ; — ఈ అర్థములందు ; సింహవక్త్రికః=సింహ ముఖ (హస్త)ం (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం : అంగుష్ఠం, నడిమి వ్రేలు ఉంగరపు వ్రేలు యొక్క చివరలతో కలిసి, తక్కిన రెండు వ్రేళ్ళు ప్రసారితం కాగా, అది 'సింహాముఖ హస్తం' అవుతుంది.

పగడం, మంచి ముత్యం, సువాసన, ముంగురులు దిద్దటం, వినటం, నీటిబొట్టు, హస్తం రొమ్ముమీద ఉన్నయడల మోక్ష విషయం, హోమం, కుందేలు, ఏనుగు, దర్భనువిదలించటం, పద్మముల దండ, సింహం యొక్క ముఖం, మందుల తయారీ, శోధించటం లేదా వైద్యుడు మందులను వండటం, శోధించటం- ఈ అర్థములను నిరూపించటంలో సింహాముఖహస్తం తగును.

టీక : వినియోగంలోని మొదటి రెండు పాదాలు ఘోష్‌లో లేవు. సింహాస్యం,సింహవక్త్రిం, సింహాముఖం- ఈ మూడూ సమానా

ర్థకాలు. దీనికి గ్రంథాంతర లక్షణ వినియోగాలు లేవు. భరతముని ఈ హస్తాన్ని చెప్పలేదు.

## 19. కాంగుల హస్తం


15

పద్మకోశే ఽనామికాచేత్ నమ్రా కాంగుల
హస్తకః ॥ 365
లికుచస్యఫలే బాలాకుచే కల్హారకే తథా ।
చకోరే క్రముకే బాలకింకిణ్యాం ఘుటికాదికే ॥ 366
చాతకే యుజ్యతే చాఽయం కాంగులకరనామకః ।

అర్థం : పద్మకోశే, అనామికా, నమ్రాచేత్ = పద్మకోశ (హస్త) మందలి, ఉంగరపు వ్రేలు, వంచబడినది అయితే; కాంగుల హస్తకః = 'కాంగుల హస్త(క)ం' (అవుతుంది). (లాంగూలకో భవేత్ = లాంగూల హస్తం అవుతుంది — నీడా).

లి(ల)లకుచస్యఫలే, బాలాకుచే, కల్హారకే (తథా) = నిమ్మ పండు, బాలికాకుచం, సువాసనతోకూడిన ఎర్ర కలువ; చకోరే, క్రముకే, బాలకింకిణ్యాం, ఘుటికాదికే = చకోరం, పోకకాయ, చిరుగజ్జెలు, (మందు) మాత్ర మొదలగునవి; చాతకే = చాతక పక్షి — ఈ అర్థాలను నిరూపించటంలో కాంగులకరనామకః అయం = కాంగుల హస్తం (అనే) పేరుగల ఈ హస్తం; యుజ్యతే = తగును.

తాత్పర్యం : పద్మకోశ హస్తమందలి అనామిక వంచబడితే, అది కాంగుల లేదా లాంగూల హస్తం అవుతుంది.

నిమ్మపండు, బాలికాకుచం,సువాసనతో కూడిన ఎర్ర కలువ, చకోరము, పోక, చిరుగజ్జెలు, మందు మాత్రలు మొదలగునవి, చాతకం — ఈ అర్థాలను ప్రదర్శించటంలో కాంగుల హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : వినియోగమునకు సంబంధించిన పాదాలు ఘోష్ పాఠంలో క్రింది విధంగా ఉన్నాయి:

లకుచస్యఫలే బాలకింకిణ్యాం ఘంటికార్థకే
చకోరే క్రముకే బాలాకుచే కహ్లారకే తథా
చాతకే నాలికేరే చ కాంగులో యుజ్యతే కరః.

'ఘంటికార్థకే ... నాలికేరే' = ఘంట అనే అర్థమందు... కొబ్బరికాయ యందు — ఇది ఘోష్ పాఠంలో అధికం.

నాట్యశాస్త్రమందు కాంగూల, కాంగుల పదాలు రెండూ ఉన్నాయి; కాని, 'కాంగులం' అనే పదమే ప్రసిద్ధం. నీడా పాఠంలో మాత్రం అంతటా 'లాంగూలం' (= తోక) అనే ఉన్నది.

నాట్యశాస్త్రంలోని కాంగుల హస్తం, ఇదీ ఒక్కటే. కానీ, అందులో తర్జనీ-మధ్యమ-అంగుష్ఠాలు త్రేతాగ్నులవలె ఉంటాయని వర్ణింపబడింది. అయితే ఈ మూడు వ్రేళ్ళు, కొబ్బరి కాయ లోని మూడు కళ్ళవలె ఉంటాయని గ్రంథాంతర నిర్వచనంలో వర్ణితమైనవి.

### వేరే గ్రంథంలో లాంగూల హస్తం :

మధ్యమాంగుష్ఠతర్జన్యో నారికేళాక్షవత్కృతాః ॥ 367

లాంగులో ఒనామికావక్రా ప్రోన్నతా చ కనిష్ఠికా ।
క్షీరోధిజః కాలకూటః గశికాకృతికఃపురా ॥ 368

లాంగులో హరసంజాతో ఋషిః క్రౌంచవిదారణః ।
సిద్ధజాతిః స్వర్ణవర్ణః పద్మా తస్యాఒధిదేవతా ॥ 369

ద్రాక్షఫలే చ రుద్రాక్షే చుబుకగ్రహణే ఒపి చ ।
కుచప్రరోహే క్రముకే కింకిణ్యా ముత్పలే ఫలే ॥ 370

విద్రుమే చ మితగ్రాసే నక్షత్రే బదరీఫలే ।
వర్తులాయాం మల్లికాదౌ చకోరే చాతకే ఽల్పకే ॥ 371

కరకాయాం సిద్ధజాతౌ హరీతక్యాం సువర్ణకే ।
ఏవమాదిషు యుజ్యేత హస్తో లాంగూల సంజ్ఞకః ॥ 372

అర్థం : మధ్యమ-అంగుష్ఠ-తర్జన్యః = నడిమి వ్రేలు, బొటన వ్రేలు, చూపుడు వ్రేలు — ఈ మూడు ; నారికేళ - అక్షవత్ - కృతాః = కొబ్బరికాయి కన్నులవలె చేయబడినవి; అనామికా వక్రా, కనిష్ఠికా ప్రోన్నతా (చ) = ఉంగరపు వ్రేలు వంగినది, చిటికెన వ్రేలు పైకెత్తబడినది (కాగా, ఆ హస్తం); లాంగూలః = 'లాంగూల (హస్త)ం' (అవుతుంది).

పురా = పూర్వకాలంలో ; క్షీరోధిజః కాలకూటః = పాల సముద్రము నుంచి పుట్టిన కాలకూట విషం ; గుళికాకృతికః = (మింగటానికి వీలుగా) గుళిక ఆకారంగాచేసి (చేతిలో పట్టుకొన్నప్పుడు) ; లాంగూలః = లాంగూల హస్తం ; హర సంజాతః = హరుని (= శివుని) వలన జన్మించినది ; క్రౌంచవిదారణః ఋషి = క్రౌంచ పర్వతమును చీల్చిన వాడు (= కుమారస్వామి) ఋషి; సిద్ధజాతిః = సిద్ధజాతి ; స్వర్ణవర్ణః = బంగారు రంగు ; తస్యాః అధిదేవతా, పద్మా = దాని యొక్క, అధిదేవత, పద్మ (= లక్ష్మి దేవి).

ద్రాక్షాఫలే (చ), రుద్రాక్షే, చుబుకగ్రహణే (అపి) (చ) = ద్రాక్షపండు, రుద్రాక్ష, గడ్డం పట్టుకొనటం ; కుచప్రరోహే, క్రముకే, కింకిణ్యాం, ఉత్పలే, ఫలే = చూచుకం (మొలకచన్ను - నీడా), పోకకాయ, చిరుగజ్జెలు, కలువ, పండు ; విద్రుమే (చ), మితగ్రాసే, నక్షత్రే, బదరీఫలే = పగడం, చిన్న అన్నపుముద్ద, నక్షత్రం, రేగు పండు ; వర్తులాయాం, మల్లికాదౌ, చకోరే, చాతకే, అల్పకే = వలయం, మల్లెపువ్వు మొదలగునవి, చకోర పక్షి, చాతక

పక్షి, అల్పం ; కరకాయాం, సిద్ధజాతౌ, హారీతక్యాం, సువర్ణకే = వడగల్లు, సిద్ధజాతి, కరక్కాయ, బంగారం ; ఏవమ్ ఆదిషు = ఇవి, ఇంకా ఇటువంటి అర్థములందు ; లాంగూల సంజ్ఞకః హస్తః = లాంగూలం అనే పేరుగల హస్తం ; యుజ్యేత = ప్రయోగించవలెను.

తాత్పర్యం : నడిమి-బొటన-చూపుడు వ్రేళ్ళు మూడింటిని కొబ్బరి కాయ కన్నుల ఆకారంగా పట్టి, ఉంగరపు వ్రేలిని వంచి, చిటికెన వ్రేలిని పైకెత్తితే, అది 'లాంగూల హస్తం' అవుతుంది.

పూర్వకాలమందు పాలసముద్రం నుంచి పుట్టిన కాలకూట విషాన్ని మ్రింగటానికి వీలుగా గుళిక ఆకారంగా చేసి, దానిని చేతిలో పట్టుకొన్నప్పుడు శివునివలన లాంగూల హస్తం జన్మించినది. కుమారస్వామి ఋషి, సిద్ధజాతి, బంగారు రంగు. అధిదేవత పద్మ.

ద్రాక్షపండు, రుద్రాక్ష, గడ్డం పట్టుకొనటం, చూచుకం లేదా మొలకచన్ను, పోకకాయ, చిరుగజ్జెలు, కలువ, పండు, పగడం, చిన్న అన్నపు ముద్ద, నక్షత్రం, రేగుపండు, వలయం, మల్లె పువ్వు మొదలగునవి, చకోర పక్షి, చాతకపక్షి, అల్పత్వం, వడగల్లు, సిద్ధజాతి, కరక్కాయ, బంగారం, ఇవి, ఇంకా ఇటువంటివి — వీటి అర్థాలను ప్రదర్శించటంలో లాంగూల హస్తం ప్రయుక్తం కాదగును.

టీక : చూ. కాంగుల హస్తం క్రింది టీక.

## 20. అలపద్మ హస్తం :



కనిష్ఠాద్యా వక్రితాశ్చ విరలా శ్చాలపద్మకః ।
వికచాబ్జే కపిత్థాదిఫలే చావర్తకే కుచే ॥ 373
విరహే ముకురే పూర్ణచంద్రే సౌందర్యభావనే ।
ధమ్మిల్లే చంద్రశాలాయాం గ్రామే చోద్ధృత
కోపయోః ॥ 374

తటాకే శకటే చక్రవాకే కలకలారవే।
శ్లాఘనే సో ఒలపద్మశ్చ కీర్తితో భరతాగమే॥ 375

అర్థం : కనిష్ఠ-ఆద్యాః=చిటికెన వ్రేలు మొదలగు వ్రేళ్ళు విరలాః (చ), వక్రితాః (చ)=ఎడము కలవి (=మధ్య సందులు; కలవి), కొంచెంగా వంచబడినవి (వర్తితాః=త్రిప్పిపట్టబడినవి—నీడా) అయితే ; సః, అలపద్మకః=అది, అలపద్మ(క) హస్తం (సోలపద్మకః=సోలపద్మక హస్తం—నీడా) (అవుతుంది). (అలపద్మం=సోలపద్మం=బాగా విరిసిన పద్మం).

వికచ-అబ్జే, కపిత్థ-ఆదిఫలే (చ), ఆవర్తకే, కుచే=వికసించిన పద్మం, వెలగ మొదలగు పండ్లు, గుండ్రంగా తిరుగటం లేదా సుడిగుండం, కుచం; విరహే, ముకురే, పూర్ణచంద్రే, సౌందర్య భావనే=ఎడబాటు, అద్దం, పూర్ణచంద్రుడు, సౌందర్యం (సౌందర్య భాజనే=సౌందర్య పాత్రము - నీడా) ; ధమ్మిల్లే, చంద్రశాలాయాం, గ్రామే (అపి), ఉద్ధృత (ఉద్ధృత - నీడా) - కోపయోః=కొప్పు, మేడమీది ఇల్లు, ఊరు, ఎత్తు, కోపం ; తటాకే, శకటే, చక్రవాకే, కలకలారవే=చెరువు, బండి, చక్రవాక పక్షి, కలకల ధ్వని ; శ్లాఘనే=పొగడ్తయందు — ఈ అర్థాలను ప్రదర్శించటంలో ; సః, అలపద్మః (చ), భరతాగమే, కీర్తితః=ఆ, అలపద్మ (హస్త)ం, భరతవేదమందు, కీర్తింపబడినది.

తాత్పర్యం : చిటికెన వ్రేలు మొదలగు వ్రేళ్ళు మధ్య సందులు ఉండునట్లుగా కొంచెం వంచబడితే, అది అలపద్మ హస్తం అవుతుంది (=చిటికెన వ్రేలు మొదలుకొని ఐదు వ్రేళ్ళు విడివిడిగా అరచేతి వైపు వంగటం).

వికసించిన పద్మం, వెలగ మొదలగు పండ్లు, గుండ్రంగా తిరగటం లేదా సుడిగుండం, కుచం, ఎడబాటు, అద్దం, పూర్ణ చంద్రుడు, సౌందర్యం, కొప్పు, మేడ మీది ఇల్లు, ఊరు, ఎత్తు, కోపం, చెరువు, బండి, చక్రవాకపక్షి, కలకల ధ్వని, పొగడ్త — ఈ

అర్థాలను నిరూపించటంలో అలపద్మహస్తం తగును అని భరతవేద మందు కీర్తింపబడినది.

టీక : నాట్యశాస్త్రాదులలో 'అలపల్లవ హస్తం' అని ఉన్నది. ఘోష్ 'అలపద్మ హస్తం' అని పఠించినారు. సంస్కృతంలో 'సః అలపద్మః' 'అనునది సోఽలపద్మః' అవుతుంది ; ఇందులోని అవగ్రహం (—ఽ) తొలగిపోతే 'సోలపద్మః' అవుతుంది. ఇట్లా ఈ పాఠం భ్రాంతిమూలకంగా ఏర్పడి ఉంటుంది. 'గ్రంథాంతరే' అని చెప్పిన తరువాతి పాఠంలో 'అలపల్లవం' అని ఉండటం గమనింపదగినది.

భరతముని చెప్పిన నిర్వచనం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో అలపల్లవ హస్తం :

వ్యావృత్తికరణం యత్ర స భవేదలపల్లవః ।
వ్యావృత్తహస్తః కలశనవనీత ముషఃపురా ॥ 376

జజ్ఞేఽలపల్లవః కృష్ణాత్ వసంతో ఋషి రుచ్యతే ।
గంధర్వజాతిః శ్యామాంశు రధీశోఽస్య దినేశ్వరః ॥ 377

హైయంగవీనే విరహే మౌళా మోదకభావనే ।
ఫుల్లపద్మే చ మంజర్యాం కిరీటే వర్తులే ఽపి చ ॥ 378

శ్లాఘాయాం రూపసౌందర్యే నర్తనే దుర్గ-సౌధయోః ।
ధమ్మిల్లే చంద్రశాలాయాం మాదుర్యే సాధువాదనే ॥ 379

నియుజ్యతే శాశపలే హస్తో ఽయ మలపల్లవః ।

అర్థం : యత్ర, వ్యావృత్తి కరణం = ఎచ్చట, (వేళ్ళను) విరళంగా, త్రిప్పిపట్టటం కలదో ; సః అలపల్లవః భవేత్ = (అచ్చట) అది 'అలపల్లవ హస్తం' అవుతుంది.

పురా = పూర్వం ; కలశనవనీత ముషః కృష్ణాత్ = కుండల

నుండి నవనీతం దొంగిలించిన కృష్ణుని వల్ల ; వ్యావృత్త హస్తః = వ్రేళ్ళు విడిగా (త్రిప్పి) పట్టుకొనిన ; అలపల్లవః, జజ్ఞే = అలపల్లవ (హస్తం), జన్మించినది ; వసంతః, ఋషిః, ఉచ్యతే = (దీనికి) వసంతుడు, ఋషి, అని చెప్పబడుతున్నది ; గంధర్వ జాతిః = గంధర్వజాతి ; శ్యామ-అంశు = శ్యామవర్ణం ; అస్య, అధీశః, దినేశ్వరః = దాని యొక్క, అధిదేవత, సూర్యుడు.

హైయంగవీనే, విరహే, మౌళౌ, మోదకభావనే = అప్పుడే కాచిన నెయ్యి లేదా తాజా వెన్న ముద్ద, విరహం, తల, కుడుము; ఫుల్లపద్మే (చ), మంజర్యాం, కిరీటే, వర్తులే (అపి) (చ) = వికసించిన పద్మం, పూలగుత్తి, కిరీటం, వలయం; శ్లాఘాయాం, రూపసౌందర్యే, నర్తనే, దుర్గ - సౌధయోః = పొగడ్త, రూపం, సౌందర్యం, నర్తనం, కోట, మేడ ; ధమ్మిల్లే, చంద్రశాలాయాం, మాధుర్యే, సాధువాదనే = కొప్పు, మేడమీది ఇల్లు, మాధుర్యం, బాగుబాగు అనటం ; తాళఫలే = తాటిపండు ; — ఈ అర్థాలను ప్రదర్శించటంలో; అయం, అలపల్లవ హస్తః, నియుజ్యతే = ఈ, అలపల్లవ హస్తం, నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : వ్రేళ్ళను విరళంగా, (అరచేతిలోనికి) త్రిప్పి పడితే అది అలపల్లవ హస్తం అవుతుంది. పూర్వ కాలంలో, కలశముల నుంచి నవనీతం దొంగిలించిన కృష్ణునివల్ల వ్యావృత్త (= అలపల్లవ) హస్తం జన్మించినది. వసంతుడు ఋషి, గంధర్వ జాతి, శ్యామవర్ణం, అధిదేవత సూర్యుడు.

అప్పుడే కాచిన నెయ్యి లేదా తాజా వెన్నముద్ద, విరహం, తల, కుడుము, వికసించిన పద్మం, పూలగుత్తి, కిరీటం, వలయం, పొగడ్త, రూపం, సౌందర్యం, నర్తనం, కోట, మేడ, కొప్పు, మేడ మీది ఇల్లు, మాధుర్యం, బాగు బాగు అనటం, తాటిపండు - వీటి అర్థాలను నిరూపించటంలో ఈ అలపల్లవ హస్తం నియుక్తమవుతున్నది.

టీక : ఈ నిర్వచనం ఇంతకుముందు చెప్పిన నిర్వచనంతో సంవదిస్తున్నది.

## 21. చతుర హస్తం :



తర్జన్యాద్యా త్రయః శ్లిష్టాః కనిష్ఠా ప్రసృతా యది ॥ 380
అంగుష్ఠో ఒనామికామూలే తిర్యక్ చేత్ చతురః కరః ।

కస్తూర్యాం కించిదప్యర్థే స్వర్ణతామ్రాదిలోహకే ॥ 381
ఆర్ద్రే భేదే రసాస్వాదే లోచనే వర్ణభేదనే ।

ప్రమాణే సరసే మందగమనే శకలీకృతే ॥ 382
ఆననే ఘృతతైలాదౌ యుజ్యతే చతురః కరః ।

అర్థం : తర్జని-ఆద్యాః త్రయాః శ్లిష్టాః = తర్జని మొదలైన మూడు (వ్రేళ్ళు), దగ్గరకు చేరినవి ; కనిష్ఠా ప్రసృతా = చిటికెన వ్రేలు, చాచబడినది ; అనామికామూలే, అంగుష్ఠః తిర్యక్ యది చేత్ = ఉంగరపు వ్రేలు మొదట బొటన వ్రేలు, అడ్డంగా ఉంచబడినది అయితే (ఆ హస్తం) ; చతురః కరః = చతురహస్తం (అవుతుంది) (చతురం = నాలుగు).

కస్తూర్యాం, కించత్ (అపి) అర్థే, స్వర్ణ = తామ్ర-ఆది లోహకే = కస్తూరి, కొంచెం అనే అర్థం, బంగారం రాగి మొదలయిన లోహాలు (స్వర్ణే, తామ్రేచ, లోహకే = బంగారం, రాగి, లోహములందు - నీడా); ఆర్ద్రే, భేదే, రసాస్వాదే, లోచనే, వర్ణ భేదనే = తడి, భేదం, రసాస్వాదం, కన్ను, వర్ణ(= కుల) భేదం; ప్రమాణే, సరసే మందగమనే, శకలీకృతే = ప్రమాణం, సారస్యం మెల్లగానడవటం, ముక్కలు చేయటం; ఆననే, ఘృత-తైల-ఆదౌ = ఎత్తుపీట, నేయినూనె మొదలగు (ద్రవ) వస్తువులు; - ఈ అర్థాలను నిరూపించటంలో చతురః కరః యుజ్యతే = చతురహస్తం తగును.

తాత్పర్యం : తర్జని మొదలగు మూడు వ్రేళ్ళు దగ్గరకు చేరి నవి, చిటికెన వ్రేలు చాచబడినది, ఉంగరపు వ్రేలు మోట బొటన వ్రేలు అడ్డంగా ఉంచబడినది అయితే, అది 'చతుర హస్తం' అవుతుంది.

కస్తూరి, కొంచెం, బంగారం, రాగి, ఇతర లోహాలు, ఖేదం, రసాస్వాదం, కన్ను, కులభేదం, ప్రమాణం, సారస్యం, మెల్లగా నడవటం, ముక్కలు చేయటం, ఎత్తైన పీట, నేయి నూనె మొదలగు ద్రవ పదార్థాలు - వీటి అర్థాలను నిరూపించటంలో చతుర హస్తం తగును.

టీక : నాట్యశాస్త్రంలోని చతుర హస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో చతుర హస్తం :

యంత్రాంగుష్ఠః పతాకస్య మధ్యమా మధ్యపర్వగః॥ 383
కనిష్ఠికా బహిర్యాతా చతురం తం కరం విదుః ।
అమృతం హర్తుమనస మాత్మానుమతికాంక్షిణమ్ ॥ 384
సుధాం హరేతి హస్తేన గురుదంప్రతి జల్పతః ।
కాశ్యపాత్ చతురో జాతః వాలఖిల్యోమహాఋషిః ॥ 385
చిత్రవర్ణో మిశ్రజాతిః వైనతేయ శ్చ దేవతా ।
గోరోచనాయాం దూర్వాయాం చ సరసే ఽ లక్తకే ఽపి చ ॥ 386
చిత్తావధానే కర్పూరే లోచనే చుబుకే తథా ।
తాటంకే వదనే ఫాలే కటాక్షే చ ప్రియే నయే ॥ 387
కస్తూర్యాం శర్కరాయాం చ తైలే మధుని సర్పిషి ।
చాతుర్యే దర్పణే స్వర్ణే వజ్రే మరతకే ఽపి చ ॥ 388
ఇయత్తాయా మీషదర్థే వస్తూనాం మితదర్శనే ।

నీలశ్వేతాదివర్ణేషు మిశ్రజాతౌ చ శాద్వలే ॥ 389

గండస్థలే పాలికాయాం ద్రష్టవ్యః చతురః కరః ।

అర్థం: పతాకస్య, అంగుష్ఠః = పతాక హస్తమందలి, బొటన వ్రేలు; మధ్యమా, మధ్యపర్వగః = నడిమి వ్రేలి యొక్క, నడిమి కణుపును తాకినది; కనిష్ఠికా బహిః యాతా = చిటికెన వ్రేలు వెలుపలికి వచ్చినది (విడిగా చాపబడినది); యత్ర = ఎచ్చటనో (= ఏ హస్తమందో); తం = దానిని (= ఆ హస్తాన్ని); చతురం కరం, విదుః = చతుర హస్తం (అని) తెలిసికొందురు.

అమృతం హర్తుమనసమ్ = (పూర్వం) అమృతమును అపహరించే మనస్సు కలవాడై; ఆత్మానుమతి, కాంక్షిణమ్ = తనయొక్క అనుమతిని, కోరుతున్న; గరుడం ప్రతి = గరుత్మంతునితో; సుధాం, హర, ఇతి, హస్తేన జల్పతః, కాశ్యపాత్ = సుధ (= అమృతము)ను, 'అపహరించుము', అని, హస్తంతో చెబుతున్న, కశ్యప మహర్షి వలన; చతురః జాతః = చతుర (హస్త)ం జన్మించినది; వాలఖిల్యః మహా ఋషిః = వాలఖిల్యుడు (మహా) ఋషి; చిత్రవర్ణః = చిత్ర వర్ణః; మిశ్ర జాతిః = మిశ్రజాతి; దేవతా, వైనతేయః (చ) = (అధి) దేవత వైనతేయుడు (= గరుత్మంతుడు).

గోరోచనాయాం, ధూళ్యాం (చ), నరసే, అలక్తకే (అపి) (చ) = గోరోచనం, దుమ్ము, ఆవాలు, లత్తుక; చిత్త-అవధానే, కర్పూరే, లోచనే, చుబుకే (తథా) = ఏకాగ్రత, కర్పూరం, కన్ను, గడ్డం; తాటంకే, వదనే, ఫాలే, కటాక్షే (చ), ప్రియే, నయే = తాటంకం, ముఖం, నొసలు, కడకంటి చూపు, ప్రియమైన విషయం, నయం (విధానం — స్వామి); కస్తూర్యాం, శర్కరాయాం (చ), తైలే, మధుని, సర్పిషి = కస్తూరి, చక్కెర, నూనె, తేనె, నెయ్యి; చాతుర్యే, దర్పణే, స్వర్ణే, వజ్రే, మరతకే (అపి) (చ) = చాతుర్యం, అద్దం, బంగారం, వజ్రం, మరకతం (= పచ్చ);

ఇయత్తాయాం, ఈషదర్థే, వస్తూనాం మితదర్శనే = ఇంత అనటం, కొంచెం అనటం, వస్తువులను మితంగా చూపటం ; నీలశ్వేత - ఆది వర్ణేషు, మిశ్రజాతా (చ), శాద్వలే = నీలం - తెలుపు మొదలగు రంగులు, మిశ్రజాతి, పచ్చిక నేల (కత్తి - స్వామి) ; గండస్థలే, పాలికాయాం = చెక్కిలి, పాలిక (= కర్ణపత్రం) ; — ఈ అర్థాలను నిరూపించటంలో ; చతురః కరః, ద్రష్టవ్యః = చతుర హస్తం చూడదగినది.

తాత్పర్యం : పతాక హస్తమందలి బొటన వ్రేలు, నడిమి వ్రేలు మొదట చేరగా చిటికెన వ్రేలును వెలుపలికి చాచితే, అది 'చతుర హస్తం' అవుతుంది.

పూర్వం అమృతమును అపహరించే కోరికతో తన అనుమతిని కోరుతున్న గురుత్మంతునితో "అమృతమును అపహరించుము" అని ఏ హస్తంతో కశ్యపమహర్షి చెప్పెనో ఆహస్తం నుంచి చతురహస్తం జన్మించినది. వాలఖిల్యుడు ఋషి. చిత్రవర్ణం. మిశ్రజాతి. అధిదేవత వైనతేయుడు.

గోరోచనం, దుమ్ము, ఆవాలు, ఉత్సుక, ఏకాగ్రత, కర్పూరం, కన్ను, గడ్డం, తాటంకం, ముఖం, నొసలు, కడకంటి చూపు, ప్రియమైన విషయం, నయం లేదా విధానం, కస్తూరి, చక్కెర, నూనె, తేనె, నెయ్యి, చాతుర్యం, అద్దం, బంగారం, వజ్రం, మరకతం, ఇంత అనటం, కొంచెం అనటం, వస్తువులను మితంగా చూపటం, నీలము, తెలుపు మొదలగు రంగులు, మిశ్రజాతి, పచ్చిక నేల లేదా కత్తి, చెక్కిలి, పాలిక — వీటి అర్థాలను నిరూపించటంలో చతుర హస్తం తగినది.

టీక : ఈ నిర్వచన విధానం చాలా సమగ్రంగా ఉంది. ఇంతకుముందు చెప్పిన చతుర హస్తం, ఇదీ ఒక్కటే.

## 22. భ్రమర హస్తం :



మధ్యమాంగుష్ఠసంయోగే తర్జనీ వక్రితాకృతిః ॥ 390
శేషాః ప్రసారితా శ్చాసౌ భ్రమరాభిధహస్తకః ।

భ్రమరే చ శుకే యోగే సారసే కోకిలాదిషు ॥ 391
భ్రమరాభిధ హస్తో ఽయం కీర్తితో భరతాగమే ।

అర్థం : మధ్యమ-అంగుష్ఠ, సంయోగే = నడిమి వ్రేలు బొటనవ్రేలు, కలిసినవి ; తర్జనీ వక్రితా-ఆకృతిః = చూపుడు వ్రేలు వంగిన ఆకారం కలది ; శేషాః ప్రసారితాః (చ) = తక్కిన రెండు వ్రేళ్ళు చాచబడినవి అయితే ; అసౌ, భ్రమర-అభిధ హస్తకః = అది, భ్రమరం అనే పేరుగల, హస్తం (అవుతుంది).

భ్రమరే (చ), శుకే, యోగే, సారసే, కోకిల - ఆదిషు = తుమ్మెద, చిలుక, యోగాభ్యాసం (పక్షే = రెక్క యందు-ఘోష్), సారస పక్షి, కోకిల మొదలగు పక్షులు ; — వీటి అర్థాలను నిరూపించ టంలో ; భ్రమర-అభిధహస్తః అయం = భ్రమరం అనే పేరు గల ఈ హస్తం ; భరతాగమే, కీర్తితః = భరత వేదంలో కీర్తింపబడింది (భ్రమరం = తుమ్మెద).

తాత్పర్యం : నడిమివ్రేలు బొటవ్రేలు కలిసినవి, చూపుడు వ్రేలు వంగినది, తక్కిన రెండు వ్రేళ్ళు ప్రసారితములు అయితే, అది 'భ్రమర హస్తం' అవుతుంది.

తుమ్మెద, చిలుక, యోగాభ్యాసం లేదా రెక్క, సారస పక్షి, కోకిల మొదలగు పక్షులు=ఈఅర్థాలను నిరూపించటానికి భ్రమర హస్తం తగును అని భరతాగమం (=నాట్య శాస్త్రం)లోచెప్పబడినది.

టీక : నాట్యశాస్త్రంలోని భ్రమర హస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో భ్రమర హస్తం :

హంసాస్యతర్జనీ నమ్రా యదిస్యాత్ భ్రమరః కరః ॥ 392

కర్ణపూరం రచయతో దేవమాతుః కదాచన ।
కశ్యపాత్ భ్రమరో జాతః కపిలో ఋషి రుచ్యతే ॥ 393

మేచకః ఖచరోజాతిః పక్షిరాజో ఽధిదేవతా ।
యోగే మౌనవ్రతే శృంగే గజదంతనిరూపణే ॥ 394

దీర్ఘనాళప్రసూనానాంగ్రహణే భ్రమరే ఽపి చ ।
కర్ణమంత్రస్యరచనే కంటకోద్ధరణే ఽపి చ ॥ 395

సీపీమోక్షే ద్వ్యక్షరాణా మవ్యయానాం నిరూపణే ।
ఖేచరే మేచకేపర్ణే భ్రమరో ఽయం నియుజ్యతే ॥ 396

అర్థం : హంసాస్య, తర్జనీ, నమ్రా, యది = హంసాస్య మందలి, తర్జని, వంగినది, అయితే ; భ్రమరః కరః, స్యాత్ = భ్రమర హస్తం, అవుతుంది.

కదాచన = ఒకానొకప్పుడు ( = పూర్వం) ; దేవమాతుః, కర్ణపూరం, రచయతః, కశ్యపాత్ = దేవమాతకు( = అదితికి), కర్ణపూరం, రచిస్తున్న ( = పువ్వులతో చెవుల కమ్మలు చేస్తున్న), కశ్యపమహర్షి వలన ; భ్రమరః, జాతః = భ్రమరహస్తం, జన్మించినది ; కపిలః, ఋషిః, ఉచ్యతే = కపిలుడు, ఋషి (అని), చెప్పబడుతున్నది ; మేచకః = చామనచాయ (రంగు కలది) ; ఖచరః, జాతిః = గంధర్వ జాతి ; అధిదేవతా, పక్షిరాజః = అధిదేవత పక్షిరాజు ( = గురుత్మంతుడు).

యోగే, మౌనవ్రతే, శృంగే, గజదంత నిరూపణే = యోగాభ్యాసం (కలయిక - స్వామి), మౌనవ్రతం, కొమ్ము, గజదంతం నిరూపించటం ; దీర్ఘనాళ ప్రసూనానాంగ్రహణే, భ్రమరే (అపి)

(చ)=పొడుగు కాడగల పువ్వులను గ్రహించటం, తుమ్మెద ; కర్ణ మంత్రస్వరచనే, కంటక-ఉద్ధరణే (అపి) (చ)=చెవిలో రహస్యం చెప్పటం, ముల్లు తీయటం; నీవీ మోక్షే, ద్వ్యక్షరాణాం అవ్యయానాం నిరూపణే=పోకముడి విప్పటం, రెండు అక్షరాల అవ్యయాలను నిరూపించటం ; ఖేచరే, మేచకే వర్ణే=ఆకాశమందు తిరిగే ప్రాణి, చామనచాయ ;— ఈ అర్థాలను నిరూపించటంలో ; అయం భ్రమరః, నియుజ్యతే = ఈ భ్రమర (హస్త)ం,నియుక్తగును.

తాత్పర్యం : హంసాస్య మందలి తర్జని వంగితే, అది భ్రమర హస్తమవుతుంది.

ఒకానొకప్పుడు అదితికి కర్ణపూరము రచిస్తున్న కశ్యపమహర్షి వలన భ్రమర హస్తం జన్మించినది. కపిలుడు ఋషి. చామనచాయ. గంధర్వ జాతి. అధిదేవత గరుత్మంతుడు.

యోగాభ్యాసం లేదా కలయిక, మౌనవ్రతం, కొమ్ము, గజ దంతం, పొడుగు కాడగల పువ్వులను గ్రహించటం, తుమ్మెద, చెవిలో రహస్యం చెప్పటం, ముల్లు తీయటం, పోకముడి విప్పటం, రెండు అక్షరాల అవ్యయాలను నిరూపించటం, ఆకాశమందు తిరిగే ప్రాణి, చామనచాయ — ఈ అర్థాలను ప్రదర్శించటంలో భ్రమర హస్తం తగును.

టీక : హంసాస్యహస్తం తరువాత చెప్పబడుతున్నది. చెప్పిన విధానం భిన్నంగా ఉన్నా, ఇంతకు ముందు చెప్పిన భ్రమర హస్తం, ఇదీ ఒక్కటే.

పితరౌ జగతఃపితరౌ వందే ।

## 23. హంసాస్య హస్తం :



23 అద

మధ్యమాద్యాః త్రయో ఉంగుల్యః ప్రసృతా విరలా యది।
తర్జన్యంగుష్ఠసంశ్లేషాత్ కరో హంసాస్యకో భవేత్ ॥ 397

మాంగల్యే సూత్రబంధే చ ఉపదేశవినిశ్చయే ।
రోమాంచే మౌక్తికాదౌ చ దీపవర్తిప్రసారణే ॥ 398

నికషే మల్లికాదౌ చ చిత్రే తల్లేఖనే తథా ।
దంశే చ జలబంధే చ హంసాస్యో యుజ్యతే కరః ॥ 399

అర్థం : మధ్యమాద్యాః, త్రయః, అంగుల్యః = నడిమి వ్రేలు మొదలుకొని, మూడు, వ్రేళ్ళు ; ప్రసృతా, విరలా యది = చాచినవి, ఎడం ఎడంగా ఉన్నవి కాగా; తర్జనీ - అంగుష్ఠ సంశ్లేషాత్ = తర్జనీ - అంగుష్ఠముల కలియకవలన; హంసాస్యకః, కరః, భవేత్ = హంసాస్య(క) హస్తం అవుతుంది.

మాంగల్యే, సూత్ర బంధే (చ), ఉపదేశ వినిశ్చయే = ఆశీస్సు లేదా ఉత్సవం, దారంతో కట్టటం (మాంగల్య సూత్రబంధే = మంగళ సూత్రం కట్టటం - నీడా), ఉపదేశమందు నిశ్చయం (ఉపదేశే వినిశ్చయే = ఉపదేశం, నిశ్చయం - నీడా) ; రోమాంచే, మౌక్తికాదౌ (చ), దీపవర్తి ప్రసారణే = గగుర్పాటు, ముత్యం మొదలైనవి, దీపపు వత్తిని ఎగద్రోయటం ; నికషే, మల్లికాదౌ (చ), చిత్రే, తల్లేఖనే (తథా) = ఒరపిడిరాయి, మల్లె మొగ్గ మొదలైనవి, చిత్రం, చిత్రం వ్రాయటం (చిత్ర సంలేఖనే = చిత్రం బాగా వ్రాయటం - నీడా) (శోధనే = శోధించటంలో - నీడాలో అధికం); దంశే (చ), జలబంధే (చ) = అడవి ఈగ, ప్రవాహానికి అడ్డుకట్ట (జలబిందౌ = జలబిందువునందు-నీడా); — ఈ అర్థాలను నిరూపించటంలో, హంసాస్యః కరః, యుజ్యతే = హంసాస్య హస్తం; ప్రయోగింపదగినది (హంసాస్యం = హంస ముఖం).

తాత్పర్యం : నడిమి వ్రేలు మొదలుకొని మూడు వ్రేళ్ళు ఎడం ఎడంగా చాచినవి కాగా, చూపుడు వ్రేలు బొటన వ్రేలు కలిస్తే, అది హంసాస్య హస్తం అవుతుంది.

ఆశీస్సు లేదా ఉత్సవం, దారంతో కట్టటం లేదా మంగళ సూత్రం కట్టటం, ఉపదేశమందు నిశ్చయం లేదా ఉపదేశం, నిశ్చయం, గగుర్పాటు, ముత్యం మొదలైనవి, దీపపు వత్తిని ఎగ ద్రోయటం, ఒరపిడిరాయి, మల్లెమొగ్గ మొదలైనవి, చిత్రం, చిత్రం బాగా వ్రాయటం, శోధించటం, అడవి ఈగ, ప్రవాహానికి అడ్డుకట్టటం లేదా జల బిందువు — ఈ అర్థములందు హంసాస్య హస్తం తగినది.

[నీడా పాఠంలో - మూడు అధిక పాదాలతో, వినియోగ పాఠం క్రింది విధంగా ఉంది:

మాంగళ్యసూత్రబంధే చా ఽ వ్యుపదేశే వినిశ్చయే ।
రోమాంచే మౌక్తికాదౌ చ చిత్రసంలేఖనే తథా ॥ 400

దంశే తు జలబిందౌ చ దీపవర్తిప్రసారణే ।
నికషే శోధనే మల్లికాదౌ రేఖావిలేఖనే ॥ 401

మాలాయావహనే సోఽహంభావనాయంచ రూపకే ।
నాస్తీతివచనే చాపి నికషాణాం చ భావనే ॥ 402

కృతకృత్యే ఽపి హంసాస్యః ఈరితో భరతాగమే ।

అర్థం : మాలాయా, వహనే, సః అహం భావనాయాంచ), రూపకే=దండ పట్టుకొనటం, నేనే బ్రహ్మము అనేభావన, ఆరోపించటం (రూపకాలంకారం - స్వామి) ; న-అస్తి-ఇతివచనే (చ) (అపి), నికషాణాం (చ) భావనే=లేదు అని చెప్పటం, వస్తువులను ఒరపిడి పెట్టి చూడటం ; కృతకృత్యే (అపి)=పని పూర్తి కావటం; — ఈ అర్థాలను నిరూపించటంలో; హంసాస్యః, భరతాగమే, ఈరితః=హంసాస్య (హస్త)ం భరతవేదమందు, చెప్పబడినది.

తాత్పర్యం : దండ పట్టుకొనటం, నేనే బ్రహ్మము అని భావించటం, రూపించటం లేదా రూపకాలంకారం, లేదు అని చెప్పటం, వస్తువులను ఒరపిడి పెట్టి చూడటం, పని పూర్తికావటం-ఈ అర్థములందు హంసాస్య హస్తం తగును అని భరతవేదంచేత చెప్పబడింది.]

టీక : దీనిని 'హంసవక్త్రం' అనికూడా అంటారు (ఆస్యం=వక్త్రం=ముఖం). భరతముని చెప్పిన హంసవక్త్రంకంటె ఇది భిన్నంగా ఉంది.

## వేరే గ్రంథంలో హంసాస్య హస్తం :


19

శ్లిష్టాగ్రమధ్యమాంగుష్ఠతర్జన్యో యత్ర ప్రసారితా॥ 403
అనామికా కనీయాంసౌ స హంసాస్యకరో భవేత్ ।
న్యగ్రోధమూలమాశ్రిత్య మునీనాం తత్త్వదర్శనే॥404
హంసాస్యో దక్షిణామూర్తే రాసీ దస్య ఋషిః శుకః ।
క్షత్రవర్ణో విప్రజాతి రధీశ శ్చతురాననః॥ 405

జ్ఞానోపదేశే పూజాయాం నిర్ణయే చ తిలాహుతౌ ।
భాషణే వతనే గానే ధ్యానే భావనిరూపణే ॥ 406
రచనేయావకాదీనాం పులకే మౌక్తికమణౌ ॥
వేణునాదే సంయుత శ్చేత్ వాసనాయాం నిజాత్మని ॥ 407
జలబిందౌ లక్ష్యభావే ముద్రికాయాం చ చుంబనే ।
విప్రజాతా క్షత్రవర్ణే హంసాస్యః ప్రకీర్తితః ॥

అర్థం : యత్ర=ఎందు (=ఏ హస్తమందు); శ్లిష్ట-అగ్ర మధ్యమ-అంగుష్ఠ తర్జన్యః=నడిమివ్రేలు, బొటనవ్రేలు, చూపుడు వ్రేలు యొక్క చివరలు కలిసినవి; అనామికా-కనీయాంసౌ, ప్రసారితా=ఉంగరపువ్రేలు, చిటికెన వ్రేలు, చాపబడినవి(అవుతాయో); సః హంసాస్యకరః భవేత్ = అది హంసాస్యహస్తం, అవుతుంది.

న్యగ్రోధ మూలం ఆశ్రిత్య = (పూర్వం) మఱ్ఱిచెట్టు మొదట చేరి; మునీనాం, తత్త్వ దర్శనే = మునులకు, పరతత్త్వమునుగూర్చి ఉపదేశిస్తున్న; దక్షిణామూర్తేః = దక్షిణామూర్తివలన, హంసాస్యః, ఆసీత్ = హంసాస్య హస్తం కలిగినది; అస్య, ఋషిః, శుకః = దీని యొక్క ఋషి, శుకుడు; శుభ్రవర్ణః = తెలుపు రంగు; విప్రజాతిః = విప్రజాతి; అధీశః, చతురాననః = అధిదేవత బ్రహ్మ.

జ్ఞానోపదేశే, పూజాయాం, నిర్ణయే (చ), తిల-అహుతౌ = జ్ఞానోపదేశం, పూజ, నిర్ణయించటం, తిల ఆహుతి; భాషణే, పఠనే, గానే, ధ్యానే, భావనిరూపణే = మాటాడటం, పఠించటం, పాడటం, ధ్యానం చేయటం, భావములను నిరూపించటం; యావకాదీనాం రచనే, పులకే, మౌక్తికమణౌ = లత్తుక మొదలగు వానిని వ్రాయటం, గగుర్పాటు, ముత్యం; సంయుతః చేత్ వేణునాదే, వాసనాయాం, నిజాత్మని = రెండు హంసాస్య హస్తాలు కలిసినప్పుడు వేణుగానం చేయటం, వాసన చూడటం, తన మనస్సు; జలబిందౌ, లత్యాభావే, ముద్రికాయాం (చ), చుంబనే = నీటిబొట్టు, గురిపెట్టటం, ముద్దుటుంగరం, ముద్దు పెట్టటం; విప్రజాతౌ, శుభ్రవర్ణే = విప్రజాతి, తెలుపు రంగు — ఈ అర్థాలను నిరూపించటంలో ; హంసాస్యః, పరికీర్తితః = హంసాస్య హస్తం, కీర్తింపబడినది.

తాత్పర్యం : బొటన-చూపుడు-నడిమి వ్రేళ్ళ చివరలు కలిసినవి, ఉంగరపు వ్రేలు చిటికెన వ్రేలు చాపబడినవి అయితే అది హంసాస్య హస్తం అవుతుంది.

పూర్వం మఱ్ఱిచెట్టు మొదట కూర్చుండి మునులకు పరతత్త్వము గూర్చి ఉపదేశిస్తున్న దక్షిణామూర్తి వలన హంసాస్య హస్తం జన్మించినది. ఋషి శుకుడు. తెలుపు రంగు. విప్రజాతి. అధిదేవత బ్రహ్మ.

జ్ఞానోపదేశం, పూజ, నిర్ణయించటం, తిలతర్పణం, మాటాడటం, పఠించటం, పాడటం, ధ్యానం చేయటం, భావములను నిరూపించటం, లత్తుక మొదలగు వానిని పెట్టటం, గగుర్పాటు, ముత్యం, రెండు హంసాస్య హస్తములు కలిసినప్పుడు వేణుగానం చేయటం, వాసన చూడటం, తన మనస్సు, నీటి బొట్టు, గురి పెట్టటం, ముద్దుటుంగరం, ముద్దు పెట్టటం, విప్రజాతి, తెలుపు రంగు — ఈ అర్థాలను నిరూపించటంలో హంసాస్య హస్తం తగును.

టీక : ఈ నిర్వచనం నాట్యశాస్త్రం మందలి నిర్వచనంతో సంవదిస్తున్నది. బొటన-నడిమి-చూపుడు వ్రేళ్ళను త్రేతాగ్నులతో పోల్చినాడు భరతముని.

## 24. హంసపక్ష హస్తం :



సర్పశీర్షకరే సమ్యక్ కనిష్ఠా ప్రసృతా యది ।
హంసపక్షకరః సోఽయం తన్నిరూపణ ముచ్యతే॥409

షట్సంఖ్యాయాం సేతుబంధే నఖరేఖాంకనే తథా ।
పిధానే హంసపక్షోఽయం కథితో భరతాగమే ॥ 410

అర్థం : సర్పశీర్షకరే, కనిష్ఠా, సమ్యక్ ప్రసృతా యది = సర్పశీర్ష హస్తమందలి చిటికెన వ్రేలు బాగుగా చాపబడినది, అయితే; అయం సః, హంసపక్ష కరః = అది, హంసపక్ష హస్తం (అవుతుంది); తత్ నిరూపణం, ఉచ్యతే = దాని స్వరూపం, చెప్పబడుతున్నది.

షట్ సంఖ్యాయాం, సేతుబంధే, నఖరేఖ-అంకనే (తథా)= ఆరు అనెడి సంఖ్య, అడ్డు కట్ట కట్టటం, గోటినొక్కు గుర్తు; పిధానే = మరుగుపడటం (విధానే = ఏదేని ఒక పనిచేయటంలో -

నీడా) ; — ఈ అర్థాలను నిరూపించటంలో ; అయం, భరత-ఆగమే, కథితః = ఇది (= ఈ హంసపక్ష హస్తం) భరత వేదమందు, చెప్ప బడినది (కీర్తితః = కీర్తింపబడినది-నీడా) (= హంస పక్షం = హంస యొక్క రెక్క).

తాత్పర్యం : సర్పశీర్ష హస్తమందలి చిటికెన వ్రేలు బాగుగా ప్రసారితమైతే, అది హంసపక్ష హస్తం అవుతుంది. దాని స్వరూపం చెప్పబడుతున్నది.

ఆరు అనెడి సంఖ్య, అడ్డుకట్ట కట్టటం, గోటి నొక్కు గుర్తు, మరుగుపడటం లేదా ఏదైనా ఒకపని చేయటం — ఈ అర్థములందు హంసపక్ష హస్తం తగును అని భరతవేదం చేత చెప్పబడినది.

టీక : నాట్యశాస్త్రమందలి హంసపక్ష హస్తం, ఇదీ ఒక్కటే దానికంటె ఈ నిర్వచనం సూటిగా ఉన్నది.

## వేరే గ్రంథంలో హంస పక్షహస్తం :

కనిష్ఠా సర్పశీర్షే సారితా హంసపక్షకః ।
తాండవాఖ్యసనే హంసపక్షాకారః కరః స్మృతః ॥ 411

తండోర్జాతో హంసపక్షః భరతో ఋషి రుచ్యతే ।
నీలవర్ణో ఉప్సరోజాతి రధీశః పంచసాయకః ॥ 412

శుభనాట్యే సేతుబంధే వీణావాదే సమాహృతా ।
నియంత్రణే పక్షపక్షే పర్యాప్తౌ రూపలేఖనే॥ 413

శ్యామవర్ణే ఉప్సరోజాతా హంసపక్షో నియుజ్యతే ।

అర్థం : సర్పశీర్షే, కనిష్ఠా, సారితా, హంసపక్షకః = ఆ సర్ప శీర్ష హస్తమందలి, చిటికెనవ్రేలు, చాపబడితే, (అది) హంసపక్షక (హస్త)ం అవుతుంది.

తాండవాభ్యసనే = (పూర్వం శివుని యెదుట) తాండవం అభ్యసిస్తున్న సమయ లో; హంసపక్షాకారః కరః, స్మృతః = హంసపక్షం ఆకారంగా హస్తం, స్మరింపబడినప్పుడు( = పట్టినప్పుడు); హంసపక్షః, తండోః, జాతః = హంసపక్షహస్తం, తండువు వలన, పుట్టినది; భరతః, ఋషిః, ఉచ్యతే = భరతుడు, ఋషి, అని చెప్పబడుతున్నది; నీలవర్ణః = నీలపురంగు; అప్సరః జాతిః = అప్సరజాతి; అధీశః, పంచసాయకః = అధిదేవత, మన్మథుడు.

శుభనాట్యే, సేతుబంధే వీణావాదే, సమాహృతౌ = మంగళ ప్రదమైన నాట్యం, అడ్డుకట్ట కట్టటం, వీణవాయించటం, సంగ్రహించటం; నియంత్రణే, పక్షిపక్షే, పర్యాప్తౌ, రూపలేఖనే = అడ్డగించటం, పక్షిరెక్క, (పని) ముగియటం, చిత్రలేఖనం; శ్యామవర్ణే, అప్సరోజాతౌ = శ్యామవర్ణం, అప్సరజాతి; - ఈ అర్థాలను నిరూపించటంలో; హంసపక్షః, నియుజ్యతే = హంసపక్ష (హస్తం), నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : సర్పశీర్ష హస్తమందలి చిటికెన వ్రేలు ప్రసారితమైతే అది హంసపక్ష హస్తం అవుతుంది.

పూర్వం శివుని యెదుట తాండవం అభ్యసిస్తున్న సమయంలో హస్తాన్ని, హంసపక్ష ఆకారంగా పట్టినప్పుడు తండువు వలన హంసపక్ష హస్తం జన్మించినది. భరతుడు ఋషి. నీలపురంగు అప్సరజాతి. అధిదేవత మన్మథుడు.

మంగళప్రదమైన నాట్యం, అడ్డుకట్ట కట్టటం, వీణ వాయించటం, సంగ్రహించటం, అడ్డగించటం, పక్షిరెక్క, పని పూర్తి కావటం, చిత్రలేఖనం, శ్యామవర్ణం, అప్సరజాతి - ఈ అర్థాలను నిరూపించటంలో హంస పక్షహస్తం తగును.

టీక : ఇంతకుముందు చెప్పిన హంసపక్ష హస్తం, ఇదీ ఒక్కటే.

## 25. సందంశ హస్తం:



పునఃపునః పద్మకోశః సంశ్లిష్టో విరలో యది ॥ 414
సందంశాభిధహస్తోఽయం కీర్తితో నృత్యకోవిదైః ।
ఉదరే బలిదానే చ వ్రణే కీటే మహాభయే ॥ 415
అర్చనే పంచ సంఖ్యాయాం సందంశాఖ్యో నియుజ్యతే ।

25 అ.ద



అర్థం : పద్మకోశః, పునఃపునః, సంశ్లిష్టః, విరలః యది = పద్మకోశ (హస్త) మందలి (వ్రేళ్ళను) మరల మరల దగ్గరకు చేర్చి, దూరం చేస్తూ, ఉంటే (ప్రసృతా = చాపబడినది అయితే - నీడా) ; అయం, సందంశ - అభిధ హస్తః = ఇది, సందంశం అనే పేరుగల హస్తం (అవుతుందని) ; నృత్యకోవిదైః, కీర్తితః = నృత్యవేత్తల చేత, కీర్తింపబడినది.

ఉదరే, బలిదానే (చ), వ్రణే, కీటే, మహాభయే = పొట్ట (ఉదారే = త్యాగం-నీడా), బలిదానం, పుండు, పురుగు, మహాభయం (మనోభయే = మనస్సులోని భయం-నీడా) ; అర్చనే, పంచ సంఖ్యాయాం = అర్చించటం, ఐదు అనే సంఖ్య, (పంచవక్తవ్యే = ఐదు అనటం-నీడా) ;— ఈ అర్థాలను నిరూపించటంలో ; సందంశ - ఆఖ్యః, నియుజ్యతే = సందంశం అనే పేరుగల హస్తం, నియోగింపబడుతున్నది.

తాత్పర్యం : పద్మకోశ హస్తమందలి వ్రేళ్ళను మరల మరల దగ్గరకు చేర్చి, దూరంచేస్తూ ఉంటే, అది సందంశహస్తం అవుతుందని నృత్యకోవిదులు చెప్పినారు.

పొట్ట లేదా త్యాగం, బలిదానం, పుండు, పురుగు, మహా

భయం లేదా మనస్సులోని భయం, జర్పించటం, ఐదు అనే సంఖ్య లేదా ఐదు అనటం — ఈ అర్థములందు సందంశ హస్తం వినియోగ పడుతుంది.

## వేరే గ్రంథంలో సందంశ హస్తం:



25 అ, అద

హంసాస్య మధ్యమా బాహ్యే యది సందంశకో భవేత్ ॥ 416

యేనాఽక్షమాలా వాగ్దేవ్యా ద ధే హస్తా ద్యత స్తతః ।

సందంశో భారతే ర్జాతో ఋషిః విశ్వావసుః స్మృతః ॥ 417

విద్యాధరాన్వయో గౌరో వాల్మీకి రధిదేవతా ।

రదనే సూక్ష్మముకుళే సంగీతే లాస్యన ర్తనే ॥ 418

టీకాయాం జ్ఞానముద్రాయాం తులాయాం రదన వణే ।

యజ్ఞోపవీతే రేఖాయాం శోధనే చిత్రలేఖనే ॥ 419

సత్యే నా స్తితివచనే కించిదర్థే క్షణే శ్రుతా ।

నికషే కనకాదీనాం శితే లక్ష్యే నఖే ఒంకురే॥ 420

గుంజాయా మష్టసంఖ్యాయా మింద్రగోపే విషే తృణే ।

పిపీలికాయాం మశకే గ్రహణే మౌక్తికస్రజామ్ ॥ 421

మత్కుణే మక్షికే మాల్యే రోమావళ్యాం చ సూచనే ।

విజనే స్పర్శనే వేదే తుహినే భాషణే చ్యుతే ॥ 422

క్షతే నఖక్షతే రత్నే యాచకే తిలకే ఒంజనే।

విద్యాధరాన్వయే గౌరే మందే సందంశ ఈరితః ॥ 423

అర్థం : హంసాస్య మధ్యమా, బాహ్యేయది = హంసాస్య హస్తమందలి నడిమి వ్రేలు, వెలుపలికి చాపబడితే ; సందంశకః, భవేత్ = సందంశ (క) హస్తం అవుతుంది.

యతః, యేనహస్తేన, అక్షమాలా, వాగ్దేవ్యా, దధ్రే, తతః = ఎప్పుడు, ఏ హస్తంతో, అక్షమాల, వాగ్దేవి (= సరస్వతి) చేత, ధరింపబడినదో, అప్పుడు ; సందంశః, భారతేః, జాతః = సందంశ (హస్త)ం, భారతీ( = సరస్వతీ, దేవి వల్ల, పుట్టినది; ఋషిః, విశ్వావసుః, స్మృతః = ఋషి, విశ్వావసువు (అని) స్మరింపబడినది ; విద్యాధర-అన్వయః = విద్యాధర జాతి ; గౌరః = గౌర (వర్ణ)ం ; అధిదేవతా, వాల్మీకిః = అధిదేవత, వాల్మీకి.

రదనే, సూక్ష్మ ముకుళే, సంగీతే, లాస్యనర్తనే = పన్ను, సన్నని మొగ్గ, పాట పాడటం, లాస్యనర్తనం; టీకాయాం, జ్ఞాన ముద్రాయాం, తులాయాం, రదనప్రాణే = టీక (పదముల అర్థ వివరణ), జ్ఞానముద్ర, త్రాసు, దంతక్షతం (పుప్పిపన్ను-స్వామి); యజ్ఞోపవీతే, రేఖాయాం, శోధనే, చిత్రలేఖనే = జంధెం, గీత, శోధించటం, చిత్రం వ్రాయటం; సత్యే, న-అస్తి - ఇతి వచనే, కించిత్-అర్థే, క్షణే, శ్రుతౌ = నిజం, లేదు అనటం, ఇంచుక అనటం, క్షణ కాలం (అనటం), వినటం; కనకాదీనాంనికషే, శితే, లక్ష్యే, సఖే, అంకురే = బంగారం మొదలగువాటిని ఒరయటం, తెలుపు, గురి, గోరు, మొలక; గుంజాయాం, అష్టసంఖ్యాయాం, ఇంద్రగోపే, విషే, తృణే = గురివిందగింజ, ఎనిమిదింటిలెక్క, ఆరుద్రపురుగు, విషం, గడ్డిపోచ; పిపీలికాయాం, మశకే, గ్రహణే, మౌక్తిక స్రజామ్ = ఎర్రచీమ, దోమ, గ్రహణం, ముత్యాలదండ (ముత్యాల దండ ఎత్తటం-నిడా); మత్కుణే, మక్షికే, మాల్యే, రోమావళ్యాం(చ), సూచనే = నల్లి, ఈగ, పూలదండ, నూగారు, జాడ; విజనే, స్పర్శనే, వేదే, తుహినే, భాషణే, చ్యుతే = ఏకాంతం, తాకటం, వేదం, మంచు, మాటాడటం, జారటం; క్షతే, నఖక్షతే, రత్నే, యాచకే, తిలకే, అంజనే = గాయం, నఖక్షతం, రత్నం, యాచకుడు, బొట్టు, కాటుక; విద్యాధర-అన్వయే, గౌరే, మందే = విద్యాధరవంశం, గౌరవర్ణం, మాంద్య ; - ఈ అర్థాలను నిరూపించటంలో; సందంశః, ఈరితః - సందంశహస్తం, చెప్పబడి నది.

తాత్పర్యం : హంసాస్య హస్తమందలి నడిమి వ్రేలు ప్రసారితమైతే అది 'సందంశ హస్తం' అవుతుంది.

అక్షమాల ధరించిన సరస్వతి వలన సందంశహస్తం జన్మించినది. విశ్వావసువు ఋషి. విద్యాధరజాతి. గౌరవర్ణం. అధిదేవత వాల్మీకి.

పన్ను, సన్నని మొగ్గ, పాటపాడటం, లాస్యనర్తనం, టీక, జ్ఞానముద్ర, త్రాసు, దంతక్షతం (=పంటినొక్కు) లేదా పుప్పి పన్ను, జందెం, గీత, శోధించటం, చిత్రం వ్రాయటం, నిజం, లేదు అనటం, ఇంచుక అనటం, క్షణకాలం అనటం, వినటం, బంగారం మొదలగువాటిని ఒరయటం, తెలుపు, గురి, గోరు, మొలక, గురివింద గింజ, ఎనిమిదింటి లెక్క, ఆరుద్రపురుగు, విషం, గడ్డిపోచ, ఎర్రచీమ, దోమ, గ్రహణం, ముత్యాలదండ, నల్లి, ఈగ, పూలదండ, నూగారు, జాడ, ఏకాంతం, తాకటం, వేదం, మంచు మాటాడటం, జారటం, గాయం, నఖక్షతం (=గోటి నొక్కు), రత్నం, యాచకుడు, బొట్టు, కాటుక, విద్యాధరవంశం, గౌరవర్ణం, మాంద్యం - వీటి అర్థాలను నిరూపించటంలో సందంశ హస్తం చెప్పబడినది.

టీక : ఈ నిర్వచనం ఇంతకుముందు చెప్పిన సందంశహస్త నిర్వచనంకంటె భిన్నంగా ఉంది. కాగా, నాట్యశాస్త్ర, నందికేశ, గ్రంథాంతర నిర్వచనాలు మూడూ మూడు విధాలుగా గోచరిస్తున్నవి.

## 26. ముకుళ హస్తం :




అంగుళీ పంచకం చైవ మేలయిత్వా ప్రదర్శనే
ముకులాభిధహస్తో உயం కీర్త్యతే భరతాగమే ॥ 424

కుముదే భోజనే పంచబాణే ముద్రాదిధారణే ।
నాభౌ చ కదలీపుష్పే యుజ్యతే ముకులః కరః ॥ 425

అర్థం : అంగుళీపంచకం (చ) (ఏవ), మేలయిత్వా, ప్రదర్శనే = ఐదు అంగుళులు (అగ్రే = చివరలందు-నీడా, కలిపి, ప్రదర్శిస్తే ; అయం, ముకుల-అభిధహస్తః = ఇది, ముకులం అనే పేరు గల హస్తం (అవుతుంది అని) ; భరత-ఆగమే కీర్త్యతే = భరతవేద మందు, కీర్తింపబడుతున్నది (ముకులం = ముకుళం = మొగ్గ).

కుముదే, భోజనే, పంచబాణే, ముద్రాదిధారణే = కలువ పూవు, భోజనము, పంచబాణుడు ( = మన్మథుడు), ముద్రాదులు ధరించటం; నాభౌ (చ, కదలీపుష్పే = నాభి = బొడ్డు, అరటి పువ్వు ; — ఈ అర్థాలను నిరూపించటంలో ; ముకులః కరః, యుజ్యతే = ముకుల హస్తం, ప్రయోగింపబడుతున్నది.

తాత్పర్యం : ఐదు అంగుళులను చివరలందు కలిపి ప్రదర్శించితే అది 'ముకుళ హస్తం' అవుతుందని భరతవేదమందు కీర్తింపబడినది.

కలువపూవు, భోజనం, మన్మథుడు, ముద్రాదులు ధరించటం, బొడ్డు, అరటి పువ్వు — ఈ అర్థములందు ముకుళ (= ల) హస్తం తగినది.

టీక : నాట్యశాస్త్రంలోని ముకుల హస్తం, ఇదీ ఒక్కటే. కలిసిన ఐదు వ్రేళ్ళు ఊర్ధ్వ ముఖంగా ఉండాలని నాట్యశాస్త్రంలో చెప్పబడింది.

## వేరే గ్రంథంలో ముకుల హస్తం :

శ్లిష్టాంగుళిః పద్మకోశో యది స్యాత్ ముకులః కరః ।
భానుం ప్రగృహ్ణతః పూర్వం బింబ మేవేతి శంకయా ॥ 426

మారుతేః ముకుళో జాతః ఋషిః తస్య విశాఖిలః ।
సంకీర్ణజాతిః కపిలవర్ణః చంద్రో ఽధిదేవతా ॥ 427

దానే జపే దీనవాక్యే భోజనే పద్మకోశకే ।
ఆత్మని ప్రాణనిర్దేశే పంచసంఖ్యానిరూపణే ॥ 428

కాముకోచ్చరితే బాలచుంబనే దేవపూజనే ।
ఛత్రాదీనాం చ ముకుళే ఫలగ్రహనిరూపణే ॥ 429

సంకీర్ణజాత్యాం కపిలే ముకుళః కర ఈరితః ।

అర్థం : పద్మకోశః, శ్లిష్టాంగుళిః యది = పద్మకోశ (హస్త)ం, అంగుళులు కలిసినది, అయితే; ముకులః కరః, స్యాత్ = ముకుల హస్తం, అవుతుంది.

పూర్వం = పూర్వ కాలంలో; బింబం- ఏవ, ఇతి శంకయా = దొండపండే, అనే, శంకతో ; భానుం, ప్రగృహ్ణతః, మారుతేః = సూర్యుని, పట్టబోయిన, ఆంజనేయుని వలన ; ముకుళః జాతః = ముకుళ హస్తం, జన్మించినది ; తస్య, ఋషిః, విశాఖిలః = దాని యొక్క, ఋషి, విశాఖిలుడు ; సంకీర్ణ జాతిః = సంకీర్ణ జాతి ; కపిల వర్ణః = కపిల వర్ణం ; అధిదేవతా, చంద్రః = అధిదేవత చంద్రుడు.

దానే, జపే, దీనవాక్యే, భోజనే, పద్మకోశకే = దానం చేయటం, జపం, దీనవాక్యం, భోజనం చేయటం, తామర మొగ్గ ; ఆత్మని- ప్రాణనిర్దేశే, పంచ సంఖ్యా నిరూపణే = ఆత్మను ప్రాణ మును నిర్దేశించటం, అయిదు అని లెక్కించటం ; కాముక-ఉచ్చరితే, బాలచుంబనే, దేవపూజనే = కాముకుని మాటలు, బిడ్డలను ముద్దు

పెట్టుకొనటం, దైవపూజ చేయటం ; ఛత్రాదీనాం (చ) ముకుళే, ఫలగ్రహ నిరూపణే = గొడుగు మొదలగు వానిని ముడవటం, పండు పట్టుకొనటం ; సంకీర్ణ జాత్యాం, కపిలే = సంకీర్ణ జాతి, కపిలవర్ణం; — ఈ అర్థాలను ప్రదర్శించటంలో ; మ కుళః కరః, ఈరితః = ముకుళ హస్తం, చెప్పబడినది.

తాత్పర్యం : పద్మకోశ హస్తమందలి అంగుళులు కలిస్తే అది ముకుళహస్తం అవుతుంది.

పూర్వం దొండపండు అనే శంకతో సూర్యుని పట్టుకో బోయిన హనుమంతుని వలన ముకుళహస్తం జన్మించినది. ఋషి విశాఖిలుడు. సంకీర్ణజాతి. కపిలవర్ణం. అధిదేవత చంద్రుడు.

దానంచేయటం, జపం, దీనవాక్యం, భోజనంచేయటం, తామరమొగ్గ, ఆత్మను ప్రాణములను నిర్దేశించటం, అయిదు అని లెక్కించటం, కాముకుని మాటలు, బిడ్డలను ముద్దుపెట్టుకొనటం, దైవపూజ చేయటం, గొడుగు మొదలగువానిని ముడవటం, పండు పట్టుకొనటం, సంకీర్ణజాతి, కపిలవర్ణం - వీటి అర్థాలను నిరూపించటంలో ముకుళహస్తం చెప్పబడినది.

టీక : ఇంతకుముందు చెప్పిన ముకుళహస్తం, ఇదీ ఒక్కటే.

## 27. తామ్రచూడ హస్తం




ముకుళే తామ్రచూడః స్యాత్ తర్జనీ వక్రితా యది । 430

కుక్కుటాదౌ బకే కాకే ఉష్ట్రే వత్సేచ లేఖనే ।
తామ్రచూడకరాఖ్యో౽ సౌ కీర్తితో భరతాగమే ॥ 431

అర్థం : ముకుళే, తర్జనీ, వక్రియతాది = ముకుళహస్త మందలి, తర్జనిని, వంచిపట్టితే; తామ్రచూడః, స్యాత్ = తామ్ర చూడ (హస్త)ం అవుతుంది.


24

కుక్కుటాదౌ, బకే, కాకే, (అపి) ఉష్ట్రే, వత్సే(చ), లేఖనే = కోడి మొదలైనవి, కొంగ, కాకి, ఒంటె, దూడ, వ్రాయటం; - ఈ అర్థాలను ప్రదర్శించటంలో; తామ్ర చూడకర-ఆఖ్యః అసౌ = తామ్రచూడ హస్తం అనే పేరుగల ఈ హస్తం; భరత-ఆగమే, కీర్తితః = భరత వేదమందు కీర్తింపబడినది (తామ్రచూడం = కోడిపుంజు).

తాత్పర్యం : ముకుళహస్తమందలి తర్జనిని వంచిపడితే అది 'తామ్రచూడ హస్తం' అవుతుంది.

కోడి మొదలైనవి, కొంగ, కాకి, ఒంటె, దూడ, వ్రాయటం- ఈ అర్థములందు తామ్ర చూడహస్తం తగును అని భరత వేదమందు చెప్పబడినది (తామ్రచూడహస్తం భరత వేదవేత్తలచేత యోజింపబడుతున్నది-ఘోష్).

టీక : నాట్యశాస్త్రంలో తామ్రచూడ హస్తానికి రెండు నిర్వచనాలున్నాయి. ఈ నిర్వచనం ఆ రెండింటి కంటె భిన్నంగా ఉంది.

## వేరే గ్రంథంలో తామ్రచూడ హస్తం :


27అ, అ.ద

పతాకస్య కనిష్ఠాయాం యత్రాంగుష్ఠనిపీడనమ్ ।
తమేవ తామ్రచూడాఖ్యం వదంతి భరతాదయః ॥ 432
తేషాం మూర్తిత్రయీభావః ఋగ్యజుస్సామభిః పురా ।
యేన హస్తే నాభినీతో విదే రగ్రే యత స్తతః ॥ 433
తామ్రచూడ త్రయీజాత స్తస్య వజ్రాయుధో ఋషిః ।
శంఖవర్ణో దేవజాతి రధిదేవో బృహస్పతిః ॥ 434

లోకత్రయే త్రిశూలే చ త్రిసంఖ్యాగణనే ఽపి చ ।

అశ్రుసమ్మార్జనే వేదత్రయే బిల్వదళే ఽపి చ ॥ 435

దేవజాతౌ శుభ్రవర్ణే తామ్రచూడో నియుజ్యతే ।

అర్థం : యత్ర, పతాకస్య కనిష్ఠాయాం, అంగుష్ఠనిపీడనమ్ = ఎచ్చట పతాక హస్తం యొక్క చిటికెన వ్రేలిని, అంగుష్ఠం నొక్కటం కలదో; తమ్ ఏవ, భరతాదయః, తామ్రచూడ-ఆఖ్యం, వదంతి = దానినే (= ఆ హస్తాన్ని), భరతాదులు, తామ్రచూడం అనే పేరు (గల హస్తం)గా, చెప్పుచున్నారు.

పురా = పూర్వం ; విధేః, అగ్రతః = బ్రహ్మ, యెదుట; ఋగ్యజుఃసామభిః = ఋక్-యజుస్-సామములనే మూడు వేదాల చేత ; తేషామ్ = వాటి యొక్క ; మూర్తిత్రయీ భావః = త్రిమూర్తి స్వరూపత్వం; యేనహస్తేన = ఏ హస్తం చేత; యతః = ఎందువలన ; అభినీతః = అభినయింపబడినదో ; తతః = అందువలన ; తామ్రచూడః, త్రయీజాతః = తామ్రచూడ హస్తం వేదత్రయి వలన పుట్టినది ; తస్యఋషిః వజ్రాయుధః = దాని యొక్క ఋషి ఇంద్రుడు ; శంఖవర్ణః = శంఖవర్ణం ; దేవజాతిః = దేవజాతి ; అధిదేవః, బృహస్పతిః = అధిదేవత, బృహస్పతి.

లోకత్రయే, త్రిశూలే (చ), త్రిసంఖ్యా గణనే (అపి) (చ)= మూడు లోకాలు, త్రిశూల , మూడు అని లెక్క పెట్టటం ; అశ్రు సమ్మార్జనే, వేదత్రయే, బిల్వదళే (అపి) (చ) = కన్నీరు తుడవటం, మూడు వేదాలు, మారేడు దళం ; దేవజాతౌ, శుభ్రవర్ణే = దేవజాతి, తెలుపురంగు ;— ఈ అర్థాలను ప్రదర్శించటంలో ; తామ్రచూడః, నియుజ్యతే = తామ్రచూడ (హస్తం), నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : పతాక హస్తమందలి చిటికెన వ్రేలిని బొటన వ్రేలు నొక్కితే అది తామ్రచూడ హస్తం అవుతుందని భరతాదులు చెప్పినారు.

పూర్వం, మూడు వేదాలు బ్రహ్మ యెదుట, తాము మూర్తిత్రయ రూపములని ఈ హస్తంతో అభినయించినవి అందు చేత తామ్రచూడహస్తం వేదత్రయివలన పుట్టినది. ఋషి ఇంద్రుడు. శంఖవర్ణం. దేవజాతి. అధిదేవత బృహస్పతి

మూడు లోకాలు, త్రిశూలం, మూడు అని లెక్క పెట్టటం, కన్నీరు తుడవటం, మూడు వేదాలు, మారేడు దళం, దేవజాతి, తెలుపురంగు — వీటి అర్థాలను నిరూపించటంలో తామ్రచూడ హస్తం నియుక్తమవుతున్నది.

టీక : ఇది ఇంతకు ముందు చెప్పిన తామ్రచూడ హస్తం కంటె భిన్నంగా ఉంది. కాగా, భరతముని, నందికేశుడు, ఇతర గ్రంథాలు చెప్పిన నిర్వచనాలు నాలుగు వేర్వేరుగా ఉన్నాయి.

## 28. త్రిశూల హస్తం :



నికుంచనయుతాంగుష్ఠకనిష్ఠ స్తు త్రిశూలకః ॥ 436

బిల్వపత్రే త్రిత్వయుక్తే త్రిశూలకర ఈరితః ।

28 అ.ద

అర్థం : నికుంచయుత - అంగుష్ఠ - కనిష్ఠః (తు)= వంపుతో కూడిన బొటన వ్రేలు, చిటికెన వ్రేలు కలది (బొటన - చిటికెన వ్రేళ్ళను వంచిన - సీడా); త్రిశూలకః = త్రిశూల (క) (హస్తం) (అవుతుంది).

బిల్వపత్రే, త్రిత్వయుక్తే = మారేడు పత్రం (= దళం), మూడింటి కూడిక - అనే అర్థములందు ; త్రిశూలకరః, ఈరితః= త్రిశూల హస్తం చెప్పబడినది.

తాత్పర్యం : (పతాక హస్తంలోని)బొటన వ్రేలిని, చిటికెన వ్రేలిని వంచితే త్రిశూల(క) హస్తం ఏర్పడుతుంది. మారేడు దళం, మూడింటి కూడిక — ఈ అర్థములందు త్రిశూల హస్తం చెప్పబడినది.

టీక : ఈ హస్తం నాట్యశాస్త్రంలో లేదు.

ఇత్యష్టా వింశతిః ప్రోక్తా అసంయుత కరాఃక్రమాత్ ॥ 437
యావదర్థాః ప్రయోగాణాం తావద్భేదాః కరాః స్మృతాః ।

ఇతి-అష్టావింశతిః, అసంయుతకరాఃక్రమాత్ ప్రోక్తాః = ఇట్లు, ఇరవై ఎనిమిది అసంయుత హస్తాలు క్రమంగా చెప్పబడినవి; ప్రయోగాణాం యావత్ అర్థాః = ప్రయోగముల యొక్క ఎన్ని అర్థాలు కలవో; తావత్ భేదాః కరాః స్మృతాః = అన్ని భేదములు గల హస్తాలు కలవని చెప్పబడినవి.

తాత్పర్యం : ఇంతవరకు 28 అసంయుత హస్తాలు వరుసగా చెప్పబడినవి. నాట్య ప్రయోగాదులందు ఎన్ని అర్థాలు కలవో అన్ని హస్తభేదాలు కలవని విజ్ఞులు చెప్పినారు.

టీక : పై రెండు పాదాలు ఘోష్‌లో లేవు.

## అధిక హస్తాలు

### 29. ఊర్ణనాభ హస్తం :




పద్మకోశాంగుళీనాం చ కుంచనా దూర్ణనాభకః ॥ 438
హస్తాభ్యాం కుర్వతః పూర్వం దైత్యవక్షోవిదారణమ్ ।
నృసింహా దూర్ణనాభశ్చ జాతః శార్దూలకో ఋషిః ॥ 439
క్షత్రాన్వయో రక్తకాంతి రాదికూర్మో ఽధిదేవతా ।

శిరఃకండూయనే చౌర్యే నరసింహే మృగాననే ॥ 440
హర్యక్షే వానరే కూర్మే కర్ణికారే కుచే భయే ।
క్షత్రజాతౌ రక్తకాంతా వూర్ణనాభో నియుజ్యతే ॥ 441

అర్థం : పద్మకోశ - అంగుళీ నాం (చ), కుంచనాత్, ఊర్ణ నాభకః = పద్మకోశ హస్తమందలి వ్రేళ్ళను, వంచితే, 'ఊర్ణనాభ (క) (హస్తం)' (అవుతుంది).

పూర్వం = పూర్వకాలంలో ; హస్తాభ్యాం, దైత్యవక్షో విదారణమ్, కుర్వతః, నృసింహాత్ = రెండు చేతులతో దైత్యుని (= హిరణ్య కశిపుని) రొమ్ము చీల్చుతూ ఉన్న నృసింహ (స్వామి) వలన ; ఊర్ణ నాభకః (చ) జాతః = ఊర్ణనాభ (క) హస్తం జన్మిం చింది ; శార్దూలకః, ఋషిః = శార్దూలకుడు, ఋషి; క్షత్రి వ్వయః = క్షత్రియ జాతి ; రక్తకాంతిః = రక్తవర్ణం ; అధిదేవతా, ఆదికూర్మః = అధిదేవత, ఆదికూర్మం.

శిరఃకండూయనే, చౌర్యే, నరసింహే,మృగాననే = తలగోకు కొనటం, దొంగతనం, నరసింహుడు, మృగ ముఖం ; హార్యక్షే, వానరే, కూర్మే, కర్ణికారే, కుచే, భయే = సింహం, కోతి, తాబేలు, కొండగోగు, స్తనం, భయం; క్షత్రజాతౌ, రక్తకాంతౌ, ఊర్ణ నాభః నియుజ్యతే = క్షత్రియ జాతి, రక్తవర్ణం ; — ఈ అర్థాలను నిరూపించటంలో ఊర్ణనాభ హస్తం నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : పద్మకోశ మందలి వ్రేళ్ళను (అరచేతిలోనికి) వంచిపడితే అది 'ఊర్ణనాభ (క) హస్తం' అవుతుంది

పూర్వం, రెండు చేతులతో హిరణ్యాకశిపుని రొమ్ము చీల్చ తున్న నృసింహుని వలన ఊర్ణనాభ హస్తం జన్మించినది. శార్దూల కుడు ఋషి. క్షత్రియ జాతి. రక్తవర్ణం. అధిదేవత ఆది కూర్మం.

తలగోకి కొనటం, దొంగతనం, నరసింహుడు, మృగముఖం, సింహం, కోతి, తాబేలు, కొండగోగు, స్తనం, భయం, క్షత్రియ జాతి, రక్తవర్ణం — వీటి అర్థాలను నిరూపించటంలో ఊర్ణనాభ హస్తం ప్రయుక్తమవుతున్నది.

టీక : ఈ హస్తం ఘోష్ పాఠంలో లేదు. 'గ్రంథాంతరంలో, ఊర్ణనాభ హస్తం' అని నీడాపాఠంలో ఉంది (419-22 శ్లో.) 'ఊర్ణనాభ హస్తం' నాట్య శాస్త్రమందు 23 వ అసంయుత హస్తం. దానితో ఈ లక్షణం వినియోగం చాలవరకు సంవదిస్తున్నవి. పద్మకోశ హస్తమందలి వ్రేళ్ళు బాగుగా వంగి, ఒండొంటికి అభిముఖాలు అయితే, అది ఊర్ణనాభ హస్తం అవుతుంది (ఊర్ణనాభం = సాలెపురుగు).

## 30. బాణ హస్తం :



తర్జన్యా ద్యా స్త్రయః శ్లిష్టాః కించి దంగుష్ఠ పీడితాః ।
కనిష్ఠికా చ ప్రసృతా స బాణః కథితః కరః ॥ 442
షట్సంఖ్యాయాం నాళనృత్యే బాణహస్తో నియుజ్యతే ।

అర్థం : తర్జనీ-ఆద్యాః, త్రయః, శ్లిష్టాః, కించిత్, అంగుష్ఠ పీడితాః = తర్జని మొదలుకొని, మూడు వ్రేళ్ళును, కలిసినవి, కొంచెంగా అంగుష్ఠంచేత నొక్కబడినవి కాగా ; కనిష్ఠికా (చ) ప్రసృతా = చిటికెన వ్రేలు చాపబడినది (అయితే) ; సః, బాణః హస్తః, కథితః = అది 'బాణ హస్తం' (అని) చెప్పబడినది.

షట్ సంఖ్యాయాం, నాళ నృత్యే = ఆరు అని లెక్కపెట్టటం, నాళనృత్యం — అనే అర్థములందు ; బాణహస్తః, నియుజ్యతే = బాణ హస్తం ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : తర్జని మొదలుకొని మూడు వ్రేళ్ళు కలిసినవి, అంగుష్ఠం చేత నొక్కబడినవి కాగా, చిటికెన వ్రేలు చాపబడితే అది 'బాణ హస్తం' అవుతుంది.

ఆరు అని లెక్క పెట్టటం, నాళనృత్యం — ఈ అర్థములందు బాణ హస్తం ప్రయుక్తమవుతున్నది.

టీక : ఈ హస్తం ఘోష్ పాఠంలో లేదు. 'గ్రంథాంతరంలో బాణహస్తం' అంటూ నీడా పాఠంలో ఉంది (422-23 శ్లో.). నాట్యశాస్త్రంలో ఈ హస్తం లేదు.

## 31. అర్ధసూచీ (చిక) హస్తం :


31 అద

కపిత్థే తర్జనీ ఊర్ధ్వసారణే త్వర్ధసూచికః ॥ 443

అంకురే పక్షిశాబాదౌ బృహత్కీటే నియుజ్యతే ।

అర్థం : కపిత్థే, తర్జనీ, ఊర్ధ్వసారణే (తు), అర్ధసూచికః= కపిత్థ హస్తమందలి, తర్జనిని, పైకి పొడవుగా చాపితే, (అది) 'అర్ధ సూచీ (చిక) హస్త' మవుతుంది.

అంకురే, పక్షి శాబాదౌ, బృహత్-కీటే, నియుజ్యతే = మొలక, పక్షిపిల్ల మొదలగునవి, పెద్ద పురుగు — ఈ అర్థములందు అర్ధసూచీహస్తం తగును.

తాత్పర్యం : కపిత్థహస్తమందలి తర్జనిని పైకి పొడవుగా చాపితే అది అర్ధసూచీ (లేదా అర్ధసూచిక) హస్తం అవుతుంది.

మొలక, పక్షిపిల్ల మొదలగునవి, పెద్ద పురుగు — ఈ అర్థములందు అర్ధసూచీ హస్తం తగును.

టీక : ఈ హస్తం నీడా (424 శ్లో), ఘోష్ (167-68 శ్లో) — రెండు పాఠాలలోను ఉంది.

లక్షణ శ్లోకం నీడా పాఠంలో క్రింది విధంగా ఉంది :

కపిత్థ తర్జన్యాశ్చోర్ధ్వసారణాదర్ధసూచికః ।

ఈ హస్తం నాట్యశాస్త్రంలో లేదు.

## 32. వ్యాఘ్ర హస్తం :



32 అద

కనిష్ఠాంగుష్ఠనమనే మృగశీర్షకరే తథా ॥ 441

వ్యాఘ్రహస్తః స విజ్ఞేయో భరతాగమకోవిదైః ।

వ్యాఘ్రే భేకే మర్కటే చ శుక్తే సంయుజ్యతే కరః ॥ 445

అర్థం : మృగశీర్షకరే (తథా , కనిష్ఠ-అంగుష్ఠ నమనే = మృగశీర్ష హస్తమందలి, చిటికెన వ్రేలిని బొటన వ్రేలిని వంచితే ; సః, వ్యాఘ్ర హస్తః, భరత-ఆగమకోవిదైః, విజ్ఞేయః = అది, వ్యాఘ్ర హస్తం (అని), భరత శాస్త్ర వేత్తల చేత, తెలియదగినది.

వ్యాఘ్రే, భేకే, మర్కటే (చ), శుక్తే = పులి, కప్ప, కోతి, ముత్యపు చిప్ప — అనే అర్థములందు ; కరః, సంయుజ్యతే = (ఈ) హస్తం బాగుగా తగును.

తాత్పర్యం: మృగశీర్ష హస్తమందలి చిటికెన వ్రేలిని, బొటన వ్రేలిని వంచితే, అది 'వ్యాఘ్ర హస్తం' అవుతుంది అని భరతశాస్త్ర వేత్తలచేత తెలియదగినది.

పులి, కప్ప, కోతి, ముత్యపుచిప్ప — ఈ అర్థములందు వ్యాఘ్ర హస్తం తగును.

టీక : ఈ హస్తం నీడా పాఠంలో లేదు. ఘోష్ పాఠంలో 266 శ్లో.

## 33. కటక హస్తం :



33 అద

సందంశే ఉప్యూర్ధ్వభాగే తు మధ్యమానామికాన్వయా (త్)।
....................... కటకో హస్త ఉచ్యతే ॥ 446

ఏతస్య వినియోగస్తు ..............దర్శనే ।
ఆహ్వానభావే చలనే .............. ॥ 447

అర్థం : సందంశే (అపి), ఊర్ధ్వ భాగే (తు), మధ్యమా-అనామికా-అన్వయాత్ — సందంశ హస్తమందలి నడిమి వ్రేలు, ఉంగరపు వ్రేలు పై భాగమందు కలిస్తే............'కటకహస్తం' (అని) చెప్పబడుతున్నది.

......దర్శనే, ఆహ్వాన భావే, చలనే ఏతః (తు), వినియోగః (తు) — చూడటం, పిలవటం, కదలటం — అనే అర్థములందు ఈ హస్తం యొక్క వినియోగం (చెప్పబడినది).

తాత్పర్యం : సందంశ హస్తంలోని నడిమి వ్రేలు, ఉంగరపు వ్రేలు పై భాగంలో కలిస్తే, అది 'కటక హస్తం' అవుతుంది (?) ఈ హస్తం......చూడటం, పిలవటం, కదలటం మొదలయిన అర్థాలలో వినియోగపడుతుంది.

టీక : ఈ హస్తం నీడా పాఠంలో లేదు. ఘోష్‌లో 168 - 69 శ్లో. కాని, లక్షణ-వినియోగాలు రెండూ అసంపూర్ణములుగానే ఉన్నవి.

**34. పల్లి హస్తం :**




మయూరే తర్జనీపృష్ఠే మధ్యమేన యుతో యది ।

పల్లిహస్తః స విజ్ఞేయః పల్ల్యర్థే వినియుజ్యతే ॥ 448

అర్థం : మయూరే = మయూర హస్తమందలి : మధ్యమేవ తర్జనీపృష్ఠః యుతః యది = నడిమి వ్రేలిచేత, చూపుడు వ్రేలు యొక్క వెనుక భాగం, తాకబడితే ; సః, పల్లి హస్తః, విజ్ఞేయః = అది (= ఆ హస్తం) పల్లి హస్తం, అని తెలియదగినది.

పల్లి - అర్థే వినియుజ్యతే = పల్లెటూరు లేదా గుడిసె అనే అర్థమందు (ఈ పల్లి హస్తం) వినియోగపడుతున్నది.

తాత్పర్యం : మయూర హస్తమందలి నడిమి వ్రేలు చూపుడు వ్రేలి వెనుక భాగాన్ని తాకితే, అది పల్లి హస్తం అవుతుంది.

పల్లెటూరు లేదా గుడిసె అనే అర్థమందు ఈ పల్లి హస్తం ప్రయుక్తమవుతున్నది.

టీక : ఈ హస్తం ఘోష్ పాఠంలో మాత్రమే ఉన్నది (170-71 శ్లో.).

అభినయవశాదేషాం సంయుతత్వం ప్రకీర్తితమ్ ।

మార్గప్రదర్శనం తేషాం క్రమాల్లక్ష్యానుసారతః ॥ 449

అర్థం : ఏషాం, సంయుతత్వం = వీటి యొక్క (= అసంయుత హస్తాల యొక్క), సంయుతత్వం (= సంయుత హస్తాలు కావటం) ; అభినయవశాత్, ప్రకీర్తితమ్ = అభినయంలోని అవసరాన్ని పట్టి, చెప్పబడింది ; తేషాం మార్గ ప్రదర్శనం = వాటికి

లక్షణాదులు చెప్పటం ; లక్ష్యానుసారతః క్రమాత్ = లక్ష్యానుసారంగా క్రమంగా (జరుగుతుంది).

తాత్పర్యం : అభినయంలో, అవసరాన్ని పట్టి, అసంయుత హస్తాలు, సంయుత హస్తాలు అవుతూ ఉంటాయి. వాటి లక్షణాదులు లక్ష్యాలను అనుసరించి క్రమంగా వివరింపబడతాయి.

టీక : ఈ రెండు పాదాలు నీడా పాఠంలో లేవు. తరువాత సంయుత హస్తాలు వివరింపబడతున్నాయి. రెండు హస్తాలు ఒకేసారి ప్రయుక్తమయితే, అది సంయుత హస్తం అవుతుంది. ఈ రెండు హస్తాలు - అంజలి మున్నగు హస్తాలలోవలె ఒకే హస్తాలు కావచ్చు; లేదా కొన్ని చోట్ల భిన్నహస్తాలు కావచ్చు.

# 7

# సంయుత హస్తాలు

## సంయుత హస్తాల పేర్లు :

అంజలి శ్చ కపోత శ్చ కర్కటః స్వస్తిక స్తథా।
డోలాహస్తః పుష్పపుట ఉత్సంగః శివలింగకః॥ 450
కటకావర్ధన శ్చైవ కర్తరీస్వస్తిక స్తథా।
శకటః శంఖ-చక్రౌ చ సంపుటః పాశ-కీలకౌ॥ 451
మత్స్యః కూర్మో వరాహ శ్చ గరుడో నాగబంధకః।
ఖట్వా భేరుండకాఖ్య శ్చ అవహిత్థస్తథైవ చ॥ 452
చతుర్వింశతి సంఖ్యాకాః సంయుతాః కథితాః కరాః।

అర్థం : అంజలిః(చ), కపోతః(చ), కర్కటః, స్వస్తికః(తథా), డోలా హస్తః, పుష్పపుటః, ఉత్సంగః, శివలింగకః శంఖ-చక్రౌ(చ),సంపుటః, పాశ-కీలకౌ, మత్స్యః, కూర్మః, వరాహ (చ), గరుడః, నాగబంధకః, ఖట్వా, భేరుండక-అఖ్యః(చ), అవహిత్థః, (తథా) (ఏవ, (చ)=1. అంజలి, 2. కపోతం, 3.కర్కటం, 4. స్వస్తికం, 5. డోల, 6. పుష్పపుటం, 7. ఉత్సంగం, 8. శివలింగ(క)ం, 9. కటకావర్ధనం, 10. కర్తరి స్వస్తికం, 11. శకటం, 12. శంఖం, 13. చక్రం, 14. సంపుటం, 15. పాశం, 16. కీలకం, 17. మత్స్యాం, 18. కూర్మం, 19. వరాహం, 20. గరుడం, 21. నాగబంధ(క)ం, 22. ఖట్వ, 23. భేరుండకం (అనే పేరుగలది), 24. అవహిత్థం; ఇట్లా - చతుః వింశతి సంఖ్యాకాః, సంయుతాః కరాః, కథితాః=ఇరవై నాలుగు పంఖ్యగల, సంయుత హస్తాలు, చెప్పబడినవి.

తాత్పర్యం : అంజలి, కపోతం, కర్కటం, స్వస్తికం, డోల, పుష్పపుటం, ఉత్సంగం, శివలింగ(క)ం, కటకావర్ధనం, కర్తరీ స్వస్తికం, శకటం, శంఖం, చక్రం, సంపుటం, పాశం, కీలకం, మత్స్యం, కూర్మం, వరాహం, గరుడం, నాగబంధ(క)ం, ఖట్వా, భేరుండ(క)ం, అవహిత్థం - ఇట్లా సంయుత హస్తాలు 24 అని చెప్పబడినవి.

టీక : నాట్య శాస్త్రమునందు 13 సంయుతహస్తాలు చెప్పబడినవి. కాని ఇచ్చట 24 సంయుతహస్తాలు చెప్పబడినవి. అంతే కాదు- "గ్రంథాంతరే సంయుత హస్తాః" అంటూ మొత్తం 25 + 27 = 52 హస్తాలు రెండు వర్గాలుగా అధికంగా చెప్పబడినవి. కాగా సంయుత హస్తాలు మొత్తం 24 + 25 + 27 = 76 అయినవి. ఇందులో అంజలి, కపోత, కర్కట, డోల, పుష్పపుట, ఉత్సంగ, కటకావర్ధన, అవహిత్థ హస్తాలకు గ్రంథాంతరస్థ లక్షణ- వినియోగాలు- అధిదేవతాపూర్వకంగా చెప్పబడినవి.

ఘోష్ పాఠంలో 23 సంయుత హస్తాలు ఉన్నాయి. నీడా పాఠంలో అవహిత్థం అనే 24 వ హస్తం అధికం.

చివరి రెండు పాదాలు ఘోష్‌పాఠంలో క్రింది విధంగా ఉన్నాయి :

ఖట్వా భేరుండ ఇత్యేతే సంఖ్యాతా సంయుతాః కరాః ।

త్రయోవింశతి రిత్యుక్తాః పూర్వగైః భరతాదిభిః॥

నాట్యశాస్త్రంలోని నిషధ, మకర, గజదంత, వర్ధమాన హస్తాలను నందికేశుడు చెప్పలేదు; కాగా, తొమ్మిది హస్తాలే సమానం. ఈ నాలుగు హస్తాలు - 'ఇతర గ్రంథాలలోని హస్తాలు' అంటూ నీడావారు చేర్చిన రెండు వర్గాలలో - ఉన్నాయి. కర్తరీ స్వస్తిక హస్తంనుంచి భేరుండక హస్తంవరకు - అంటే 14 హస్తాలు నాట్యశాస్త్రంలో లేవు.

అసంయుతానాం సంయోగా త్సంయుతాఖ్యా భవంతి తే ॥ 453

తేషాముత్పత్తిరేవైషా యోజనీయా మతా బుధైః ।

తథాఽపి ద్వంద్వతాభేదా దధిదేవః పృథక్పృథక్ ॥ 454

అర్థం : అసంయుతానాం, సంయోగాత్, తే, సంయుత - ఆఖ్యా, భవంతి = అసంయుత హస్తాల; సంయోగం వలన (= రెండేసి అసంయుత హస్తాల కలయిక వలన), అవి 'సంయుతములు' అనే పేరుగలవి (= సంయుత హస్తాలు), అవుతున్నది ; తేషాం, ఉత్పత్తిః, ఏషా ఏవ = వీటి, ఉత్పత్తి, అదే (= అసంయుత హస్తాల నుంచే వాటి ఉత్పత్తి అని), బుధైః, మతా, యోజనీయా = పండితులచే, అంగీకరింపబడినదిగా, యోజింపదగును; తథా అపి = అయినప్పటికీ; ద్వంద్వతా, భేదాత్ = ద్వంద్వత్వం(= రెండు కలియటం) అనే, భేదంచేత; అధిదేవః, పృథక్ పృథక్ = అధిదేవతలు, వేర్వేరు (గా ఉంటారు).

తాత్పర్యం : రెండేసి అసంయుత హస్తాల కలయిక వలన సంయుత హస్తాలు ఏర్పడుతున్నవి. వీటి ఉత్పత్తి కూడా ఆయా అసంయుత హస్తాల ఉత్పత్తియే. అయినప్పటికీ, రెండేసి హస్తాల కలయికవలన అధిదేవతలు మాత్రం వేరు వేరుగా ఉన్నారు.

టీక : 'గ్రంథాంతరే' అంటూ నీకాలో మూడు పాదాలు (428-29 శ్లో) అధికంగా ఉన్నాయి.

## 1. అంజలి హస్తం :



పతాకతలయోః యోగా దంజలిః కర ఈరితః ।

దేవతా గురు విప్రాణాం నమస్కారే ష్వనుక్రమాత్ ॥ 455

కార్యః శిరోముఖోరస్థో వినియోజ్యో ఽంజలి ర్బుధైః ।

అర్థం : పతాకతలయోః యోగాత్, అంజలిః కర

ఈరితః = రెండు పతాక హస్తములయొక్క, అరచేతుల కలయిక వలన, 'అంజలి హస్తం', చెప్పబడినది.

దేవతా-గురు-విప్రాణాం నమస్కారేషు = దేవతలకు, గురువులకు, విప్రులకు నమస్కారాలు చేయటంలో; బుధైః అంజలిః వినియోజ్యః = బుధులచేత అంజలి హస్తం వినియోగింపదగినది; అనుక్రమాత్, శిరో-ముఖ-ఉరస్థః, కార్యః =(ఇట్లా నమస్కారం చేయటంలో అంజలి హస్తం) క్రమంగా శిరస్సునందు, ముఖమునందు, ఉరమునందు ఉండునట్లుగా చేయవలెను( = అనగా చేతులు-దేవతలకు నమస్కరించేటప్పుడు తలమీదను, గురువులకు నమస్కరించేటప్పుడు ముఖంమీదను, బ్రాహ్మణులకు నమస్కరించేటప్పుడు రొమ్ముమీదను ఉండవలెను).

తాత్పర్యం : రెండు పతాక హస్తాలయొక్క అరచేతుల కలయికవలన 'అంజలి హస్తం' ఏర్పడుతుంది.

దేవతలకు గురువులకు విప్రులకు నమస్కరించటంలో ఇది వినియోగపడుతుంది. అంటే ఈ అంజలిహస్తం దేవతలకు- నమస్కరించేటప్పుడు తలమీదను, గురువులకు నమస్కరించేటప్పుడు ముఖంమీదను, బ్రాహ్మణులకు నమస్కరించేటప్పుడు రొమ్ముమీదను ఉండవలెను.

టీక : భరతముని చెప్పిన అంజలి హస్తం, ఇదీ ఒక్కటే. అయితే అరచేతులు రెండూ కలియాలని ఇందులో స్పష్టం చేయబడింది.

## వేరే గ్రంథంలో అంజలి హస్తం :

పతాక హస్త తలయోస్సంశ్లేషో యత్ర జాయతే ॥ 456

త మాహు రంజలిం హస్తం క్షేత్రపాలో ఽధిదేవతా ।

ప్రణామే వినయే తాలమాతే శంభునిరూపణే ॥ 457

కింకరోమీతివచనే ధ్యానే చాఽంజలి రుచ్యతే ।

అర్థం : పతాక హస్తతలయోః, సంశ్లేః, యత్రజాయతే = రెండు పతాక హస్తములందలి అరచేతుల, కలయిక, ఎచ్చట జరుగుతుందో; తమ్, అంజలిం హస్తం, ఆహుః = దానిని 'అంజలి హస్తం' అని చెబుతారు; క్షేత్రపాలః, అధిదేవతా = క్షేత్రపాలుడు, అధిదేవత.

ప్రణామే, వినయే, తాలఘాతే, శంభునిరూపణే = నమస్కరించటం, వినయంతో వంగటం, తాళంవేయటం, శివస్వరూపాన్ని నిరూపించటం; కింకరోమి-ఇతివచనే, ధ్యానే(చ) = ఏమిచేయుదును (కింకరుడను-నీడా) అని చెప్పటం, ధ్యానం; - ఈ అర్థాలను ప్రదర్శించటంలో; అంజలిః, ఉచ్యతే = అంజలి (హస్తం), చెప్పబడుతున్నది.

తాత్పర్యం : పతాక హస్తమందలి అరచేతులు కలిస్తే, అది పతాక హస్తం అని చెబుతారు,

నమస్కరించటం, వినయంతో వంగటం, తాళంవేయటం, ఏమిచేయుదును లేదా సేవకుడను అని చెప్పటం, ధ్యానం — వీటి అర్థాలను నిరూపించటంలో అంజలిహస్తం తగును.

టీక : ఇంతకుముందు చెప్పిన అంజలి హస్తం, ఇదీ ఒక్కటే.

## 2. కపోత హస్తం :



కపోతః సకరో జ్ఞేయః శ్లిష్టమూలాగ్రపార్శ్వతః ॥ 458

ప్రణామే గురుసంభాషా వినయాంగీకృతిష్వయమ్ ।

అర్థం : సఃకరం = ఆ, అంజలి హస్తం ; మూల-అగ్ర-పార్శ్వతః, శ్లిష్టః = మొదలు, చివర, ప్రక్కల కలిసి ది (అయితే అది) ; కపోతః ; జ్ఞేయః = 'కపోత (హస్త)ం' అని తెలియవలెను.

అయమ్, ప్రణామే, గురు సంభాషా - వినయాంగీకృతిషు = ఇది (= ఈ హస్తం), ప్రణామం (ప్రమాణం-నీడా), గురువుతో సంభాషించటం, వినయ పూర్వకంగా అంగీకరించటం-అనే అర్థము లందు (ప్రయుక్తమవుతుంది) (కపోతం = పావురం).

తాత్పర్యం : అంజలి హస్తమందలి మొదలు, చివర, ప్రక్కలు (ఆ మూలాగ్రంగా-ఘోష్) కలిస్తే, అది కపోత హస్తం అవుతుంది. (అంజలి హస్తమందలి రెండు అరచేతులు దూరం-కావటం చేత మొగ్గ ఆకారం ఏర్పడుతుంది).

ప్రణామం లేదా ప్రమాణ , గురువుతో సంభాషించటం, వినయ పూర్వకంగా అంగీకరించటం — వీటి అర్థాలను నిరూపించటంలో కపోత హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : నాట్యశాస్త్రంలోని కపోత హస్తం, ఇదీ ఒక్కటే. అయితే నా. శా. లో పార్శ్వభాగాలు కలియాలని ఉంటే, ఇచ్చట - మొదలు, చివర, పార్శ్వభాగాలు కలియాలని ఉన్నది.

నిర్వచనం ఉన్న పాదం ఘోష్ పాఠంలో క్రింది విధంగా ఉంది :

కపోతో ఽసౌ కరో యత్ర శ్లిష్టా ఽఽ మూలాగ్రపార్శ్వకః ।

## వేరే గ్రంథంలో కపోత హస్తం :

అంజలే రంతరం యత్ర జాయతే విరళీకృతమ్ ॥ 459

న భవేత కపోతాఖ్యః చిత్రసేనో ఽధిదేవతా ।

అంగీకారే నారికేళ-పూగ-హింతాళపాళిమ ॥ 460

కదళీకుసుమే శీతే వినతే వస్తుసంగ్రహే ।

సంపుటే మాతులుంగే చ కపోతో వినియుజ్యతే ॥ 461

అర్థం : అంజలేః అంతరం, యత్ర విరళీకృతమ్ జాయతే = అంజలి హస్తమందలి చేతుల మధ్య ఎడం ఎక్కడ ఏర్పడుతుందో

(అక్కడ); సః కపోత-ఆఖ్యః భవేత = అది (= ఆ హస్తం) 'కపోతం' అనే పేరుగలది, అవుతుంది; అధిదేవతా చిత్రసేనః = అధిదేవత, చిత్రసేనుడు.

అంగీగారే, నారికేళ-పూగ-హింతాళ పాళిషు = అంగీకారం, కొబ్బరి-పోక-హింతాళపు వరుసలు; కదళీ కుసుమే, శీతే, వినతే, వస్తు సంగ్రహే = అరటి పూవు, చలి, వినయం, వస్తువులను సంగ్రహించటం; సంపుటే, మాతులుంగే (చ) = సంపుటం, మాదీఫలం; — ఈ అర్థాలను ప్రదర్శించటంలో; కపోతః, వినియుజ్యతే = కపోత హస్తం, వినియోగపడుతున్నది.

తాత్పర్యం: అంజలి హస్తమందలి అరచేతుల మధ్య ఎడం ఏర్పడితే, అది కపోత హస్తం అవుతుంది. చిత్రసేనుడు అధిదేవత.

అంగీకారం, కొబ్బరి-పోక-హింతాళపు వరుసలు, అరటి పూవు, చలి, వినయం, వస్తువులను సంగ్రహించటం, సంపుటం, మాదీఫలం — ఈ అర్థములందు కపోత హస్తం తగును.

టీక: ఇంతకుముందు చెప్పిన కపోతహస్తం, ఇదీ ఒక్కటే.

### 3. కర్కట హస్తం:



3

అన్యోన్యస్యాంతరే యత్రాంగుల్యో నిస్సృత్యహస్తయోః ।
అంతర్బహిర్వా వర్తంతే కర్కటః సోఽభిధీయతే ॥ 462

సమూహాగమనే తుందదర్శనే శంఖపూరణే ।
అంగానాంమోటనే శాఖోన్నమనే చ నియుజ్యతే ॥ 463

అర్థం : యత్ర, హస్తయోః, అంగుల్యః, అన్యోన్యాస్య - అంతరే, నిఃస్సృత్య = ఎచ్చట, హస్తమందలి, (వ్రేళ్ళ సందున) వ్రేళ్ళు, పరస్పరం, దూరి ఉంటాయో; అంతః, బహిఃవా, వర్తంతే = వెలికి గాని, లోపలకు (అరచేయి వైపు) గాని ఉంటాయో ; సః, కర్కటః, అభిధీయతే = అది (= ఆ హస్తం) 'కర్కట (హస్త)ం' (అని) చెప్పబడుతున్నది (కర్కటం = ఎండ్రకాయ).

సమూహ-ఆగమనే, తుందదర్శనే, శంఖపూరణే = సమూహం రావటం (సమూహాదర్శనే = సమూహమును చూపటం లేదా చూడటం-నీడా),లావైనదానిని(పొట్టను-ఘోష్) చూపటం,శంఖం= పూరించటం ; అంగానాం మోటనే, శాఖా-ఉన్నమనే (చ) = ఒడలు విరుచు కొనటం, చెట్టు కొమ్మ వంచటం ; — ఈ అర్థాలను నిరూపించటంలో ; నియుజ్యతే = (ఈ హస్తం) నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : కపోత హస్తములందలి వ్రేళ్ళ సందున వ్రేళ్ళు దూర్చి, వెలుపలికి గానీ, లోపలకి గానీ వచ్చేటట్లు చేస్తే అది కర్కట హస్తం అవుతుంది.

సమూహం రావటం లేదా చూడటం, లావైన దానిని లేదా పొట్టను చూపటం, శంఖం పూరించటం, ఒడలు విరుచు కొనటం, చెట్టు కొమ్మ వంచటం — వీటి అర్థాలను నిరూపించటంలో కర్కట హస్తం చెల్లుతుంది.

టీక : నాట్యశాస్త్రంలోని కర్కట హస్తం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో కర్కట హస్తం :

ఊర్ధ్వనా ఖాంగుళీరంధ్ర సంశ్లేషే కర్కటో భవేత్ ।
అస్యాధిదైవతం విష్ణు మాదిదేవం విదు ర్బుధాః ॥ 464
విలాపే జృంభణే మాతే కర్కటే శంఖపూరణే ।
అంగుళీ మోటనే స్త్రీణాం కర్కటో వినియుజ్యతే ॥ 465

అర్థం : ఊర్ణనాభ-అంగుళీ రంధ్ర సంశ్లేషే = ఊర్ణనాభ హస్తంలో ఒక చేతివ్రేళ్ళు ఇంకొక చేతి వ్రేళ్ళ సందున చొప్పించితే (అది); కర్కటః, భవేత్ = 'కర్కట (హస్త)ం' అవుతుంది; అస్య-అధిదైవతం, ఆదిదేవం విష్ణుం, బుధాః విదుః = దీనియొక్క, అధిదేవతను, ఆదిదేవుడైన విష్ణువని బుధులు ఎరుగుదురు.

విలాపే, జృంభణే, ఘాతే, కర్కశే, శంఖపూరణే = విలపించటం, ఆవులింత, కొట్టటం (బరువుగా శ్వాసపీల్చటం-స్వామి), ఎంద్రకాయ, శంఖాన్ని పూరించటం - అనే అర్థములందు; స్త్రీణాం, అంగుళీమోటనే = స్త్రీలు, మెటికలు విరవటంలో; కర్కటః, వినియుజ్యతే = కర్కట (హస్త)ం, వినియోగపడుతుంది.

తాత్పర్యం : ఊర్ణనాభ హస్తంయొక్క వ్రేళ్ళ సందులందు రెండవ చేతియొక్క వ్రేళ్ళను చొప్పించితే, అది 'కర్కట హస్తం' అవుతుంది. అధిదేవత ఆదిదేవుడైన విష్ణువు.

విలపించటం, ఆవులింత, కొట్టటం లేదా బరువుగా శ్వాసపీల్చటం, ఎంద్రకాయ, శంఖాన్ని పూరించటం స్త్రీలు మెటికలు విరవడం — వీటి అర్థాలను నిరూపించటంలో కర్కట హస్తం వినియోగపడుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన కర్కట హస్త నిర్వచనంతో, ఇది సరిపోతున్నది.

## 4. స్వస్తిక హస్తం :


4 ఆద

పతాకయోః సన్నియుక్త కరయోర్మణి
బంధయోః ।
సంయోగేన స్వస్తికాఖ్యో మకరార్థే నియు
జ్యతే ॥ 466
భయవాదే వివాదే చ కీర్తనే స్వస్తికో భవేత్।

అర్థం : పతాకయోః, సన్నియుక్త-కరయోః, మణి బంధయోః, సంయోగేన = దగ్గరకు చేరిన రెండు పతాక హస్త ములయొక్క, మణికట్టులు (అడ్డంగా) కలిస్తే; స్వస్తిక-ఆఖ్యః = స్వస్తికం అనే పేరుగల (హస్తం అవుతుంది).




మకర-అర్థే నియుజ్యతే = (ఇది) మొసలి అనే అర్థమందు నియుక్తమవుతున్నది; భయ వాదే, వివాదే(చ), కీర్తనే = భయంతో మాటాడటం, వివాద పడటం, పొగడటం - అనే అర్థములందు; స్వస్తికః, భవేత్ = స్వస్తిక (హస్త)ం అవుతుంది.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు మణికట్టులవద్ద అడ్డంగా కలిస్తే అది స్వస్తిక హస్తం అవుతుంది.

మొసలి, భయంతో మాటాడటం, వివాదపడటం, పొగ డటం - ఈ అర్థములందు స్వస్తిక హస్తం తగును.

టీక : రెండు అరాల హస్తాలు మణికట్టుల వద్ద, వామ పార్శ్వంలో ఉత్తానంగా కలియాలన్న నాట్యశాస్త్ర నిర్వచనం దీనికి భిన్నంగా ఉంది.

ఇచ్చటి చివరి పాదం నీడాపాఠంలో లేదు.

దీనికి గ్రంథాంతర నిర్వచనాదులు లేవు.

## 5. డోలాహస్తం :



పతాకావూరు దేశస్థౌ డోలాహస్తోఽ యము
చ్యతే॥ 467

నాట్యారంభే ప్రయోక్తవ్య ఇతి నాట్యవిదో
ఽ విదుః ।

అర్థం : పతాకే, ఊరుదేశస్థౌ = రెండు పతాక హస్తాలు, తొడలమీద ఉంటే; అయం, డోలాహస్తః, ఉచ్యతే = అది, 'డోలా హస్తం' (అని), చెప్పబడుతున్నది.

నాట్య-ఆరంభే, ప్రయోక్తవ్యః, ఇతి =(ఈ హస్తం) నాట్య ప్రారంభమందు, ప్రయోగింపదగినది, అని; నాట్యవిదో, విదుః = నాట్యవేత్తలు, ఎరుగుదురు.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు వ్రేలాడుతూ తొడల మీద ఉంటే అది 'డోలాహస్తం' అవుతుంది.

దీనిని నాట్య ప్రారంభమందు ప్రయోగించవలెనని నాట్య వేత్తలకు తెలుసును.

టీక : 'దోల' అని నాట్యశాస్త్ర పాఠం. అంసములు( = భుజముల మూపులు) వదులుగా ఉండవలెనని అచ్చట అధికంగా చెప్పబడింది. కాగా నాట్యశాస్త్రంలోని దోలాహస్త నిర్వచనం, ఇదీ ఒక్కటే.

నిర్వచన పాదం ఘోష్ పాఠంలో ఇట్లా ఉంది :

పతాక ఊరుదేశస్థే డోలాహస్తోఽయమిష్యతే ।

## వేరే గ్రంథంలో డోలాహస్తం :

పతాకౌ పార్శ్వగౌ డోలా భారతీ తస్య దేవతా ॥ 468

మోహ మూర్ఛా మదాలస్య-విలాసాదిషు కీర్తితః ।

అర్థం : పతాకౌ, పార్శ్వగౌ, డోలా = పతాక హస్తాలు రెండు ప్రక్కలలో ఉన్నవి అయితే (అది) డోలాహస్తం (అవుతుంది); తస్య, దేవతా, భారతీ = దీని, అధిదేవత, భారతి.

మోహ, మూర్ఛా, మద, ఆలస్య, విలాస-ఆదిషుకీర్తితః = మోహం, మూర్ఛ, మదం, ఆలస్యం, విలాసం మొదలగు అర్థములందు (ఈ హస్తం) కీర్తింపబడినది( = వినియోగపడుతుంది).

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు ప్రక్కలందు వ్రేలాడితే, అది డోలాహస్తం అవుతుంది. అధిదేవత భారతి.

మోహం, మూర్ఛ, మదం, ఆలస్యం, విలాసం మొదలగు అర్థములందు డోలాహస్తం తగును.

టీక : ఇంతకుముందు చెప్పిన డోల నిర్వచనం, ఈ నిర్వచనం ఒక్కటే. అయితే వినియోగాలు మాత్రం నాట్యశాస్త్రం లోని వినియోగాలకు సన్నిహితంగా ఉన్నాయి.

## 6. పుష్పపుట హస్తం :



సంశ్లిష్టౌ సర్పశీర్షౌ చేత్ భవేత్ పుష్పపుటః కరః॥ 469
నీరాజనావిధౌ వారిఫలాదిగ్రహణే తథా ।
సంధ్యాయా మర్ఘ్యదానే చ మంత్రపుష్పే
నియుజ్యతే॥ 470

అర్థం : సర్పశీర్షౌ, సంశ్లిష్టౌచేత్ = (ఒకప్రక్కగా) రెండు సర్పశీర్ష హస్తాలు, (చిటికెనవ్రేళ్ళు, మణికట్టులు సన్నిహితములగునట్లుగా) కలిస్తే, (అవి); పుష్పపుటకరః భవేత్ = 'పుష్పపుట హస్తం' అవుతుంది.

నీరాజనావిధౌ, వారి ఫల-ఆదిగ్రహణే (తథా) = కర్పూర హారతి ఇవ్వటం, నీళ్ళు పండ్లు మొదలగువానిని తీసుకొనటం (బాల-ఫలాది గ్రహణే = పిల్లలు పండ్లు మొదలగునవి గ్రహించటం-నీడా,; సంధ్యాయామ్, అర్ఘ్యదానే (చ), మంత్రపుష్పే = సంధ్యా సమయం, సంధ్యాసమయమందు చేసే అర్ఘ్యప్రదానం, మంత్ర పుష్పం; ఈ అర్థాలను నిరూపించటంలో; నియుజ్యతే = (ఈ పుష్ప పుట హస్తం) నియుక్తమవుతున్నది. (పుష్పపుటం = పూలబుట్ట).

తాత్పర్యం : చిటికెనవ్రేళ్ళు, మణికట్టులు సన్నిహితములగునట్లుగా రెండు పతాక హస్తాలు కలిస్తే అది 'పుష్పపుట హస్తం' అవుతుంది.

కర్పూరహారతి ఇవ్వటం, నీళ్ళు-పండ్లు లేదా పిల్లలు పండ్లు మొదలగువాటిని గ్రహించటం, సంధ్యా సమయం, అర్ఘ్యప్రదానం లేదా సంధ్యా సమయమందుచేసే అర్ఘ్యప్రదానం - ఈ అర్థములందు పుష్పపుట హస్తం వినియోగపడుతుంది.

టీక : నాట్యశాస్త్రంలోని పుష్పపుట నిర్వచనం, ఇదీ ఒక్కటే.

## వేరే గ్రంథంలో పుష్పపుట హస్తం :

సర్ప శీర్షస్య పార్శ్వే తు అపరః సర్పశీర్షకః ।
ధృతః పుష్పపుటాఖ్యః స్యాదధీశః కిన్నరేశ్వరః ॥ 471

సుమ-ధాన్య-ఫలాదీనామర్పణే గ్రహణే తథా ।
అర్ఘ్యదానే పుష్పపుటః కీర్తితో భావకోవిదైః ॥ 472

అర్థం : సర్పశీర్షస్య పార్శ్వే(తు), అపరః సర్పశీర్షకః, ధృతః=(ఒక) సర్పశీర్ష హస్తం యొక్క ప్రక్క ఇంకొక సర్ప శీర్ష హస్తాన్ని ధరిస్తే (=చేర్చటంవల్ల); పుష్పపుట - ఆఖ్యః, స్యాత్ =పుష్పపుట (హస్తం) అనే పేరుగలది, ఏర్పడుతుంది; అధీశః, కిన్నర-ఈశ్వరః =అధిదేవత, కిన్నరేశ్వరుడు.

సుమ-ధాన్య-ఫల-ఆదీనాం-అర్పణే, గ్రహణే (తథా)= పువ్వులు, ధాన్యం, పండ్లు మొదలగువాటిని ఇవ్వటం, పుచ్చుకొనటం - అనే అర్థములందు; అర్ఘ్యదానే=అర్ఘ్య ప్రదానంలో; భావకోవిదైః, పుష్పపుటః, కీర్తితః =భావకోవిదులచేత, పుష్పపుట హస్తం కీర్తింపబడినది.

తాత్పర్యం : ఒక సర్పశీర్ష హస్తం ప్రక్కన ఇంకొక సర్ప శీర్ష హస్తాన్ని చేర్చితే, అది 'పుష్పపుట హస్తం' అవుతుంది. కిన్న రేశ్వరుడు అధిదేవత.

పువ్వులు ధాన్యం పండ్లు మొదలగువాటిని అర్పించటం, వాటిని పుచ్చుకొనటం, అర్ఘ్యప్రదానం - ఈ అర్థములందు పుష్ప పుట హస్తం వినియోగపడుతుందని భావకోవిదులు చెప్పినారు.

టీక : ఇంతకుముందు చెప్పిన పుష్పపుట హస్తం, ఇదీ ఒక్కటే.

## 7. ఉత్సంగ హస్తం :



అన్యోన్య బాహు మూలస్థౌ మృగశీర్ష కరౌ యది ।
ఉత్సంగహస్తః స జ్ఞేయో భరతాగమవేదిభిః ॥ 473

ఆలింగనే చ లజ్జాయా మంగదాది ప్రదర్శనే ।
బాలానాంశిక్షణే చాయముత్సంగో యుజ్యతే
కరః ॥ 474

అర్థం : మృగశీర్ష కరౌ, అన్యోన్య బాహుమూలస్థౌ, యది = రెండు మృగశీర్ష హస్తాలు, పరస్పరం బాహుమూలము లందు (బాహుదేశస్థౌ = బాహువులందు-నీడా) ఉన్నవి, అయితే; సః, ఉత్సంగహస్తః = అది (= ఆహస్తం), 'ఉత్సంగ హస్తం' (అని); భరతాగమవేదిభిః, జ్ఞేయః = నాట్య వేదవేత్తలచేత, తెలిసి కొనదగినది (ఆ హస్తం భరత వేదమందు ఉత్సంగము అనే పేరు గల హస్తంగా కీర్తింపబడినది-నీడా).

ఆలింగనే(చ), లజ్జాయాం, అంగద-ఆది ప్రదర్శనే, బాలానాం శిక్షణే(చ) = కౌగిలింత, సిగ్గు, భుజకీర్తులు మొదలగు వాటిని చూపటం, బాలురను శిక్షించటం - అనే అర్థములందు; ఉత్సంగః కరః, యుజ్యతే = ఉత్సంగహస్తం, నియుక్తమవుతున్నది (ఉత్సంగం = ఒడి).

తాత్పర్యం : రెండు మృగశీర్ష హస్తాలు పరస్పరం బాహు మూలములందు లేదా బాహువులందు ఉంటే, అది 'ఉత్సంగ హస్తం' అవుతుంది.

ఆలింగనం, సిగ్గు, భుజకీర్తులు మొదలగువాటిని చూపటం,

బాలురను శిక్షించటం - ఈ అర్థములందు ఉత్సంగహస్తం ప్రయుక్త మవుతుంది.

టీక : నాట్యశాస్త్రంలో - ఉత్తానంగా ఉన్న రెండు అరాల హస్తాలు ఉత్సంగ హస్తం అవుతాయని చెప్పబడింది.

నిర్వచనంలోని రెండవ పాదం నీడా పాఠంలో ఇట్లా ఉంది:
ఉత్సంగ నామాహస్తోఽయం కీర్తితో భరతాగమే।

## వేరే గ్రంథంలో ఉత్సంగ హస్తం :



అరాళౌ స్వస్తికస్కంధా వుత్సంగ
స్తదధీశ్వరః ।
గౌతమో వినియోగ స్తు లజ్జాయాం
పరిరంభణే ॥ 475
అంగీకారే చ శీతే చ సాధ్వర్థే
కుచగోపనే ।
ఏవమాదిషు యుజ్యంతే ఉత్సంగకరభావనా ॥ 476

అర్థం. అరాళౌ, స్వస్తికస్కంధౌ, ఉత్సంగః = రెండు అరాళ హస్తాలు, మూపుల యందు స్వస్తికం కావటం (= స్వస్తిక ఆకారంగా ఏర్పడటం) వల్ల, 'ఉత్సంగ హస్తం' (అవుతుంది); తత్-అధీశ్వరః, గౌతమః = దాని అధిదేవత, గౌతముడు.

లజ్జాయాం, పరిరంభణే = సిగ్గు, కౌగిలింత అనే అర్థములందు; వినియోగః (తు) = (దీనికి) వినియోగం; అంగీకారే (చ), శీతే, సాధు-అర్థే, కుచగోపనే, ఏవం ఆదిషు = అంగీకారం, చలి, మేలు అనటం, కుచములను కప్పుకొనటం మొదలైన అర్థములందు; ఉత్సంగకర భావనా = ఉత్సంగ హస్తం యొక్క భావన (చేయబడినది .

తాత్పర్యం : బాహువుల మూపులందు రెండు అరాళ హస్తాలు స్వస్తికంగా ఉంటే, అది ఉత్సంగ హస్తం అవుతుంది. గౌతముడు అధిదేవత.

సిగ్గు, కౌగిలింత, అంగీకారం, చలి, మేలు అనటం, కుచ ములను కప్పుకొనటం మొదలగునవి — ఈ అర్థములందు ఉత్సంగ హస్తం భావింపబడినది.

టీక : నాట్య శాస్త్రంలోని ఉత్సంగ హస్త నిర్వచనం, ఇదీ ఒక్కటే.

## 8. శివలింగ హస్తం :



8 అ.ద

వామే ఒర్ధచంద్రే విన్యస్తః శిఖరః
శివలింగకః ।
వినియోగ స్తు తస్యైవ శివలింగ
ప్రదర్శనే ॥ 477

అర్థం : అర్ధచంద్రే వామే, శిఖరః విన్యస్తః, శివలింగకః = అర్ధచంద్ర హస్తంగా ఉన్న ఎడమ చేతిలో, శిఖర హస్తం(గా ఉన్న కుడిచేతిని) ఉంచితే, 'శివలింగ (క) హస్తం' (అవుతుంది).

శివలింగ ప్రదర్శనే ఏవ తస్య వినియోగః (తు) = శివలింగ ప్రదర్శన మందే (దర్శనే = చూపించుట యందే - ఘోష్), దాని యొక్క వినియోగం

తాత్పర్యం : అర్ధచంద్ర హస్తంగా ఉన్న ఎడమ చేతియందు (కుడి) శిఖర హస్తాన్ని ఉంచితే, అది 'శివలింగ (క) హస్తం' అవుతుంది.

శివలింగమును ప్రదర్శించటంలో ఇది వినియోగపడుతుంది.

టీక : నాట్యశాస్త్రంలో ఈ హస్తం లేదు.

## 9. కటకావర్ధన హస్తం :



కటకాముఖయోః పాణ్యోః స్వస్తికా
న్మణిబంధయోః ।
కటకావర్ధనాఖ్యః స్యా దితి నాట్యవిదో
విదుః ॥ 478

పట్టాభిషేకే పూజాయాం వివాహాశిషి
యుజ్యతే ।

అర్థం : కటకాముఖయోః, పాణ్యోః = రెండు కటకాముఖ హస్తాలయొక్క; మణిబంధయోః స్వస్తికాత్ = మనికట్టుల వద్ద స్వస్తికం కావటం వలన ; కటకావర్ధన-ఆఖ్యః, స్యాత్ = 'కటకా వర్ధనం' అనే పేరుగలది, అవుతుంది; ఇతి, నాట్యవిదః, విదుః = అని, నాట్యవేత్తలు తెలిసికొందురు.

పట్టాభిషేకే, పూజాయాం, వివాహ-ఆశిషి = పట్టాభిషేకం, పూజ, పెండ్లి దీవన (వివాహాదులు = పెండ్లి మొదలగు వాటియందు-ఘోష) - అనే అర్థములందు ; యుజ్యతే = (కటకావర్ధన హస్తం) తగును.

తాత్పర్యం : రెండు కటకాముఖ హస్తాలు మణికట్టుల వద్ద స్వస్తికం కావటం వలన 'కటకావర్ధన హస్తం' ఏర్పడుతుందని నాట్య వేత్తలు ఎరుగుదురు.

పట్టాభిషేకం, పూజ, పెండ్లి దీవన లేదా పెండ్లి మొదలగు నవి — ఈ అర్థములందు కటకావర్ధన హస్తం తగును.

టీక : నాట్యశాస్త్ర- సంగీతరత్నాకరములందు ఈ హస్తం పేరు 'కటకావర్ధమానకం'. నాట్యశాస్త్ర నిర్వచనంతో ఈనిర్వచనం సరిపోతున్నది.

## వేరే గ్రంథంలో కటకావర్ధన హస్తం :

కటకావర్ధనాఖ్యః స్యాత్ స్వస్తికౌ కటకాముఖౌ ॥ 479

తస్యదేవో యక్షరాజో భావజ్ఞైశ్చ నిరూపితః ।

వినియోగో విచారే చ శృంగారే కోపసాంత్వనే ॥ 480

జక్కిణీనటనే దండలాస్యే భవతి నిశ్చయే ।

అర్థం : కటకాముఖౌ, స్వస్తికౌ = రెండు కటకాముఖ హస్తాలు, స్వస్తికం అయితే; కటకావర్ధన-ఆఖ్యః, స్యాత్ = కటకావర్ధనం అనే పేరుగలది, అవుతుంది; తస్యదేవః, యక్షరాజః = దానికి అధిదేవత, యక్షరాజు (అని); భావజ్ఞైః (చ), నిరూపితః = భావవేత్తల చేత నిరూపితమైనది.

విచారే(చ), శృంగారే, కోపసాంత్వనే, జక్కిణీ నటనే, దండలాస్యే, నిశ్చయే = విచారం, శృంగారం, కోపం శాంతింపజేయటం, జక్కిణీనటనం, దండలాస్యం (= కోలాటం), నిశ్చయం - అనే అర్థములందు; వినియోగః, భవతి = వినియోగం, అవుతుంది (= ఈ హస్తం వినియోగపడుతుంది).

తాత్పర్యం : రెండు కటకాముఖ హస్తాలు స్వస్తికంగా ఉంటే, అది 'కటకావర్ధన హస్తం' అవుతుంది, అధిదేవత యక్షరాజు-ఇట్లా భావవేత్తలచేత నిరూపితమైనది,

విచారం, శృంగారం, కోపం శాంతింపజేయటం, జక్కిణీ నటనం, దండలాస్యం. నిశ్చయం — వీటి అర్థాలను నిరూపించటంలో కటకావర్ధన హస్తం వినియోగపడుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన కటకావర్ధన హస్తం, ఇదీ ఒకట్టే.

## 10. కర్తరీ స్వస్తిక హస్తం :


10 అ.ద

కర్తరీ స్వస్తికాకారా కర్తరీస్వస్తికో
భవేత్ ॥ 481

శాఖాసు చాద్రిశిఖరే వృక్షేషు చ
నియుజ్యతే ।

అర్థం : స్వస్తిక-ఆకారః, కర్తరీ=స్వస్తిక ఆకారంగా ఉన్న, రెండు కర్తరీముఖ హస్తాలు; కర్తరీ స్వస్తికః, భవేత్ = కర్తరీస్వస్తిక (హస్త)ం, అవుతుంది.

శాఖాసు(చ), అద్రిశిఖరే, వృక్షేషు(చ), నియుజ్యతే= చెట్టు కొమ్మలు, పర్వత శిఖరం, వృక్షాలు (అనే అర్థములందు ఈ హస్తం) నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : రెండు కర్తరీముఖ హస్తాలు స్వస్తికంగా ఉంటే అది 'కర్తరీ స్వస్తిక హస్తం' అవుతుంది.

చెట్టు కొమ్మలు, పర్వత శిఖరం, వృక్షాలు - ఈ అర్థములందు కర్తరీస్వస్తికం తగును.

టీక : ఈ హస్తంనుంచి, భేరుండ హస్తం వరకు-మొత్తం 14 హస్తాలు నాట్యశాస్త్రంలో లేవు.

## 11. శకట హస్తం :





భ్రమరౌ మధ్యమాంగుష్ఠ ప్రసారాచ్ఛకటో
భవేత్ ॥ 482

రాక్షసాభినయే ప్రాయః శకటో విని
యుజ్యతే ।

అర్థం : మధ్యమ - అంగుష్ఠ ప్రసారాత్ = నడిమివ్రేలు, బొటనవ్రేలు చాపబడటంవల్ల; భ్రమరౌ, శకటః, భవేత్ = రెండు భ్రమరహస్తాలు, శకట (హస్త)ం, అవుతాయి.

ప్రాయః రాక్షస-అభినయే = తరచుగా (అయం = ఈ హస్తం-నీడా) రాక్షసులను అభినయించటంలో; శకటః, విని యుజ్యతే = శకట (హస్త)ం, వినియుక్తమవుతుంది.

తాత్పర్యం : రెండు భ్రమరహస్తాల నడిమివ్రేళ్ళు, బొటన వ్రేళ్ళు ప్రసారితాలైతే; అది 'శకటహస్తం' అవుతుంది.

శకటహస్తం రాక్షసాభినయమందు (తరచుగా) ప్రయుక్తమవుతుంది.

## 12. శంఖ హస్తం :




శిఖరాంతర్గతాంగుష్ఠ ఇతరాంగుష్ఠ సంగతః ॥ 483
తర్జన్యాద్యా స్తతః శ్లిష్టాః శంఖ హస్తః ప్రకీర్తితః ।

శంఖాదిషు ప్రయోజ్యో ఽయ మిత్యాహు
ర్భరతాదయః ॥ 484

అర్థం : శిఖరాంతర్గత-అంగుష్ఠః = శిఖర హస్తమందలి అంగుష్ఠం; ఇతరాంగుష్ఠ సంగతః = రెండవ శిఖర హస్తమందలి అంగుష్ఠంతో చేరినది; తతఃతర్జన్యాద్యాః, శ్లిష్టాః = అల్లే తర్జని మొదలగు వ్రేళ్ళు (అంగుష్ఠంతో) కలిసినవి (కాగా అది) (తర్జన్యాయుత- అశ్లిష్టః = తర్జనితో కూడినది, కాని కలియనిది-ఘోష్); శంఖ హస్తః, ప్రకీర్తితః = 'శంఖ హస్తం' (అని) కీర్తించబడింది.

అయం, శంఖాదిషు, ప్రయోజ్యః ఇతి = ఇది, శంఖం మొదలగు వానియందు, ప్రయోగింపదగినది, అని; భరతాదయః ఆహుః = భరతాదులు, చెబుతారు.

తాత్పర్యం : ఒక శిఖర హస్తమందలి అంగుష్ఠం రెండవ శిఖర హస్తమందలి అంగుష్ఠంతో చేరగా, అల్లే తర్జని మొదలగు వ్రేళ్ళు కూడా కలియగా 'శంఖ హస్తం' ఏర్పడుతుంది.

ఈ హస్తం శంఖం మొదలగు వాటియందు వినియోగపడుతుందని భరతాదులు చెప్పినారు.

టీక : 'అశ్లిష్టః' అనే ఘోష్ పాఠం కూడ సమాదరణీయమే.

## 13. చక్ర హస్తం :


13 అ.ద

యత్రార్ధచంద్రౌ తిర్యఞ్చావన్యోన్యతల
సంస్పృశౌ ।
చక్రహస్తః స విజ్ఞేయః చక్రార్థే
వినియుజ్యతే ॥ 485

అర్థం: యత్ర, అర్ధచంద్రౌ, తిర్యఞ్చౌ అన్యోన్యతలసంస్పృశౌ =ఎచ్చట రెండు అర్ధచంద్ర హస్తములందలి అరచేతులు అభిముఖంగా కలుస్తాయో (అచ్చట), సః, విజ్ఞేయః, చక్రహస్తః -అని, 'చక్రహస్తం' (అని), తెలియదగినది.

చక్ర-అర్థే, వినియుజ్యతే=(ఈ చక్ర హస్తం) చక్రం అనే అర్థంలో, వినియుక్తమవుతుంది.

**తాత్పర్యం :** రెండు అర్ధచంద్ర హస్తములందలి అరచేతులు అభిముఖంగా కలిస్తే, అది 'చక్రహస్తం' అవుతుంది.

చక్రం అనే అర్థమందు ఈ హస్తం వినియోగపడుతుంది.

## 14. సంపుట హస్తం :


14 అ.ద

కుంచితాంగుళయశ్చక్రే ప్రోక్తః సంపుట
హస్తకః ।
వస్త్వాద్ఛాదే సంపుటే చ సంపుటః కర
ఈరితః ॥ 486

అర్థం : చక్రే, కుంచిత-అంగుళయః =(ముందు చెప్పిన) చక్రహస్తమందలి, అంగుళులు కుంచితాలయితే; సంపుట హస్తకః, ప్రోక్తః =(అది) సంపుట హస్త(క)ం (అని) చెప్పబడినది.

వస్తు-ఆచ్ఛాదనే, సంపుటే(చ) = వస్తువులను కప్పటం(= దాచటం). సంపుటం(= పెట్టె)-అనే అర్థములందు; సంపుటః కరః, ఈరితః = సంపుటహస్తం, చెప్పబడినది.

తాత్పర్యం : చక్రహస్తమందలి అంగుళులు కుంచితములు అయితే అది సంపుట హస్తం అవుతుంది.

వస్తువులను కప్పటం లేదా దాచటం, పెట్టె అనే అర్థము లందు చక్రహస్తం వినియోగపడుతుంది.

## 15. పాశహస్తం :




సూచ్యాం నికుంచితే శ్లిష్టే తర్జన్యౌ
పాశ ఈరితః ॥

అన్యోన్యకలహే పాశే శృంఖలాయాం
నియుజ్యతే ॥ 487

అర్థం : సూచ్యాం, తర్జన్యౌ = (రెండు) సూచీహస్తము లందలి, చూపుడువ్రేళ్ళు; నికుంచితే, శ్లిష్టే = వంగినవి, కలిసినవి (అయితే); పాశ, ఈరితః = పాశ(హస్త)ం, (అని) చెప్పబడింది.

అన్యోన్యకలహే, పాశే, శృంఖలాయాం = పరస్పర కలహం, త్రాడు, సంకెల-అనే-అర్థములందు; నియుజ్యతే = (ఈ హస్తం) నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : రెండు సూచీహస్తములందలి చూపుడువ్రేళ్ళు వంగినవి, కలిసినవి అయితే, అది పాశహస్తం అవుతుంది.

పరస్పర కలహం, త్రాడు, సంకెల-అనే అర్థాలలో పాశ హస్తం నియుక్తమవుతుంది.

## 16. కీలక హస్తం :


16 అ.ద

కనిష్ఠే కుంచితే శ్లిష్టే మృగశీర్షే తు కీలకః ।
స్నేహే నర్మానులాపే చ కీలకో వినియుజ్యతే ॥ 488

అర్థం : మృగశీర్షే (తు), కనిష్ఠే, కుంచితే, శ్లిష్టే = రెండు మృగశీర్ష హస్తాలలోని, చిటికెన వ్రేళ్ళు, వంగినవి, కలిసినవి (అయితే అది) ; కీలకః = కీలక (హస్త)ం (అవుతుంది).

స్నేహే, నర్మ-అనులాపే (చ) = స్నేహం, ప్రియవచనం - ఈ అర్థములందు ; కీలకః, వినియుజ్యతే = కీలక(హస్త)ం వినియుక్తమవుతుంది.

తాత్పర్యం : రెండు మృగశీర్ష హస్తములందలి చిటికెన వ్రేళ్ళు వంగినవి, కలిసినవి అయితే, అది కీలకహస్తం అవుతుంది.

స్నేహం, ప్రియవచనం - ఈ అర్థములందు కీలక హస్తం వినియుక్తమవుతుంది (కీలక హస్తం యొక్క వినియోగం సమ్మతింపబడినది-నీడా).

## 17. మత్స్య హస్తం:


17 అ.ద

కరపృష్ఠోపరి న్యస్తో యత్ర హస్తః పతాకికః ।
కించి త్ప్రసారితాంగుష్ఠకనిష్ఠో మత్స్య నామకః ॥ 489

ఏతస్య వినియోగ స్తు మత్స్యార్థే సమ్మతో భవేత్ ।

అర్థం : యత్ర, పతాకికః హస్తః = ఎచ్చట, (ఒక) పతాక హస్తం ; కరపృష్ఠ-ఉపరిన్యస్తః = (రెండవ పతాక) హస్తం యొక్క వెనుక భాగం మీద ఉంచబడినది ; అంగుష్ఠ-కనిష్ఠః, కించిత్, ప్రసారితః = బొటన వ్రేళ్ళు, చిటికెన వ్రేళ్ళు, కొంచెం, చాపబడినవి (కాగా) (అది) ; మత్స్యనామకః = మత్స్యం (అనే) పేరుగలది (అవుతుంది).

ఏతస్య వినియోగః (తు) = దీని యొక్క వినియోగం ; మత్స్య-అర్థే, సమ్మతః భవేత్ = మత్స్యం (= చేప) అనే అర్థమునందు, సమ్మతమైనది (మత్స్యదర్శనే సమ్మతః = చేపను చూపుటయందు సమ్మతించబడినది-ఘోష్).

తాత్పర్యం : ఒక పతాక హస్తం మీద ఇంకొక పతాక హస్తాన్ని ఉంచి, బొటన వ్రేళ్ళను చిటికెన వ్రేళ్ళను కొంచెం ప్రసారితం చేస్తే, అది 'మత్స్యహస్తం' అవుతుంది.

ఈ హస్తం మత్స్యం అనే అర్థమందు వినియోగపడుతుంది.

టీక : యత్ర హస్తత్వ ధోముఖః = ఎక్కడ ..... హస్తం అధోముఖం — అని ఘోష్ పాఠం.

ఒక అరచేయి అధోముఖం కాగా, దాని మీదిది కూడ అధోముఖమే అవుతుంది. చక్రహస్తమందలి అరచేతులు అభిముఖములుగా కలిస్తే ఈ హస్తమందలి అరచేతులు ఒకదాని మీద ఒకటి కలుస్తాయి.

## 18. కూర్మహస్తం :



18 అ.ద

కుంచితాగ్రాంగుళి శ్చక్రే త్యక్తాంగుష్ఠ
కనిష్ఠకః ॥ 490

కూర్మహస్తః స విజ్ఞేయః కూర్మార్థే
వినియుజ్యతే ।

అర్థం : చక్రే = చక్రహస్తంలో; కుంచిత-అగ్ర-అంగుళిః (చ) = వంచిన చివరలు గల (మూడు) వ్రేళ్ళు; త్యక్త-అంగుష్ఠ-కనిష్ఠకః = విడిచిపెట్టిన (= చాచిన) బొటనవ్రేళ్ళు, చిటికెన వ్రేళ్ళు (ఉంటే); సః, విజ్ఞేయః, కూర్మహస్తః = అది (= ఆ హస్తం) కూర్మహస్తం అని తెలియదగినది.

కూర్మార్థే వినియుజ్యతే = (ఇది) కూర్మం (= తాబేలు) అనే అర్థంలో వినియుక్తమవుతుంది.

తాత్పర్యం : చక్రహస్తమందలి బొటనవ్రేళ్ళు చిటికెన వ్రేళ్ళు చాచినవి, తక్కినవ్రేళ్ళ చివరలు వంగినవి అయితే అది కూర్మహస్తం అవుతుంది.

తాబేలు అనే అర్థమందు ఇది వినియోగపడుతుంది.

## 19. వరాహ హస్తం :


19 అద

మృగశీర్షే త్వన్యతరే స్వోపర్యేకః స్థితే యది ॥ 491

కనిష్ఠాంగుష్ఠయో ర్యోగా ద్వరాహః కర ఈరితః ।

ఏతస్య వినియోగః స్యాత్ వరాహార్థ ప్రదర్శనే ॥ 492

అర్థం : మృగశీర్షే(తు), అన్యతరే స్వ-ఉపరి-ఏకః స్థితే, యది = రెండు మృగశీర్ష హస్తాలు, ఒకదానిమీద ఇంకొకటి ఉండగా; కనిష్ఠ - అంగుష్ఠయోః, యోగాత్ = చిటికెనవ్రేళ్ళు, బొటన వ్రేళ్ళు, (పరస్పరం) కలియటంవల్ల; వరాహః కరః, ఈరితః = వరాహహస్తం, చెప్పబడినది.

వరాహ-అర్థ ప్రదర్శనే = వరాహం అని తెలియచెప్ప టంలో; ఏతస్య వినియోగః స్యాత్ = దీనియొక్క వినియోగం అవు తుంది (= ఇది వినియోగపడుతున్నది).

తాత్పర్యం : రెండు మృగశీర్ష హస్తాలు ఒకదానిమీద ఒకటి ఉండగా, చిటికెనవ్రేళ్ళు బొటనవ్రేళ్ళు పరస్పరం కలిస్తే అది వరాహహస్తం అవుతుంది.

వరాహం అనే అర్థమందు ఇది ప్రయుక్తమవుతుంది.

టీక : 'మృగశీర్షే త్వన్యకరస్తేన శ్లిష్టస్థితః' - అని నీడా పాఠం. ఒక మృగశీర్ష హస్తంమీద ఇంకొక మృగశీర్ష హస్తం ఉంచినప్పుడు, ఒకచేతి బొటనవ్రేలు రెండవచేతి చిటికెనవ్రేలితోను, ఆ చేతి చిటికెనవ్రేలు రెండవచేతి బొటనవ్రేలితోను కలుస్తాయి. అందుచేత 'శ్లిష్టస్థితః' (=కలిసి ఉంటాయి) అన్న నీడా పాఠమే అర్థవంతం కాగలదు.

## 20. గరుడ హస్తం :




తిర్యక్తలస్థితా వర్ధచంద్రా వంగుష్ఠ
యోగతః ।
గరుడో గరుడార్థే చ యుజ్యతే
భరతాగమే ॥ 493

అర్థం : అంగుష్ఠయోగతః అర్ధచంద్రౌ = రెండు బొటన వ్రేళ్ళు కలిసేటట్లుగా రెండు అర్ధచంద్రహస్తాలు; తిర్యక్తలస్థితౌ= ఒక అరచేతి మీద ఇంకొక అరచేయి అడ్డంగా ఉంచినప్పుడు; గరుడ =(అది)గరుడ (హస్త)ం (అవుతుంది).

భరతాగమే = భరత వేదమందు; గరుడార్థే(చ), యుజ్యతే= గరుడుడు అనే అర్థమందు, నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : రెండు బొటనవ్రేళ్ళు కలిసేటట్లుగా రెండు అర్ధచంద్ర హస్తాలను - ఒక అరచేతి మీద ఇంకొక అరచేయి ఉండే టట్లుగా - పడితే, అది గరుడ హస్తం అవుతుంది.

గరుత్మంతుడు అనే అర్థమందు ఇది తగును అని భరతవేద మందు చెప్పబడినది.

## 21. నాగబంధ హస్తం :




సర్పశీర్షౌ స్వస్తికౌచేత్ నాగబంధ ఇతీరితః ।

ఏతస్య వినియోగస్తు నాగబంధే హి సమ్మతః॥ 494

భుజంగదంపతీభావే నికుంజానాం చ దర్శనే ।

అధర్వణస్యమంత్రేషు యోజ్యో భరత
కోవిదైః ॥ 495

అర్థం : సర్పశీర్షౌ స్వస్తికౌచేత్ = రెండు సర్పశీర్ష హస్తాలు స్వస్తికంగా ఉంటే (అది) ; (సర్పశీర్ష స్వస్తికంచ = ఒక సర్పశీర్ష హస్తం ఒక స్వస్తిక హస్తం కలిస్తే-ఘోష్); నాగబంధః, ఇతి, ఈరితః = నాగబంధ (హస్త)-, అని చెప్పబడినది.

ఏతస్య వినియోగః (తు) = దీని యొక్క వినియోగం ; నాగ బంధే (హి) సమ్మతః = నాగబంధమునందు అంగీకరించబడినది (నియుజ్యతే = నియుక్తమైనది-నీడా,. (ఇంకా ఈ హస్తం)-భుజంగ దంపతీభావే = పాముల జంట అనే భావమందు ; నికుంజానాం (చ) దర్శనే = పొదరిళ్ళు చూపటంలో ; అధర్వణస్య మంత్రేషు = అధ ర్వణ వేద మంత్రముల విషయంలో ; భరతకోవిదైః, యోజ్యః = భరత శాస్త్రవేత్తల చేత, ప్రయోగింపదగినది.

తాత్పర్యం : రెండు సర్పశీర్ష హస్తాలు స్వస్తికంగా ఉంటే అది 'నాగబంధ హస్తం' అని చెప్పబడినది (ఒక సర్పశీర్ష హస్తం, ఒక స్వస్తిక హస్తం కలిస్తే అది నాగబంధ హస్తం అవుతుంది - ఘోష్).

నాగబంధ విషయమున ఇది వినియోగపడుతుంది. ఇంకా

ఈ హస్తం - పాముల జంట, పొదరిళ్ళు చూపటం, అధర్వణ వేద మంత్రాలు — ఈ అర్థములందు కూడ ప్రయుక్తమవుతుంది.

టీక : చివరి రెండు పాదాలు ఘోష్ పాఠంలో లేవు.

## 22. ఖట్వా హస్తం :



22 అద

చతురే చతురం న్యస్య తర్జన్యంగుష్ఠమోక్షతః ।

ఖట్వాహస్తో భవే దేషః ఖట్వాదిషు నియుజ్యతే ॥ 496

అర్థం : చతురే, చతురం, న్యస్య = ఒక చతురహస్తంమీద, ఇంకొక చతురహస్తం, ఉంచి; తర్జనీ-అంగుష్ఠమోక్షతః = చూపుడు వ్రేళ్ళను, బొటనవ్రేళ్ళను చాపితే; ఖట్వాహస్తః, భవేత్ = ఖట్వా హస్తం, అవుతుంది.

ఏషః, ఖట్వాదిషు, నియుజ్యతే = ఇది (= ఈ హస్తం) ఖట్వం (= మంచం) మొదలగువాని విషయమున నియుక్తమవు తున్నది.

[ఖట్వాశిబికయోః స్మృతః = ఖట్వం, శిబిక (= పల్లకి) అను వాని విషయమున స్మరింపబడినది-ఘోష్].

తాత్పర్యం : ఒక చతురహస్తంమీద ఇంకొక చతురహస్తం ఉంచి, చూపుడువ్రేళ్ళను బొటనవ్రేళ్ళను ప్రసారితంచేస్తే-అది ఖట్వా హస్తం అవుతుంది.

ఈ హస్తం ఖట్వం (ఖట్వం, శిబిక - ఘోష్) మొదలగు అర్థములందు ఉపయోగపడుతుంది.

## 23. భేరుండ హస్తం :


23 అద

మణిబంధే కపిత్థాభ్యాం భేరుండకర ఇష్యతే ।

భేరుండే పక్షిదంపత్యోః భేరుండో యుజ్యతేకరః 497

అర్థం : మణిబంధే, కపిత్థాభ్యాం = మణికట్టుల వద్ద రెండు కపిత్థ హస్తాలు కలిస్తే; భేరుండకరః, ఇష్యతే = భేరుండ హస్తం (అవుతుందని) అంగీకరించబడింది.

భేరుండే, పక్షి దంపత్యోః = భేరుండం అనే పక్షి, పక్షిదంపతులు (భేరుండ పక్షిదంపత్యోః = భేరుండ పక్షి దంపతులు - నీడా) — అనే అర్థాలలో; భేరుడః కరః, యుజ్యతే = భేరుండ హస్తం, ప్రయోగింపబడుతుంది.

తాత్పర్యం : మణికట్టుల వద్ద రెండు కపిత్థ హస్తాలుకూడితే అది భేరుండ హస్తం అవుతుంది.

భేరుండం, పక్షిదంపతులు (భేరుండ పక్షి దంపతులు - నీడా) అనే అర్థములందు భేరుండ హస్తం ఉపయుక్తమవుతుంది.

## 24. అవహిత్థ హస్తం :


24 అద

సోలపద్మౌ వక్షసిస్థా వవహిత్థకరో మతః ।
శృంగారవటనే చైవ లీలాకందుకధారణే ॥ 498
కుచార్థే యుజ్యతే సోఒయ మవహిత్థకరాభిధః ।

అర్థం : సోలపద్మౌ వక్షసిస్థౌ = రెండు సోలపద్మహస్తాలు ఱొమ్ముమీదఉన్నవి (అయితే); అవహిత్థకరఃమతః = (అది) అవహిత్థ హస్తం (అని), అంగీకరింపబడినది.

శృంగార నటనే(చ) (ఏవ), లీలాకందుక ధారణే, కుచార్థే = శృంగారనటనం, లీలాకందుకాన్ని ధరించటం, కుచం అనే అర్థం — వీటి విషయంలో; అవహిత్థకరాభిదః, సః అయమ్ = అవహిత్థ హస్తం అనే పేరుగల, ఈ హస్తం; యుజ్యతే = ప్రయోగింపదగినది.

తాత్పర్యం: రెండు సోలపద్మహస్తాలు వక్షంమీద(అభిముఖంగా) ఉంటే, అది 'అవహిత్థహస్తం' అవుతుంది.

శృంగారనటనం, లీలాకందుకం ధరించటం, కుచం — ఈ అర్థములందు అవహిత్థహస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : ఈ హస్తం ఘోష్ పాఠంలో లేదు; నాట్యశాస్త్రమందు ఈ పేరుతో ఒక హస్తం ఉన్నది కాని, నిర్వచనాలు, వినియోగాలు కూడా భిన్నంగా ఉన్నాయి.

## వేరే గ్రంథంలో అవహిత్థ హస్తం :



12

హృదయాభిముఖౌ యత్ర శుకతుండా వధోగతౌ ॥ 499

సో ఽవహిత్థో భవే దస్య మార్కండే యాఽధిదేవతా ।

దుర్బలత్వే దేహకార్శ్యే కౌతుకే చ కృశే మతః ॥ 500

అర్థం : యత్ర = ఎక్కడ (= ఎప్పుడు); శుకతుండే = రెండు శుకతుండ హస్తాలు; అధోగతౌ = క్రిందుగా ఉన్నవి (= అరచేతులు భూమివైపు ఉంచినవి); హృదయాభిముఖౌ = వక్షమునకు ఎదు

రుగా ఉన్నవి (అయితే); సః, అవహిత్థః, భవేత్ = అది, అవహిత్థ (హస్తం) అవుతుంది; అస్య, అధిదేవతా, మార్కండేయః = దాని యొక్క, అధిదేవత, మార్కండేయుడు.

దుర్బలత్వే, దేహకార్శ్యే, కౌతుకే(చ), కృశే = బలహీనత, దేహం సన్నగిలటం, సంతోషం, చిక్కిపోవటం — అనే అర్థము లందు; సమ్మతః = (ఈ హస్తం) అంగీకరించబడినది.

తాత్పర్యం : రెండు శుకతుండ హస్తాలు వక్షమునకు ఎదురుగా అధోముఖంగా ఉంటే అది అవహిత్థ హస్తం అవుతుంది. అధిదేవత మార్కండేయుడు.

బలహీనత, దేహం సన్నగిలటం, సంతోషం, చిక్కిపోవటం- ఈ అర్థములందు అవహిత్థహస్తం తగును.

టీక : మొదటి పాదమందలి నిర్వచనం నాట్యశాస్త్రమందలి నిర్వచనంతో సంవదిస్తున్నది.

ఏవం సంయుతహస్తానాం నామలక్షణ మీరితమ్ ।

అర్థం : ఏవం = ఈ(= పైనిచెప్పిన) విధంగా ; సంయుత హస్తానాం = సంయుత హస్తాలయొక్క ; నామ-లక్షణం, ఈరితమ్ = పేర్లు, లక్షణాలు చెప్పబడినవి.

తాత్పర్యం : ఇంతవరకు (ఇరవైనాలుగు) సంయుత హస్తాల పేర్లు, నిర్వచనాలు, వినియోగాలు చెప్పబడినవి.

టీక : ఈ పాదం ఘోష్ పాఠంలో లేదు.

# 8
# గ్రంథాంతర సంయుత హస్తాలు

## 1. గజదంత హస్తం :




బాహూమధ్యగతౌ సర్పశీర్షౌ స్వస్తికతా
మితౌ ॥ 501

యది స్యా ద్గజదంతో౽యం
పరమాత్మా౽ధిదేవతా।

స్తంభగ్రహే శిలోత్పాటే భారగ్రాహే
నియుజ్యతే॥ 502

అర్థం: సర్పశీర్షౌ = రెండు సర్పశీర్ష హస్తాలు ; బాహుమధ్య గతౌ = బాహుమధ్యమును పొందినవి (బాహుమధ్య మందున్నవి) ; స్వస్తికతాం ఇతౌ = స్వస్తికత్వాన్ని పొందినవి ; యది స్యాత్ = అయితే; అయం, గజదంతః = అది 'గజదంత (హస్త)ం' (అవు తుంది) ; ౽ధిదేవతా, పరమాత్మా = అధిదేవత, పరమాత్మ.

ఈ హస్తం - స్తంభగ్రహే = స్తంభమును గ్రహించటం; శిల-ఉత్పాటే = రాతిని పెల్లగించటం; భారగ్రాహే = బరువును మోయటం – అనే అర్థములందు ; నియుజ్యతే = నియుక్తమవు తున్నది.

తాత్పర్యం : రెండు సర్పశీర్ష హస్తాలు బాహుమధ్య మందు స్వస్తికత్వం పొందితే అది 'గజదంత హస్తం' అవుతుంది. దీనికి అధి దేవత పరమాత్మ.

స్తంభాన్ని గ్రహించటం, రాతిని పెల్లగించటం, బరువును మోయటం — అనే అర్థములందు ఈ హస్తం వినియోగపడుతుంది.

టీక : 'జగదంత హస్తం' అని నీడా పాఠం. కాని 'గజ దంతం' అని— కుమారస్వామి ఆంగ్లానువాదం. ఈ పేరుతోనే ఇంకొక నిర్వచనం తరువాత వస్తుంది. "గ్రంథాంతరే అసంయుత హస్తాః" అంటూ చెప్పిన అధికహస్తాలలో ఇది మొదటి వర్గం. ఈ మొదటి వర్గంలో 25 హస్తాలు ఉన్నాయి - నాట్యశాస్త్రంలోని 13 సంయుత హస్తాలలో 11 వ హస్తం 'గజదంత హస్తం'; ఆ గజదంత హస్తం, ఇదీ ఒక్కటే. ఈ గ్రంథాంతర హస్తాలలో 27 వ హస్తం కూడా గజదంత హస్తమే, కాని, అది దీని కంటె భిన్నమైంది. నాట్యశాస్త్రంలో సంయుత-అసంయుత హస్తాలు మాత్రమే కాక కేవలం నృత్తానికి ఉపయోగించే 30 నృత్తహస్తాలుకూడా నిర్వచింప బడినవి. ఇవి కేవలం నృత్తానికి ఉపయోగించేవి కాబట్టి వీటికి విని యోగాలు చెప్పబడలేదు. కాని, ఈ గ్రంథాంతర హస్తాలకు కొన్నింటికి అధిదేవతలు, వినియోగాలు కూడా చెప్పబడినవి.

'గ్రంథాంతరస్థములు' అంటూ నీడా మంగళం వారు అభినయ దర్పణం తెలుగు ముద్రణలో చేర్చిన రెండువర్గాల హస్తాలు మొత్తం 52 (25+27). వీటిల్లో చాలావరకు భరతుడు చెప్పిన నృత్త హస్తాలే. భరతముని నృత్త హస్తాలను బహువచనంలో చెప్పగా, ఇచ్చట ఏకవచనంలోనే ఉన్నవి.

ఇతర గ్రంథాల నుంచి ఉద్ధరించిన రెండు వర్గాలలోను పదకొండు పేర్లు సమానంగా ఉన్నవి. మొదటి వర్గంలోని తక్కిన 14 పేర్లు రెండవ వర్గంలో లేవు. అట్లాగే రెండవ వర్గంలో ఉన్న 14 పేర్లు మొదటి వర్గంలో లేవు — ద్విరద, సంయమ, ముద్రా, అజా ముఖ, అర్ధముకుళ, కుళల, తిలక, జ్ఞాన, రేఖా, వైష్ణవ, బ్రహ్మోక్త శుకతుండ, ఖండచతుర, అర్ధచతుర, లీనముద్రా హస్తాలు.

నామసామ్యాలను చూపే పట్టికను, చదువరుల సౌలభ్యార్థం క్రింద ఇస్తున్నాను. నిర్వచనాలు ఒక్కటే కావటం, భేదించటం, దగ్గరగా ఉండటం మొదలయిన అంశాలను ఆయా హస్తాల క్రింద టీకలలో వివరించాను.

## గ్రంథాంతర సంయుత హస్తాలు

| 1 వ వర్గం | 2 వ వర్గం | తె.నా.శా.లో | (పుట) |
|---|---|---|---|
| 1. గజదంత | 27. గజదంత | గజదంత | 307 |
| 2. చతురశ్ర | | చతురశ్రములు | 312 |
| 3. తలముఖ | 28. తాలముఖ | తలముఖములు | 312 |
| 4. స్వస్తికాముఖ | | స్వస్తికములు | 314 |
| 5. ఆవిద్ధవక్ర | | ఆవిద్ధవక్రములు | 313 |
| 6. రేచిత | 40. రేచిత | రేచితములు | 313 |
| 7. నితంబ | 31. నితంబ | నితంబములు | 313 |
| 8. లత | | లతలు | 313 |
| 9. పక్షవంచిత | 42. పక్షవంచిత | పక్షవంచితములు | 313 |
| 10. పక్షప్రద్యోత | | పక్షప్రద్యోతములు | 313 |
| 11. గరుడపక్ష | | గరుడపక్షములు | 314 |
| 12. నిషేధ | | నిషధము | 306 |
| 13. మకర | | మకరము | 307 |
| 14. వర్ధమాన | 45. వర్ధమాన | వర్ధమానము | 307 |
| 15. ఉద్వృత్త | 35. ఉద్వృత | ఉద్వృత్తములు | 312 |
| 16. విప్రకీర్ణ | 26. విప్రకీర్ణ | విప్రకీర్ణములు | 312 |
| 17. అరాళకటకాముఖ | | అరాళకటకాముఖములు | 312 |

| | | | |
|---|---|---|---|
| 18. సూచ్యాస్య | 29. సూచీవిద్ధ | సూచీముఖములు | 313 |
| 19. అర్ధరేచిత | | అర్ధరేచితములు | 313 |
| 20. కేశబంధ | 32. కేశబంధ | కేశబంధములు | 313 |
| 21. ముష్టికస్వస్తిక | | ముష్టికస్వస్తికములు | 314 |
| 22. నళినీపద్మకోశ | | నళినీపద్మకోశములు | 314 |
| 23. ఉద్వేష్టితాలపద్మ | | ఆలపల్లవములు | 314 |
| 24. ఉల్బణ | | ఉల్బణములు | 314 |
| 25. లాలిత | 33. లత | లలితములు | 314 |

## 2. చతురశ్ర హస్తం :

చతురశ్రః స్మృతో వక్షః పురోగౌ కటకాముఖౌ ।
తస్యాఽధిదైవం వారాహీ కీర్తితా భావకోవిదైః ॥ 503
నియోగో దధిమంథానే జక్కిణీనటనే ఽపి చ ।
ధారణే దోహనవిధౌ పటానామవకుంఠనే ॥ 504
వహనే మౌక్తికాదీనాం రజ్వాదీనాం చ కర్షణే ।
నీవీబంధే చోళబంధే సుమాదీనాం చ ధారణే ॥ 505
వీజనే చామరాదీనాం చతురశ్రో నియుజ్యతే ।

అర్థం : కటకాముఖౌ = కటకాముఖ హస్తాలు (రెండు); వక్షః పురోగౌ = వక్షమునకు ఎదురుగా ఉన్నవి (అయితే ; చతురశ్రః స్మృతః = చతురశ్రహస్తం అని స్మరింపబడింది; తస్య అధిదైవం, వారాహీ = దీని (= ఈ హస్తం) యొక్క అధిదేవత, వారాహి (అని); భావకోవిదైః కీర్తితా = భావాలు తెలిసిన వారిచేత, కీర్తింపబడినది.

నియోగః = వినియోగం(= ఈ హస్తం క్రిందివిధంగా వినియోగపడుతుంది)-దధిమంథానే,జక్కిణీ నటనే(అపి) (చ) = పెరుగు చిలుకటం, జక్కిణి అనే నటనం; ధారణే = ధరించటం, పటానాం

అవకుంఠనే, దోహనవిధౌ = వస్త్రం కప్పుకొనటం, పాలు పిదుకటం; మౌక్తికాదీనాంవహనే, రజ్జు-ఆదీనాం (చ) కర్షణే = ముత్యాలు మొదలగువానిని ధరించటం, తాడు మొదలగువానిని లాగటం; నీవీబంధే = పోకముడి వేయటం; చోళబంధే = రవిక ముడి వేయటం; సుమాదీనాం(చ) ధారణే = పువ్వులు మొదలగు వానిని ధరించటం; చామరాదీనాం వీజనే = వింజామరం మొదలగు వాటిని వీచటం - ఈ అర్థాలను నిరూపించటంలో; చతురశ్రః నియుజ్యతే = చతురశ్రహస్తం వినియోగపడుతున్నది.

తాత్పర్యం : రెండు కటకాముఖ హస్తాలను వక్షానికి ఎదురుగా పడితే చతురశ్ర హస్తం ఏర్పడుతుంది. దీని అధిదేవత వారాహి అని భావకోవిదులు చెప్పినారు.

పెరుగుచిలకటం, జక్కిణి నటనం, ధరించటం, పాలుపిదుకటం, వస్త్రం కప్పుకొనటం, ముత్యాలు మొదలగువాటిని ధరించటం, త్రాడు మొదలగువాటిని లాగటం, పోకముడి వేయటం, రవికెముడి వేయటం, పువ్వులు మొదలగువాటిని ధరించటం, వింజామరం మొదలగువాటిని వీచటం — ఈ అర్థములందు చతురశ్ర హస్తం వినియోగపడుతున్నది.

టీక : ఇది భరతముని చెప్పిన 'చతురశ్రములు' అనే ప్రథమ నృత్తహస్తమే. కాని, భరతముని చాలా వివరంగా చెప్పినాడు — "కూర్పర-అంసములు సమానంగా ఉండేటట్లుచేసి, వక్షానికి ఎదురుగా ఎనిమిది అంగుళాల దూరంలో ప్రాఙ్ముఖంగా రెండు కటకాముఖ హస్తాలను ఉంచితే అవి 'చతురశ్ర హస్తాలు' అవుతాయి" (తె.నా.శా. పుట 812).

## 3. తలముఖ హస్తం :

వక్షః పురస్తా దుద్వృత్తౌ కరౌ త్వభిముఖౌ యది ॥ 506
నామ్నా తలముఖ స్తస్య విఘ్నరాజో ఒధిదేవతా ।
ఆలింగనే స్థూలవస్త్వో మహాస్తంభాది భావనే ॥ 507
ఋద్ధై రభిహితో మంజుమర్దళే మధురస్వనే ।

అర్థం : వక్షఃపురస్తాత్ = వక్షమునకు ముందు; కరౌ = హస్తాలు; అభిముఖౌ ఉద్వృత్తౌయది = ఒండొంటికి అభిముఖంగా మీదికి త్రిప్పబడినవి - అయితే; తలముఖఃనామ్నా = 'తలముఖ హస్తం' అనే పేరుగలది (అవుతుంది); తస్య, అధిదేవతా, విఘ్నరాజః = దీని యొక్క, అధిదేవత, విఘ్నరాజు.

(ఈ హస్తం) - ఆలింగనే = ఆలింగనం చేయటం; స్థూల వస్త్వా = పెద్ద వస్తువులు; మహోస్తంభ-ఆది భావనే = గొప్ప స్తంభాలు మొదలగు వాటిని భావించటం (= చూపటం); మధురస్వనే, మంజు మర్దళే = మధురస్వనం, మనోజ్ఞమైన మద్దెల వాదనం; — ఈ అర్థాలను నిరూపించటంలో ; బుధైః, ఈరితః = (ఈ హస్తం) విద్వాంసుల చేత చెప్పబడినది.

తాత్పర్యం : రెండు హస్తాలు వక్షమునకు ముందు ఒండొంటికి అభిముఖంగా మీదికి త్రిప్పబడితే 'తలముఖ హస్తం' ఏర్పడుతుంది. అధిదేవత విఘ్నరాజు.

ఆలింగనం చేయటం, పెద్ద వస్తువులు, గొప్ప స్తంభం మొదలగు వాటిని భావించటం, మధుర స్వనం, మనోజ్ఞమైన మద్దెల వాదనం — ఈ అర్థములందు తలముఖ హస్తం ప్రయోగింపదగినదని విద్వాంసులు చెప్పినారు.

టీక : భరతముని కూడా ఈ నృత్త హస్తాన్ని చెప్పినాడు. కాని, ఇక్కడ 'హస్తాలు' అని మాత్రమే ఉండగా, అక్కడ చతురశ్ర హస్తాలు చెప్పబడినవి. నీడా వారు మాత్రం 'పతాక' హస్తాలు అన్నారు.

## 4. స్వస్తికాముఖ హస్తం :

త్రిపతాకౌ వామభాగే యది స్వస్తికతాం గతౌ ॥ 508

స భవేత్ స్వస్తికాహస్తో గుహ స్తస్యాధిదేవతా ।
కల్పద్రుమేషు శైలేషు హస్తోఽయం నియుజ్యతే ॥ 509

అర్థం : త్రిపతాకౌ = రెండు త్రిపతాక హస్తాలు ; వామ భాగే = వామపార్శ్వంలో ; స్వస్తికతాంగతౌయది = స్వస్తికత్వం పొందినవి, అయితే ; సః స్వస్తిక హస్తః భవేత్ = అది, స్వస్తిక హస్తం అవుతుంది ; తస్య, అధిదేవతా, గుహః = దానికి, అధిదేవత, గుహుడు.

కల్పద్రుమేషు, శైలేషు = కల్పవృక్షాలు, పర్వతాలు - అనే అర్థములందు ; అయం హస్తః, నియుజ్యతే = ఈ హస్తం, నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : రెండు త్రిపతాక హస్తాలు వామ భాగమందు స్వస్తికంగా ఉంటే, అది స్వస్తికాముఖ హస్తం అవుతుంది. అధి దేవత గుహుడు.

కల్ప వృక్షాలు, పర్వతాలు అనే అర్థములందు స్వస్తికాముఖ హస్తం వినియోగపడుతుంది.

టీక : భరతముని చెప్పిన 'స్వస్తికములు' అనే నృత్త హస్తానికి ఇది దగ్గరగా ఉంది.

## 5. ఆవిద్ధ వక్ర హస్తం :

పతాకహస్తౌ వ్యావృత్తౌ సవిలాసం సకూర్పరమ్ ।

అసౌ వావిద్ధవక్రః స్యాత్ తుంబురు స్త్వధిదేవతా ॥ 510

మేఖలావహనే భేదే మధ్యకార్శ్యనిరూపణే ।

దేశీయనాట్యనటనే వినియోగం తయోర్విదుః ॥ 511

అర్థం : పతాక హస్తౌ, సకూర్పరమ్, సవిలాసం, వ్యావృత్తౌ = రెండు పతాక హస్తాలు, మోచేతులతో కూడా, సవిలాసంగా, వ్యావృత్తములు (= వెనుకకు త్రిప్పబడినవి) అయితే; అసౌ, ఆవిద్ధవక్రః, స్యాత్ = అది, 'ఆవిద్ధవక్ర (హస్త)ం' అవుతుంది ; తుంబురుః (తు), అధిదేవతా = (ఈ హస్తానికి) అధిదేవత, తుంబురుడు.

మేఖలావహనే, భేదే, మధ్యకార్శ్య నిరూపణే, దేశీయ నాట్య నటనే = మేఖలను ధరించటం, భేదం, నడుము యొక్క సన్నదనం తెలుపటం, దేశీయ నాట్యం - వీటియందు ; తయోః, వినియోగం, విదుః = ఈ హస్తం యొక్క వినియోగాన్ని తెలిసికొందురు.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు మోచేతులతోసహా, సమానంగా వ్యావృత్తములు అయితే, అది ఆవిద్ధవక్ర హస్తం అవుతుంది. అధిదేవత తంబురుడు.

మేఖలను ధరించటం, నడుము యొక్క సన్నదనం తెలుపటం, దేశీయ నాట్యం అనే అర్థములందు ఇది వినియోగపడుతుంది.

టీక : భరతముని చెప్పిన ఆవిద్ధవక్రములు లేదా ఆవిద్ధ వక్త్రిములు అనే నృత్త హస్తం, ఇదీ ఇంచుమించుగా ఒక్కటే.

## 6. రేచిత హస్తం :

హంసపక్షౌ కృతోత్తానతలా వగ్రధృతౌ యది ।
రేచితః స కరోజ్ఞేయో యక్షరా డధిదేవతా ॥ 512

శిశూనాంధారణే చిత్రఫలకస్య నిరూపణే ।
వినియోగో రేచితస్య ఏవమాదిషు యుజ్యతే ॥ 513

అర్థం: హంసపక్షౌ, కృత-ఉత్తానతలౌ-అగ్రధృతౌ, యది = రెండు హంసపక్ష హస్తాలు ఉత్తానతలములు (=పైకి పట్టిన అరచేతులు కలది), అగ్రధృతములు (ఎత్తుగా పట్టినవి) అయితే ; సః కరః, రేచితః, జ్ఞేయః = ఆ హస్తం, 'రేచిత (హస్త)ం' (అని) తెలియదగినది ; అధిదేవతా, యక్షరాట్ = అధిదేవత, యక్షరాజు.

శిశూనాంధారణే, చిత్రఫలకస్య నిరూపణే, ఏవమాదిషు = బిడ్డలను ఎత్తుకోవటం, చిత్రఫలకాన్ని చూపటం, ఇంకా ఇటువంటి వాటియందు; రేచితస్య, వినియోగః, యుజ్యతే = రేచిత (హస్త)ం యొక్క, వినియోగం, తగును.

తాత్పర్యం : రెండు హంసపక్ష హస్తాలను అరచేతులు పైకి ఉండునట్లుగా ఎత్తిపడితే, అది 'రేచిత హస్తం' అవుతుంది. అధిదేవత యక్షరాజు.

బిడ్డలను ఎత్తుకొనటం, చిత్ర ఫలకమును ఎత్తి చూపటం, ఇంకా ఇటువంటి వాటియందు రేచిత హస్తం తగును.

టీక : భరతముని చెప్పిన 'రేచితములు' అనే నృత్తహస్తం, ఇదీ ఒక్కటే.

## 7. నితంబ హస్తం :

ఉత్తానితా వధోవక్త్రౌ పతాకా వంసదేశతః ।
నితంబస్థౌ నితంబాఖ్యో అగస్త్య స్త్వస్యదేవతా ॥ 514

శ్రమే ఒవతరణే చైవ విస్మయే వివశాయితే ।
ఏవమాదిషు యుజ్యేత నితంబాఖ్యకరః స్మృతః ॥ 515

అర్థం : ఉత్తానితౌ పతాకౌ, అంధోవక్త్రౌ, అసందేశతః నితంబస్థౌ = వెల్లకిలగా ఉన్న, రెండు పతాకహస్తాలు, మూపులు మొదలుకొని క్రిందు మొగంగా పిరుదులను తాకుతూఉంటే; నితంబ-ఆఖ్యః = నితంబహస్తం అనే పేరుగలది (అవుతుంది); అస్యదేవతా(తు), అగస్త్యః = దానియొక్క, అధిదేవత, అగస్త్యుడు.

శ్రమే, అవతరణే(చ) (ఏవ), విస్మయే, వివశాయితే, ఏవమాదిషు = బడలిక, క్రిందకు దిగటం, విస్మయం, పరవశత్వం, ఇంకా ఇటువంటి వాటియందు; నితంబ-ఆఖ్యకరః, యుజ్యేత, స్మృతః = నితంబం అనే పేరుగల హస్తాన్ని, ప్రయోగించవలెను (అని) చెప్పబడినది.

తాత్పర్యం : పైకి ఎత్తబడిన రెండు పతాక హస్తాలు క్రిందు మొగములుగా పిరుదుల వరకు ప్రసారితములైతే అది నితంబహస్తం అవుతుంది. అధిదేవత అగస్త్యుడు.

బడలిక, క్రిందకు దిగటం, విస్మయం, పరవశత్వం ఇంకా ఇటువంటివాటియందు నితంబహస్తం చెల్లుతుంది.

టీక : భరతముని చెప్పిన 'నితంబములు' అనే నృత్తహస్తం, ఇదీ ఒక్కటే.

## 8. లతాహస్తం :

పతాకౌ డోలికాకరౌ లతాఖ్యః శక్తిదేవతః ।

ఏతస్య వినియోగ శ్చ నిశ్చేష్టాయాం మదాలసే ॥ 516

స్వభావనటనారంభే రేఖాయాం యోగభావనే ।

ఏవమాదిషు యుజ్యేత లతాహస్తవిభావనా ॥ 517

అర్థం : పతాకౌ, డోలిక-ఆకారౌ, లతా-ఆఖ్యః = రెండు పతాకహస్తాలు డోలిక (= ఊయెల) ఆకారంగా ఉంటే (అది), లతా హస్తం అనే పేరుగలది (అవుతుంది); దేవతః శక్తిః = (దీనికి) అధి దేవత శక్తి.

ఏతస్య వినియోగః(చ) = (ఇంక) దీనియొక్క వినియోగం- నిశ్చేష్టాయాం, మద-అలసే, స్వభావనటన ఆరంభే, రేఖాయాం, యోగభావనే, ఏవమాదిషు = చేష్టలేకుండటం, మదంవలని అలసత, స్వభావనటన ప్రారంభం, రేఖ, యోగభావన, ఇంకా ఇటువంటి అర్థములందు; లతాహస్త విభావనా = లతాహస్త విభావన; యుజ్యేత = యోజింపదగును.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు డోలిక ఆకారంగా ఉంటే అది లతాహస్తం అవుతుంది, అధిదేవత శక్తి.

చేష్టలేకుండటం, మదంవలన అలసత, స్వభావనటన ప్రారంభం, రేఖ, యోగభావన, ఇంకా ఇటువంటివాటియందు లతాహస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : భరతముని చెప్పిన 'లతలు' అనే నృత్తహస్తం, ఇదీ ఇంచుమించుగా ఒక్కటే.

## 9. పక్షవంచిత హస్తం :

విన్యస్యాగ్రే కటీశీర్షే త్రిపతాకకరౌ యది ।
పక్షవంచితనామానావనయో ర్దేవతార్జునః ॥ 518
ఊర్వోరభినయే భేదే వినియోగో నియుజ్యతే ।

అర్థం: త్రిపతాకకరౌ, కటీశీర్షే-అగ్రే, విన్యస్య యది = రెండు త్రిపతాక హస్తాలను, కటి(నడుము) మీద, శిరస్సుమీద ఉంచితే; పక్షవంచిత నామానౌ = పక్షవంచిత హస్తాలు అనే పేరుగలవి (అవుతాయి); అనయోః, దేవతా, అర్జునః = వీటికి, అధిదేవత, అర్జునుడు.

ఊర్వోః- అభినయే, భేదే, వినియోగః, నియుజ్యతే = ఊరువుల అభినయమందు, భేదమందు వీటి వినియోగం తగును.

తాత్పర్యం : రెండు త్రిపతాక హస్తాలను కటిమీద, శిరస్సు మీద ఉంచితే అది పక్షవంచిత హస్తం అవుతుంది. అధిదేవత అర్జునుడు.

ఊరువుల అభినయమందు, భేదమందు ఈ హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : భరతముని చెప్పిన 'పక్షవంచితకములు' అనే నృత్త హస్తం, ఇదీ ఇంచుమించుగా ఒక్కటే. అయితే ఒక త్రిపతాక హస్తం కటిమీద, ఇంకో త్రిపతాక హస్తం తలమీద ఉండాలని భరతముని స్పష్టంగా చెప్పినాడు.

## 10. పక్షప్రద్యోత హస్తం :

ఉత్తానితౌ విమౌ పక్షప్రద్యోతః సిద్ధదేవతః ॥ 519
నిరుత్సాహే బుద్ధిజాడ్యే విపరీతనిరూపణే ।
మాయావరాహే కుండాభినయాదిషు భవే దసౌ ॥ 520

అర్థం : ఇమౌ ఉత్తానితౌ = ఈ పక్షవంచిత హస్తాలు కటీ-శీర్షములందే ఉత్తానితములు (= ఊర్ధ్వముఖములు = పైకి ఎత్తబడినవి) (అయితే); పక్షప్రద్యోతః = పక్షప్రద్యోత (హస్త)ం (ఏర్పడుతుంది); దేవతః, సిద్ధః = అధిదేవత సిద్ధుడు.

అసౌ నిరుత్సాహే, బుద్ధిజాడ్యే, విపరీత నిరూపణే, మాయా వరాహే, కుండ-అభినయ-ఆదిషు, భవేత్ = ఇవి (= ఈ హస్తాలు) నిరుత్సాహం, బుద్ధిమాంద్యం, విపరీతాన్ని నిరూపించటం, మాయా వరాహం, కుండాభినయం మొదలగువాటియందు (ప్రయుక్తం) అవుతుంది.

తాత్పర్యం : పక్షవంచిత హస్తాలు కటీ- శీర్షములందే పైకి ఎత్తబడితే అది 'పక్ష ప్రద్యోత హస్తం' అవుతుంది. అధిదేవత సిద్ధుడు.

నిరుత్సాహం, బుద్ధిమాంద్యం, విపరీతమును నిరూపించటం, మాయావరాహం, కుండాభినయం మొదలైనవి — ఈ అర్థములందు ఈ హస్తం తగును.

టీక : పక్షవంచితక హస్తాలు విపర్యయం అయితే, అవి 'పక్ష ప్రద్యోతక హస్తాలు' అనే నృత్తహస్తం అవుతుందని భరతముని చెప్పినాడు.

## 11. గరుడపక్ష హస్తం :

అర్ధచంద్రౌ కటీపార్శ్వే న్యస్తోర్ధ్వంసారితౌ యది ।
స్యాతాం గరుడపక్షాఖ్యౌ తయో రీశః సనందనః ॥ 521

కటిసూత్రే ఒధికే చైవ ఏవమాదిషు యుజ్యతే ।

అర్థం : కటీ పార్శ్వే, అర్ధచంద్రౌ, న్యస్య, ఊర్ధ్వంసారితౌ, యది = కటీపార్శ్వములందు, రెండు అర్ధచంద్ర హస్తాలను ఉంచి, పైకి చాపితే ; గరుడపక్షాఖ్యౌ, స్యాతాం = గరుడ పక్షాలు అనే

పేరుగలవి, అవుతాయి ; తయోః, ఈశః, సనందనః = వీటికి, అధి దేవత, సనందనుడు.

కటిసూత్రే, అధికే (చ) (ఏవ), ఏవం-ఆదిషు, యుజ్యతే = మొలనూలు, అధికం, ఈ మొదలైన వాటియందు (ఈ హస్తం) తగును.

తాత్పర్యం : రెండు అర్ధచంద్ర హస్తాలను నడుమువకు రెండు ప్రక్కల ఉంచి (తరువాత) పైకిచాపితే, అది 'గరుడపక్ష హస్తం' అవుతుంది. సనందనుడు అధిదేవత.

మొలనూలు, అధికం మొదలైన అర్థములందు ఈ హస్తం ప్రయుక్తమవుతుంది.

టీక : పతాకవంచితక హస్తాలు నితంబాల మీదపడి, వెంటనే పైకిలేస్తే అవి 'గరుడ పక్ష హస్తాలు' అవుతాయని భరతముని.

## 12. నిషేధ హస్తం :




కపిత్థాఖ్యేన హస్తేన వేష్టితో ముకుళో యది ॥ 522
నిషేధో నామ చ భవేత్ తుంబురుస్త్వధిదేవతా ।

సిద్ధాంతస్థాపనే సత్యే నూనమిత్యభిభాషణే ॥ 523
చూచుకగ్రహణే లింగపూజాయాం వినియుజ్యతే ।

అర్థం : కపిత్థ-ఆఖ్యేన హస్తేన, ముకుళః, వేష్టితః, యది = కపిత్థం అనే పేరుగల హస్తం చేత, ముకుళ హస్తం చుట్టబడితే ; నిషేధః నామ (చ), భవేత్ = నిషేధం అనే పేరుగలది అవుతుంది ; అధిదేవతా (తు), తుంబురుః = అధిదేవత, తుంబురుడు.

సిద్ధాంత స్థాపనే, సత్యే, నూనమ్-ఇతి అభిభాషణే, చూచుక గ్రహణే, లింగ పూజాయాం, వినియుజ్యతే = సిద్ధాంతమును

స్థాపించటం, సత్యం, నూనమ్ ( = అవును, తప్పక) అని చెప్పటం, చనుమొనలను గ్రహించటం, లింగపూజ — వీటియందు (ఈ హస్తం) వినియోగపడుతుంది.

తాత్పర్యం : కపిత్థ హస్తం చేత ముకుళ హస్తం చుట్టబడితే అది నిషేధ హస్తం అవుతుంది. తుంబురుడు అధిదేవత.

సిద్ధాంతమును స్థాపించటం, సత్యం, అవును లేదా తప్పక అని చెప్పటం, చనుమొనలను గ్రహించటం, లింగపూజ - ఈ అర్థములందు నిషేధ హస్తం చెల్లుతుంది.

టీక : భరతముని చెప్పిన 'నిషధము' అనే 7 వ సంయుత హస్తం, ఇదీ ఒక్కటే.

## 13. మకర హస్తం :




యత్రాఽన్యోన్యం పరిగతా వర్ధచంద్రా వధోముఖౌ ॥ 524

చలాంగుష్ఠేన మకరో మహేంద్ర స్తస్య దేవతా ।

కూలంకషే నదీపూరే సింహే దైత్యే మృగాననే ॥ 525

కల్యాణే నిబిడే మంచే నక్రేచాయం నియుజ్యతే ।

అర్థం: యత్ర, అర్ధచంద్రౌ,అన్యోన్యంపరిగతౌ, అధోముఖౌ = ఎక్కడ, రెండు అర్ధచంద్ర హస్తాలు, పరస్పరం పరిగతములు ( = కలిసినవి), అధోముఖములు అవుతాయో ; చల - అంగుష్ఠేన, మకరః = చలించుతున్న అంగుష్ఠాలు కలవి (కూడా) కావటం చేత, మకర హస్తం (అవుతాయి) ; తస్య, దేవతా, మహేంద్రః = దాని యొక్క, అధిదేవత, మహేంద్రుడు.

కూలంకషే, నదీపూరే, సింహే, దైత్యే, మృగాననే, కల్యాణే, నిబిడే, మంచే, నక్రే, అయం నియుజ్యతే = గట్టుల నొరసి సాగుతున్న నదీ ప్రవాహం (సముద్రం, గట్టుమీదుగా ప్రవహించేది-స్వామి), సింహం, దైత్యుడు, లేడి ముఖం, బంగారం లేదా పెండ్లి, నిండుతనం లేదా నిండినది, మంచె, మొసలి — అనే అర్థములందు ఇది వినియోగపడుతుంది.

తాత్పర్యం : రెండు అర్ధచంద్ర హస్తాలు పరస్పరం కలిసినవి, అధోముఖములు, చలించుతున్న అంగుష్ఠములు కలవి అయితే, అది మకర హస్తం అవుతుంది. అధిదేవత మహేంద్రుడు.

గట్టుల నొరసి సాగుతున్న నదీప్రవాహం, సింహం, దైత్యుడు, లేడి ముఖం, బంగారం లేదా పెండ్లి, నిండుతనం లేదా నిండినది, మంచె, మొసలి — ఈ అర్థములందు మకర హస్తం చెల్లుతుంది.

టీక : భరతముని 'మకర హస్తం' అనే 10 వ సంయుత హస్తాన్ని చెప్పినాడు. రెండింటికీ కొంత పోలిక ఉంది.

## 14. వర్ధమాన హస్తం :



అధోముఖౌ హంసపక్షౌ యస్మిన్నన్యోన్య
ముస్ముఖౌ ॥ 526

స వర్ధమానో భవతి వాసుకిః తస్య
దేవతా ।

అసౌ నృసింహే తద్దిష్టౌ రక్షోవక్షో
విదారణే ॥ 527

అర్థం : యస్మిన్, అధోముఖౌ హంసపక్షౌ, అన్యోన్యం ఉన్ముఖౌ = ఎందులో, అధోముఖాలుగా ఉన్న రెండు హంసపక్ష హస్తాలు, పరస్పరం ఉన్ముఖాలుగా ఉంటాయో; సః, వర్ధమానః,

భవతి = అది వర్ధమాన (హస్త)ం అవుతుంది; తస్య, దేవతా, వాసుకిః = దాని యొక్క, అధిదేవత, వాసుకి.

అసౌ, నృసింహే, తత్ దీప్తౌ, రక్షోవక్షో విదారణే = అది (= ఆ హస్తం), నృసింహస్వామి, ఆయన తేజస్సు, ఆయన రాక్షసుని (= హిరణ్యకశిపుని) వక్షం చీల్చటం - అనే అర్థములందు (వినియోగపడుతుంది).

తాత్పర్యం : అధోముఖాలుగా ఉన్న రెండు హంసపక్ష హస్తాలు పరస్పరం ఉన్ముఖాలుగా ఉంటే అది వర్ధమాన హస్తం అవుతుంది. అధిదేవతవాసుకి.

నృసింహ స్వామి, ఆయన తేజస్సు, ఆయన హిరణ్యకశిపుని వక్షాన్ని చీల్చటం - అనే అర్థములందు వర్ధమాన హస్తం చెల్లు తుంది.

టీక : భరతముని చెప్పిన 'వర్ధమానము' అనే 13 వ సంయుత హస్తం, ఇదీ ఒక్కటే. ఇక్కడ 'ఉన్ముఖాలుగా' అని ఉంటే భరతముని 'పరాఙ్ముఖాలుగా' అని చెప్పినాడు.

## 15. ఉద్వృత్త హస్తం :

అధరోత్తరయోరేకసమయే హంసపక్షయోః ।
ఉద్వృత్త ఇతి విఖ్యాతో వాసిష్ఠోఽస్యాధిదేవతా ॥ 528

లజ్జాయా ముపమార్థే చ సంతాపే కంటకాదిషు ।
ఖేదే భయే విచారే చ ఉద్వృత్తకర ఈరితః ॥ 529

అర్థం : ఏకసమయే, హంస పక్షయోః అధర-ఉత్తరయోః = ఒకే సమయంలో, రెండు హంస పక్షాల యొక్క క్రింద మీదులు (= ఒకటి క్రిందకు, ఇంకొకటి పైకి) (అయితే అది); ఉద్వృత్తః, ఇతి, విఖ్యాతః = ఉద్వృత్త (హస్త)ం, అని, ప్రసిద్ధి చెందినది; అస్య, అధిదేవతా, వాసిష్ఠః = దాని యొక్క, అధిదేవత, వాసిష్ఠుడు.

లజ్జాయాం, ఉపమ-అర్థే (చ), సంతాపే, కంటక-ఆదిషు, ఖేదే, భయే, విచారే (చ)=సిగ్గు, సాదృశ్యం (=పోలిక), సంతాపం, ముల్లు మొదలగునవి, ఖేదం, భయం, విచారం; — వీటి అర్థాలను నిరూపించటంలో; ఉద్వృత్త కరః, ఈరితః=ఉద్వృత్త హస్తం, చెప్పబడినది.

తాత్పర్యం : ఒకే సమయంలో- రెండు హంసపక్ష హస్తాలలో ఒకటి మీదకు, ఇంకొకటి క్రిందకు చాపబడితే అది 'ఉద్వృత్త హస్తం' అవుతుంది. అధిదేవత వాసిష్ఠుడు.

సిగ్గు, పోలిక చెప్పటం, సంతాపం, ముల్లు మొదలగునవి. ఖేదం, భయం,విచారం — ఈ అర్థములందు ఉద్వృత్త హస్తం చెల్లుతుంది.

టీక : భరతముని చెప్పిన 'ఉద్వృత్తములు' అనే నృత్త హస్తం, ఇదీ ఇంచుమించుగా ఒక్కటే. అయితే ఈ హస్తాలను తాళ వృంతంవలె క్రిందుమీదులుగా ఆడించాలనీ, దీనికి 'తాళవృంతములు' అనే పేరు కూడా కలదని భరతముని చెప్పినాడు.

## 16. విప్రకీర్ణ హస్తం:

స్వస్తికః శీఘ్రవిశ్లేషాత్ విప్రకీర్ణః స ఉచ్యతే ।
దక్షిణామూర్తి రేతస్య అధిదేవః ప్రకీర్తితః ॥ 580

చేలాంచలస్య విస్రంసే స యుజ్యేత విధూననే ।

అర్థం : సః స్వస్తికః, శీఘ్రవిశ్లేషాత్, విప్రకీర్ణః, ఉచ్యతే = (ఇంతకు ముందు చెప్పబడిన) ఆ స్వస్తిక హస్తం, వేగంగా విడిపోతే, (అది) విప్రకీర్ణ హస్తం (అని), చెప్పబడుతున్నది; ఏతస్య, అధిదేవః, దక్షిణామూర్తిః, ప్రకీర్తితః=దీని (=ఈ హస్తం) యొక్క, అధి దేవత, దక్షిణామూర్తి, (అని) కీర్తింపబడినది.

చేలాంచలస్య, విస్రంసే, విధూననే, సః, యుజ్యతే=పైట జార్చటం, (పైట) తీసివేయటం — ఈ అర్థములందు ఇది ఉపయుక్త మవుతున్నది

తాత్పర్యం : స్వస్తిక హస్తం వేగంగా విడిపోతే అది విప్రకీర్ణ హస్తం అవుతుంది. అధిదేవత దక్షిణామూర్తి.

పైట జార్చటం, పైట తీసివేయటం అనే అర్థములందు ఈ హస్తం వినియోగపడుతుంది.

టీక : భరతముని చెప్పిన 'విప్రకీర్ణములు' అనే నృత్తహస్తం, ఇదీ ఒక్కటే.

## 17. అరాళకటకాముఖ హస్తం :

అరాళకటకౌ హస్తావరాళకటకాముఖః ॥ 531

ప్రాపితౌ చేత్ స్వస్తికతా మధిపోఽస్య చ వామనః ।

తాంబూలదళఖండానాం దానే చింతావిషాదయోః ॥ 532

వినియోజ్య ఇతి ప్రోక్తః అరాళకటకాముఖః ।

అర్థం : అరాళ-కటకౌ హస్తౌ, స్వస్తికతామ్, ప్రాపితౌచేత్ అరాళకటకాముఖః = అరాళ హస్తాన్ని, కటకాముఖ హస్తాన్ని, స్వస్తికతను పొందిస్తే (= స్వస్తిక ఆకారంగా ఏర్పడితే), (అది) అరాళకటకాముఖ (హస్త)ం (అవుతుంది) ; అస్య, అధిపః, వామనః = దీని (= ఈహస్తం యొక్క), అధిదేవత, వామనుడు.

తాంబూలదళ-ఖండానాం దానే, చింతా - విషాదయోః = తములపాకులను- వక్కలను ఇవ్వటం, చింత, విషాదం - అనే అర్థములందు ; అరాళకటకాముఖః, వినియోజ్యః, ఇతి, ప్రోక్తః = అరాళకటకాముఖ హస్తం, వినియోగింప దగినది, అని చెప్పబడినది.

తాత్పర్యం : ఒక అరాళ హస్తం, ఒక కటకాముఖ హస్తం, స్వస్తికత్వాన్ని పొందితే, అది కటకాముఖ హస్తం అవుతుంది. అధిపతి వామనుడు.

తములపాకులను వక్కలను ఇవ్వటం, చింత, విషాదం — అనే అర్థములందు ఈ హస్తాన్ని వినియోగించవలెను.

టీక : భరతముని చెప్పిన 'అరాలకటకాముఖము' అనే వృత్త హస్తం, దీని కంటె భిన్నంగా ఉంది.

## 18. సూచ్యాస్య హస్తం :

సూచీముఖౌ పురోదేశా ద్యుగపత్పార్శ్వగామినౌ ॥ 533

సూచ్యాస్య ఇతి విజ్ఞేయః అధిదేవో ఽస్యనారదః ।

కింకరోమీతివచనే విరహే సకలార్థకే ॥ 534

విలోకయేతివాక్యే చ సూచ్యాస్యాభినయం విదుః ।

అర్థం : సూచీముఖౌ = సూచీముఖ హస్తములు రెండున్నూ ; పురోదేశాత్, యుగపత్, పార్శ్వగామినౌ = ఎదుట నుంచి, కలిసి, ప్రక్కలకు వస్తే ; సూచ్యాస్యః, ఇతి, విజ్ఞేయః = సూచ్యాస్య (హస్త)ం అని, తెలియదగినది ; అస్య, అధిదేవః, నారదః = దీని యొక్క, అధిదేవత, నారదుడు.

కింకరోమి-ఇతివచనే, విరహే, సకల- అర్థకే, విలోకయ-ఇతి వాక్యే (చ) = ఏమి చేయుదును అని అనటం, విరహం, సమస్తం అనే అర్థం. చూడుము అని అనటం-ఈ అర్థములందు ; సూచ్యాస్య అభినయః, విదుః = సూచ్యాస్య (హస్త)ం యొక్క అభినయం (యుక్తమని) (వేత్తలు) తెలిసికొందురు.

తాత్పర్యం : రెండు సూచీముఖ హస్తాలు ఎదుటి నుంచి కలిసి ప్రక్కలకు వస్తే, అది 'సూచ్యాస్య హస్తం' అవుతుంది.

ఏమి చేయుదును అనటం, విరహం, సమస్తం అనటం, చూడుము అనటం — ఈ అర్థములందు సూచ్యాస్యహస్తం ప్రయుక్త మవుతుంది.

టీక: భరతముని చెప్పిన 'సూచీముఖములు' అనే వృత్తహస్తం దీని కంటె భిన్నంగా ఉంది.

## 19. అర్ధరేచిత హస్తం :

ఏకం త్వధోముఖం ధృత్వా తౌ హస్తౌ వథరేచితౌ ॥ 535

అర్ధరేచితనామానౌ నందికేశో ఽధిదేవతా ।

ఆవాహే చోపదాదీనాం కార్యగుప్తౌ విమౌ మతౌ ॥ 536

అర్థం : అథ రేచితౌ తౌ హస్తౌ = ఇంక, రేచిత హస్తాల లోని ; ఏకం (తు), అధోముఖం, ధృత్వా = ఒక (హంసపక్ష) హస్తాన్ని అదోముఖంగా పట్టి ; అథ = పిమ్మట ; తౌ హస్తౌ = ఆ హస్తాలను, రేచితౌ = రేచితములుగా చేస్తే ; అర్ధ రేచితనామానౌ = అర్ధరేచితాలు అనే పేరుగలవి (అవుతాయి) ; నందికేశః, అధి దేవతా = (దీనికి) నందికేశుడు, అధిదేవత.

ఆవాహే (చ), ఉపద-ఆదీనాం, కార్యగుప్తౌ, ఇమౌ మతౌ = ఆవాహనం, కానుక మొదలగునవి, కార్యాన్ని మరుగుపరచటం (అనే అర్థములందు) ఈ హస్తాలు, (చెల్లుతాయి) (అని) సిద్ధాంతం.

తాత్పర్యం : రేచిత హస్తమందలి రెండు హంసపక్ష హస్తాలలో ఒకదానిని అధోముఖం చేసి, మరల వాటిని రేచితం చేస్తే, అది, 'అర్ధరేచిత హస్తం' అవుతుంది. అధిదేవత నందికేశుడు.

ఆవాహనం, కానుక మొదలగునవి, కార్యాన్ని మరుగు పరచటం — ఈ అర్థములందు ఈ హస్తం చెల్లుతుంది.

టీక : భరతముని చెప్పిన 'అర్ధరేచితములు' అనే నృత్త హస్తం దీనికంటె భిన్నంగా ఉంది.

## 20. కేశబంధ హస్తం :

పతాకౌ స్యాత్కేశబంధః తస్య దుర్గాధిదేవతా ।

రత్నస్తంభే కేశబంధే కపోలాదిషు యుజ్యతే । 537

అర్థం : పతాకౌ, కేశబంధః స్యాత్ = రెండు పతాక హస్తాలు (కలిస్తే) కేశబంధ (హస్త)ం అవుతుంది;తస్య, అధిదేవతా, దుర్గా = దీని యొక్క, అధిదేవత, దుర్గ.

రత్నస్తంభే, కేశబంధే, కపోల-ఆదిషు, యుజ్యతే = రత్న స్తంభం, కొప్పు, చెక్కిళ్ళు మొదలగు అర్థములందు ఇది తగును.

తాత్పర్యం : రెండు పతాకహస్తాలు కలిసి 'కేశబంధహస్తం' అవుతుంది. అధిదేవత దుర్గ.

టీక : భరతముని చెప్పిన 'కేశబంధ హస్తములు' అనే నృత్త హస్తానికి ఇది సన్నిహితంగా ఉంది.

## 21. ముష్టిస్వస్తిక హస్తం :

ముష్టిహస్తౌ స్వస్తికతాం కుక్షిస్థానే గతౌ యది ।
ముష్టిస్వస్తికహస్తః స్యాత్ దేవః కింపురుషః స్మృతః ॥ 538

క్రీడాకందుకసంధానే ద్వంద్వయుద్ధ నిరూపణే ।
వ్రీడాభరే నీవిబంధే వినియోగోఽస్య సంమతః ॥ 539

అర్థం: కుక్షిస్థానే, ముష్టిహస్తౌ, స్వస్తికతాంగతౌ, యది = పొట్ట మీద, రెండు ముష్టి హస్తాలు, స్వస్తికత్వం పొందితే ; ముష్టి స్వస్తిక హస్తః, స్యాత్ =(అది) ముష్టిస్వస్తికహస్తం, అవుతుంది ; దేవః, కింపురుషః, స్మృతః = అధిదేవుడు, కింపురుషుడు, అని చెప్ప బడినది.

క్రీడాకందుక సంధానే, ద్వంద్వయుద్ధ నిరూపణే, వ్రీడాభరే, నీవిబంధే, అస్యవినియోగః, సంమతః = పూలచెండు గ్రుచ్చటం, ద్వంద్వ యుద్ధం, సిగ్గు బరువు, పోకముడి (అనే అర్థములందు), దీని యొక్క వినియోగం, సమ్మతించబడినది.

తాత్పర్యం : రెండు ముష్టి హస్తాలు పొట్టమీద స్వస్తికంగా ఉంటే,అది ముష్టిస్వస్తికహస్తం అవుతుంది. అధిదేవత కింపురుషుడు.

పూలచెండు గ్రుచ్చటం లేదా పూలచెండుతో ఆడటం, ద్వంద్వ యుద్ధం, సిగ్గు, బరువు లేదా ఎక్కువ సిగ్గు, పోకముడి — ఈ అర్థములందు ఈ హస్తం తగును.

టీక : భరతముని చెప్పిన 'ముష్టిక స్వస్తికములు' అనే నృత్త హస్తం దీనికంటె కొంత భిన్నంగా ఉంది.

## 22. నళినీపద్మకోశ హస్తం :

వ్యావర్తితౌ పద్మకోశౌ యది స్వస్తికతాం గతౌ ।
నళినీపద్మకోశాఖ్యో భవేత్ శేషోఽధిదేవతా ॥ 540

నాగబంధే చ ముకుళే సమయోః దానకర్మణి ।
స్తబకే దశసంఖ్యాయాం గండభేరుండకే మతః ॥ 541

అర్థం: వ్యావర్తితౌ, పద్మకోశౌ, స్వస్తికతాం గతౌ యది = వెనుకకు త్రిప్పబడిన, రెండు పద్మకోశ హస్తాలు, స్వస్తికంగా అయితే (ఆ హస్తం) ; నళినీ పద్మకోశ- ఆఖ్యః, భవేత్ = నళినీ పద్మకోశం అనే పేరు గలది అవుతుంది ; అధిదేవతా, శేషః = (దీనికి) అధిదేవత, శేషుడు.

నాగబంధే (చ), ముకుళే, సమయోః దానకర్మణి, స్తబకే, దశసంఖ్యాయాం, గండభేరుండకే, మతః = నాగబంధం, ముకుళం (= మొగ్గ), రెండు సమభాగాలను చూపటం, పూలగుత్తి, పది సంఖ్య, గండభేరుండపక్షి - అనే అర్థములందు (ఇది) సమ్మతించబడినది.

తాత్పర్యం : వెనుకకు త్రిప్పబడిన రెండు పద్మకోశ హస్తాలు స్వస్తికంగా ఉంటే, అది 'నళినీపద్మకోశహస్తం' అవుతుంది.

నాగబంధం, మొగ్గ, రెండు సమభాగాలను చూపటం, పూలగుత్తి, పదిసంఖ్య, గండభేరుండ పక్షి — ఈ అర్థములందు ఈ హస్తం తగును.

టీక : భరతముని చెప్పిన 'నళినీ పద్మకోశములు' అనే నృత్త హస్తానికి ఇది సన్నిహితంగా ఉంది.

## 23. ఉద్వేష్టితాలపద్మ హస్తం :

ఉద్వేష్టితక్రియావంతౌ వక్షసోఽగ్రేఽలపల్లవౌ ।
ఉద్వేష్టితాలపద్మాఖ్యః శక్తి రస్యాధిదేవతా ॥ 542

ప్రాణేశే దీనవచనే స్తనయోః వికచాంబుజే ।
మోహితాస్మీతివాక్యే చ ప్రలాపస్యనిరూపణే ॥ 543
కామితార్థప్రకటనే ఏతేషు వినియుజ్యతే ।

అర్థం: వక్షసః అగ్రే, అలపల్లవౌ, ఉద్వేష్టిత క్రియావంతౌ = రొమ్మునకు ఎదురుగా, రెండు అలపల్లవ హస్తాలు, పైకి అల్లుకొంటే; ఉద్వేష్టితాలపద్మ-ఆఖ్యః = ఉద్వేష్టితాలపద్మ (హస్త)ం అనే పేరు కలది (అవుతుంది) ; అస్య, అధిదేవతా, శక్తిః = దీని యొక్క, అధి దేవత, శక్తి.

ప్రాణేశే, దీనవచనే, స్తనయోః, వికచ-అంబుజే, మోహితా-అస్మి-ఇతి వాక్యే (చ), ప్రలాపస్య నిరూపణే, కామిత-అర్థ ప్రకటనే, ఏతేషు, వినియోజ్యః = ప్రాణనాథుడు, దీనవచనం, స్తనాలు, వికసించిన కమలం, మోహితురాలను అయితిని అనే వాక్యం, ప్రలాపం నిరూపించటం, కోరికను తెలియజేయటం — అనే అర్థములందు (ఈ హస్తం) వినియోగింపదగినది.

తాత్పర్యం : రొమ్ముమీద రెండు అలపల్లవ హస్తాలు పైకి అల్లుకొంటే, అది 'ఉద్వేష్టితాలపద్మహస్తం' అవుతుంది. అధిదేవత శక్తి.

ప్రాణనాథుడు, దీనవచనం, స్తనాలు, వికసించిన కమలం, మోహితురాలను అయితిని అనటం, ప్రలాపం, కోరికను తెలియ జేయటం — ఈ అర్థములందు ఈ హస్తం వినియోగపడుతుంది.

టీక : దీనిని భరతముని చెప్పలేదు.

**24. ఉల్బణ హస్తం :**

తా నేత్రదేశగా వుల్బణాఖ్యో విఘ్నేశ దేవతః ॥ 544

స్తబకేషు విశాలేషు నేత్రేషు చ నిరూపితః ।

అర్థం: తా, నేత్రదేశగా, ఉల్బణ-అఖ్యః = అవి (= ఆ అల పల్లవ హస్తాలను) కంటికి ఎదురుగా పట్టితే, ఉల్బణం అనే పేరుగలది (అవుతుంది) ; విఘ్నేశ దేవతః = (ఇది) విఘ్నేశుడు దేవతగా కలది.

స్తబకేషు, విశాలేషు నేత్రేషు (చ), నిరూపితః = పూల గుత్తులు, విశాలములైన నేత్రాలు — ఈ అర్థాలలో (ఈ హస్తం) నిరూపితమైనది.

తాత్పర్యం : రెండు అలపల్లవ హస్తాలు కంటికి ఎదురుగా ఉంటే, అది 'ఉల్బణ హస్తం' అవుతుంది.

పూలగుత్తులు, విశాల నేత్రాలు — ఈ అర్థములందు ఈ హస్తం తగును.

టీక ; భరతముని చెప్పిన 'ఉల్బణములు' అనే నృత్త హస్తం కంటె ఇది కొంత భిన్నంగా ఉంది.

**25. లాలిత హస్తం :**

స్వస్తికాకరణా వేతా శిరోదేశేఽలపల్లవౌ ॥ 545

లాలితో గదితా వేతా దేవతా వైష్ణవీ మతా ।

ఏతస్య వినియోగ స్తు సాలే దుర్గే మహీధరే ॥ 546

అర్థం : ఏతౌ అలపల్లవౌ, శిరోదేశే, స్వస్తికాకరణే, లాలితః గదితే — ఈ అలపల్లవ హస్తాలు, శిరస్సు మీదుగా, స్వస్తికత్వం పొందితే (అది), లాలిత (హస్త)ం (అని) చెప్పబడినది; దేవతా, వైష్ణవీ, మతా = దేవత, వైష్ణవి (అని), సిద్ధాంతం.

సాలే, దుర్గే, మహీధరే, ఏతస్య వినియోగః (తు) = మద్దిచెట్టు, దుర్గం, కొండ - అనే అర్థములందు ఈ హస్తం యొక్క వినియోగం (చెల్లుతుంది).

తాత్పర్యం : రెండు అలపల్లవ హస్తాలు శిరస్సు మీద స్వస్తికంగా ఉంటే, అది 'లాలిత హస్తం' అవుతుంది. అధిదేవత వైష్ణవి.

మద్దిచెట్టు, దుర్గం, కొండ - ఈ అర్థములందు లాలిత-హస్తం వినియోగపడుతుంది.

టీక : భరతముని చెప్పిన 'లలితములు' అనే నృత్త హస్తం, ఇదీ ఒక్కటే. అయితే ఇందులో హస్తాలు స్వస్తికంగా ఉండాలని స్పష్టంగా చెప్పబడింది.

## 26. విప్రకీర్ణ హస్తం :

హస్తౌ తు త్రిపతాకాఖ్యౌ తిర్యక్కూర్పర సంయుతౌ ।
కథ్యతే విప్రకీర్ణోఽయం హస్తో నాట్యవిశారదైః ॥ 547

కవచే చ కరన్యాసే మంత్రావాహే క్షమాగుణే ।
విచారే చ ప్రయోక్తవ్యో విప్రకీర్ణ ఇతీరితః ॥ 548

అర్థం : త్రిపతాక ఆఖ్యౌ హస్తౌ (తు), తిర్యక్ కూర్పర సంయుతౌ = త్రిపతాకములు అనే పేరుగల రెండు హస్తాలు, మోచేతుల వద్ద అడ్డంగా కలిస్తే ; అయం హస్తః, విప్రకీర్ణః, నాట్య శాస్త్ర విశారదైః, కథ్యతే = ఆ హస్తం, విప్రకీర్ణం (అని), నాట్య వేత్తలచేత, చెప్పబడుతున్నది.

కవచే (చ), కరన్యాసే, మంత్ర - ఆవాహే, క్షమాగుణే, విచారే (చ), విప్రకీర్ణః, ప్రయోక్తవ్యః, ఇతి, ఈరితః = కవచం, కరన్యాసం, మంత్ర ఆవాహనం, క్షమాగుణం, విచారం - అనే అర్థ ములందు విప్రకీర్ణ (హస్త)ం ప్రయోగింపదగినది, అని, చెప్ప బడినది.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు మోచేతుల వద్ద అడ్డంగా కలిస్తే అది విప్రకీర్ణ హస్తం అవుతుంది.

కవచం, కరన్యాసం, మంత్రఆవాహనం, క్షమాగుణం, విచారం — ఈ అర్థములందు విప్రకీర్ణ హస్తాన్ని ప్రయోగించవలెను.

టీక : "గ్రంథాంతరే సంయుత హస్తాః" అంటూ చెప్పిన అధికహస్తాలలో ఇక్కడనుంచి రెండవ వర్గం. ఈ వర్గంలో 27 హస్తములున్నాయి. ఇంతకుముందు చెప్పిన విప్రకీర్ణ హస్తం కంటె ఇది భిన్నంగా ఉంది.

## 27. గజదంత హస్తం :

కరాభ్యాం శిఖరౌ ధృత్వా కనిష్ఠే ప్రసృతే యది ।
గజదంతకరః ఖ్యాతః కరో భరతవేదిభిః ॥ 549

జలావగాహే ద్విరదదంతయోః భూమిమానయోః ।
శంకుస్థాపనభావేషు గజదంతో నియుజ్యతే ॥ 550

అర్థం : కరాభ్యాం, శిఖరే, ధృత్వా = రెండు చేతులతో, శిఖర హస్తాలను, పట్టి ; కనిష్ఠే, ప్రసృతే యది = చిటికెన వ్రేళ్ళు చాపబడితే ; కరః, గజదంతకరః, భరతవేదిభిః, ఖ్యాతః = (ఆ) హస్తం గజదంత హస్తం (అని), భరతవేత్తల చేత చెప్పబడినది.

జల-అవగాహనే, ద్విరద దంతయోః, భూమిమానయోః, శంకుస్థాపనభావేషు, గజదంతః, నియుజ్యతే = నీళ్ళయందు మునుగటం, ఏనుగు దంతాలు, భూమి కొలత, శంకుస్థాపన — అనే భావములందు గజదంత (హస్త)ం వినియోగపడుతుంది.

తాత్పర్యం : రెండు చేతులతో శిఖరహస్తాలను పట్టి చిటికెన వ్రేళ్ళనుచాపితే, అది గజదంతహస్తం అవుతుంది అని భరతవేత్తలు చెప్పినారు.

నీళ్ళయందు మునుగటం, ఏనుగుదంతం, భూమికోలత, శంకు స్థాపన — ఈ అర్థములందు గజదంత హస్తం వినియోగపడుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన గజదంత హస్తం కంటె ఇది భిన్నంగా ఉంది.

## 28. తాలముఖ హస్తం :

కరే పతాకనామా నావన్యోన్యాభిముఖీకృతౌ ।
చలితౌ చేత్ తాలముఖః ప్రోక్తో భరతవేదిభిః ॥ 551

భుజంగసూక్ష్మనాట్యే చ ముఖనాట్యే చ మేళనే ।
గ్రహే స్థూలపదార్థే చ తాలవక్త్రోఽభిధీయతే ॥ 552

అర్థం : పతాక నామానౌ కరౌ, అన్యోన్య-అభిముఖీకృతౌ, చలితౌ చేత్ = పతాకములు అనే పేరుగల హస్తాలు రెండు, ఎదురెదురుగా, చలించుతూ ఉంటే (అది) ; తాలముఖః, భరతవేదిభిః, ప్రోక్తః = తాలముఖ (హస్త)ం (అవుతుందని) భరతవేత్తల చేత, చెప్పబడినది.

భుజంగ సూక్ష్మనాట్యే (చ), ముఖనాట్యే (చ), మేళనే, గ్రహే, స్థూలపదార్థే (చ), తాలవక్త్రః, అభిధీయతే = భుజంగ సూక్ష్మ నాట్యం, ముఖనాట్యం, కలయిక, గ్రహించటం, లావైన పదార్థం-అనే అర్థములందు తాలవక్త్ర (= ముఖ) (హస్త)ం చెప్ప బడుతున్నది.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు ఎదురెదురుగా ఉన్నవి, చలిస్తున్నవి అయితే, అది 'తాలముఖ హస్తం' అవుతుంది.

భుజంగ . సూక్ష్మనాట్యం, ముఖనాట్యం, కలయిక, గ్రహించటం, లావుగ ఉన్న వస్తువు — ఈ అర్థములందు తాలముఖ (= తాలవక్త్ర) హస్తం వినియోగపడుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన 'తలముఖ హస్తం' తో ఇది సంవదిస్తున్నది.

## 29. సూచీవిద్ధ హస్తం :

అన్యోన్యమభిసంస్పృష్టౌ సూచీవక్త్రాభిధౌ కరౌ ।
సూచీవిద్ధకరః సోఽయం నృత్తహస్తానుసారిభిః ॥ 553

హల్లీసలీనాభినయే లగ్నార్థే మేళనే దృఢే ।
శాఖాద్వయస్య సంయోగే సూచీవిద్ధకరో భవేత్ ॥ 554

అర్థం: సూచీవక్త్ర-అభిధౌ కరౌ, అన్యోన్యమ్-అభిసంస్పృష్టౌ = సూచీముఖములు అనే పేరుగల రెండు హస్తాలు, ఎదురెదురుగా కలిస్తే ; అయం సః, సూచీవిద్ధకరః = ఈ హస్తం, సూచీవిద్ధ హస్తం (అవుతుంది); నృత్తహస్త - అనుసారిభిః = నృత్తహస్తాలను అనుసరించే (= తెలిసిన) వారిచేత (ఇట్లా చెప్పబడినది).

హల్లీస-లీన-అభినయే, లగ్న-అర్థే, దృఢే, మేళనే, శాఖా ద్వయస్య సంయోగే, సూచీవిద్ధకరః భవేత్ = హల్లీసమందు కలిసిన అభినయం (కోలాట మండలి కలగలుపు-నీడా), తగులు కొనటం అనే అర్థం, గట్టి కలయిక, రెండు కొమ్మల చేరిక — వీటి అర్థాలను రూపించటంలో సూచీవిద్ధ హస్తం వినియోగపడుతుంది.

తాత్పర్యం : రెండు సూచీముఖ హస్తాలు ఎదురెదురుగా లిస్తే అది 'సూచీవిద్ధ హస్తం' అవుతుంది.

హల్లీసమందలి అభినయం, చేరిక, గట్టితనం, రెండు కొమ్మల చేరిక - ఈ అర్థములందు సూచీవిద్ధ హస్తం చెల్లుతుంది.

టీక : ఇది నాట్యశాస్త్రంలో లేదు. ఇంతకుముందు చెప్పిన 'సూచ్యాస్య' హస్తానికి ఇది సన్నిహితంగా ఉంది.

## 30. పల్లవ హస్తం :

పతాకౌ మణిబంధే తు చలితౌ చే దధోముఖౌ ।
కరః పల్లవనామాఽయం యుజ్యతే నాట్యవేదిభిః ॥ 555

ఫలపుష్పాతిభారేణ నమ్రశాఖానులంబనే ।
నమ్రతార్థే నియోక్తవ్యః పల్లవ స్సోఽభిధీయతే ॥ 556

అర్థం : మణిబంధే (తు), పతాకౌ = మణికట్టుల వద్ద, రెండు పతాక హస్తాలు ; అధోముఖౌ చలితౌ చేత్ = అధోముఖములుగా చలిస్తున్నవి అయితే; అయం కరః = ఈ హస్తం ; నాట్యవేదిభిః, పల్లవనామా, యుజ్యతే = నాట్యవేత్తల చేత పల్లవ హస్తం అనే పేర వ్యవహృతమవుతున్నది.

ఫలపుష్ప-అతిభారేణ నమ్రశాఖ-అనులంబనే, నమ్రత-అర్థే = ఫలపుష్పముల యొక్క అతిభారం చేత వంగిన కొమ్మలు వ్రేలాడటం, వంగటం అనే అర్థాలలో ; సః పల్లవః, నియోక్తవ్యః, అభిధీయతే = ఈ పల్లవ హస్తం, నియోగింపదగినది, (అని) చెప్పబడుతున్నది.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు మణికట్టులవద్ద అధోముఖంగా, చలిస్తున్నవి అయితే, అది పల్లవ హస్తం అవుతుంది.

ఫల-పుష్పముల యొక్క అతిభారం చేత వంగిన కొమ్మలు వ్రేలాడటం, వంగటం అనే అర్థములందు పల్లవ హస్తం చెల్లుతుంది.

టీక : భరతముని చెప్పిన 'అలపల్లవములు' అనే నృత్త హస్తానికి ఇది సన్నిహితంగా ఉంది.

## 31. నితంబ హస్తం :

అంసదేశం సమారభ్య నితంబావధి చాలితౌ ।
పార్శ్వయో స్తు పతాకౌ ద్వౌ నితంబకర ఉచ్యతే ॥ 557

పరివేషే చ సూర్యేంద్వో రంగలావణ్యదర్శనే ।
ప్రాకారే దేవతానాం చ నైవత్యే భ్రమణే ఽపి చ ॥ 558
పార్శ్వసౌందర్యభావే చ నితంబాఖ్యకరో భవేత్ ।

అర్థం : పతాకౌ ద్వౌ = పతాక హస్తాలు రెండు; పార్శ్వ యోః(తు) = రెండు పార్శ్వములందు; అంసదేశం సమారభ్య, నితంబ-అవధి చాలితౌ = అంసములు (= మూపులు) మొదలుకొని, పిరుదుల పర్యంతం చలిస్తూ ఉంటే (అది); నితంబకరః, ఉచ్యతే = నితంబహస్తం (అని), చెప్పబడుతున్నది.

సూర్య-ఇంద్వోః పరివేషే(చ) = సూర్యచంద్రుల పరివేషం అనే అర్థంలో; అంగలావణ్య దర్శనే, ప్రాకారే, దేవతానాం(చ) నైపథ్యే, భ్రమణే (అపి) (చ), పార్శ్వ సౌందర్యభావే(చ) నితంబ-అఖ్యకరః, భవేత్ = చక్కదనం, ప్రాకారం, దేవతల వేషం, భ్రమణం, ప్రక్కల చక్కదనం - ఈ అర్థములందు నితంబం అనే పేరుగల హస్తం ఉపయోగపడుతుంది.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు రెండు పార్శ్వము లందు అంసములు మొదలుకొని పిరుదుల పర్యంతం చలిస్తూ ఉంటే, అది నితంబహస్తం అవుతుంది.

సూర్యచంద్రుల పరివేషం, చక్కదనం, ప్రాకారం, దేవతల వేషం, భ్రమణం, ప్రక్కల చక్కదనం - ఈ అర్థములందు నితంబ హస్తం చెల్లుతుంది.

టీక : భరతముని చెప్పిన 'నితంబములు' అనే నృత్తహస్తం, ఇంతకుముందు చెప్పిన నితంబహస్తం, ఇదీ ఒక్కటే.

## 32. కేశబంధ హస్తం :

ఏతావేవ నితంబాది కేశపర్యంతచాలితౌ ॥ 559
యది స్యాత్ కేశబంధాఖ్యకరః సమ్యక్ నిరూప్యతే ।

వృక్షద్వయే ఒధికే మేరోరర్థే బహువిభావనే ॥ 560

ఉత్తిష్ఠేతి వచోభావే యుజ్యతె కేశబంధకః ।

అర్థం : ఏతౌ ఏవ = (ఇంతకుముందు చెప్పిన) పతాక హస్తాలు; నితంబ-ఆది, కేశపర్యంత చాలితౌ, స్యాత్ యది = పిరుదులు మొదలుకొని, వెండ్రుకల వరకు చలించితే (అది); కేశబంధ-ఆఖ్యః కరః, సమ్యక్ నిరూప్యతే = కేశబంధం అనే పేరుగల హస్తం (అని), బాగుగా నిరూపింపబడుతున్నది.

వృక్షద్వయే, అధికే, మేరోః-అర్థే, బహు విభావనే, ఉత్తిష్ఠ-ఇతి వచఃభావే, కేశబంధకః, యుజ్యతే = రెండు పెద్ద చెట్లు, అధికం, మేరుపర్వతం అనే అర్థం, చాలా అనే భావం, లెమ్ము అని చెప్పటం — వీటియందు కేశబంధ హస్తం ఉపయోగపడుతుంది.

తాత్పర్యం : రెండు పతాక హస్తాలు పిరుదులు మొదలుకొని కేశముల పర్యంతం చలించితే, అది కేశబంధ హస్తం అవుతుంది.

రెండు పెద్ద చెట్లు, అధికం, మేరుపర్వతం, చాలా అనటం, లెమ్ము అనటం — ఈ అర్థములందు కేశబంధ హస్తం తగును.

టీక : ఇంతకుముందు చెప్పిన కేశబంధ హస్త నిర్వచనం కంటె ఈ నిర్వచనం స్పష్టంగా ఉంది.

## 33. లతాహస్తం :

అలపద్మౌ వగ్రభాగప్రశితౌ చలితౌ యది ॥ 561

లతాహస్తః న విజ్ఞేయః ప్రోక్తో నాట్యవిశారదైః ।

భ్రమరాభిధనాట్యే చ వాయో శ్చలితకోరకే ॥ 562

లతాయాం పుష్పితాయాం చ స్తబకాచలనేఽపి చ ।

లీలాకందుకభావే చ లతాహస్తో నియుజ్యతే ॥ 563

అర్థం : అలపద్మౌ, అగ్రభాగ ప్రశితౌ, చలితౌయది = అలపద్మ హస్తాలు రెండు, చివరిభాగంలో వంగినవి, చలిస్తున్నవి,

అయితే; సః లతాహస్తః విజ్ఞేయః = అది, లతాహస్తం(గా) బాగుగా తెలియదగినది (అని); నాట్య విశారదైః, ప్రోక్తః = నాట్యవేత్తలచేత చెప్పబడినది.

భ్రమర-అభిధనాట్యే(చ), వాయోః చలితకోరకే, పుష్పితాయాం లతాయాం(చ), స్తబకాచలనే (అపి) (చ), లీలాకందుకభావే(చ) = భ్రమరం అనే పేరుగల నాట్యం, గాలి తాకుడుచేత కదలే మొగ్గ, పూలతీగె, పూలగుత్తుల కదలిక, పూలచెండు — అనే అర్థములందు; లతాహస్తః, నియుజ్యతే = లతాహస్తం వినియోగపడుతున్నది.

తాత్పర్యం : రెండు అలపద్మ హస్తాలు చివరిభాగంలో వంగినవి, చలిస్తున్నవి అయితే, అది లతాహస్తం అవుతుంది. భ్రమర నాట్యం, గాలి తాకుడుచేత కదలే మొగ్గ, పూలతీగె, పూలగుత్తుల కదలిక, పూలచెండు — ఈ అర్థములందు లతాహస్తం వినియోగపడుతున్నది.

టీక : ఇంతకుముందు చెప్పిన లాలిత హస్తానికి ఇది సన్నిహితంగా ఉంది.

## 34. ద్విరద హస్తం

పతాకనామ్నా హస్తేన స్కంధదేశే నివేశ్య చ ।
పద్మకోశ మధోవక్త్రం దక్షిణే హస్తకే యది ॥ 564

సమౌ ధృతౌ చేత్ ద్విరదహస్తోఽయం పరికీర్తితః ।
గజస్య శుండాభినయే గజవక్త్రప్రదర్శనే ॥ 565

యుజ్యతే కరిహస్తోఽసౌ నరహస్తానుసారతః ।

అర్థం : పతాకనామ్నాహస్తేన = పతాకం అనే పేరుగల (వామ) హస్తాన్ని; స్కంధదేశే నివేశ్య(చ) = స్కంధం(= మూపు) మీద ఉంచి; అధోవక్త్రం, పద్మకోశం దక్షిణేహస్తకే (యది) = అధోముఖంగా, పద్మకోశ హస్తాన్ని, కుడిచేతితో; సమౌధృతౌచేత్ =

సమంగా ( = ఒకే కాలమందు) పడితే; అయం, ద్విరదహస్తః, పరి కీర్తితః = అది ద్విరదహస్తం (అని), కీర్తింపబడినది.

గజస్య శుండ-అభినయే, గజవక్త్రప్రదర్శనే = ఏనుగు తొండమును అభినయించటంలో, విఘ్నేశ్వరుని చూపటంలో; అసౌ కరి హస్తః, నరహస్తానుసారతః, యుజ్యతే = ఈకరి( = ద్విరద) హస్తం, నరహస్తానుసారంగా, ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : వామహస్తంచేత పతాకహస్తం పట్టి, దానిని స్కంధమందుంచి, రెండవచేత అధోముఖంగా పద్మకోశహస్తం పడితే, అది ద్విరదహస్తం అవుతుంది.

ఏనుగుతొండం, విఘ్నేశ్వరుడు- అనే అర్థములందు ద్విరద హస్తం తగును.

టీక : నాట్యశాస్త్రంలోని 'కరిహస్తములు' అనే నృత్త హస్తం ఉంది. దానికంటె ఇది భిన్నంగాఉంది.

## 35. ఉద్ధృత హస్తం :

ఉరసోఽగ్రే హంసపక్షా వన్యోన్యాభిముఖీకృతౌ ॥ 566

భవే దుద్ధృత హస్తో ఽయం వినియోగో ఽస్య కథ్యతే ।

ఆవర్తే త్వవ్యథేత్యర్థే భావనాయాం-స్వరూపకే ॥ 567

స్థిరోభవేతివచనే డోలాయాం స్థూలకే ఽపి చ ।

గృహే ఽప్యుద్ధృతహస్తోఽయం ప్రకృతార్థే నియుజ్యతే ॥ 568

అర్థం : ఉరసః- అగ్రే = రొమ్మునకు, ఎదురుగా ; హంస పక్షౌ, అన్యోన్య-అభిముఖీ కృతౌ = రెండు హంసపక్షహస్తాలు, ఎదు రెదురుగ చేరినవి (అయితే) ; అయం, ఉద్ధృత హస్తః, భవేత్ = ఇది ఉద్ధృత హస్తం, అవుతుంది ; అస్య, వినియోగః, కథ్యతే = దీని యొక్క, వినియోగం, చెప్పబడుతున్నది.

ఆవర్తే (తు), అవ్యాథా-ఇత్యర్థే, భావనాయాం, స్వరూపకే, స్థిరోభవ - ఇతివచనే, డోలాయాం, స్థూలకే (అపి) (చ), గృహే, ప్రకృత-అర్థే=నీటి సుడి, నిశ్చింత, తలపు, స్వరూపం, స్థిరుడవు కమ్మ అనటం, ఉయ్యాల, పెద్ద వస్తువు, ఇల్లు, ప్రకృతం అనే అర్థం — వీటి యందు; అయం, ఉద్వృత హస్తః, నియుజ్యతే= ఈ, ఉద్వృత హస్తం. నియుక్తమవుతున్నది.

నీటిసుడి, నిశ్చింత, తలపు, స్వరూపం, స్థిరుడవు కమ్మ అనటం, ఉయ్యాల, పెద్ద వస్తువు, ఇల్లు, ప్రకృతము అనే అర్థం — వీటియందు ఉద్వృత హస్తం వినియోగపడుతున్నది.

తాత్పర్యం : భూమ్మనకు ఎదురుగా రెండు హంసపక్ష హస్తాలు అభిముఖంగా చేరి ఉంటే, అది ఉద్వృత హస్తం అవుతుంది.

టీక : భరతముని చెప్పిన 'ఉద్వృత్తములు' అనే నృత్త హస్తం, ఇదీ ఒక్కటే. ఇంతకు ముందు చెప్పిన ఉద్వృత్త హస్తం దీనితో సంవదిస్తున్నది.

## 36. సంయమ హస్తం :

తర్జనీమధ్యమౌ హస్తతలే నమ్రీకృతౌ యది ।
ఇతరౌ ప్రసృతౌ సోఽయం కరః సంయమనామకః ॥ 569

ప్రాణాయామే మహాయోగే యుజ్యతే చాఽఽర్యభావనే ।

అర్థం : తర్జనీ మధ్యమౌ, హస్తతలే, నమ్రీకృతౌ= చూపుడు వ్రేలు నడిమి వ్రేలు, అరచేతిలోనికి, వంగినవి ; ఇతరౌ, ప్రసృతౌ, యది= తక్కిన వ్రేళ్ళు, చాపబడినవి, అయితే ; అయం సః, సంయమనామకః కరః= ఈ హస్తం, సంయమం అనే పేరుగల హస్తం (అవుతుంది).

ప్రాణాయామే, మహాయోగే,అర్చ్యభావనే (చ), యుజ్యతే= ప్రాణాయామం, యోగాభ్యాసం, పూజ్యులు అనటం - వీటియందు ఈ హస్తం తగును.

తాత్పర్యం : చూపుడు వ్రేలు నడిమివ్రేలు అరచేతిలోనికి వంగినవి, తక్కిన వ్రేళ్ళు ప్రసారితాలు అయితే అది 'సంయమ హస్తం' అవుతుంది.

ప్రాణాయామం, యోగాభ్యాసం, పూజ్యులు అనటం — ఈ అర్థములందు సంయమ హస్తం తగును.

టీక : దీనిని భరతముని చెప్పలేదు.

## 37. ముద్రా హస్తం:

కరయోః మధ్యమాంగుష్ఠే యోగా న్ముద్రాకరో భవేత్ ॥ 570

అణౌ తృణే గోముఖే చ త్రోటీపుటనిదర్శనే ।

ముద్రాహస్తో యుజ్యతేఽసౌ భరతాగమకోవిదైః ॥ 571

అర్థం : కరయోః, మధ్యమ-అంగుష్ఠే, యోగాత్ = రెండు చేతుల, నడిమి బొటన వ్రేళ్ళను, దగ్గరకు చేర్చితే; ముద్రాకరః, భవేత్ = ముద్రా హస్తం, అవుతుంది.

అణౌ, తృణే, గోముఖే (చ), త్రోటీపుట నిదర్శనే= అణువు, గడ్డిపోచ, ఆవు మోర, పక్షి ముక్కు చూపటం — అనే అర్థములందు ; అసౌ ముద్రా హస్తః, భరత - ఆగమకోవిదైః, యుజ్యతే = ఈ ముద్రా హస్తం, భరతవేదవేత్తలచేత, ఉపయుక్త మవుతున్నది.

తాత్పర్యం : రెండుచేతుల నడిమి-బొటన వ్రేళ్ళను దగ్గరకు చేర్చినచో, అది 'ముద్రా హస్తం' అవుతుంది.

అణువు, గడ్డిపోచ, ఆవు మోర, పక్షిముక్కు చూపటం—

ఈ అర్థములందు ముద్రా హస్తం తగును అని భరతవేదవేత్తలు చెప్పినారు.

టీక : ఈ హస్తాన్ని భరతముని చెప్పలేదు.

## 38. అజాముఖ హస్తం :

సింహాననాభిధకరే తర్జనీ చ కనిష్ఠికా ।
మధ్యమానామికా పృష్ఠే యోగా ద్భూయా దజాముఖః ॥ 572

అజాదికానాం వక్త్రేషు నిర్విషాణముఖేషు చ ।
గజకుంభే మల్లయుద్ధే అజావక్త్రో నియుజ్యతే ॥ 573

అర్థం : సింహ-ఆనన-అభిధకరే = సింహముఖం అనే పేరు గల హస్తంలో; తర్జనీ (చ) కనిష్ఠికా, మధ్యమ-అనామికే పృష్ఠే యోగాత్ = చూపుడు-చిటికెన వ్రేళ్ళు, నడిమి-ఉంగరపు వ్రేళ్ళ వెనుక చేరితే, (అది); అజాముఖః, భూయాత్ = అజాముఖ (హస్త)ం అవుతుంది.

అజ-ఆదికానాం వక్త్రేషు, నిర్విషాణముఖేషు (చ), గజ కుంభే, మల్లయుద్ధే = మేక మొదలగు వాటి ముఖాలు, కొమ్ములు లేని జంతువుల ముఖాలు, ఏనుగు కుంభ స్థలం, మల్లుర యుద్ధం — ఈ అర్థములయందు; అజావక్త్రః, నియుజ్యతే = అజాముఖ (హస్త)ం నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : సింహముఖ హస్తమందలి చూపుడు-చిటికెన వ్రేళ్ళను, నడిమి - ఉంగరపు వ్రేళ్ళ వెనుక చేర్చితే, అది అజాముఖ హస్తం అవుతుంది.

మేక మొదలగు వాటి ముఖాలు, కొమ్ములు లేని జంతువుల ముఖాలు, ఏనుగు కుంభస్థలం, మల్లుర యుద్ధం — ఈ అర్థములందు అజాముఖ హస్తం నియుక్తమవుతున్నది.

టీక : దీనిని భరతముని చెప్పలేదు.

## 39. అర్ధముకుళ హస్తం :

లాంగూలాఖ్యకరే సమ్యక్ కనిష్ఠా వక్రితా యది ।
ప్రోక్తో ఽర్ధముకుళాఖ్యో ఽసౌ భరతాగమవేదిభిః ॥ 574

లికుచే శీలభావే చా ప్యుచితే ఽపి కుచే ఽపి చ ।
లోభే ముకుళపద్మే చ కరణే వినియుజ్యతే ॥ 575

అర్థం : లాంగూల-ఆఖ్యకరే = లాంగూలం అనే పేరుగల హస్తంలో; కనిష్ఠా, సమ్యక్, వక్రితాయది = చిటికెనవ్రేలు, చక్కగా, వంచబడితే; అసౌ, అర్ధముకుళ- ఆఖ్యః = అది, అర్ధ ముకుళం అనే పేరుగలది (అవుతుందని); భరత-ఆగమవేదిభిః ప్రోక్తః = భరతవేదవేత్తలచేత చెప్పబడినది.

లికుచే, శీలభావే(చ), (అపి) ఉచితే, (అపి) కుచే, (అపి)(చ) లోభే, ముకుళపద్మే(చ), కరణే, వినియుజ్యతే = గజనిమ్మపండు, మంచి స్వభావం, ఉచితం (= తగినది), కుచం, లోభం, తామర మొగ్గ, ఉపకరణం (= సాధనం) — అనే అర్థములందు (ఈ అర్ధ ముకుళహస్తం) తగును.

తాత్పర్యం : లాంగూల హస్తమునందలి చిటికెనవ్రేలు చక్కగా వంచబడితే, అది అర్ధముకుళహస్తం అవుతుందని భరత వేదవేత్తలు చెప్పినారు.

గజనిమ్మపండు, మంచి స్వభావం, ఉచితం, కుచం, లోభం, తామరమొగ్గ, ఉపకరణం — ఈ అర్థములందు అర్ధముకుళ హస్తం చెల్లుతుంది.

టీక : ఈ హస్తం నాట్యశాస్త్రంలో లేదు.

## 40. రేచితహస్తం :

అలపద్మకరౌ యత్ర శ్లిష్టౌ ప్రసారితౌ ।
తత్ర ప్రయోగకుశలైః రేచితో ఽయం నిరూప్యతే ॥ 576

చారియే పార్శ్వనటనే నారికేళే ప్రలాపకే ।
సర్వ-నాట్యేషు వేళాయాం యుజ్యతే రేచితః కరః ॥ 577

అర్థం : తత్ తత్ ప్రయోగకుశలైః = ఆయా ప్రయోగాలలో నేర్పరులైనవారిచేత; యత్ర, అలపద్మకరౌ, పార్శ్వప్రసారితౌ = ఎచ్చట, అలపద్మహస్తాలు రెండు, దగ్గర చేర్చబడినవై, (తరువాత) పార్శ్వములందు చాపబడినవి (అవుతాయో); అయం, రేచితః, నిరూప్యతే = (అచ్చట) అది రేచిత హస్తం (అవుతుందని), నిరూపించబడుతున్నది.

చారియే, పార్శ్వనటనే, నారికేళే, ప్రలాపకే, సర్వనాట్యేషు వేళాయాం = చారీనాట్యం, పార్శ్వనటనం, కొబ్బరికాయ, ప్రలాపం — అనే అర్థములందు, సర్వనాట్య సమయములందు; రేచితః కరః, యుజ్యతే = రేచితహస్తం తగును.

తాత్పర్యం : రెండు అలపద్మ హస్తాలను దగ్గరకుచేర్చి, ప్రక్కలకు ప్రసారితంచేస్తే, అది రేచిత హస్తం అవుతుంది.

చారీనాట్యం, పార్శ్వనటనం, కొబ్బరికాయ, ప్రలాపం - ఈ అర్థములందు, సర్వనాట్య సమయములందు రేచిత హస్తం వినియోగపడుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన రేచిత హస్తంకంటె ఇది భిన్నంగా ఉంది.

## 41. కుశలహస్తం :

అన్యోన్యాభిముఖా వర్ధచంద్రౌ కుశలసంజ్ఞకః ।
భూదారే నయనే పూర్ణవస్తునిర్దేశభావనే ॥ 578
జలావగాహే పద్మే చ యుజ్యతే కుశలః కరః ।

అర్థం : అర్ధచంద్రౌ అన్యోన్య-అభిముఖౌ = రెండు అర్ధచంద్ర హస్తాలు పరస్పరం ఎదురు ఎదురుగా ఉంటే; కుశలసంజ్ఞకః = కుశల(హస్త)ం అనే పేరుగలది (అవుతుంది).

భూచారే, నయనే, పూర్ణవస్తు నిర్దేశభావనే, జల-అవగాహే, పద్మే(చ) — భూసంచారం, నేత్రం, నిండు వస్తువులను నిర్దేశించటం, నీళ్ళలో మునుగటం, పద్మం — ఈ అర్థములందు; కుళలః కరః, యుజ్యతే — కుళలహస్తం తగును.

తాత్పర్యం : రెండు అర్ధచంద్ర హస్తాలు పరస్పరం అభిముఖంగా ఉంటే అది కుళలహస్తం అవుతుంది.

భూ సంచారం, నేత్రం, నిండు వస్తువులను నిర్దేశించటం, నీళ్ళలో మునుగటం, పద్మం — ఈ అర్థములందు కుళలహస్తం తగును.

టీక : నాట్యశాస్త్రంలో ఈ హస్తం లేదు.

## 42. పక్షవంచిత హస్తం :

**కటిదేశగతౌ చేతౌ పక్షవంచితకో భవేత్ ॥ 579**

**పక్షిణాం పక్షభావే తు రశనాయాం నితంబకే ।**
**పక్షవంచిత హస్తో௨యం యుజ్యతే௨త్ర పురాతనైః ॥ 580**

అర్థం : ఏతౌ, కటిదేశగతౌ — అవి (— కుళల హస్తమందలి అర్ధచంద్ర హస్తాలు), కటి ప్రదేశమందుంటే; పక్షవంచితకః, భవేత్ — (అది) పక్షవంచిత (క) (హస్త)ం (అవుతుంది).

పక్షిణాం పక్షభావే (తు), రశనాయాం, నితంబకే — పక్షుల రెక్కలు, వడ్డాణం, పిరుదు — అనే అర్థములందు; అయం, పక్షవంచిత హస్తః — ఈ పక్షవంచిత హస్తం; పురాతనైః, అత్ర యుజ్యతే — ప్రాచీనుల చేత, ఈ నాట్యమందు, ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : రెండు అర్ధచంద్ర హస్తాలను రెండు ప్రక్కల కటిమీద ఉంచితే, అది 'పక్షవంచిత హస్తం' అవుతుంది.

పతుల రెక్కలు, వడ్డాణం, పిరుదు — అనే అర్థములందు ఈ హస్తం ప్రయుక్తమవుతున్నది.

టీక : ఇంతకుముందు చెప్పిన పక్షవంచిత హస్తంతో ఇది సంవదిస్తున్నది. అక్కడ త్రిపతాక హస్తాలు చెప్పగా, ఇక్కడ అర్ధ చంద్ర హస్తాలు చెప్పినారు.

## 43. తిలక హస్తం :

త్రిపతాకాభిధౌ హస్తౌ లలాటే హృదయే స్థితౌ ।
తిలకాభిధహస్తో ఒయం కీర్తితో భావవేదిభిః ॥ 581

దేవపుష్పాంజలౌ గంధవస్త్వాదిషుతిలకేషు చ ।
తిలకాభిధహస్తో ఒయం కీర్తితో భావవేదిభిః ॥ 582

అర్థం : త్రిపతాక-అభిధౌ, హస్తౌ = త్రిపతాకం అనే పేరు గల, రెండు హస్తాలు ; లలాటే, హృదయేస్థితౌ =(ఒకటి) నొసటను, (ఇంకొకటి) ఱొమ్ము మీదను ఉంచే; అయం, తిలక - అభిధ హస్తః = ఇది తిలకం అనే పేరుగల హస్తం (అవుతుందని) ; భావ వేదిభిః, కీర్తితః = భావవేత్తల చేత, కీర్తింపబడినది.

దేవపుష్పాంజలౌ, గంధవస్తు-ఆదిషు, తిలకేషు (చ) = దేవతకు ఇచ్చే పుష్పాంజలి, సువాసనగల వస్తువులు మొదలగునవి, తిలకం (= బొట్టు) — ఈ అర్థములందు; తిలక-అభిధహస్తః అయం = తిలకం అనే పేరుగల ఇది (= ఈ హస్తం) ; భావవేదిభిః, కీర్తితః = భావవేత్తల (= శాస్త్రజ్ఞుల) చేత, చెప్పబడినది.

తాత్పర్యం : రెండు త్రిపతాక హస్తాలలో ఒకటి లలాటం మీదను, ఇంకొకటి ఱొమ్ము మీదను ఉంచే, అది 'తిలక హస్తం' అవుతుంది.

దేవపుష్పాంజలి, సువాసన గల వస్తువులు మొదలగునవి, తిలకం- అనే అర్థములందు తిలకహస్త ప్రయోగాన్ని శాస్త్రజ్ఞులు చెప్పినారు.

టీక : ఈ హస్తం నాట్యశాస్త్రంలో లేదు.

## 44. ఉత్థానవంచిత హస్తం :

త్రిపతాకా వంసదేశగతా వుత్థానవంచితః ।
విష్ణోరభినయే స్తంభభావనాయాం బుధోదితః ॥ 583
ఉత్థానవంచితాభిఖ్యః సర్వనాట్యేషు కీర్తితః ।

అర్థం : అసందేశగతౌ త్రిపతాకౌ = మూపురాల (= భుజ మూలముల)మీద చేరిన రెండు త్రిపతాక హస్తాలు; ఉత్థానవంచితః = ఉత్థానవంచిత (హస్త)ం (అవుతాయి).

విష్ణోః- అభినయే, స్తంభభావనాయాం = విష్ణువును అభినయించటంలో, స్తంభమును చూపటంలో;బుధ-ఉదితః =(ఈ హస్తం పండితులచేత చెప్పబడినది.

ఉత్థానవంచిత-అభిఖ్యః = ఉత్థానవంచితం అనే పేరుగల (ఈ హస్తం); సర్వనాట్యేషు కీర్తితః = అన్ని విధములగు నాట్యాలలో కీర్తింపబడినది.

తాత్పర్యం : రెండు త్రిపతాక హస్తాలు మూపురములమీద ఉంటే, అది 'ఉత్థానవంచిత హస్తం' అవుతుంది.

విష్ణువును, స్తంభమును అభినయించటంలో ఈ హస్తం తగును. అంతేకాదు ఇది సర్వనాట్యములందును తగును అని ప్రసిద్ధి పొందింది.

టీక : భరతముని చెప్పిన 'ఉత్తానవంచితములు' అనే నృత్త హస్తానికి ఇది సన్నిహితంగా ఉంది.

## 45. వర్ధమానహస్తం

ఊర్ధ్వభాగోన్ముఖౌ హస్తౌ శిఖరే వర్ధమానకః ॥ 584
సర్వదేతి వచోభావే దత్తమిత్యర్థకే ఽపి చ ।
కింకిమిత్యుక్తిసమయే కదాచిదితి భాషణే ॥ 585
వర్ధమానకరః ప్రోక్తః భరతాగమవేదిభిః ।

అర్థం : ఊర్ధ్వ భాగ - ఉన్ముఖౌ, శిఖరౌ హస్తౌ = మీదకు ఉన్ముఖములు అయిన రెండు శిఖర హస్తాలు ; వర్ధమానకః = వర్ధమాన (క) (హస్త)ం అవుతాయి.

సర్వదా - ఇతివచః భావే, దత్తమ్ - ఇతి - అర్థకే (అపి) (చ), కిమ్ - ఇతి - ఉక్తి సమయే, కదాచిత్ - ఇతి భాషణే, = ఎల్లప్పుడూ అని చెప్పటం, ఇవ్వబడినది అనే అర్థం, ఏమిటి అని (ప్రశ్నించే) సమయం, ఒకానొకప్పుడు అని చెప్పటం — ఈ అర్థము లందు; భరత - ఆగమవేదిభిః = భరతశాస్త్రవేత్తలచేత; వర్ధమాన కరః, ప్రోక్తః = వర్ధమానకరం, చెప్పబడింది.

తాత్పర్యం : రెండు శిఖర హస్తాలను పైకెత్తి, పడితే అది 'వర్ధమానహస్తం' అవుతుంది.

ఎల్లప్పుడూ అని చెప్పటం, ఇవ్వబడినది అనే అర్థం, ఏమిటి అని ప్రశ్నించటం. ఒకానొకప్పుడు అని చెప్పటం - వీటియందు వర్ధమానహస్తం వినియోగపడుతుంది.

టీక : ఇంతకుముందు చెప్పిన 'వర్గమానహస్తం' కంటె ఇది భిన్నంగా ఉంది.

## 46. జ్ఞానహస్తం

ఆదౌపతాకౌ ధృత్వా తు అంసా దూర్ధ్వముఖౌ వహేత్ ॥ 586

భవేత్ జ్ఞానాభిధకరః కథితం నృత్తకోవిదైః ।

గ్రహే చ హృదయే ధ్యానే జ్ఞానహస్తో విధీయతే ॥ 587

అర్థం : ఆదౌ పతాకౌ ధృత్వా (తు) = మొదట రెండు పతాక హస్తాలు పట్టి (తరువాత); అంసాత్, ఊర్ధ్వముఖౌ, వహేత్ = భుజమూలముల నుంచి ఊర్ధ్వముఖాలుగా పట్టవలెను (అప్పుడు అది); జ్ఞాన - అభిధకరః, భవేత్ = జ్ఞానం అనే పేరుగల హస్తం అవుతుంది (అని) : నృత్త కోవిదైః, కథితం = నృత్తవేత్తల చేత, చెప్పబడినది.

గ్రహే (చ, హృదయే, ధ్యానే=గ్రహం, హృదయం, ధ్యానం - అనే అర్థములందు; జ్ఞానహస్తః, విధీయతే= జ్ఞానహస్తం, విధింపబడుతున్నది.

తాత్పర్యం : తోలుత రెండు పతాక హస్తాలను పట్టి, తరువాత అంసముల నుంచి ఊర్ధ్వముఖాలుగా చాపితే, అది జ్ఞాన హస్తం అవుతుందని నృత్తకోవిదులు చెప్పినారు.

గ్రహం, హృదయం, ధ్యానం అనే అర్థములందు జ్ఞానహస్తం తగును.

టీక : ఈ హస్తం నాట్యశాస్త్రంలో లేదు. 'జ్ఞానహస్తం' నుంచి లీనముద్రాహస్తం వరకు - అంటే ఈ ఏడు హస్తాలు నాట్య శాస్త్రంలో లేవు.

## 47. రేఖాహస్తం :

అంగుష్ఠః కుంచితో భూయా న్మధ్యమా ఽనామికా తథా ।
కుంచితా స్యాత్ కనిష్ఠా చ తర్జనీ ప్రసృతా యది ॥ 588
రేఖాభిధకరః సో ఽయం ముద్రాయాం సంప్రయుజ్యతే ।

అర్థం : అంగుష్ఠః, కుంచితః, భూయాత్ =అంగుష్ఠం, కుంచితం (=వంగినది), కావలెను; మధ్యమా, అనామికా తథా కనిష్ఠా కుంచితాస్యాత్ = నడిమివ్రేలు, ఉంగరపు వ్రేలు, అట్లే చిటికెన వ్రేలు కుంచితములు కావలెను (ఇంక); తర్జనీ, ప్రసృతాయది = చూపుడు వ్రేలు ప్రసృతం (=చావబడినది) (అయితే అది); రేఖా-అభిధకరః = రేఖ అనే పేరుగల హస్తం (అవుతుంది).

అయం సః=ఈ రేఖాహస్తం; ముద్రాయాం, సంప్రయుజ్యతే=ముద్రయందు, చక్కగా ఉపయోగింపబడుతున్నది.

తాత్పర్యం : చూపుడువ్రేలు ప్రసారితం, తక్కిన నాలుగు వ్రేళ్ళు కుంచితాలు అయితే అది రేఖాహస్తం అవుతుంది.

ముద్రయందు ఈ హస్తం వినియోగపడుతున్నది.

## 48. వైష్ణవహస్తం :

ఊర్ధ్వగౌ త్రిపతాకౌ చే ద్వైష్ణవః కర ఈరితః ॥ 589

విష్ణో రభినయే యోజ్య ఇతి భావవిదో విదుః ।

అర్థం : త్రిపతాకౌ, ఊర్ధ్వగౌ, చేత్ — రెండు త్రిపతాక హస్తాలు, ఊర్ధ్వముఖాలుగా, ఉన్నప్పుడు; వైష్ణవకరః, ఈరితః — (అది) వైష్ణవహస్తం (అని), చెప్పబడినది.

(ఈ హస్తం) విష్ణోః అభినయే, యోజ్యః —(మహా)విష్ణువును అభినయించటంలో, ఉపయోగింపదగినది (అని); భావవిదః విదుః — భావవేత్తలు ఎరుగుదురు.

తాత్పర్యం : రెండు త్రిపతాక హస్తాలను ఊర్ధ్వముఖాలుగా పడితే అది వైష్ణవహస్తం అవుతుంది.

మహావిష్ణువును అభినయించటంలో ఈ హస్తం తగును.

## 49. బ్రహ్మోక్తశుకతుండహస్తం :

కపిత్థే ఒంగుష్ఠ - తర్జన్యౌ సమానాగ్రౌ ధృతౌ యది ॥ 590

బ్రహ్మోక్త శుకతుండః స్యాత్ గరుడార్థే నియుజ్యతే ।

అర్థం : కపిత్థే, అంగుష్ఠ-తర్జన్యౌ, సమాన - అగ్రౌ ధృతౌ యది — కపిత్థహస్తమందలి, అంగుష్ఠాన్ని తర్జనిని, సమానాగ్రములుగా, పడితే (అది); బ్రహ్మ - ఉక్త - శుకతుండః, స్యాత్ — బ్రహ్మ చెప్పిన శుకతుండ (హస్తం) అవుతుంది.

(ఈ హస్తం) గరుడ - అర్థే నియుజ్యతే — గరుత్మంతుడు అనే అర్థమందు ప్రయుక్తమవుతుంది.

తాత్పర్యం : కపిత్థహస్తమందలి అంగుష్ఠంయొక్క, తర్జని యొక్క చివరలు సమానంగా ఉంటే, అది బ్రహ్మోక్తశుకతుండ హస్తం అవుతుంది.

గరుత్మంతుడు అనే అర్థమందు ఇది చెల్లుతుంది.

## 50. ఖండచతురహస్తం :

చతురే తర్జనీ త్యక్తా కనిష్ఠా మిశ్రితా యది ॥ 591

నామ్నా ఽయం ఖండచతురః కీర్తితో భరతాగమే ।

రుధిరాదిద్రవే చాఽపి కర్ణామృత మితీరితే ॥ 592

ఖండాదిషు ప్రయోక్తవ్యః ఖండాఖ్యచతురః కరః ।

అర్థం : చతురే, తర్జనీత్యక్తా, కనిష్ఠా మిశ్రితా, యది = = చతురహస్తమందలి, చూపుడువ్రేలు విడువబడినది, చిటికెనవ్రేలు చేర్చిపట్టబడినది, అయితే; అయం, ఖండచతురః, నామ్నా = అది ఖండచతురం (అనే) పేరుగల (హస్తం అవుతుంది, అని); భరతాగమే, కీర్తితః = భరతవేదమందు చెప్పబడినది.

రుధిరాదిద్రవే (చ) (అపి, = రక్తం మొదలగు ద్రవ పదార్థములందు; కర్ణ-అమృతం, ఇతి, ఈరితే = కర్ణామృతం ( = చెవికింపు) అని చెప్పబడినపుడు; ఖండాదిషు = ఖండం ( = ముక్క) మొదలగు వాటియందు; ఖండ- ఆఖ్య చతురః కరః = ఖండం అనేపేరు గల చతురహస్తం (చెల్లుతుంది.)

తాత్పర్యం : చతురహస్తమందు చూపుడు వ్రేలిని విడిచి, చిటికెన వ్రేలిని చేర్చిపట్టితే అది ఖండచతురహస్తం అవుతుందని భరతవేదమందు చెప్పబడినది.

రక్తం మొదలగు ద్రవపదార్థాలు, చెవికింపు అని చెప్పటం, ఖండం మొదలగునవి - ఈ అర్థములందు ఖండచతురహస్తం చెల్లుతుంది.

## 51. అర్ధచతురహస్తం :

అస్మిన్ కనిష్ఠికా త్యక్తా య ద్యర్ధచతురో భవేత్ ॥ 593

మధురాదిరసాస్వాదే వినియోగో ఽస్య కీర్తితః ।

అర్థం : అస్మిన్ = ఇందు ( = ఈ ఖండచతుర హస్తమందు); కనిష్ఠికా త్యక్తా, యది = చిటికెన వ్రేళ్ళు, విడువబడినవి, అయితే; అర్ధచతురః భవేత్ = అర్ధచతుర (హస్త)ం అవుతుంది.

మధుర - ఆది రస - ఆస్వాదే = మధురం ( = తీపి) మొదలగు రసాలను ఆస్వాదించటంలో; అస్య, వినియోగః కీర్తితః = దీని( = ఈ అర్ధచతురహస్త) వినియోగం కీర్తింపబడింది.

తాత్పర్యం : ఖండచతురహస్తమందు చిటికెనవ్రేళ్ళు విడువబడితే; అది అర్ధచతురహస్తం అవుతుంది.

మధురము మొదలైన రసాలను ఆస్వాదించటంలో ఈ హస్తం చెప్పబడినది.

## 52. లీనముద్రాహస్తం :

**ముద్రాఖ్యే తర్జనీ నమ్రా లీనముద్రాకరో భవేత్ ॥** 594

అర్థం: ముద్రా- ఆఖ్యే = ముద్ర అనే పేరుగల హస్తమందు; తర్జనీ, నమ్రా = చూపుడువ్రేలు వంచబడినది (అయితే); లీనముద్రాకరః, భవేత్ = లీనముద్రాహస్తం, అవుతుంది.

తాత్పర్యం : ముద్రాహస్తమందు చూపుడు వ్రేలు వంగితే అది లీనముద్రాహస్తం అవుతుంది.

టీక : దీనికి వినియోగం చెప్పలేదు.

# 9
# దేవ - దిక్పాల - దశావతారహస్తాలు

## దేవహస్తాలు

అథ బ్రహ్మాదిదేవానాం భావనాభినయక్రమాత్ ।
మూర్తిభేదేన యే హస్తాః తేషాం లక్షణ ముచ్యతే ॥ 595

అర్థం : అథ, బ్రహ్మ - ఆది దేవానాం, భావనా = ఇంక, బ్రహ్మ మొదలగు దేవతల యొక్క భావనను (అథ - అత్ర బ్రహ్మ రుద్రాది దేవతా = ఇంక ఇప్పుడు బ్రహ్మ రుద్రాది దేవతల యొక్క -ఘోష్); అభినయక్రమాత్ = అభినయక్రమంలో; మూర్తిభేదేన = మూర్తి భేదాలననుసరించి; యేహస్తాః = ఏ హస్తాలు (కలవో); తేషాం, లక్షణం, ఉచ్యతే = వాటియొక్క లక్షణం చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఇంక ఇప్పుడు బ్రహ్మ, రుద్రుడు మొదలగు దేవతల యొక్క హస్తాలు, ఆయా మూర్తులలోని భేదాలను అనుసరించి, అభినయానుగుణంగా వివరింపబడుతున్నవి.

టీక : ఈ దేవతల హస్తాలు కూడా నాట్యశాస్త్రంలో లేవు. ఇచ్చట 9 మంది దేవతలకు హస్తాలు చెప్పబడినవి — బ్రహ్మ, శంభువు, విష్ణువు (= త్రిమూర్తులు); సరస్వతి, పార్వతి, లక్ష్మి (= త్రిమూర్తుల భార్యలు); విఘ్నేశ్వర, షణ్ముఖ, మన్మథులు. మాతృభూతయ్య కూడా ఈ తొమ్మిది హస్తాలే చెప్పినాడు.

### 1. బ్రహ్మహస్తం :

బ్రహ్మణ శ్చతురో వామే హంసాస్యో దక్షిణే కరః ।

అర్థం : వామే చతురః, దక్షిణే హంసాస్యః = ఎడమచేత

చతుర హస్తం, కుడిచేత హంసాస్య హస్తం (పట్టితే అది); బ్రహ్మణః కరః = బ్రహ్మ యొక్క హస్తం (అవుతుంది.)

తాత్పర్యం : ఎడమచేత చతుర హస్తం, కుడిచేత హంసాస్య హస్తం పట్టితే, అది బ్రహ్మహస్తం అవుతుంది.

టీక : బ్రహ్మ - ఎడమచేత చతురం, కుడిచేత హంసాస్యం పట్టవలెను - ఈ ప్రకరణంలో ఘోష్ అనువాదం ఇట్లా సాగింది.

## 2. శంభుహస్తం :

శంభో ర్వామే మృగశీర్ష స్త్రిపతాక స్తు దక్షిణే ॥ 596

అర్థం: వామే మృగశీర్షః, దక్షిణే త్రిపతాకః (తు) = ఎడమ చేత మృగశీర్షహస్తం, కుడిచేత త్రిపతాకహస్తం (పట్టితే అది); శంభోః = శంభుని (= శివుని) యొక్క (హస్తం అవుతుంది).

తాత్పర్యం : ఎడమచేత మృగశీర్ష హస్తం, కుడిచేత త్రిపతాక హస్తం పట్టితే, అది శంభుహస్తం అవుతుంది.

## 3. విష్ణుహస్తం :

హస్తాభ్యాం త్రిపతాకాభ్యాం విష్ణుహస్తః ప్రకీర్తితః ।

అర్థం ; త్రిపతాకాభ్యాం, హస్తాభ్యాం = రెండు త్రిపతాక హస్తాల చేత (= పట్టడంవల్ల); విష్ణుహస్తః, ప్రకీర్తితః = విష్ణు హస్తం, కీర్తింపబడినది.

తాత్పర్యం : రెండు చేతులతోను త్రిపతాక హస్తాలను పట్టితే అది విష్ణుహస్తం అవుతుంది.

## 4. సరస్వతీహస్తం :

సూచీకృతే దక్షిణే ఒర్ధచంద్రే వామకరే తథా । 597

సరస్వత్యాః కరః ప్రోక్తః భరతాగమవేదిభిః ।

అర్థం : దక్షిణే, సూచీకృతే=కుడిచేత సూచీహస్తంపట్టి; వామకరే, అర్ధచంద్రే=ఎడమచేత అర్ధచంద్రహస్తం పట్టితే (అది); సరస్వత్యాః కరః=సరస్వతియొక్క హస్తం (అని); భరతాగమ వేదిభిః, ప్రోక్తః = భరతవేదం ఎరిగిన వారిచేత, చెప్పబడినది.

తాత్పర్యం: : కుడిచేత సూచీహస్తం, ఎడమచేత అర్ధచంద్ర హస్తం పట్టితే అది సరస్వతీహస్తం అవుతుంది.

టీక : ఈ హస్తం ఘోష్‌లో భిన్నవిధంగా ఉన్నది.

సూచీకృతే దక్షిణే చ వామే చాంసనమకృతా ॥ 598

కపిత్థకే ఽపి భారత్యాః కరః స్యాదితి సమ్మతః ।

కుడిచేత సూచీహస్తం, ఎడమచేత కపిత్థహస్తం భుజస్కంధాలతో సమానంగా పడితే (అది), భారతీహస్తమవుతుంది అని సిద్ధాంతం.

## 5. పార్వతీహస్తం :

ఊర్ధ్వాధః ప్రసృతా వర్ధచంద్రాఖ్యౌ వామదక్షిణౌ ॥ 599

అభయో వరద శ్చైవ పార్వత్యాః కర ఈరితః ।

అర్థం : వామదక్షిణే=ఎడమ, కుడి పార్శ్వములందు అర్ధచంద్రాఖ్యౌ= రెండు అర్ధచంద్ర హస్తాలు; అభయః, వరదః; (చ) (ఏవ)=అభయహస్తంగా, వరదహస్తంగా; ఊర్ధ్వ - అధః ప్రసృతౌ =(ఎడమచేయి) క్రిందకు, (కుడిచేయి) పైకి చాపబడినవి (అయితే); పార్వత్యాఃకరః, ఈరితః = (అది) పార్వతీదేవి యొక్క హస్తం (అని) చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమచేత అర్ధచంద్ర హస్తాన్ని ఎడమ ప్రక్క వరదహస్తంగా క్రిందకు, కుడిచేత అర్ధచంద్ర హస్తాన్ని కుడిప్రక్క అభయ హస్తంగా పైకి పట్టితే, అది పార్వతీహస్తం అవుతుంది.

టీక : నీడా అనువాదం ప్రకారం కుడి-యెడమ చేతులు వరుసగా క్రిందు-మీదు లవుతాయి.

## 6. లక్ష్మీహస్తం :

ఆంసోపకంఠే హస్తాభ్యాం కపిత్థాభ్యాం శ్రియః కరః ॥ 600

అర్థం : అంస - ఉపకంఠే = రెండు అంసముల సమీపంలో; కపిత్థాభ్యాం హస్తాభ్యాం = కపిత్థ హస్తాలను (పట్టితే); శ్రియః కరః = లక్ష్మీహస్తం (అవుతుంది).

తాత్పర్యం : రెండు అంసముల సమీపమందు రెండు కపిత్థ హస్తాలను పట్టితే, అది లక్ష్మీహస్తం అవుతుంది.

## 7. విఘ్నేశ్వరహస్తం :

పురోగాభ్యాం కపిత్థాభ్యాం కరాభ్యాం విఘ్నరాట్ కరః ।

అర్థం : పురోగాభ్యాం, కపిత్థాభ్యాం కరాభ్యాం = ఎదురుగా రెండు కపిత్థహస్తాలను (పట్టిన); విఘ్నరాట్ కరః = విఘ్నేశ్వర హస్తం(ఏర్పడుతుంది).(ఉరోగతాభ్యాం = రొమ్ముమీద ఉన్న రెండు కపిత్థ హస్తాలచేత — ఘోష్).

తాత్పర్యం : రెండు కపిత్థ హస్తాలు ఎదురుగా (లేదా రొమ్ముమీద ఉంటే, అది విఘ్నేశ్వరహస్తం అవుతుంది.

## 8. షణ్ముఖహస్తం :

వామే కరే త్రిశూలశ్చ శిఖరో దక్షిణే కరే ॥ 601

ఊర్ధ్వం గతే షణ్ముఖస్య హస్తః స్యాదితి కీర్తితః ।

అర్థం : వామే కరే త్రిశూలః (చ), దక్షిణే కరే శిఖరః = ఎడమచేత త్రిశూలహస్తం, కుడిచేత శిఖరహస్తం; ఊర్ధ్వంగతే = పైకి ఎత్తిపట్టితే (అది); షణ్ముఖస్యహస్తః, స్యాత్, ఇతి, కీర్తితః = షణ్ముఖ హస్తం అవుతుంది, అని, కీర్తించబడినది (...ఇత్యుచ్యతే బుధైః = అని బుధుల చేత చెప్పబడుతున్నది — నీడా).

తాత్పర్యం : ఎడమచేత త్రిశూలహస్తం, కుడిచేత శిఖర హస్తం పట్టి పైకి చాపితే, అది షణ్ముఖహస్తం అవుతుంది.

## 9. మన్మథహస్తం :

వామే కరే తు శిఖరో దక్షిణే కటకాముఖః ॥ 602

మన్మథస్య కరః ప్రోక్తో నాట్యశాస్త్రార్థకోవిదైః ।

అర్థం : వామేకరే (తు) శిఖరః, దక్షిణే కటకాముఖః = ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత కటకాముఖ హస్తం (పట్టితే అది); మన్మథస్యకరః = మన్మథునియొక్క హస్తం (అని); నాట్యశాస్త్రార్థ కోవిదైః ప్రోక్తః = నాట్యశాస్త్రార్థాలు తెలిసిన వారిచేత, చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత కటకాముఖ హస్తం పట్టితే, అది మన్మథహస్తం అవుతుందని నాట్యశాస్త్రవేత్తల మతం.

## దిక్పాలహస్తాలు

### 1. ఇంద్రహస్తం :

త్రిపతాకౌ స్వస్తికౌచేత్ ఇంద్రహస్తః ప్రకీర్తితః ॥ 603

అర్థం : త్రిపతాకౌ, స్వస్తికౌచేత్ = రెండు త్రిపతాక హస్తాలు, స్వస్తికంగా ఉంటే, (అది); ఇంద్రహస్తః, ప్రకీర్తితః = ఇంద్ర (శక్ర - ఘోష్) హస్తం (అని) కీర్తింపబడినది.

తాత్పర్యం : రెండు త్రిపతాకహస్తాలు స్వస్తికంగా ఉంటే, అది ఇంద్ర లేదా శక్రహస్తం అవుతుంది. (ఇంద్ర - శక్ర పదాలు పర్యాయపదాలు)

టీక : దిక్పాలహస్తాలు నాట్యశాస్త్రంలో లేవు. ఎనిమిది దిక్కులకు దిక్పాలురు ఎనమండుగురు:

| | |
|---|---|
| తూర్పు - ఇంద్రుడు | ఆగ్నేయం - అగ్ని |
| దక్షిణం - యముడు | నైరృతి - నిరృతి |
| పశ్చిమం - వరుణుడు | వాయవ్యం - వాయువు |
| ఉత్తరం - కుబేరుడు | ఈశాన్యం - ఈశానుడు. |

కాని ఇచ్చట ఎనిమిదవ దిక్కు అయిన ఈశాన్యమునకు అధిపతి అయిన ఈశానుని హస్తం చెప్పబడలేదు. మాతృభూతయ్య ఈశాన హస్తాన్ని ఇట్లా వివరించినాడు:

"ముందుగా వామ పార్శ్వమందు శంఖ హస్తాన్ని పట్టి, తరువాత దక్షిణ హస్తంతో త్రిపతాకం, వామహస్తంతో మృగశీర్షం చూపితే అది ఈశానహస్తం అవుతుంది".

## 2. అగ్నిహస్తం :

త్రిపతాకో దక్షిణే తు వామే కాంగులహస్తకః ।
అగ్నిహస్తః స విజ్ఞేయో నాట్యశాస్త్రవిశారదైః ॥ 604

అర్థం : దక్షిణే (తు) త్రిపతాకః, వామే కాంగులహస్తకః = కుడిచేత త్రిపతాకహస్తం, ఎడమచేత కాంగుల (లాంగూల - నీడా) హస్తం (పట్టితే); సః,అగ్నిహస్తః = అది అగ్నిహస్తం (అని); నాట్యశాస్త్రవిశారదైః, విజ్ఞేయః = నాట్యశాస్త్రవిశారదుల చేత, తెలియదగినది.

తాత్పర్యం : కుడిచేత త్రిపతాకహస్తం, ఎడమచేత కాంగుల లేదా లాంగూలహస్తం పట్టితే అది అగ్నిహస్తం అవుతుందని నాట్యశాస్త్ర విశారదులు తెలియవలెను.

## 3. యమహస్తం :

వామే పాశః దక్షిణే తు సూచీ యమకరః స్మృతః ।

అర్థం : వామే పాశః, దక్షిణే (తు) సూచీ = ఎడమచేత పాశహస్తం,కుడచేత సూచీహస్తం (పట్టితే అది); యమకరః, స్మృతః = యమహస్తం (అని), స్మరించబడినది.

తాత్పర్యం : ఎడమచేత పాశహస్తం, కుడిచేత సూచీహస్తం పట్టితే అది యమహస్తం అవుతుంది.

## 4. నైర్‌ఋతి హస్తం :

**ఖట్వా చ శకటశ్చైవ కీర్తితో నిర్‌ఋతేః కరః ॥** 605

అర్థం : ఖట్వా (చ), శకటః (చ) (ఏవ)=ఖట్వాహస్తం, శకట హస్తం (పట్టితే, అది); నిర్‌ఋతేః (నైర్‌ఋతేః — నీడా)=నైర్‌ఋతి హస్తం అవుతుంది.

తాత్పర్యం : ఒకచేత ఖట్వాహస్తం, ఇంకొకచేత శకట హస్తం పట్టితే అది నైర్‌ఋతిహస్తం అవుతుంది.

## 5. వరుణహస్తం :

**పతాకో దక్షిణే వామే శిఖరో వారుణఃకరః ।**

అర్థం : దక్షిణే పతాకః, వామే శిఖరః=కుడిచేత పతాక హస్తం, ఎడమచేత శిఖరహస్తం (పట్టితే, అది); వారుణః కరః= వరుణహస్తం అవుతుంది.

తాత్పర్యం : కుడిచేత పతాకహస్తం, ఎడమచేత శిఖర హస్తం పట్టితే, అది వరుణహస్తం అవుతుంది.

## 6. వాయుహస్తం :

**అరాలో దక్షిణే హస్తే వామే చార్ధపతాకికా ॥** 606

**ధృతాచేత్ వాయుదేవస్య కర ఇత్యభిధీయతే ।**

అర్థం : దక్షిణే హస్తే అరాళః, వామే (చ) అర్ధపతాకికా =కుడిచేత అరాళహస్తం, ఎడమచేత అర్ధపతాకహస్తం; ధృతా చేత్ =పట్టితే (అది); వాయుదేవస్యకరః, ఇతి, అభిధీయతే= వాయు దేవునియొక్క హస్తం, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : కుడిచేత అరాళహస్తం, ఎడమచేత అర్ధపతాక హస్తం పట్టితే అది వాయుహస్తం అవుతుంది.

## 7. కుబేరహస్తం :

**వామే పద్మం దక్షిణే తు గదా యక్షపతేః కరః ॥** 607

అర్థం : వామే పద్మం, దక్షిణే (తు) గదా = ఎడమచేత పద్మహస్తం, కుడిచేత గదాహస్తం (పట్టితే, అది); యక్షపతేః కరః = యక్షరాజు ( = కుబేరుడు) యొక్క హస్తం (అవుతుంది).

తాత్పర్యం : ఎడమచేత పద్మహస్తం, కుడిచేత గదాహస్తం పట్టితే, అది కుబేరహస్తం అవుతుంది.

టీక : ఈశానహస్తం చెప్పబడలేదు; ఇంతకు ముందు చెప్పిన 'శంభుహస్తం' ఇక్కడ కూడా సరిపోతుందని కాబోలు! ఇచ్చట గదాహస్తం యొక్క నిర్వచనం లేదు. మాతృభూతయ్య గదా హస్తానికి బదులు ముష్టిహస్తం చెప్పినాడు. ఎడమచేతిలో పద్మం, కుడిచేత గద చూపితే చాలునేమో ?

## దశావతారహస్తాలు

### 1. మత్స్యావతారహస్తం :

మత్స్యహస్తం దర్శయిత్వా తతః స్కంధసమౌ కరౌ
[త్రిపతాకౌ యది ధృతౌ యుజ్యతే మత్స్యజన్మని ।]
ధృతౌ మత్స్యావతారస్య హస్త ఇత్యభిధీయతే ॥ 608

అర్థం : మత్స్య హస్తం దర్శయిత్వా = మత్స్యహస్తం ప్రదర్శించి; తతః స్కంధసమౌ, కరౌ, ధృతౌ = తరువాత మూపులతో సమానంగా, హస్తాలను, పట్టితే (అది); మత్స్యావతారస్య, హస్తః, ఇతి, అభిధీయతే = మత్స్యావతారం యొక్క హస్తం, అని చెప్పబడుతున్నది.

తాత్పర్యం : రెండు చేతులతో మత్స్య హస్తాలను పట్టి, తరువాత స్కంధాలతో సమానంగా ఉంచితే అది 'మత్స్యావతార హస్తం' అవుతుంది.

టీక : "త్రిపతాకే......మత్స్యజన్మని" — ఈపాదం ఘోష్ పాఠంలో లేదు. "స్కంధాలతో సమానంగా త్రిపతాక హస్తాలను పట్టితే మత్స్యావతారమందు చెల్లును" — అని దీని అర్థం. ఇది ఇక్కడ ఉండవలసినది కాదేమో?

దశావతారహస్తాలు కూడా నాట్యశాస్త్రంలో లేవు. దశావతారాలు : మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ (=నారసింహ), వామన, పరశురామ, రామచంద్ర, బలరామ, బుద్ధ, కల్క్యవతారాలు. ఇచ్చట బుద్ధావతారహస్తం చెప్పబడ లేదు; దాని బదులు కృష్ణావతారహస్తం ఉన్నది. మాతృభూతయ్య కూడా బుద్ధావతార హస్తానికి బదులు కృష్ణావతారహస్తాన్నే చెప్పినాడు.

## 2. కూర్మావతారహస్తం :

కూర్మహస్తం దర్శయిత్వా తతః స్కంధసమౌ కరౌ ।
[త్రిపతాకౌయది ధృతౌ యుజ్యతే కూర్మజన్మని ।]
ధృతౌ కూర్మావతారస్య హస్త ఇత్యభిధీయతే ॥ 609

అర్థం : కూర్మహస్తం దర్శయిత్వా=కూర్మహస్తం ప్రదర్శించి; తతః, స్కంధ సమౌ, కరౌ ధృతౌ = పిమ్మట, స్కంధాలతో సమానంగా హస్తాలు పట్టితే (అది); కూర్మావతారస్య, హస్తః, ఇతి, అభిధీయతే=కూర్మావతారం యొక్క హస్తం అని చెప్పబడుతున్నది.

తాత్పర్యం : కూర్మహస్తం ప్రదర్శించి, పిమ్మట స్కంధాలతో సమానంగా హస్తాలను పట్టితే, అది 'కూర్మావతారహస్తం' అవుతుంది.

టీక : "త్రిపతాకౌ......కూర్మజన్మని" — ఈ పాదం ఘోష్ పాఠంలో లేదు. ఈ పాదం ఇక్కడ ఉండవలసినది కాదేమో? దీని అర్థం ఇట్లా ఉంటుంది:

తతః, త్రిపతాకౌ, కరౌ, సమౌ, ధృతౌ, యది = పిమ్మట త్రిపతాకహస్తాలు స్కంధములకు సమానంగా ధరిస్తే (అది); కూర్మజన్మని, యుజ్యతే — కూర్మావతారమందు, తగును.

## 3. వరాహావతారహస్తం :

దర్శయిత్వా వరాహం తు కటి పార్శ్వ సమౌ కరౌ ।

ధృతౌ వరాహదేవస్య హస్త ఇత్యభిధీయతే ॥ 610

అర్థం : వరాహం (తు), దర్శయిత్వా — వరాహహస్తం ప్రదర్శించి; కటిపార్శ్వసమౌ, కరౌ, ధృతౌ = పార్శ్వములందు కటితో సమానంగా హస్తాలను పట్టితే (అది); వరాహదేవస్య, హస్తః, ఇతి, అభిధీయతే = వరాహ దేవుని యొక్క, హస్తం, అని చెప్పబడు తున్నది.

తాత్పర్యం : వరాహహస్తం ప్రదర్శించి, పార్శ్వములందు కటి ( — నడుము)తో సమానంగా హస్తాలను పట్టితే, అది 'వరాహావ తారహస్తం' అవుతుంది.

## 4. నృసింహావతారహస్తం :

వామే సింహముఖం ధృత్వా దక్షిణే త్రిపతాకికా ।

నరసింహావతారస్య హస్త ఇత్యభిధీయతే ॥ 611

అర్థం : వామే, సింహముఖం, ధృత్వా — ఎడమచేత, సింహ ముఖ హస్తం, ధరించి; దక్షిణే, త్రిపతాకికా — కుడిచేత, త్రిపతాక హస్తం (పట్టితే, అది); నర ( — నృ) సింహావతారస్య, హస్తః, ఇతి, అభిధీయతే = నర ( — నృ) సింహావతారం యొక్క, హస్తం, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఎడమచేత సింహముఖహస్తం, కుడిచేత పతాక హస్తం ధరిస్తే అది 'నృసింహావతారహస్తం' అవుతుంది.

## 5. వామనావతారహస్తం :

ఊర్ధ్వాధో ధృతముష్టిభ్యాం సవ్యాన్యాభ్యాం యది స్థితః ।
స వామనావతారస్య హస్త ఇత్యభిధీయతే ॥ 612

అర్థం : సవ్య - అన్యాభ్యాం, ధృతముష్టిభ్యాం = ఎడమ-కుడిచేతులతో, ధరింపబడిన ముష్టి హస్తాలను; ఊర్ధ్వ - అధఃస్థితః యది = (క్రమంగా) పైకి క్రిందకు చాపితే; సః, వామనావతారస్య, హస్తః, ఇతి, అభిధీయతే = అది, వామనావతారం యొక్క, హస్తం, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఎడమ - కుడి చేతులతో ముష్టి హస్తాలను పట్టి, (వరుసగా) పైకి, క్రిందకు — చాపితే, అది వామనావతార హస్తం' అవుతుంది.

## 6. పరశురామావతారహస్తం :

వామం కటితటే న్యస్య దక్షిణే ఒర్ధపతాకికా ।
ధృతా పరశురామస్య హస్త ఇత్యభిధీయతే ॥ 613

అర్థం : వామం, కటితటే, న్యస్య = ఎడమచేతిని, కటి యందు, ఉంచి; దక్షిణే, అర్ధపతాకికా, ధృతా = కుడిచేత, అర్ధ పతాక హస్తం పట్టితే (అది); పరశురామస్యహస్తః, ఇతి, అభిధీయతే = పరశురామునియొక్క, హస్తం, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఎడమచేతిని కటి మీద ఉంచి, కుడిచేత అర్ధ పతాక హస్తం, పట్టితే, అది 'పరశురామావతారహస్తం' అవుతుంది.

## 7. రామచంద్రావతారహస్తం :

కపిత్థో దక్షిణే హస్తే వామే తు శిఖరః కరః ।
ఊర్ధ్వం ధృతో రామచంద్రహస్త ఇత్యుచ్యతే బుధైః ॥ 614

అర్థం : దక్షిణేహస్తే కపిత్థః = కుడిచేత కపిత్థహస్తం; వామే (తు) శిఖరః కరః, ఊర్ధ్వం ధృతః = ఎమడచేత శిఖరహస్తం, పైకి పట్టితే (అది); రామచంద్రహస్తః, ఇతి, బుధైః, ఉచ్యతే = రామచంద్ర ( = రఘురామ - నీడా) హస్తం, అని, బుధులచేత, చెప్పతున్నది.

తాత్పర్యం : కుడిచేత కపిత్థహస్తం క్రిందుగానూ, ఎడమచేత శిఖరహస్తం మీదుగానూ పట్టితే అది 'రామచంద్రావతార ( = రఘురామావతార) హస్తం' అవుతుంది.

టీక : 'అధరోత్తరభాగేతు రామచంద్ర కరః స్మృతః' అని నీడా పాఠం; అనగా కుడి కపిత్థహస్తం క్రిందుగానూ, ఎడమచేతి శిఖరహస్తం మీదుగానూ ఉంటే అది రామచంద్రహస్తం అని స్మరింపబడినది అని అర్థం. ఇది సమంజసంగా ఉన్నది.

## 8. బలరామావతారహస్తం :

పతాకో దక్షిణే హస్తే ముష్టి ర్వామకరే తథా ।
బలరామావతారస్య హస్త ఇత్యభిధీయతే ॥ 615

అర్థం: దక్షిణేహస్తే పతాకః, (తథా), వామకరే ముష్టిః = కుడిచేత పతాకహస్తం, ఎడమచేత ముష్టిహస్తం (పట్టితే అది); బలరామావతారం యొక్క హస్తం, అని, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : కుడిచేత పతాకహస్తం, ఎడమచేత ముష్టిహస్తం పట్టితే, అది బలరామావతారహస్తం అవుతుంది.

## 9. కృష్ణావతారహస్తం :

మృగశీర్షే తు హస్తాభ్యా మన్యోన్యాభిముఖీకృతే ।
ఆస్యోపకంఠే కృష్ణస్యహస్త ఇత్యుచ్యతేబుధైః ॥ 616

అర్థం : హస్తాభ్యాం మృగశీర్షే (తు)—రెండు చేతులతో మృగశీర్ష హస్తాలను (పట్టి); ఆస్యోపకంఠే = ముఖానికి దగ్గరగా (అంసోపకంఠే=స్కంధాలకు దగ్గరగా - నీడా); అన్యోన్య - అభి ముఖీ కృతే—పరస్పరం అభి ముఖాలుగా చేస్తే (అది); కృష్ణస్య హస్తః, ఇతి, బుధైః, ఉచ్యతే—కృష్ణుని యొక్క హస్తం, అని బుధులచేత, చెప్పబడుతున్నది.

తాత్పర్యం : రెండు చేతులతో మృగశీర్ష హస్తాలను పట్టి వాటిని ముఖం లేదా అంసాలకు దగ్గరగా, అభిముఖంగా చేస్తే అది కృష్ణావతారహస్తం అవుతుంది.

టీక : సాధారణంగా 'రామోరామఃరామశ్చ' అని పరశు రామ, రామ, బలరాములనే దశావతారములందు పరిగణిస్తారు. ఆ పరిగణనలో కృష్ణావతారం లేదు; దీని బదులు బుద్ధావతారం ఉంది. బహుశః ఈ హస్త పరిగణన బుద్ధుని అవతారంగా గుర్తించ టానికి ముందు జరిగినది కాదగును.

వేణుగానం చేస్తూన్నట్లు చూపితే, అది కృష్ణావతారహస్త మవుతుందని మాతృభూతయ్య వర్ణించినాడు.

## 10. కల్క్యవతారహస్తం ;

పతాకో దక్షిణే వామే త్రిపతాకః కరో ధృతః ।
కల్క్యాఖ్యస్యావతారస్య ఇత్యభిధీయతే ॥ 617

అర్థం : దక్షిణే పతాకః, వామే త్రిపతాకః కరః, ధృతః —కుడిచేత పతాకహస్తం, ఎడమచేత త్రిపతాకహస్తం, ధరిస్తే (అది); కల్కి - ఆఖ్యస్య - అవతారస్య, హస్తః—కల్కి అనే పేరు

గల అవతారం యొక్క, హస్తం; ఇతి, అభిధీయతే — అని, చెప్ప బడుతున్నది

తాత్పర్యం : కుడిచేత పతాకహస్తం, ఎడమచేత త్రిపతాక హస్తం ధరిస్తే, అది 'కల్క్యవతారహస్తం' అవుతుంది.

టీక : హస్తః కల్క్యవతారస్య ఇతి నాట్యవిదో విదుః — కల్కి అవతారం యొక్క హస్తం అని నాట్యవేత్తలు తెలిసి కొందురు — నీడా పాఠం.

10

# వర్ణ - జాతీయ - బాంధవ హస్తాలు

## చతుర్వర్ణహస్తాలు

### 1. బ్రాహ్మణహస్తం:

కరాభ్యాం శిఖరం ధృత్వా యజ్ఞసూత్రస్య సూచనే ।
దక్షిణేన కృతే తిర్యక్ బ్రహ్మణానాం కరః స్మృతః ॥ 618

అర్థం : కరాభ్యాం శిఖరం ధృత్వా = రెండుచేతులతోను శిఖర హస్తాలను పట్టి; దక్షిణేన, తిర్యక్, యజ్ఞసూత్రస్య, సూచనే కృతే = కుడిచేత, అడ్డంగా, యజ్ఞోపవీతం యొక్క, సూచన, చేస్తే (అది); బ్రహ్మణానాం కరః, స్మృతః = బ్రాహ్మణులయొక్క హస్తం (అని), స్మరించబడినది.

తాత్పర్యం : రెండు చేతులతో శిఖరహస్తాలు పట్టి, కుడిచేత అడ్డంగా జందెమును చూపిస్తే, అది బ్రాహ్మణహస్తం అవుతుంది.

టీక : ఇది ఇంతకు ముందు చెప్పిన బృహస్పతిగ్రహ హస్త నిర్వచనంతో సంవదిస్తున్నది. ('అడ్డంగా' అనేది ఇచ్చట అధికం). చతుర్వర్ణ హస్తాలు నాట్యశాస్త్రంలో లేవు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణాలు నాలుగింటికి ఇచ్చట హస్తాలు చెప్పబడినవి. అంతేకాక రాక్షస హస్తం అనేది అధికంగా చెప్పబడింది.

### 2. క్షత్రియహస్తం :

వామేన శిఖరం తిర్యక్ధృత్వాఽన్యేన పతాకికా ।
ధృతా యది క్షత్రియాణాం హస్త ఇత్యభిధీయతే ॥ 619

అర్థం : వామేన, శిఖరం తిర్యక్, ధృత్వా = ఎడమచేత శిఖరహస్తాన్ని, అడ్డంగా, ధరించి; అన్యేన, పతాకికా, ధృతా యది = రెండవ (= కుడి) చేత, పతాక హస్తం ధరిస్తే (అది); క్షత్రియాణాం హస్తః, ఇత్యభిధీయతే = క్షత్రియుల యొక్క హస్తం అని చెప్పబడుతున్నది.

తాత్పర్యం : ఎడమచేతితో శిఖరహస్తం అడ్డంగా పట్టి, కుడి చేతితో పతాకహస్తం ధరిస్తే, అది క్షత్రియహస్తం అవుతుంది.

3. వైశ్యహస్తం :

కరే వామే తు హంసాస్యే దక్షిణే కటకాముఖః ।
వైశ్యహస్తోఽయ మాఖ్యాతో మునిభిర్భరతాదిభిః ॥

అర్థం : వామేకరే (తు), హంసాస్యః = ఎడమచేత, హంసాస్య హస్తం; దక్షిణే, కటకాముఖః = కుడిచేత, కటకాముఖ హస్తం (పట్టితే); అయం, వైశ్యహస్తః = ఇది, వైశ్యహస్తం (అని); భరతాదిభిః మునిభిః ఆఖ్యాతః = భరతాది మునుల చేత (భరతాగమ వేదిభిః = భరతాగమవేత్తల చేత — నీడా) చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమచేతితో హంసాస్యహస్తం, కుడిచేతితో కటకాముఖహస్తం పట్టితే, అది వైశ్యహస్తం అవుతుందని భరతాగమ వేత్తలు చెప్పినారు.

టీక : చతుర్వర్ణహస్తాలు నాట్యశాస్త్రంలో లేవు కావున, 'భరతాదులు' అనటం కంటె 'భరతాగమవేత్తలు అనటమే సమంజసం.

4. శూద్రహస్తం :

వామే తు శిఖరం ధృత్వా దక్షిణే మృగశీర్షకః ।
శూద్రహస్తః స విజ్ఞేయో మునిభిః భరతాదిభిః ॥ 621

అర్థం : వామే (తు) శిఖరం ధృత్వా, దక్షిణే మృగశీర్షకః

= ఎడమచేత శిఖరహస్తం ధరించి, కుడిచేత మృగశీర్ష హస్తం (సూచీహస్తం - నీడా (పట్టితే); సః, శూద్రహస్తః = అది శూద్ర హస్తం (అవుతుందని); భరతాదిభిః మునిభిః విజ్ఞేయః = భరతాది మునులచేత, తెలియబడినది.

తాత్పర్యం : ఎడమచేతితో శిఖరహస్తం, కుడిచేతితో మృగ శీర్ష హస్తం పట్టితే అది 'శూద్రహస్తం' అవుతుందని భరతాది మునులు ఎరుగుదురు.

టీక : చివరి పాదం నీడాలో లేదు.

## 5. రాక్షసహస్తం :

ముఖే కరాభ్యాం శకటౌ రాక్షసానాం కరః స్మృతః ।

అర్థం : ముఖే, కరాభ్యాం, శకటౌ = ముఖమునందు (= ముఖం వద్ద) రెండు చేతులతో శకటహస్తాలు (పట్టితే అది); రాక్షసానాం, కరః, స్మృతః = రాక్షసుల యొక్క, హస్తం, (అని) స్మరించబడినది.

తాత్పర్యం : ముఖంవద్ద రెండు చేతులతో శకట హస్తాలను పట్టితే అది రాక్షసహస్తం అవుతుంది.

టీక : ఈ హస్తం ఘోష్ పాఠంలో చతుర్వర్ణహస్తాలకు మొదట ఉండగా, నీడా పాఠంలో దశావతారహస్తాలకు చివర ఉంది. మాతృభూతయ్య దీనిని చెప్పలేదు.

## తత్తజ్జాతీయహస్తాలు

అష్టాదశానాం జాతీనాం కర్మాదీనాః కరాః స్మృతాః ॥ 622

తత్తద్దేశజనానాం చ ఏవమూహ్యం బుధోత్తమైః ।

యావదర్థాః ప్రయోగాణాం తావద్భేదాః కరాః స్మృతాః॥ 623

అర్థాత్ప్రకరణాల్లింగాదౌచిత్యా దర్థనిర్ణయః ।
తత్తత్సమ్యక్సమాలోక్య సంగృహ్యోక్తమిదం మయా ॥ 624
సమాలోచ్య ప్రయోక్తవ్యం భావజ్ఞై రిహశాస్త్రతః ।

అర్థం: అష్టాదశజాతీనాం కరాః, కర్మాదీనాః, స్మృతాః =(తక్కిన) పదునెనిమిది జాతుల యొక్క, హస్తాలు, వారి వారి పనులను అనుసరించి (=పనులకు తగినట్లు) ఉంటాయని, చెప్పబడినది; తత్ తత్ దేశ జనానాం (చ), ఏవం, బుధోత్తమైః ఊహ్యాం =ఆయా దేశాల జనుల హస్తాలు కూడా, ఈ విధంగానే ఉత్తమ బుధుల చేత, ఊహింపదగినవి; ప్రయోగాణాం, యావదర్థాః, తావత్ కరాః భేదాః, స్మృతాః=ప్రయోగాలకు, ఎన్ని విధాలయిన అర్థాలు ఉన్నాయో అన్ని విధాలయిన హస్తభేదాలు, చెప్పబడినవి; అర్థాత్, ప్రకరణాత్, లింగాత్, ఔచిత్యాత్, అర్థనిర్ణయః =అర్థం, ప్రకరణం (=సందర్భం), లింగం, ఔచిత్యం (వీటిని బట్టి) అర్థ నిర్ణయం (చేయవలెను); తత్ తత్ సమ్యక్ సమాలోచ్య, సంగృహ్య, ఉక్తం ఇదం మయా =ఆయా విషయాల నన్నింటిని బాగుగా పరిశీలించి, సంగ్రహంగా, ఇది నా చేత చెప్పబడినది; సమాలోచ్య, శాస్త్రతః, భావజ్ఞైః, ప్రయోక్తవ్యం = (కావున) బాగుగా ఆలోచన చేసి, శాస్త్రానుగుణంగా, భావజ్ఞుల చేత, ప్రయోగింపదగును.

తాత్పర్యం: పదునెనిమిది జాతుల హస్తాలు వారి వారి పనులకు తగినట్లుగా ఉంటాయి. ఆయా దేశాల జనుల హస్తాలను కూడా ఈ విధంగానే ఊహించవలెను. ప్రయోగాలకు ఎన్ని విధాలయిన అర్థాలు ఉంటాయో అన్ని విధాలయిన హస్తభేదాలు ఉన్నాయి. ఈ హస్తాలను అర్థం, సందర్భం, లింగం, ఔచిత్యం అనే వాటిని అనుసరించి అర్థనిర్ణయం చేసి, ప్రయోగించవలెను. ఆయా విషయాలనన్నింటిని బాగుగా పరిశీలించి, సంగ్రహంగా ఈ హస్తాలను

చెప్పాను. కావున భావవేత్తలు కూడా బాగుగా ఆలోచించి, శాస్త్రానుగుణంగా ప్రయోగాలు చేయదగును.

టీక : 623, 624 శ్లోకపాదాలు ఘోష్ పాఠంలో లేవు.

## బాంధవహస్తాలు

**అథైకాదశ బాంధవ్యాః తేషాం లక్షణముచ్యతే ॥** 625

అర్థం : అథ - ఏకాదశ, బాంధవ్యాః = ఇంక పదకొండు, బాంధవ్యాలు (కలవు); తేషాం, లక్షణం, ఉచ్యతే = వాటియొక్క (= బాంధవ్యాలు తెలిపే హస్తాల యొక్క), లక్షణం చెప్పబడు తున్నది.

తాత్పర్యం : లోకంలో పదకొండు బాంధవ్యాలు (= బంధుత్వాలు) కలవు: ఆ బాంధవ్యాలను తెలిపే హస్తాల యొక్క లక్షణం ఇప్పుడు చెప్పబడుతున్నది.

టీక : ఈ శ్లోక పాదం ఘోష్‌లో లేదు. నిజానికి ఈ శీర్షిక క్రింద 13 హస్తాలు చెప్పబడినవి - దంపతి, మాతృ, పితృ, శ్వశ్రూ, శ్వశుర, భర్తృభ్రాతృ, ననాంద్రృ, జ్యేష్ఠభ్రాతృ, కనిష్ఠభ్రాతృ, పుత్ర, స్నుషా, భర్తృ, సపత్నీ హస్తాలు. వీటిలో పుత్రహస్తం నీడా పాఠంలో లేదు. భర్తృ హస్తం ఘోష్ పాఠంలో లేదు,

మొత్తం మీద చెల్లెలు, అక్క, భార్య, కుమార్తె, అల్లుడు అనే ప్రసిద్ధ బాంధవ్యాలకు ప్రత్యేకంగా హస్తాలు చెప్పబడ లేదు. మాతృహస్తమే కుమార్తెకు, పితృహస్తమే అల్లునికి చెల్లుతాయని తరువాత చెప్పబడినది. అల్లే తక్కినవాటిని ఆచార్యుడు సంప్రదాయానుసారంగా ప్రయోగించవలెను.

ఇచ్చటనుంచి చెప్పబడుతున్న హస్తాలు ఏవీ కూడా నాట్య శాస్త్రంలో లేవు. ఇవి తరువాతి కాలంలో పెంపొందినవే. అసంయుత-

సంయుత హస్తాలను వివరించిన తరువాత భరతముని ఇట్లా. పేర్కొన్నాడు. "......అర్థసహితములైన ఇతర లౌకికహస్తములింకను చాలా కలవు. ఆచార్యబుద్ధి ననుసరించి వానిని రస - భావ (= స్థాయిభావ - వ్యభిచారిభావ) సూచకములగువట్లుగా ప్రయోగింప దగును. దేశమును, కాలమును, ప్రయోగమును, అర్థయుక్తిని విశేషముగా విచారించి, స్త్రీ - పురుషులీ హస్తములను ప్రయోగించవలెను." (తె. నా. శా. పుట 308)

## 1. దంపతిహస్తం :

వామే తు శిఖరం ధృత్వా దక్షిణే మృగశీర్షకః ।
ధృతః స్త్రీపుంసయోః హస్తః ఖ్యాతో భరతకోవిదైః ॥ 626

అర్థం : వామే (తు), శిఖరం, ధృత్వా = ఎడమచేత, శిఖర (హస్త)ం, ధరించి; కుడిచేత, మృగశీర్ష (క) (హస్త)ం, పట్టితే (అది); స్త్రీపుంసయోః హస్తః, భరతకోవిదైః, ఖ్యాతః = స్త్రీ పురుష (= దంపతి) హస్తం (అని), భరత కోవిదుల చేత, చెప్ప బడినది.

తాత్పర్యం : ఎడమచేత శిఖరహస్తం, తరువాత కుడిచేత మృగశీర్షహస్తం పట్టితే, అది దంపతి (= భార్యాభర్తల = ఆలుమగల) హస్తం అని భరతవేత్తలు చెప్పినారు.

## 2. మాతృహస్తం :

హస్తే వామే ఒర్ధచంద్ర శ్చ సందంశో దక్షిణే కరే।
ఆవర్తయిత్వా జఠరే వామహస్తం తతఃపరమ్ ॥ 627

స్త్రియాః కరౌ ధృతో మాతృహస్త ఇత్యుచ్యతే బుధైః ।
జనన్యాం చ కుమార్యాం చ మాతృహస్తో నియుజ్యతే ॥ 628

అర్థం : వామేహస్తే, అర్ధచంద్రః (చ), దక్షిణేకరే, సందంశః = ఎడమచేత అర్ధచంద్ర(హస్తం), కుడిచేత సందంశ (హస్త)ం (పట్టి); వామహస్తం, జఠరే, అవర్తయిత్వా = ఎడమ చేతిని, పొట్టకు ఎదురుగా, త్రిప్పి; తతఃపరమ్, స్త్రియాః కరః, ధృతః = అటుపిమ్మట, స్త్రీ హస్తం, పట్టితే (అది); మాతృహస్తః, ఇతి, బుధైః, ఉచ్యతే = మాతృ(=తల్లి) హస్తం; అని, బుధుల చేత చెప్పబడుతున్నది.

జనన్యాం(చ), కుమార్యాం(చ), మాతృహస్తః, నియుజ్యతే = తల్లియందు, కుమార్తెయందు, మాతృహస్తం, ఉపయుక్త మవుతున్నది.

తాత్పర్యం : ఎడమచేత అర్ధచంద్రహస్తం, కుడిచేత సందంశ హస్తం పట్టి, ఎడమచేతిని పొట్టకు లేదా నాభికి ఎదురుగా త్రిప్పి, పిమ్మట స్త్రీ హస్తం ధరిస్తే, అది మాతృహస్తం అవుతుంది.

జనని(=తల్లి), కుమార్తె అనే అర్థములందు మాతృహస్తం వినియోగపడుతుంది.

టీక : స్త్రీ హస్తం ఎక్కడా నిర్వచింపబడలేదు. కాని ఒక చేతిని పొట్టమీద ఉంచి, కడుపును సూచించితే అది స్త్రీ హస్తం కాదగునని కుమారస్వామి సూచన.

### 3. పితృ హస్తం :

ఏతస్మిన్ మాతృహస్తే తు శిఖరోదక్షిణేనతు ।
ధృతఃచేత్ నాట్యశాస్త్రజ్ఞైః పితృహస్తో ఽయ ముచ్యతే ॥ 629

అయం హస్తస్తు జనకే జామాతరిచ నియుజ్యతే ।

అర్థం : ఏతస్మిన్ మాతృహస్తే(తు), దక్షిణేన(తు) శిఖరః, ధృతఃచేత్ = ఈ మాతృ హస్తమందు, కుడిచేత శిఖరహస్తం,

పట్టితే; అయం, పితృహస్తః, నాట్యశాస్త్రజ్ఞైః, ఉచ్యతే = ఇది, పితృహస్తం (అవుతుందని), నాట్య శాస్త్రవేత్తలచేత (మనీషిభిః = మనీషులచేత-ఘోష్) చెప్పబడుతున్నది.

అయం హస్తం (తు) జనకే, జామాతరి(చ), నియుజ్యతే = ఈ హస్తం తండ్రి, అల్లుడు అనే అర్థములందు. నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : మాతృ హస్తమందలి కుడిచేత శిఖరహస్తం పట్టితే, అది 'పితృహస్తం' అవుతుందని నాట్య శాస్త్రవేత్తలు చెప్పినారు.

తండ్రి, అల్లుడు అనే అర్థములందు ఈ హస్తం ఉపయోగిస్తుంది.

టీక : అల్లుని హస్తాన్ని మాతృభూతయ్య వేరుగా వివరించినాడు: "వామ హస్తంచేత పద్మకోశం, దక్షిణ హస్తంచేత శిఖర హస్తం పట్టితే, అది అల్లుని హస్తం అవుతుంది."

## 4. శ్వశ్రూ హస్తం

విన్యస్య కంఠే హంసాస్యం సందంశం దక్షిణే కరే ॥ 630

ఉదరే చ పరావృత్య వామహస్తం తతః పరమ్ ॥

స్త్రియాః కరో ధృతః శ్వశ్రూహస్తః తస్యాం నియుజ్యతే ॥ 631

అర్థం : కంఠే, హంసాస్యం, విన్యస్య = కంఠమందు (ఎడమ చేతితో) హంసాస్యహస్తం, ఉంచి; దక్షిణేకరే, సందంశం = కుడి చేతితో సందంశహస్తం పట్టి; వామహస్తం ఉదరే(చ) పరావృత్య = ఎడమచేతిని పొట్టమీద త్రిప్పి (పరామృశ్య = స్పృశించి — ఘోష్); తతఃపరమ్ స్త్రియాః కరః ధృతః = అటుపిమ్మట స్త్రీహస్తం పట్టితే (అది); శ్వశ్రూ హస్తః = శ్వశ్రూ (= అత్త) హస్తం (అవుతుంది).

తస్యాం నియుజ్యతే = అందే(= అత్త అనే అర్థమందే) ఈ హస్తం వినియోగపడుతున్నది.

తాత్పర్యం : ఎడమచేత హంసాస్య హస్తం, కుడిచేత సందంశ హస్తం పట్టి, మొదట ఎడమచేతిని కంఠమందుంచి, తరువాత పొట్టకెదురుగా త్రిప్పి లేదా పొట్టను స్పృశించి, పిమ్మట స్త్రీ హస్తం పట్టితే అది శ్వశ్రూహస్తం అవుతుంది.

అత్త అనే అర్థమందు ఈ హస్తం ఉపయోగిస్తుంది.

## 5. శ్వశురహస్తం :

ఏతస్యాంతే తు హస్తస్య శిఖరో దక్షిణే యది ।

ధృతశ్చ శ్వశురస్యాయం హస్త ఇత్యుచ్యతే బుధైః ॥ 682

అర్థం : ఏతస్య హస్తస్య-అంతే(తు), దక్షిణే, శిఖరః, ధృతః(చ) యది = దాని(= అ శ్వశ్రూహస్త) చివర, కుడిచేత, శిఖరహస్తం, పట్టితే; అయం, శ్వశురస్య, హస్తః, ఇతి, బుధైః, ఉచ్యతే = ఇది, శ్వశుర(= మామయొక్క) హస్తం అని బుధుల చేత, చెప్పబడుతున్నది. (శ్వశురహస్తః స్యాత్, తస్మిన్ ఏవ-నియుజ్యతే = శ్వశురహస్తం అవుతుంది. అందే అంటే మామ విషయం లోనే అది వినియుక్తమవుతున్నది — నీడా).

తాత్పర్యం : శ్వశ్రూహస్తం చివర, కుడిచేత శిఖరహస్తం పట్టితే, అది శ్వశురహస్తం అవుతుంది.

మామ అనే అర్థమందే అది ఉపయోగపడుతుంది.

## 6. భర్తృభ్రాతృహస్తం :

వామే తు శిఖరం ధృత్వా పార్శ్వయోః కర్తరీముఖః ।

ధృతో దక్షిణహస్తేన భర్తృభ్రాతృకరః స్మృతః ॥ 683

అర్థం : వామే(తు) శిఖరం ధృత్వా, దక్షిణహస్తేన కర్తరీ ముఖః, పార్శ్వయోః, ధృతః = ఎడమచేత శిఖరహస్తం ధరించి, కుడిచేత కర్తరీముఖ హస్తం — రెండు పార్శ్వములందు ధరిస్తే (అది); భర్తృభ్రాతృకరః, స్మృతః = భర్తృ భ్రాతృ (= భర్త సోదరుడు = బావ లేదా మఱది) హస్తం, (అని) చెప్పబడినది. (ఎడమ చేతితో శిఖరహస్తం ఎడమప్రక్కను, కుడిప్రక్కను కుడిచేతితో కర్తరీ ముఖహస్తం పట్టితే భర్తృ భ్రాతృహస్తం అవుతుంది — ఘోష్).

తాత్పర్యం : ఎడమచేత శిఖరహస్తం పట్టి, కుడిచేతితో కర్తరీ ముఖహస్తం రెండు ప్రక్కల ధరిస్తే భర్తృభ్రాతృ హస్తం అవుతుంది లేదా ఎడమప్రక్కను ఎడమచేతితో శిఖరహస్తం, కుడి ప్రక్కను కుడిచేతితో కర్తరీముఖ హస్తం పట్టితే అది భర్తృభ్రాతృ హస్తం అవుతుంది.

## 7. ననాంధృహస్తం :

> భర్తృభ్రాతృ కరస్యాంతే స్త్రీహస్తో దక్షిణే కరే ।
> ధృతో ననాంధృహస్తః స్యా దితి నాట్యవిదాం మతమ్ ॥ 684

అర్థం : భర్తృ భ్రాతృకరస్య - అంతే, దక్షిణేకరే, స్త్రీ హస్తః, ధృతః = భర్తృ భ్రాతృహస్తం చివర, (= ఆ హస్తమందలి) కుడిచేత, స్త్రీ హస్తం, పట్టితే; ననాంధృహస్తః, స్యాత్, ఇతి, నాట్య విదాం, మతమ్ = (అది) ననాంధృ (= వదినె లేదా మరదలు = భర్త సోదరి) హస్తం, అవుతుంది, అని నాట్యవిదుల, సిద్ధాంతం. (ననాంధృహస్తః స్యాత్, తస్యాం ఏవ నియుజ్యతే = ననాంధృ హస్తం అవుతుంది; అందే అంటే ననాంధృ విషయంలోనే అది నియుక్తమవుతుంది - సీతా).

తాత్పర్యం : భర్తృభ్రాతృ హస్తం చివరి కుడిచేత స్త్రీ హస్తం — పట్టితే, అది ననాంధృహస్తం అవుతుంది అని నాట్య విదుల మతం.

ననాంధృ — విషయంలోనే ఈ హస్తం చెల్లుతుంది.

## 8, 9. జ్యేష్ఠ-కనిష్ఠ భ్రాతృహస్తాలు :

మయూరహస్తః పురతః పార్శ్వభాగే చ దర్శితః ।
జ్యేష్ఠభ్రాతుః కనిష్ఠస్యాప్యయం హస్త ఇతి స్మృతః ॥ 685

అర్థం : మయూరహస్తః, పురతః, పార్శ్వ భాగే(చ), దర్శితః = మయూరహస్తం, ముందుభాగంలో, పార్శ్వమందు (పశ్చాద్భాగే = వెనుక భాగమందు — నీడా) చూపబడితే; అయం, జ్యేష్ఠ - భ్రాతుః, కనిష్ఠస్య-అపి, హస్తః, ఇతిస్మృతః = ఇది జ్యేష్ఠ భ్రాతృ(= అన్న) హస్తం, కనిష్ఠ భ్రాతృ(= తమ్ముడు) హస్తం కూడా అవుతుందని చెప్పబడినది.

తాత్పర్యం : మయూరహస్తం ముందు భాగమున, పార్శ్వమందు (లేదా వెనుకభాగమందు) పట్టితే, అది జ్యేష్ఠ భ్రాతృహస్తం, కనిష్ఠ భ్రాతృహస్తం కూడా అవుతుంది.

టీక : ఒకేహస్తం ఇరువురిని తెలుపుతుందన్నట్లుగా కుమార స్వామి అనువాదం. ఘోష్ అనువాదం అటూ, ఇటూ కాకుండా ఉన్నది. రెండు మయూరహస్తాలను ముందుభాగంలో పట్టితే జ్యేష్ఠ భ్రాతృ(= అన్న) హస్తం అవుతుందనీ, ప్రక్కను లేదా వెనుకను పట్టితే కనిష్ఠ భ్రాతృ(= తమ్ముని) హస్తం అవుతుందనీ చెప్పవచ్చు నేమో? ఇందుకు సంప్రదాయజ్ఞులే ప్రమాణం.

మాతృభూతయ్య క్రిందివిధంగా వివరించినాడు : అన్న హస్తం - ఎడమచేత శిఖరం, కుడిచేత అర్ధపతాకం పట్టాలి. తమ్ముని హస్తం - ఎడమచేత శిఖరం, కుడిచేత త్రిపతాకం పట్టాలి.

## 10. పుత్రహస్తం :

సందంశ ముదరే న్యస్య భ్రామయిత్వా తతఃపరమ్ ।

ధృత్వా వామేన శిఖరం పుత్రహస్తః ప్రకీర్తితః ॥ 686

అర్థం : సందంశం ఉదరేన్యస్య, భ్రామయిత్వా, తతఃపరమ్, వామేన శిఖరం, ధృత్వా = సందంశహస్తం ఉదరం మీద పట్టి, త్రిప్పి లేదా చలింపజేసి, అటు పిమ్మట, ఎడమచేత, శిఖరహస్తం, పట్టితే (అది); పుత్రహస్తః, ప్రకీర్తితః = పుత్రహస్తం (అని) కీర్తింపబడినది.

తాత్పర్యం : సందంశహస్తం పొట్టమీద పట్టి, చలింపజేసి, పిమ్మట ఎడమచేత శిఖరహస్తం పట్టితే అది పుత్ర (= కొడుకు) హస్తం అవుతుంది.

టీక : ఈ హస్తం నీడాలో లేదు.

## 11. స్నుషా హస్తం :

ఏతదంతే దక్షిణేన స్త్రీహస్తశ్చ ధృతో యది ।

స్నుషాహస్త ఇతి ఖ్యాతో భరతాగమకోవిదైః ॥ 687

అర్థం : ఏతత్-అంతే, దక్షిణేన, స్త్రీ హస్తః (చ), ధృతః యది = పుత్ర (జ్యేష్ఠ-కనిష్ఠ భ్రాతృ-నీడా) హస్తం చివర, కుడిచేత, స్త్రీహస్తం, పట్టితే (అది); స్నుషాహస్తః, ఇతి, భరతాగమకోవిదైః, ఖ్యాతః = స్నుషా (= కోడలు) హస్తం, అవుతుందని, భరతవేద వేత్తలచేత, చెప్పబడినది.

తాత్పర్యం : పుత్ర (లేదా జ్యేష్ఠ-కనిష్ఠ భ్రాతృ) హస్తం చివర, కుడిచేత స్త్రీహస్తం పట్టితే అది స్నుషాహస్తం అవుతుందని భరతవేదవేత్తల మతం.

## 12. భర్తృ హస్తం :

విన్యస్య కంఠే హంసాస్యో శిఖరో దక్షిణే కరే ।

భర్తృహస్త ఇతి ఖ్యాతః తస్మిన్నేవ నియుజ్యతే ॥ 688

అర్థం : కంఠే, హంసాస్యౌ విన్యస్య, దక్షిణేకరే, శిఖరః = కంఠం మీద (= వద్ద), హంసాస్య హస్తాలు ఉంచి, (తరువాత) కుడి చేత శిఖరహస్తం (పట్టితే అది); భర్తృహస్తః, ఇతి, ఖ్యాతః = భర్తృ (= భర్త) హస్తం అవుతుంది అని, చెప్పబడినది.

తస్మిన్-ఏవనియుజ్యతే = (ఈ హస్తం) అందే (= భర్తృ విషయమందే) వినియుక్తమవుతున్నది.

తాత్పర్యం : కంఠం వద్ద హంసాస్య హస్తాలను ఉంచి, కుడి చేత శిఖర హస్తం పట్టితే, అది భర్తృ హస్తం అవుతుంది.

భర్త అనే అర్థమందే ఈ హస్తం వినియోగపడుతుంది.

టీక : ఈ హస్తం ఘోష్ పాఠంలో లేదు. భార్య హస్తం ఇచ్చట చెప్పబడలేదు. కాని, మాతృభూతయ్య భార్య హస్తాన్ని ఇట్లా వర్ణించినాడు: "వామహస్తంతో హంసహస్తం కంఠందగ్గర పట్టి, దక్షిణహస్తంతో సందంశం నాభిదగ్గర పట్టితే, అది భార్యాహస్తం అవుతుంది".

## 13. సపత్ని హస్తం :

దర్శయిత్వా పాశహస్తం కరాభ్యాం స్త్రీకరా వుభౌ ।
ధృత్వా సపత్నీహస్తః స్యాదితి భావవిదో విదుః ॥ 639

అర్థం : పాశహస్తం, దర్శయిత్వా = పాశహస్తం చూపించి; కరాభ్యాం, ఉభౌ స్త్రీకరౌ, ధృత్వా = (పిమ్మట) చేతులతో రెండు స్త్రీ హస్తాలను ధరించితే (అది), సపత్నీహస్తః, స్యాత్, ఇతి, భావ విదో, విదుః = సపత్ని (= సవతి) హస్తం, అవుతుంది అని, భావ విదులు, తెలిసికొందురు.

[సపత్న్యాహస్తః స్యాత్; తస్యాం ఏవనియుజ్యతే = సపత్ని హస్తం అవుతుంది; దానియందే (= సపత్ని విషయమందే) ఇది ప్రయుక్తమవుతున్నది — నీడా].

తాత్పర్యం : మొదట పాశహస్తం పట్టి, తరువాత రెండు చేతులతో స్త్రీ హస్తాలను పట్టితే, అది సపత్నీహస్తం అవుతుంది.

సపత్ని అనే అర్థంలో ఇది ప్రయుక్తమవుతుంది.

**ఇత్యేకాదశ బాంధవ్యహస్తాః సందర్శితాః క్రమాత్ ।**

**అనుక్తానాం తు బంధూనాం జ్ఞేయాః కర్మానుసారతః ॥ 640**

అర్థం : ఇతి-ఏకాదశ బాంధవ్యహస్తాః, క్రమాత్, సందర్శితాః = ఇట్లా పదకొండు బాంధవ్యహస్తాలు, క్రమంగా చూపబడినాయి; అనుక్తానాం(తు) బంధూనాం, కర్మానుసారతః, జ్ఞేయాః = (ఇక్కడ) చెప్పబడని బంధువుల యొక్క హస్తాలు, వారి వారి క్రియలను అనుసరించి తెలిసికోదగినవి.

తాత్పర్యం : ఇచ్చట పదకొండు బాంధవ్య హస్తాలు క్రమంగా చెప్పబడినవి. ఇచ్చట చెప్పబడని బంధువులయొక్క హస్తాలను వారు చేసే పనులనుబట్టి తెలిసికోవలెను.

టీక : మొత్తం 18 హస్తాలు చెప్పబడినవని ఇంతకుముందు వివరించాను. ఈ రెండు పాదాలు ఘోష్‌లో లేవు.

# 11

# గ్రహ - రాజ - సముద్ర - నదీ - లోక హస్తాలు

## నవగ్రహ హస్తాలు

### 1. సూర్యహస్తం :

అంసోపకంఠే హస్తాభ్యా మలపద్మకపిత్థకౌ ।
ధృతౌ యది కరో హ్యేష దివాకరకరః స్మృతః ॥ 641

అర్థం : అంస-ఉపకంఠే, హస్తాభ్యాం, అలపద్మ-కపిత్థకౌ ధృతౌ యది = భుజ శిరస్సులమీద, రెండు చేతులతో, (వరుసగా) అలపద్మ - (సోలపద్మ - నీడా) కపిత్థ హస్తాలను ధరిస్తే; ఏషకరః, దివాకరకరః, స్మృతః = ఈ హస్తం, సూర్యహస్తం (అని) స్మరింప బడినది.

తాత్పర్యం : భుజ శిరస్సులమీద రెండు చేతులతో అలపద్మ (లేదా సోలపద్మ) - కపిత్థ హస్తాలను ధరించితే, అది సూర్యగ్రహ హస్తం అవుతుంది (దివాకర - సూర్యపదాలు రెండూ పర్యాయ పదాలు).

టీక : నవగ్రహ హస్తాలు నాట్యశాస్త్రంలో లేవు. నవ గ్రహాలు : సూర్య, చంద్ర, అంగారక (=కుజ), బుధ, బృహస్పతి (=గురు), శుక్ర, శని (=మంద), రాహు, కేతువులు. మాతృభూతయ్య సూర్య-చంద్ర హస్తాలు రెండే చెప్పినాడు.

## 2. చంద్ర హస్తం :

అలపద్మో వామహస్తే దక్షిణే పతాకికా ।
నిశాకరకరః ప్రోక్తో భరతాగమదర్శిభిః ॥ 642

అర్థం : వామహస్తే అలపద్మః, దక్షిణే (చ) పతాకికా — ఎడమచేత అలపద్మ (సోలపద్మ - నీడా) హస్తం, కుడిచేత పతాక హస్తం (పట్టితే, అది); నిశాకరకరః భరతాగమదర్శిభిః, ప్రోక్తః — చంద్ర హస్తం (అని), భరతాగమవేత్తలచేత చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమచేత అలపద్మ లేదా సోలపద్మ హస్తం, కుడిచేత పతాకహస్తం పట్టితే అది చంద్రగ్రహ హస్తం అవుతుందని భరతవేదవేత్తల మతం.

## 3. అంగారక హస్తం :

వామే కరే తు సూచీ స్యా న్ముష్టిహ స్త స్తు దక్షిణే ।
ధృత శ్చే న్నాట్యశాస్త్రజ్ఞై రంగారకకరః స్మృతః ॥ 643

అర్థం : వామేకరే(తు) సూచీస్యాత్, దక్షిణే ముష్టి హస్తః (తు), ధృతఃచేత్ — ఎడమచేత సూచీహస్తం, కుడిచేత ముష్టిహస్తం, ధరిస్తే (అది); అంగారకకరః, నాట్యశాస్త్రజ్ఞైః, స్మృతః — అంగారక (— కుజ) హస్తం (అని), నాట్యశాస్త్రజ్ఞులచేత స్మరింపబడినది.

తాత్పర్యం : ఎడమచేతితో సూచీహస్తం, కుడిచేతితో ముష్టిహస్తం పట్టితే, అది అంగారకగ్రహ హస్తం అవుతుందని నాట్యశాస్త్రజ్ఞులచేత చెప్పబడినది.

## 4. బుధ హస్తం :

తిర్యగ్వామే చ ముష్టిః స్యా ద్దక్షిణే చ పతాకికా ।
బుధగ్రహకరః ప్రోక్తో భరతాగమవేదిభిః ॥ 644

అర్థం : వామే (చ), తిర్యక్-ముష్టిః, దక్షిణే (చ) పతాకికా స్యాత్ = ఎడమచేత అడ్డంగా ముష్టిహస్తం, కుడిచేత పతాకహస్తం ఉంటే (అది); బుధగ్రహాకరః, భరతాగమవేదిభిః, ప్రోక్తః = బుధ గ్రహ హస్తం (అవుతుందని) భరతాగమవేత్తలచేత చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమచేతితో అడ్డంగా ముష్టిహస్తం, కుడి చేతితో పతాకహస్తం పట్టితే, అది బుధగ్రహాహస్తం అవుతుందని భరతాగమవేత్తలు చెప్పినారు.

## 5. బృహస్పతి హస్తం :

హస్తాభ్యాం శిఖరం ధృత్వా యజ్ఞసూత్రస్య దర్శనమ్ ।
ఋషిబ్రాహ్మణహస్తోఽయం గురో శ్చాపి ప్రకీర్తితః ॥ 643

అర్థం : హస్తాభ్యాం శిఖరం ధృత్వా, యజ్ఞ సూత్రస్య దర్శనమ్ = రెండు చేతులతో శిఖర హస్తం పట్టి, జందెం చూపించటం (జరిగితే);అయం, ఋషి-బ్రాహ్మణహస్తః, గురోః(చ) (అపి) ప్రకీర్తితః = ఇది, ఋషిహస్తం, బ్రాహ్మణహస్తం, గురు (= బృహస్పతి) హస్తం అని కూడా కీర్తింపబడినది.

తాత్పర్యం : రెండు చేతులతో శిఖరహస్తం పట్టి, జందెం చూపితే, అది బృహస్పతి హస్తం అవుతుంది. ఇది ఋషిహస్తం, బ్రాహ్మణ హస్తం కూడా అవుతుంది.

## 6. శుక్రహస్తం :

వామోర్ధ్వభాగే ముష్టిః స్యా దధస్తా ద్దక్షిణే తథా ।
శుక్రగ్రహకరః ప్రోక్తో భరతాగమవేదిభిః ॥ 340

టీక: వామ — ఊర్ధ్వభాగే, తథా దక్షిణే అధస్తాత్, ముష్టిః స్యాత్ = ఎడమప్రక్కను మీదుగాను, అట్లే కుడిప్రక్కను క్రిందుగాను ముష్టిహస్తాలు పట్టితే (అది); శుక్రగ్రహాకరః భరతాగమ

వేదిభిః, ప్రోక్తః = శుక్రగ్రహహస్తం (అని) భరతాగమవేత్తలచేత, చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమప్రక్కను మీదుగాను, కుడిప్రక్కను క్రిందుగాను ముష్టిహస్తాలు ఉంటే, అది శుక్రగ్రహ హస్తం అవుతుందని భరతాగమవేత్తలు చెప్పినారు.

## 7. శని(=శనైశ్చర)హస్తం :

వామే కరే తు శిఖర స్త్రిశూలో దక్షిణే కరే ।
శనైశ్చరకరః ప్రోక్తో భరతాగమకోవిదైః ॥ 647

అర్థం : వామేకరే(తు) శిఖరః, దక్షిణేకరే త్రిశూలః = ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత త్రిశూలహస్తం (పట్టితే, అది); శనైశ్చరకరః, భరతాగమకోవిదైః, ప్రోక్తః = శనైశ్చర (= శని గ్రహ) హస్తం (అని), భరతాగమవేత్తలచేత, చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమచేతితో శిఖరహస్తం, కుడిచేతితో త్రిశూలహస్తం పట్టితే అది 'శనిగ్రహ హస్తం' అవుతుందని భరతాగమవేత్తలు చెప్పినారు.

## 8. రాహుహస్తం :

సర్పశీర్షో వామకరే సూచీ స్యా ద్దక్షిణే కరే ।
రాహుగ్రహకరః ప్రోక్తో భరతాగమకోవిదైః ॥ 648

అర్థం : వామకరే సర్పశీర్షః, దక్షిణకరే సూచీ, స్యాత్ = ఎడమచేత సర్పశీర్షహస్తం, కుడిచేత సూచీహస్తం, ఉంటే (అది); రాహుగ్రహకరః, భరతాగమకోవిదైః, ప్రోక్తః = రాహుగ్రహ హస్తం (అని), భరతాగమకోవిదులచేత చెప్పబడినది.

తాత్పర్యం : ఎడమచేతితో సర్పశీర్ష హస్తం, కుడిచేతితో సూచీహస్తం పట్టితే, అది 'రాహుగ్రహహస్తం' అవుతుందని భరతాగమ కోవిదులు చెప్పినారు.

## 9. కేతుహస్తం :

వామే కరే తు సూచీ స్యా ద్దక్షిణే తు పతాకికా ।
కేతుగ్రహకరః ప్రోక్తో నాట్యవిద్యాధిపైర్జనైః ॥ 649

అర్థం : వామేకరే(తు) సూచీ, దక్షిణే(తు) పతాకికా స్యాత్ = ఎడమచేత సూచీహస్తం, కుడిచేత పతాక (అర్ధపతాక-నీడా) హస్తం ఉంటే (అది); కేతుగ్రహకరః, నాట్య విద్యాధిపైః జనైః, ప్రోక్తః = కేతుహస్తం (అని), నాట్య విద్యాధిపులైన జనులచేత (భరతాగమవేదిభిః = భరతాగమవేత్తలచేత — నీడా) చెప్ప బడినది.

తాత్పర్యం : ఎడమచేతితో సూచీహస్తం, కుడిచేతితో పతాకహస్తం (లేదా అర్ధపతాక హస్తం) పట్టితే అది 'కేతుగ్రహ హస్తం' అవుతుందని నాట్యవిద్యావేత్తలు లేదా భరతాగమవేత్తలు చెప్పినారు.

టీక : సూర్యహస్తంలో తప్ప, తక్కిన అన్ని గ్రహ హస్తాలలోను భరతాగమం అంటే నాట్యశాస్త్రం స్మరింపబడింది. నవగ్రహ హస్తాలు నాట్యశాస్త్రంలో లేవని ముందే పేర్కొన్నాను. ఇట్లా భరతాగమాన్ని స్మరించటంలో ఉద్దేశం సంప్రదాయానికి బలం చేకూర్చటం కావచ్చు.

## ప్రసిద్ధ రాజహస్తాలు

శుకతుండో హరిశ్చంద్రే మయూరో నళభూపతౌ ।
పురుకుత్సే ఽలపద్మాఖ్యో ముష్టిహస్తః పురూరవే ॥ 649

అలపద్మః శిరస్థాయీ సగరార్థే నియుజ్యతే ।
దిలీపాఖ్యే పతాకః స్యా దంబరీషే తు కర్తరీ ॥ 650

శిబిరాజ్ఞి కపిత్థః స్యా త్పురోభాగే ప్రచాలితః ।
ఉభౌ పతాకౌ భుజయోః అంతే దేవవిభావనే ॥ 651

కథితా కార్తవీర్యే తు విరళాంగుష్ఠరంధ్రకౌ ।
ఏతావహో త్సుంభితౌ చే ద్రావణార్థే ప్రకీర్తితౌ ॥ 652

భుజదేశే ప్రచలితః సూచిః స్యా ద్ధర్మరాజకే ।
త్రిపతాకః పురోభాగే చాలితః పునఃపునః ॥ 653

అర్జునార్థే నాట్యభేదే యుజ్యతే నాట్యవేదిభిః ।
భీమే ముష్టిః పురోభాగే చలితో యది కల్ప్యతే ॥ 654

ఉక్తః కైబ్యే సూచి రేవ కించి దుద్వేష్టితాంగుళః ।
కటకో నకులార్థే చ శిఖరః సహదేవకే ॥ 655

నహుషే చలహస్తః స్యా ద్యయాతౌ తామ్రచూడకః ।
అర్ధచంద్రకరః సోఽయం త్రిపతాకాకృతిః భవేత్ ॥ 656

భగీరథార్థే యోజ్యః స్యా ద్రాహ్వగ్రస్తేందుమండలే ।
మాంధాతాగ్రిమభూపాలే మరుత్వా నితి భూభుజి ॥ 657

నిరూపణార్థే ముకుళః సూచీ ముష్టికరో ఽపి చ ।
కరోఽప్యర్ధపతాకః స్యా దుద్వేష్టితతనుం భజన్ ॥ 658

ఏతే చతుర్విధాహసాః ప్రయోజ్యంతే యథాక్రమాత్ ।
రఘావజమహీపాలె దక్షిణేతరభాగతః ॥ 659

క్రమేణ పరియోజ్యేతే పూర్వోక్తార్ధపతాకకౌ
అలపద్మః స్వస్తికః చే ద్యోజ్యోక్త ద్దశరథే నృపే ॥ 660

రామే శిఖరహస్తోఽసౌ విశేషా చ్ఛాపపాణిషు
యోజ్యః శాస్త్రప్రయోగేషు పూర్వభూధర్మవిశారదైః ॥ 661

శిఖరోఽయం దక్షిణాంసగామీ చే ద్భరతే భవేత్ ।
అయం వామాంసగామీ చే ల్లక్ష్మణార్థే నియుజ్యతే ॥ ౬౬౨

అయం లలాటగామీ చేత్ శత్రుఘ్నార్థే నియుజ్యతే ।
సోమవంశే జనిజుషామేతే వామాంసయోజనాత్ ॥ ౬౬౩
కల్పితా నాట్యకుశలైః యుక్తధర్మ ప్రయోగతః ।

అర్థం : హారిశ్చంద్రే, శుకతుండః = హారిశ్చంద్రుని యందు, శుకతుండ హస్తం; నళభూపతౌ, మయూరః = నలభూపతియందు, మయూర హస్తం; పురుకుత్సే, అలపద్మ-ఆఖ్యః = పురుకుత్సుని యందు, అలపద్మహస్తం అనే పేరు గలది; పురూరవే, ముష్టిహస్తః = పురూరవునియందు, ముష్టిహస్తం; శిరస్థాయీ, అలపద్మః, సగరార్థే, నియుజ్యతే = శిరస్సు మీద చేర్చిన, అలపద్మ హస్తం, సగరుడు అనే అర్థమందు ప్రయుక్తమవుతున్నది; దిలీపాఖ్యే పతాకః, అంబరీషే (తు) కర్తరీ స్యాత్ = దిలీపుడనే పేరు గల (రాజు) విష యంలో పతాకహస్తం; అంబరీషునియందు కర్తరీహస్తం అవుతాయి; శిబిరాజ్ఞి, పురోభాగే ప్రచాలితః, కపిత్థః, స్యాత్ = శిబి అనే రాజు విషయంలో ముందు భాగమందు చలింపజేయబడిన కపిత్థ హస్తం చెల్లుతుంది.

విరళ-అంగుష్ఠ రంధ్రకౌ, ఉభౌ పతాకౌ, భుజయోః అంతే, దేవవిభావనే, కార్తవీర్యే (తు) కథితౌ = ఎడంగా ఉన్న అంగుష్ఠ రంధ్రాలు కల, రెండు పతాక హస్తాలు, భుజాల చివర = స్కంధాలవద్ద), దేవతా భావనగా (ధరింపబడితే) (అది), కార్త వీర్యుని యందు చెప్పబడినది.

ఏతౌ, పుంఖితౌ వహేత్ చేత్, రావణార్థే, ప్రకీర్తితౌ = ఆ హస్తాలే పుంఖితాలుగా ధరింపబడితే, రావణుడు అనే అర్థమందు కీర్తింపబడవవి.

భుజదేశే, ప్రచలితౌ, సూచీ, ధర్మరాజకే, స్యాత్ = భుజాం

వద్ద చలింపజేయబడిన సూచీహస్తం, ధర్మరాజు విషయంలో చెల్లుతుంది.

పురోభాగే, పునఃపునః, చాలితః, త్రిపతాకః = ముందు భాగమందు, మాటిమాటికి చలింపజేయబడిన త్రిపతాక హస్తం; అర్జునార్థే, నాట్యభేదే, నాట్యవేదిభిః, యుజ్యతే = అర్జునుడు అనే అర్థం వచ్చే నాట్యభేదంలో, నాట్యవేదులచేత ప్రయోగింపదగినది.

ముష్టిః, పురోభాగే, చలితః, యది, భీమే కల్ప్యతే = ముష్టి హస్తాన్ని ముందు భాగంలో చలింపజేస్తే, (అది) భీమునియందు చెల్లుతుంది.

సూచిః (ఏవ), కించిత్, ఉద్వేష్టిత-అంగుళిః, శైబ్యే, ఉక్తః = సూచీహస్తం, కొంచెం ఉద్వేష్టితమైన అంగుళి కలిగినది (అయితే అది), శైబ్యునియందు చెప్పబడినది.

కటకః, నకులార్థే; శిఖరః సహదేవకే = కటక హస్తం, నకులుడు అనే అర్థమందు; శిఖరహస్తం, సహదేవునియందు (చెల్లుతాయి).

చలహస్తః నహుషే, తామ్రచూడకః యయాతౌ స్యాత్ = నహుషునియందు చల (పతాక) హస్తం; యయాతి యందు తామ్రచూడ(క) హస్తం అవుతాయి.

సః అయం, అర్ధచంద్రకరః, త్రిపతాక-ఆకృతిః, భవేత్ = ఆయీ, అర్ధచంద్రహస్తం, త్రిపతాక ఆకారం కలది అయితే; భగీరథ-అర్థే, రాహుగ్రస్త-ఇందుమండలే, యోజ్యః, స్యాత్ = భగీరథుడు అనే అర్థమందు, రాహుగ్రస్తమైన చంద్రమండలమందు తగినది అవుతుంది.

మాంధాత-అగ్రిమభూపాలే, మరుత్వాన్ ఇతి భూభాజి నిరూపణార్థే = మాంధాత అనే రాజశ్రేష్ఠునియందు, మరుత్వంతుడు అనే రాజును నిరూపించుటయందు; ముకుళ-సూచీ-ముష్టికరః (అపి) (చ) = ముకుళ హస్తం, సూచీహస్తం, ముష్టిహస్తం; (అపి) ఉద్వేష్టిత

తనుంభజన్ స్యాత్ అర్ధపతాకకరః = ఉద్వేష్టితమై శరీరాన్ని తాకు తున్న అర్ధపతాకహస్తం; ఏతే, చతుర్విధా హస్తాః, యథాక్రమాత్, ప్రయోజ్యంతే = ఈ నాలుగు విధాలైన హస్తాలు యథాక్రమంగా ప్రయోజ్యములవుతాయి.

పూర్వోక్తౌ, అర్ధపతాకకౌ, దక్షిణేతర భాగతః, క్రమేణ రఘౌ-అజమహీపాలే పరియోజ్యేతే = ముందు చెప్పబడిన, అర్ధ పతాక హస్తాలు, కుడి-ఎడమ భాగములందు ఉంటే, క్రమంగా రఘు-అజ మహీపాలుర యందు చెల్లుతాయి.

అలపద్మః, స్వస్తికః చేత్, దశరథే నృపే, యోజ్యః = అల పద్మ హస్తం, స్వస్తికంగా ఉంటే, దశరథ మహారాజునందు చెల్లుతుంది.

శిఖరహస్తః రామే = శిఖరహస్తం రామునియందు; విశేషాత్, చాపపాణిషు = విశేషంగా చాపపాణులైన రాజులయందు; పూర్వ ధర్మవిశారదైః, శాస్త్ర ప్రయోగేషు యోజ్యః = ప్రాచీన ధర్మ వేత్తలచేత, శాస్త్రప్రయోగాలను అనుసరించి యోజింపదగును.

అయం శిఖరః, దక్షిణ-అంసగామీచేత్, భరతే, భవేత్ = ఈ శిఖరహస్తం, కుడి మూపురమునందుచేరితే, భరతునియందు తగును.

అయం, వామ-అంసగామీచేత్, లక్ష్మణ-అర్థే, నియుజ్యతే = ఈ హస్తాన్ని ఎడమ మూపురంమీద చేర్చితే, లక్ష్మణుడు అనే అర్థ మందు చెల్లుతుంది.

అయం, లలాటగామీచేత్, శత్రుఘ్న-అర్థే, నియుజ్యతే = ఈ హస్తమే, లలాటమందు ఉంటే, శత్రుఘ్నుడు అనే అర్థమందు నియుక్తమవుతుంది.

ఏతే, వామ-అంసయోజనాత్, సోమవంశేజనిజుషాం, యుక్త ధర్మ ప్రయోగతః, నాట్యకుశలైః కల్పితాః = ఈ హస్తాలు, ఎడమ

మూపురం మీద చేరితే, సోమ (= చంద్ర) వంశపు రాజుల యందు, ప్రయోగోచితంగా, నాట్యకుశలురచేత కల్పించబడినవి.

తాత్పర్యం : ప్రసిద్ధులైన ఆయా రాజులను తెలిపే హస్తాలు క్రింది విధంగా ఉంటాయి :

| రాజు | హస్తం |
|---|---|
| హరిశ్చంద్రుడు | శుకతుండం |
| నలుడు | మయూరం |
| పురుకుత్సుడు | అలపద్మం |
| పురూరవుడు | ముష్టి |
| సగరుడు | శిరస్సుమీద చేర్చిన అలపద్మం |
| దిలీపుడు | పతాకం |
| అంబరీషుడు | కర్తరి |
| శిబి | ముందు భాగంలో చలించే కపిత్థం |
| కార్తవీర్యుడు | ఎడంగా ఉన్న, అంగుష్ఠ రంధ్రాలు గల రెండు పతాక హస్తాలు దేవతాభావనగా ధరింపబడటం. |
| రావణుడు | పై హస్తాలే పుంఖితాలు కావటం |
| ధర్మరాజు | భుజమునొద్ద చలించే సూచి |
| అర్జునుడు | ముందు భాగంలో మాటిమాటికి చలించే త్రిపతాకం |
| భీముడు | ముందు భాగంలో చలించే ముష్టి |
| శైబ్యుడు | ఉద్వేష్టితమైన అంగుష్ఠశిఖల సూచి |

| | |
|---|---|
| నకులుడు | కటకం |
| సహదేవుడు | శిఖరం |
| నహుషుడు | చలపతాకం |
| యయాతి | తామ్రచూడం |
| భగీరథుడు, చంద్రగ్రహణం | పతాక ఆకారంగా ఉన్న అర్ధచంద్రం |
| మాంధాత, మరుత్వంతుడు | యథాక్రమంగా ముకుళ - సూచీ - ముష్టి హస్తాలు, ఉద్వేష్టితమై శరీరం తాకుతున్న అర్ధపతాక హస్తం |
| రఘువు | పై అర్ధపతాక, కుడి భాగంలో ఉన్నప్పుడు |
| అజుడు | పై అర్ధపతాక, ఎడమ భాగంలో ఉన్నప్పుడు |
| దశరథుడు | స్వస్తికం అయిన అలపద్మం |
| రాముడు | శిఖరం |
| చాపపాణులైన రాజులు | శిఖరం |
| భరతుడు | కుడి మూపురం మీద ఉన్న శిఖరం |
| లక్ష్మణుడు | ఎడమ మూపురం మీద ఉన్న శిఖరం |
| శత్రుఘ్నుడు | లలాటమందున్న శిఖరం |
| చంద్రవంశపు రాజులు | ఎడమ మూపురం మీద ఉన్న శిఖరం |

ఈ హస్తాల నన్నింటిని ప్రయోగాలకు తగినట్లు యోజింప వలెను.

టీక : ప్రసిద్ధ రాజ హస్తాలకు సంబంధించిన ఈ శ్లోకాలేవీ ఘోష్ పాఠంలో లేవు. నాట్యశాస్త్రంలో ఈ హస్తాలు చెప్పబడ లేదు.

## సప్తసముద్ర హస్తాలు

**లవణేక్షు సురాసర్పిర్దధిక్షీరజలార్ణవాః ॥ 664**

**ఏతేషాం హస్తకలనా విశేషాత్ప్రతిపాద్యతే ।**

అర్థం : లవణ - ఇక్షు-సురా - సర్పిః - దధి - క్షీర - జల అర్ణవాః = లవణం(= ఉప్పు), ఇక్షువు(= చెఱకు), సుర(=సారా), సర్పి(= నేయి), దధి (= పెరుగు), క్షీర (= పాలు), జల (= మంచినీరు) - (అని) సముద్రాలు (ఏడు ఉన్నాయి); ఏతేషాం, హస్తకలనా = ఈ ఏడు సముద్రాలను నిరూపించే, హస్త సంద ర్భాలు; విశేషాత్, ప్రతిపాద్యతే = విశేషించి, ప్రతిపాదింపబడు తున్నవి.

తాత్పర్యం : లవణసముద్రం, ఇక్షుసముద్రం, సురా సముద్రం, సర్పిస్సముద్రం, దధిసముద్రం, క్షీరసముద్రం, జల సముద్రం - ఇట్లా సముద్రాలు ఏడు కలవు. వీటిని నిరూపించే హస్త వ్యాపారం ఇప్పుడు ప్రతిపాదింపబడుతున్నది.

టీక : సప్తసముద్ర హస్తాలు నాట్యశాస్త్రంలో లేవు. మాతృభూతయ్య కూడా చెప్పలేదు. ఘోష్ పాఠంలో కూడా లేవు. ఇందులో కొన్ని హస్తాలకు బృహస్పతి మతం, శుక్రాచార్య మతం...అంటూ చెప్పటం విశేషంగా గుర్తించవలసిన అంశం. కాగా, ఈ సందర్భంలో - బృహస్పతి, శుక్రాచార్య, ఆంజనేయ, దత్తిలాచార్య, నారద, కోహళాచార్య మతాలు అను పేర్కొన బడినవి. వీటినేకాక అర్జున, యాజ్ఞవల్క్య, రావణ, ఉపాకన్యా, విఘ్నేశ్వర, సుబ్రహ్మణ్య, గరుడ మతాలను కొందరు పేర్కొ న్నారు. ఈ మతాలను 'భరతములు' అంటారు. భరతం మొత్తం పదహారు విధాలని ప్రసిద్ధి; అంటే భరత శాస్త్రకర్తలు పదహారుగురు

అన్న మాట. పైని చెప్పిన తొమ్మండుగురు, భరత-నందికేశులిద్దరు ఈ పదహారుగురిలోనూ ఉన్నారు.

## 1. లవణ సముద్రహస్తం :

> ముకుళాఖ్యౌ కరౌ చైవ వ్యావృత్తౌ చాపవేష్టితౌ ॥ 665
> ప్రయోజ్యౌ లవణాంభోధౌ ధిషణస్య మతాంతరే ।

అర్థం : వ్యావృత్తౌ(చ) అపవేష్టితౌ = వ్యావృత్తములు, అపవేష్టితములు (వెనుకకు త్రిప్పబడినవి, ముందుకు త్రిప్పబడినవి) అయిన; ముకుళ - ఆఖ్యౌకరౌ(చ) (ఏవ) = ముకుళములు అనే పేరుగల హస్తాలు; లవణ-అంభోధౌ ప్రయోజ్యౌ = లవణసముద్రం (అనే అర్థమందు) ప్రయోగింపదగినవి (అని); ధిషణస్య మతాంతరే = బృహస్పతియొక్క మతాంతరమునందు (చెప్పబడినది).

తాత్పర్యం : వ్యావృత్తములు, అపవేష్టితములు అయిన రెండు ముకుళ హస్తాలు లవణసముద్రం అనే అర్థమందు ప్రయుక్తమవుతాయి. ఇది బృహస్పతి మతం.

## 2. ఇక్షు సముద్రహస్తం :

> అలపద్మః తథాభూత ఇక్ష్వబ్ధౌ సంప్రయుజ్యతే ॥ 666

అర్థం : తథాభూతః, అలపద్మః = పై విధంగా పట్టబడిన అలపద్మహస్తం; ఇక్షు-అబ్ధౌ, సంప్రయుజ్యతే = చెఱకుసముద్రం (అనే అర్థమందు), ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : లవణసముద్ర హస్తమునందువలెనే వ్యావృత్తం, అపవేష్టితం అవునట్లుగా అలపద్మ హస్తాన్ని పట్టితే, అది ఇక్షుసముద్రహస్తం అవుతుంది. చెఱకు సముద్రం అనే అర్థమందు ఇది తగును.

### 3. సురా సముద్రహస్తం :

సంకీర్ణాఖ్యపతాకౌ చ తథైవ గుణమాశ్రితౌ ।
సురాంబుధౌ ప్రయోక్తవ్యౌ శుక్రాచార్యమతాంతరే ॥ 667

అర్థం : తథా-ఏవగుణమాశ్రితౌ, సంకీర్ణ-ఆఖ్య పతాకౌ (చ) = అదేవిధంగా పట్టబడిన సంకీర్ణ-పతాకహస్తాలు; సురాంబుధౌ, ప్రయోక్తవ్యౌ = సురసముద్రం అనే అర్థమందు, ప్రయోగింపదగినవి (ఇది); శుక్రాచార్య మతాంతరే = శుక్రాచార్య మతమందు (చెప్పబడినది).

తాత్పర్యం : సంకీర్ణ పతాకహస్తాలను వ్యావృత్తాలు, అపవేష్టితాలు అవునట్లుగా పట్టితే, అది సురా సముద్రహస్తం అవుతుంది.

సురాసముద్రం అనే అర్థమందు ఈ హస్తం ప్రయుక్తమవుతుంది. ఇది శుక్రాచార్యమతం.

### 4. సర్పి సముద్రహస్తం :

సర్పి రబ్ధే స్తు చతురౌ వాయుసూనుమతాంతరే ।

అర్థం : చతురః, సర్పిః, అబ్ధేః(తు) = చతురహస్తము(లు), సర్పి( = నేయి) సముద్రమందు (చెల్లును, ఇది); వాయుసూను మతాంతరే = ఆంజనేయుని మతమందు (చెప్పబడినది).

తాత్పర్యం : వ్యావృత్తాలు, అపవేష్టితాలు అయిన చతురహస్తాలు సర్పిసముద్రం అనే అర్థమందు చెల్లుతాయి. ఇది ఆంజనేయుని మతం.

### 5. దధి సముద్రహస్తం :

త్రిపతాకాభిధౌ హస్తౌ పూర్వవద్గుణమాశ్రితౌ ॥ 668
దధ్యర్ణవే ప్రయోక్తవ్యౌ ద త్తిలాచార్యసమ్మతౌ ।

అర్థం : పూర్వవత్ గుణమాశ్రితౌ, త్రిపతాక - అభిధౌ హస్తౌ = పూర్వం (= లవణసముద్రవిషయంలో) చెప్పబడిన విధంగా త్రిపతాకం అనే పేరుగల హస్తాలు; దధి-అర్ణవౌ ప్రయోక్తవ్యౌ = దధి(= పెరుగు) సముద్రమందు, ప్రయోగింపదగినవి; దత్తిలాచార్య, సమ్మతౌ = (ఈ హస్తాలు) దత్తిలాచార్య, సమ్మతాలు.

తాత్పర్యం : రెండు త్రిపతాకహస్తాలు వ్యావృత్తాలు, అపవేష్టితాలు అయితే, అది దధిసముద్రహస్తం అవుతుంది. దీనిని దధి సముద్రం అనే అర్థమందు ప్రయోగింపదగును. ఇది దత్తిలాచార్య మతం.

## 6. క్షీర సముద్రహస్తం :

సర్పశీర్షాహ్వయౌ హస్తౌ యథాపూర్వగుణాశ్రయౌ ॥ 669

క్షీరసాగరరూపార్థే నారదాభిమతౌ స్మృతౌ ।

అర్థం : యథాపూర్వ గుణాశ్రయౌ, సర్పశీర్షాహ్వయౌ హస్తౌ = పూర్వం చెప్పబడిన గుణం ఆశ్రయించిన (= వ్యావృత్త-అపవేష్టితములైన) సర్పశీర్ష హస్తాలు, క్షీరసాగరరూప - అర్థే = క్షీర (= పాలు) సముద్రం అనే అర్థమందు (ప్రయుక్తమవుతాయి) (అని); నారద-అభిమతౌ = నారదుని మతంలో; స్మృతౌ = చెప్పబడినవి.

తాత్పర్యం : వ్యావృత్తాలు, అపవేష్టితాలు అయిన రెండు సర్పశీర్ష హస్తాలు 'క్షీరసముద్ర హస్తం' అవుతాయి. ఈ హస్తం క్షీరసముద్రం అనే అర్థ మందు చెల్లుతుంది. ఇది నారదమతం.

## 7. జలసముద్రహస్తం :

పతాకగుణసంయుక్తౌ పూర్వవత్ మిళితౌ కృతౌ ॥ 670

జలార్ణవే ప్రయోక్తవ్యౌ కోహళాచార్యసమ్మతౌ ।

అర్థం : పూర్వవత్ మిళితాకృతౌ — ఇంతకుముందు చెప్పిన విధంగా విరివిగా త్రిప్పి క్రిందుముఖంగా చేయబడినవి; పతాక గుణ సంయుక్తౌ — పతాకంయొక్క గుణాలు కలిగినవి; జలార్ణవే, ప్రయోక్తవ్యౌ = శుద్ధోదక (— మంచినీరు) సముద్ర విషయంలో, ప్రయోగింపదగినవి; (ఇవి) కోహళాచార్య, సమ్మతౌ — కోహళా చార్యునిచేత, సమ్మతములు.

తాత్పర్యం : వ్యావృత్తాలు, అపవేష్టితాలు అయిన రెండు పతాకహస్తాలు జలసముద్ర హస్తం అవుతాయి. జలసముద్ర విషయంలో ఈ హస్తం చెల్లుతుంది. ఇది కోహళాచార్య మతం.

## ప్రసిద్ధ నదీహస్తాలు

గంగాదీనాం నిర్ణయే తు వ్యావృత్త శ్చాపవేష్టితః ॥ 671

నదీనా మపి సర్వాసాం పతాకః సముదాహృతః ।

గంగాదీనాం విశేషేణ తద్గుణాద్యనువర్ణనాత్ ॥ 672

హస్తానాం భేదకలనా గురుణా పూర్వ మీరితా ।

తత్స్వరూపం ప్రవక్ష్యామి నాట్యాభినయయోగతః ॥ 673

అర్థం : గంగాదీనాం, సర్వాసాం నదీనాం (అపి), నిర్ణయే (తు) — గంగ మొదలైన, సర్వనదులను, నిరూపించుటయందు; వ్యావృత్తః(చ), అపవేష్టితః, పతాకః, సముదాహృతః = వ్యావృత్తం, అపవేష్టితం అయిన పతాక హస్తం ఉదాహరింపబడి నది (అయినప్పటికీ); విశేషేణ, గంగాదీనాం, తత్ - గుణ - ఆది అనువర్ణనాత్ — విశేషంగా గంగాది నదులయొక్క, గుణాలు మొదలగునవి వర్ణింపబడి ఉండటంవల్ల; హస్తానాం భేదకలనా, గురుణా, పూర్వం, ఈరితమ్ — హస్తాలయొక్క భేదాలు, బృహస్పతిచేత, పూర్వం, చెప్పబడినవి; తత్ స్వరూపం — ఆ స్వరూపం;

నాట్య - అభినయయోగతః = నాట్యాభినయ సంబద్ధరీతిలో; ప్రవ క్ష్యామి = చెబుతాను.

తాత్పర్యం : గంగ మొదలగు సర్వనదులను నిరూపించ టంలో వ్యావృత్తం అపవేష్టితం అయిన పతాకహస్తం సరిపోతుంది. అయినప్పటికీ, గంగ మొదలగు నదుల గుణాదులు వేరు వేరుగా ఉండటంవల్ల, ఆయా హస్తాల భేదాలను బృహస్పతి పూర్వం వివ రించటం జరిగింది. ఆ వివరణ, నాట్యాభినయమునకు అనుగుణంగా ఇప్పుడు చెప్పబడుతున్నది.

## గంగాది నదీహస్తాలు

గంగాయాం తామ్రచూడః స్యాత్ సూర్యజాయాన్తు రేఖికః ।
కృష్ణవేణ్యాం సింహముఖః కావేర్యాం చతురః కరః ॥ 674
పతాకచతురౌ హస్తౌ సరస్వత్యాం ప్రకీర్తితౌ ।
నర్మదాయాం విధేయః స్యా త్కరో హ్యర్ధపతాకికః ॥ 675
హంసాస్యః తుంగభద్రాయాం శరావత్యాం తు బాణకః ।
సూచీహస్తో వేత్రవత్యాం చంద్రభాగార్థకే చలః ॥ 676
సరయ్వాం మలపద్మాఖ్యో భీమరథ్యాం మరాలకః ।
సువర్ణముఖనద్యాం చ కరోఽర్ధచతురో మతః ॥ 677
శుకతుండః పావనాశ్యాం యుజ్యతే భావవేదిభిః ।
అనుక్తానాంనదీనాంచ పతాకః సంప్రయుజ్యతే ॥ 678

అర్థం : గంగాయాం, తామ్రచూడః (స్యాత్) = గంగానది యందు, తామ్రచూడం (అవుతుంది); సూర్యజాయాం(తు), రేఖికః = యమునానదియందు, రేఖికం: కృష్ణవేణ్యాం, సింహ ముఖః = కృష్ణానదియందు, సింహముఖం; కావేర్యాం, చతురః కరః = కావేరీనదియందు, చతురహస్తం; సరస్వత్యాం, పతాక చతురౌ, హస్తౌ ప్రకీర్తితౌ = సరస్వతీ నదియందు, పతాక-చతుర

హస్తాలు, చెప్పబడినవి; నర్మదాయాం, అర్ధపతాకికః కరః (హి), విధేయః స్యాత్ = నర్మదానదియందు, అర్ధపతాకిక హస్తం, విధింప బడింది; తుంగభద్రాయాం, హంసాస్యః = తుంగభద్రా నదియందు, హంసాస్యం; శరావత్యాం(తు), బాణకః = శరావతీ నదియందు, బాణ(క)ం; వేత్రవత్యాం, సూచీహస్తః = వేత్రవతియందు, సూచీ హస్తం; చంద్రభాగ - అర్థకే, చలః = చంద్రభాగానది అనే అర్థ మందు, చల(పతాక)ం; సరయ్వాం, అలపద్మాఖ్యః = సరయూ నది యందు, అలపద్మం అనే పేరుగలది; భీమరథ్యాం, అరాలకః = భీమ రథీనదియందు, అరాల(క)ం; సువర్ణముఖనద్యాం(చ), అర్ధచతురః కరః మతః = సువర్ణముఖీ నదియందు, అర్ధచతుర హస్తం ఇష్టం; పాపనాశ్యాం, శుకతుండః భావవేదిభిః యుజ్యతే = పాపనాశనీ నది యందు, శుకతుండహస్తం, భావవేత్తలచేత, ప్రయుక్తమవుతున్నది;

(ఇంకా — )

అనుక్తానాం నదీనాం(చ) = చెప్పబడని నదుల విషయంలో పతాకః, సంప్రయుజ్యతే = పతాకహస్తం ప్రయుక్తం అవుతుంది.

తాత్పర్యం : గంగ మొదలగు నదులను సూచించటంలో క్రింది విధంగా హస్తాలు వినియోగపడతాయి.

| నది | హస్తం |
|---|---|
| గంగ | తామ్రచూడం |
| యమున | రేఖికం |
| కృష్ణవేణి | సింహముఖం |
| కావేరి | చతురం |
| సరస్వతి | పతాకం, చతురం |
| నర్మద | అర్ధపతాకికం |
| తుంగభద్ర | హంసాస్యం |

| | |
|---|---|
| శరావతి | బాణం |
| వేత్రవతి | సూచి |
| చంద్రభాగ | చలపతాకం |
| సరయు | అలపద్మం |
| భీమరథి | అరాలం |
| సువర్ణముఖి | అర్ధచతురం |
| పావనాశని | శుకతుండం |

ఇక ఇచ్చట చెప్పని నదుల విషయంలో పతాకహస్తాన్ని వినియోగించవలెను.

టీక : నదీహస్తాలు నాట్యశాస్త్రంలో లేవు. మాతృభూతయ్య కూడా చెప్పలేదు ఘోష్ పాఠంలో కూడా ఇవి లేవు.

## చతుర్దశలోక హస్తాలు

### 1. ఊర్ధ్వలోక హస్తాలు :

భూలోక శ్చ భువర్లోకః స్వర్గలోకః తతః పరః ।
జనోలోక స్తపోలోకః సత్యలోకాభిధ స్తతః ॥ 679
మహర్లోక శ్చ సప్తైతే లోకాశ్చోర్ధ్వం సమాశ్రితాః ।
ఉద్వేష్టితః పతాకస్తు ఏతేషు వినియుజ్యతే ॥ 680

అర్థం : భూలోకః (చ), భువర్లోకః, స్వర్గలోకః, (తతః పరః) = భూలోకం, భువర్లోకం, స్వర్గలోకం (అటుపిమ్మట); జనో లోకః, తపోలోకః, సత్యలోక-అభిధః (తతః) = జనోలోకం, తపో లోకం; సత్యలోకం (అనే పేరుగలది) (తరువాత); మహర్లోకః (చ) = మహర్లోకం; ఏతే సప్తలోకాః (చ), ఊర్ధ్వం సమాశ్రితాః = ఈ ఏడులోకాలు పైభాగాన్ని ఆశ్రయించినవి (= ఊర్ధ్వలోకాలు); ఏతేషు, ఉద్వేష్టితః, పతాకః (తు), వినియుజ్యతే = వీటియందు. ఉద్వేష్టితమైన, పతాకహస్తం, వినియోగపడుతున్నది.

తాత్పర్యం : 1. భూలోకం, 2. భువర్లోకం, 3. స్వర్గలోకం, 4. జనోలోకం, 5. తపోలోకం, 6. సత్యలోకం, 7. మహర్లోకం- ఈ ఏడున్నూ ఊర్ధ్వలోకాలు. వీటియందు ఉద్వేష్టితమైన పతాకహస్తం వినియోగపడుతుంది.

## 2. అధోలోక హస్తాలు :

అతలో వితల శ్చైవ సుతల శ్చ తలాతలః ।
మహాతల ఇతి ఖ్యాతో రసాతల ఇతీరితః ॥ 681
పాతాళశ్చైవ సప్తైతే హ్యధోలోకాః ప్రకీర్తితాః ।
అధోలోకేషు యుజ్యేత పతాకశ్చాపవేష్టితః ॥ 682

అర్థం : అతలః, వితలః, (చ) (ఏవ), సుతలః (చ), తలాతలః = అతలం, వితలం, సుతలం, తలాతలం; మహాతలః (ఇతిఖ్యాతః), రసాతలః (ఇతి-ఈరితః) = మహాతలం (అని ఖ్యాతిచెందినది), రసాతలం (అని చెప్పబడినది); పాతాళః (చ) (ఏవ) = పాతాళం; — ఏతే సప్త-అధోలోకాః, ప్రకీర్తితాః = ఈ ఏడు అధోలోకాలు (గా), కీర్తింపబడినవి; అధోలోకేషు, అపవేష్టితః పతాకః (చ) యుజ్యేత = అధోలోకాలు అనే అర్థమందు అపవేష్టితమైన పతాక హస్తాన్ని ప్రయోగించదగును.

తాత్పర్యం : 1. అతలం, 2. వితలం, 3. సుతలం, 4. తలాతలం, 5. మహాతలం, 6. రసాతలం, 7. పాతాళం — ఈ ఏడున్నూ అధోలోకాలు. వీటియందు అపవేష్టితమైన పతాకహస్తం వినియోగ పడుతుంది.

# 12
# నృత్తహస్త - పాద - మండల - స్థానక భేదాలు

## నృత్తహస్తాల గతులు

భవంతి నృత్తహస్తానాం గతయః పంచధా భువి ।
ఊర్ధ్వాఽధరోత్తరా ప్రాచీ దక్షిణా చేతి విశ్రుతా ॥ 683
యథా స్యాత్ పాదవిన్యాసః తథైవ కరయో రపి ।
వామాంగభాగే వామస్య దక్షిణే దక్షిణస్య చ ॥ 684
కుర్యాత్ ప్రచలనం హేత నృత్తసిద్ధాంతలక్షణమ్ ।
యతో హస్తః తతో దృష్టి ర్యతో దృష్టి స్తతో మనః ॥ 685
యతో మనస్తతో భావో యతో భావ స్తతో రసః

అర్థం : భువి, నృత్తహస్తానాం, గతయః, పంచధా, భవంతి = లోకంలో, నృత్తహస్తాలయొక్క గతులు, ఐదు విధాలుగా అవుతున్నాయి; ఊర్ధ్వా-అధరా - ఉత్తరా - ప్రాచీ-దక్షిణా (చ) (ఇతి) విశ్రుతా = ఊర్ధ్వ, అధర, ఉత్తర, ప్రాచి, దక్షిణ (అని ఈ అయిదు గతులు) సుప్రసిద్ధాలు; పాదవిన్యాసః, యథాస్యాత్, కరయోః, అపి, తథా ఏవ = పాదవిన్యాసం, ఎట్లా ఉంటుందో, కర విన్యాసం కూడా, అట్లాగే (ఉండాలి).

వామాంగభాగే వామస్య, దక్షిణే దక్షిణస్య (చ) = (శరీర) వామభాగమందు వామహస్తంయొక్క, దక్షిణభాగమందు దక్షిణ హస్తం యొక్క; ప్రచలనం, కుర్యాత్ = ప్రచలనం ( = బాగుగా

చలించటం) చేయవలెను; ఏతత్, నృత్త సిద్ధాంత, లక్షణం — ఇది, నృత్త సిద్ధాంతంయొక్క, లక్షణం.

తాత్పర్యం : నృత్తహస్తాల గతులు అయిదు విధాలు — ఊర్ధ్వ, అధర, ఉత్తర, ప్రాచి, దక్షిణ. పాదవిన్యాసం ఎట్లా ఉంటుందో, కరవిన్యాసం కూడా అట్లాగే ఉండాలి. వామభాగమందు వామహస్తంయొక్క చలనం, కుడిప్రక్క కుడిచేయి చలనం జరుగవలెను. - ఇది నృత్త సిద్ధాంతం.

టీక : 685 శ్లోకం రెండవ పాదం, 686 శ్లోకం మొదటి పాదం - ఈ రెండూ ఇంతకుముందు 57వ శ్లోకంగా ఉన్నవి. అర్థాదులు అచ్చట చూడవలెను.

వీటిని 'నృత్త హస్తాలు' అనటంకంటె 'నృత్య హస్తాలు' అనటమే సమంజసం. ఈ హస్తగతులను, హస్త ప్రచారాలన్న పేరుతో భరతముని ఇట్లా వివరించినాడు : "ఉత్తానము (= ఊర్ధ్వ ముఖముగా ఉండటం), పార్శ్వగతము, అధోముఖము అను భేదములచే హస్త ప్రచారము మూడు విధములు. ఉత్తానము, వర్తులము, త్ర్యశ్రము(= త్రిపార్శ్వగతము), స్థితము, అధోముఖము అను భేదములచే హస్తప్రచారము నాట్య-నృత్తములందు ఐదు విధములని కొందరందురు. ప్రయోగములందు నేత్ర-భ్రూ-ముఖరాగాదులు ఈ హస్త ప్రచారముల ననుసరించుచు అర్థవ్యక్తీకరణమునందు తోడ్పడవలెను. కరణ-కర్మ-స్థాన-ప్రచార-యుక్తి-క్రియలను విచారించి లోకసదృశముగా హస్తాభినయము చేయవలెను." (తె. నా. శా. పుటలు 310-11).

683 శ్లోకం మొదలు 753 శ్లోకంవరకు అంటే 71 శ్లోకాలు నీడా పాఠంలో లేవు. అనేక వ్రాతప్రతులను పరిశీలించిన ఘోష్ ఇవి అభినయదర్పణంలోనివే అని నిర్ణయించినాడు. నీడా మంగలం వారు వీటిని విడిచిపెట్టటానికి కారణం తెలియదు.

## నృత్తహస్తాలు

పతాకా స్వస్తికాఖ్యశ్చ డోలాహస్తస్తథాంజలిః ॥ 686

కటకావర్ధనశ్చైవ శకటః పాశ-కీలకౌ ।

కపిత్థః శిఖరః కూర్మో హంసాస్య శ్చాలపద్మకః ॥ 687

త్రయోదశైతే హస్తాః స్యుః నృత్తస్యాప్యుపయోగినః ।

అర్థం : పతాకా, స్వస్తిక - ఆఖ్యః (చ), డోలాహస్తః, (తథా) అంజలిః, కటకావర్ధనః (చ) (ఏవ), శకటః, పాశ-కీలకౌ, కపిత్థః, శిఖరః, కూర్మః, హంసాస్యః, అలపద్మకః = పతాకం, స్వస్తికం, డోల, అంజలి, కటకావర్ధనం, శకటం, పాశం, కీలకం, కపిత్థం, శిఖరం, కూర్మం, హంసాస్యం, అలపద్మ(క)ం; ఏతే, త్రయోదశహస్తాః, నృత్తస్య (అపి) ఉపయోగినః స్యుః = ఈ పదమూడు హస్తాలు నృత్తమునకు (కూడ) ఉపయోగించేవిగా ఉన్నాయి.

తాత్పర్యం : 1. పతాకహస్తం, 2. స్వస్తికహస్తం, 3. డోలాహస్తం, 4. అంజలిహస్తం, 5. కటకావర్ధనహస్తం, 6. శకటహస్తం, 7. పాశహస్తం, 8. కీలకహస్తం, 9. కపిత్థహస్తం, 10. శిఖరహస్తం, 11. కూర్మహస్తం, 12. హంసాస్యహస్తం, 13. అలపద్మహస్తం - ఈ పదమూడు హస్తాలు నృత్తమునకు ఉపయోగించే హస్తాలు.

టీక : 683వ శ్లోకం మొదలు 688వ శ్లోకం మొదటి పాదం వరకు ఉన్న శ్లోకాలు ఘోష్ పాఠంలో బాంధవ హస్తాలకు మధ్య ఉన్నవి. కాని ఇవి ఇచ్చట ఉండటమే సమంజసం.

## పాదభేదాలు

వక్ష్యతే పాదభేదానాం లక్షణం పూర్వసమ్మతమ్ ॥ 688

మండలోత్ప్లవనే చైవ భ్రమరీ పాదచారికా ।

చతుర్ధా పాదభేదాః స్యుస్తేషాం లక్షణ ముచ్యతే ॥ 689

అర్థం : పూర్వసమ్మతమ్ పాదభేదానాం లక్షణం వక్ష్యతే= పూర్వ (=సంప్రదాయ) సమ్మతములైన పాదభేదాల లక్షణం చెప్పబడుతున్నది; మండల- ఉత్ప్లవనే (చ) (ఏవ), భ్రమరీ, పాద చారికా, చతుర్ధా, పాదభేదాః, స్యుః=మండలం, ఉత్ప్లవనం, భ్రమరి, పాదచారి (అనే) నాలుగు విధాలుగా, పాదభేదాలు కలవు; తేషాం, లక్షణం, ఉచ్యతే = వీటియొక్క లక్షణం, చెప్పబడు తున్నది

తాత్పర్యం : ఇంక సంప్రదాయ సమ్మతములైన పాద భేదాల లక్షణం-చెప్పబడుతున్నది. మండలం ఉత్ప్లవనం, భ్రమరి, పాదచారి లేదా చారి - ఇట్లా పాదభేదాలు నాలుగు విధాలు.

టీక: పాదాలకు సంబంధించిన ఈ నాలుగు భేదాలలోని విభే దాలు వరుసగా ముందు చెప్పబడుతున్నవి. భరతముని, పాదకర్మ అయిదు విధాలని చెప్పి, ఉద్ఘట్టితం మొదలయిన అయిదు విధాలను వివరించినాడు (తె.నా.శా. పుటలు-320-21). పాదభేదాలు నాలుగు అంటూ ఇట్లా వివరించటం భిన్నసంప్రదాయమన్నమాట. ఈ నాలుగు భేదాలు పాదాలచేత నిర్వహించబడేవి కాబట్టి, వీటిని పాదభేదాలన్నారు

## మండల భేదాలు

స్థానకం చాయతాలీఢం ప్రేంఖణ ప్రేరితాని చ ।

ప్రత్యాలీఢం స్వస్తికం చ మోటితం సమసూచికా ॥ 690

పార్శ్వసూచీతి చ దశ మండలానీరితానీహ ।

అర్థం : స్థానకం(చ), ఆయత - ఆలీఢం, ప్రేంఖణ-ప్రేరి తాని (చ), ప్రత్యాలీఢం, స్వస్తికం(చ), మోటితం, సమసూచికా, పార్శ్వసూచీ=స్థానకం, ఆయతం, ఆలీఢం, ప్రేంఖణం, ప్రేరితం,

ప్రత్యాలీఢం, స్వస్తికం, మోటితం, సమసూచి(క), పార్శ్వసూచి; ఇతి(చ), దశ మండలాని, ఇహ, ఈరితాని = ఇట్లా, పది మండలాలు, ఇక్కడ చెప్పబడినవి.

తాత్పర్యం : 1. స్థానకమండలం, 2. ఆయతమండలం, 3. ఆలీఢమండలం, 4. ప్రేంఖణమండలం, 5. ప్రేరితమండలం, 6. ప్రత్యాలీఢమండలం, 7. స్వస్తికమండలం, 8. మోటితమండలం, 9. సమసూచీమండలం, 10. పార్శ్వసూచీమండలం - ఇట్లా మండల భేదాలు పది. వీటి ముఖ్యలక్షణ మిప్పుడు చెప్పబడుతున్నది.

టీక : నాట్యశాస్త్రంలో చెప్పబడిన 'మండలం' కంటె ఇచ్చటి మండలం భిన్నమైనది. నాట్యశాస్త్రంలోని 20 మండలాలు చారుల సంయోగంవలన ఏర్పడతాయి - ఇందులో పది ఆకాశగ ములు; పది భూమిగములు (తె.నా.శా. 10వ అధ్యా). మండల భేదాలకు 'స్టాండింగ్ పోశ్చర్స్' అని ఘోష్ అనువాదం. ఇచ్చట చెప్పిన నిర్వచనాలనుబట్టి, 'మండలం' అనే పదం నాట్యశాస్త్రం లోని 'స్థానకం' అనే అర్థంలో ప్రయుక్తమైనదని చెప్పవచ్చు. ఇందులో, తరువాత, స్థానభేదాలు ఆరు వేరుగా చెప్పబడటం గమ నార్హం. ఇచ్చట చెప్పబడిన పది మండలాలు, అదే నిర్వచనాలతో నాట్యశాస్త్రంలో లేవు.

## 1. స్థానకమండలం

**కటిం స్పృష్ట్వా ఒర్ధచంద్రాఖ్యపాణిభ్యాం సమపాదతః ॥ 691**
**సమరేఖతయా తిష్ఠేత్ తత్ స్యాత్ స్థానకమండలం ।**

అర్థం : అర్ధచంద్రపాణిభ్యాం, కటిం, స్పృష్ట్వా=అర్ధచంద్ర హస్తాలతో, కటిని, స్పృశించి; సమపాదతః, సమరేఖయా, తిష్ఠేత్= సమపాదాలతో, సమరేఖతో, నిలిస్తే; తత్, స్థానకమండలం, స్యాత్ = అది, 'స్థానకమండలం' అవుతుంది.

తాత్పర్యం : నడుంమీద రెండు ప్రక్కలను రెండు అర్ధ చంద్ర హస్తాలను ఉంచి, సమపాదాలతో, సమరేఖతో నిలిస్తే, అది 'స్థానక మండలం' అవుతుంది.

టీక : నాట్యశాస్త్రంలోని 'సమపాద స్థానకము'నకు ఇది సన్నిహితంగా ఉంది.

## 2. ఆయతమండలం

వితస్త్యంతరితౌ పాదౌ కృత్వా తు చతురస్రకౌ ॥ 692

తిర్యక్ కుంచితజానుభ్యాం స్థితి రాయతమండలమ్ ।

అర్థం : పాదౌ, వితస్తి - అంతరితౌ, చతురస్రకౌ, కృత్వా (తు) = రెండుపాదాలను, వితస్తి అంతరం (= ఒక జానెడుదూరం) కలవిగా, చతురస్రంగా, చేసి; జానుభ్యాం, తిర్యక్, కుంచితస్థితిః, ఆయతమండలం = జానువుల (= మోకాళ్ళ)ను, అడ్డంగా, వంచి (నిలిచి)న స్థితి (ఒక జానువుపై ఇంకొక జానువును ఉంచి నిలిచిన స్థితి - ఘోష్), ఆయతమండలం అవుతుంది.

తాత్పర్యం : రెండు పాదాలను ఒక వితస్తి ఎడం కలవిగా, చతురస్రంగా చేసి, జానువులను అడ్డంగా వంచి (లేదా ఒక జానువుపై ఇంకొక జానువును ఉంచి) నిలిస్తే అది ఆయతమండలం అవుతుంది.

టీక : 'వితస్తి' = half cubit అని ఘోష్ అనువాదం. cubit అనగా 'మూర' అని అర్థం. కావున వితస్తి అంటే జేన (= 9 అం॥) అని మాత్రమే అర్థం. నాట్యశాస్త్రంలో జేన (= వితస్తిలో సగం) అనగా 'తాలము'. శబ్దరత్నాకరంలో జేన అనగా వితస్తి అని చెప్పి 12 అంగుళాలు అని విశదం చేయబడింది; ఇది సరికాదు. జేన అనగా 9 అంగుళాలే. నాట్యశాస్త్రంలో 'ఆయతం' స్త్రీల స్థానకం; నిర్వచనంలో ఇవి భిన్నంగా ఉన్నాయి.

## 3. ఆలీఢమండలం

దక్షిణాంఘ్రేశ్చ పురతః వితస్తి త్రితయాంతరమ్ ॥ 693

విన్యసేత్ వామపాదం చ శిఖరం వామపాణినా ।

కటకాముఖహస్తశ్చ దక్షిణేన ధృతో యది ॥ 694

ఆలీఢమండల మితి విఖ్యాతం భరతాదిభిః ।

అర్థం : వామపాదం, దక్షిణాంఘ్రేః (చ) పురతః, వితస్తి త్రితయాంతరం, విన్యసేత్ (చ)=వామపాదాన్ని, కుడిపాదం ముందు, మూడు వితస్తుల దూరంలో, నిలిపి; వామపాణినా శిఖరం, దక్షిణేన కటకాముఖః (చ), ధృతః యది=ఎడమచేత శిఖరహస్తం కుడిచేత కటకాముఖహస్తం, ధరిస్తే (అది); ఆలీఢమండలం, ఇతి, భరతాదిభిః, విఖ్యాతం=ఆలీఢమండలం, అని, భరతాదులచేత, చెప్పబడినది.

తాత్పర్యం : వామపాదాన్ని కుడి పాదం ముందు మూడు వితస్తుల దూరంలో ఉంచి, ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత కటకాముఖ హస్తం పట్టి నిలిస్తే, అది ఆలీఢమండలం అవుతుందని భరతుడు మొదలగువారు చెప్పినారు.

టీక : 'ఆలీఢస్థానం'లో దక్షిణ పాదము వామపాదం నుంచి 5 తాలముల (=జేనల) దూరంగా ప్రసారితం కావాలని భరత ముని పేర్కొన్నాడు.

## 4. ప్రత్యాలీఢమండలం

ఆలీఢస్య విపర్యాసాత్ ప్రత్యాలీఢాఖ్య మండలమ్ ॥ 695

అర్థం : ఆలీఢస్య, విపర్యాసాత్ = ఆలీఢ మండలంయొక్క, విపర్యాసం (= తారుమారువల్ల); ప్రత్యాలీఢ-ఆఖ్య మండలమ్ = ప్రత్యాలీఢం అనే పేరుగల మండలం (సిద్ధిస్తుంది).

తాత్పర్యం : ఆలీఢమండలం విపర్యాసం అయితే, అది 'ప్రత్యాలీఢ మండలం' అవుతుంది. (అంటే కుడిపాదం వామపాదం ముందు మూడు వితస్తుల దూరంలో ఉండటం).

టీక : ఆలీఢస్థానంలోని పాదాలు వ్యత్యస్తములైతే అది 'ప్రత్యాలీఢ స్థానం' అవుతుందని భరతముని. అంటే వామపాదం ముందుకు, దక్షిణపాదం వెనుకకు ఉండగా, వాటి మధ్య దూరం 5 తాలాలు ఉంటుంది. ఆలీఢస్థానంలో దక్షిణపాదం ముందుండాలని భరతముని చెప్పగా, వామపాదం ముందుండాలని నందికేశుడు. అట్లాగే ప్రత్యాలీఢ స్థానంలో వామపాదం ముందుండాలని భరత ముని చెప్పగా, కుడిపాదం ముందుండాలని నందికేశుడు. కాగా, నందికేశుడు భిన్న సంప్రదాయాన్ని అనుసరించినాడన్నమాట.

**5. ప్రేంఖణమండలం :**

ప్రసృత్యైకపదం పార్శ్వే పార్ష్ణిదేశస్య పాదతః ।
స్థిత్వాంతే కూర్మహస్తేన స్థితిః ప్రేంఖణమండలమ్ ॥ 696

అర్థం : ఏకపదం, పాదతః, పార్ష్ణిదేశస్య పార్శ్వే, ప్రసృత్య, స్థిత్వా = ఒక పాదాన్ని, పాదంయొక్క, పార్ష్ణి (= చీలమండ) ప్రక్కకు, చాపి, నిలిచి; అంతే, కూర్మహస్తేన, స్థితిః = చివర కూర్మహస్తం పట్టి, నిలిచిన స్థితి ప్రేంఖణమండలం (అవుతుంది).

తాత్పర్యం : ఒక పాదాన్ని రెండవ పాదంయొక్క చీల మండ ప్రక్కన నిల్పి, కూర్మహస్తం పట్టి నిలిస్తే అది 'ప్రేంఖణ మండలం' అవుతుంది.

**6. ప్రేరిత మండలం :**

సంతాడ్యైకం పదం పార్శ్వే వితస్త్రితయాంతరమ్ ।
తిర్యక్ కుంచితజానుభ్యాం స్థిత్వోద్ధృత శిఖరం కరమ్ ॥ 697
విధాయ వక్షస్యన్యేన ప్రసృతా చ పతాకికా ।
ప్రదర్శయేదిదం తజ్జ్ఞాః ప్రేరితం మండలం జగుః ॥ 698

అర్థం : ఏకంపదం, పార్శ్వే, వితస్తి త్రితయాంతరమ్, సంతాడ్య = ఒక పాదాన్ని, (రెండవ పాదముయొక్క) ప్రక్కగా, మూడు జానెలదూరంలో, (నేలమీద) గట్టిగా కొట్టి; తిర్యక్, కుంచిత జానుభ్యాం, స్థిత్వా = (ఒకదానిమీద ఒకటి) అడ్డంగా, వంచిన జానువులతో, నిలిచి; అథ, వక్షసి, శిఖరంకరమ్, విధాయ = తరువాత, వక్షంమీద, శిఖరహస్తాన్ని, ఉంచి; అన్యేన, పతాకికా, ప్రసృతా(చ) = రెండవచేతితో, పతాకహస్తం పట్టి, చాపి: ప్రదర్శయేత్ = ప్రదర్శించవలెను; ఇదం, ప్రేరితంమండలం, తద్జ్ఞాః, జగుః = దీనిని, ప్రేరితమండలం (అని), తద్జ్ఞులు చెప్పినారు.

తాత్పర్యం : ఒకపాదంతో రెండవపాదం ప్రక్కగా, మూడు వితస్తుల దూరంలో భూమిని గట్టిగా కొట్టి, జానువులను ఒకదాని మీద ఒకటి అడ్డంగా ఉంచి, ఒకచేతితో శిఖరహస్తం రొమ్ముమీద పట్టి, రెండవదానితో పతాకహస్తం పట్టి చాపి నిలిస్తే అది ప్రేరిత మండలం అవుతుంది.

## 7. స్వస్తికమండలం :

దక్షిణోత్తరతః కుర్యాత్ పాదే పాదం కరే కరమ్ ।
వ్యత్యాసేన తదా ప్రోక్తం స్వస్తికంనామ మండలమ్॥ 699

అర్థం : దక్షిణ-ఉత్తరతః, పాదేపాదం, కరేకరమ్, వ్యత్యాసేన, కుర్యాత్ = కుడి ఎడమలుగా, పాదంమీద పాదం, కరంమీద కరం, వ్యత్యాసంగా, పట్టి (కుడిపాదాన్ని ఎడంపాదంమీదుగా, కుడిచేతిని ఎడంచేతిమీదుగా అడ్డంగా ఉంచి — ఘోష్); తదా, స్వస్తికంనామ మండలం, ప్రోక్తం = అప్పుడు (అది), స్వస్తికం అనే పేరుగల మండలంగా, చెప్పబడినది.

తాత్పర్యం : కుడిపాదాన్ని ఎడంపాదం మీదుగానూ, కుడి చేతిని ఎడంచేతిమీదుగానూ అడ్డంగా పట్టి నిలిస్తే అది 'స్వస్తిక మండలం' అవుతుంది.

## 8. మోటితమండలం:

ప్రపదాభ్యాం భువి స్థిత్వా జానుయుగ్మేన సంస్పృశేత్ ।
క్రమా ద్భూతలమేకైకం త్రిపతాకకరద్వయం ॥ 700
కృత్వా తన్మోటితంనామ మండలం కథితం బుధైః ।

అర్థం : ప్రపదాభ్యాం, భువి, స్థిత్వా = ప్రపదముల( = పాదాగ్రాల = వ్రేళ్ళ)తో భూమిమీద, నిలిచి; త్రిపతాకకరద్వయం, కృత్వా = త్రిపతాక హస్తాలు రెండు, పట్టి; జానుయుగ్మేన, ఏకైకం క్రమాత్ భూతలం సంస్పృశేత్ = రెండు మోకాళ్ళతో, ఒకదాని తరువాత ఇంకొకటిగా, క్రమంగా, భూమిని తాకవలెను; తత్, మోటితం నామ, మండలం, బుధైః, కథితం = అది, మోటితం అనే పేరుగల, మండలం (అవుతుందని), బుధులచే, చెప్పబడినది.

తాత్పర్యం : రెండు చేతులతో త్రిపతాక హస్తాలను పట్టి, పాదాగ్రాలమీదనిలిచి, ఒక్కొక్క మోకాలితో క్రమంగా భూమిని తాకితే, 'మోటితమండలం' అవుతుంది.

## 9. సమసూచీమండలం :

పాదాగ్రాభ్యాం చ జానుభ్యాం భూతలం సంస్పృశేద్యది ॥ 701
మండలం సమసూచీతి కథితం పూర్వసూరిభిః ।

అర్థం : పాదాగ్రాభ్యాం (చ), జానుభ్యాం, భూతలం, సంస్పృశేత్‌యది = పాదాగ్రాల ( = వ్రేళ్ళ)తో, జానువులతో, భూమిని, స్పృశించితే (అది); సమసూచీమండలం, ఇతి, పూర్వ సూరిభిః, కథితం = సమసూచీమండలం (అవుతుంది), అని, ప్రాచీన పండితులచేత, చెప్పబడినది.

తాత్పర్యం : పాదాగ్రాలతో, జానువులతో భూమిని వరుసగా తాకితే, అది సమసూచీమండలం అవుతుందని ప్రాచీన పండితుల అభిప్రాయం.

## 10. పార్శ్వసూచీమండలం

స్థిత్వా పాదాగ్రయుగ్మేన జానునైకేన పార్శ్వతః ॥ 702

సంస్పృశేద్భూతలం పార్శ్వసూచీమండల మీరితమ్ ।

అర్థం : పాదాగ్రయుగ్మేన, స్థిత్వా = రెండు పాదాగ్రాల మీద, నిల్చి; ఏకేన జానునా, పార్శ్వతః, భూతలం, సంస్పృశేత్ = ఒక జానువుతో, ప్రక్కగా, భూమిని, స్పృశించవలెను (అది); పార్శ్వ సూచీ మండలం (అని), చెప్పబడినది

తాత్పర్యం : రెండు పాదాగ్రాలమీద నిలిచి, ఒక జానువుతో ప్రక్కగా భూమిని తాకితే అది 'పార్శ్వసూచీమండలం' అవుతుంది.

### స్థానకభేదాలు

పాదవిన్యాసభేదేన స్థానకం షడ్విధం భవేత్ ॥ 703

సమపాదం చైకపాదం నాగబంధ స్తతఃపరమ్ ।

ఐంద్రం చ గారుడం చైవ బ్రహ్మస్థాన మితి క్రమాత్ ॥ 704

అర్థం : క్రమాత్, సమపాదం (చ), ఏకపాదం, నాగబంధః, (తతః) (పరమ్) ఐంద్రం(చ), గారుడం (చ) (ఏవ), బ్రహ్మస్థానం, ఇతి = క్రమంగా సమపాదం, ఏకపాదం, నాగబంధం, ఐంద్రం, గారుడం, బ్రహ్మ(స్థాన)ం (అని); పాదవిన్యాసభేదేన, స్థానకం, షడ్విధం, భవేత్ = పాదవిన్యాసమందలి భేదంచేత స్థానకం ఆరువిధాలు అవుతుంది.

తాత్పర్యం : పాదాలయొక్క విన్యాసములందలి భేదాల వల్ల స్థానకం ఆరువిధాలు — 1. సమపాదం, 2. ఏకపాదం, 3. నాగ బంధం, 4. ఐంద్రం, 5. గారుడం, 6. బ్రహ్మం.

టీక: ఆయా గతి- ప్రచారాలకు ముందుగానీ, తరువాతగానీ నిలబడే విధానమే 'స్థానకం' అని చెప్పి, భరతముని ఆరు పురుషుల స్థానకాలను 10వ అధ్యాయంలో, మూడు స్త్రీల స్థానకాలను పన్నెండవ అధ్యాయంలో వివరించినాడు (తె.నా.శా - పుటలు 332-34; 360-61). అయితే ఆ స్థానకాలకంటె ఈ స్థానకాలు

భిన్న సంప్రదాయానికి చెందినవి. భరతార్ణవం అయిదవ అధ్యాయంలో 32 స్థానకాలు వివరించబడినవి; అందులో నందికేశుడు చెప్పిన ఆరు స్థానకాలు కూడా ఉన్నాయి.

స్థానక పదానికి 'రెస్టింగ్ పోశ్చర్' అని ఘోష్ అనువాదం.

## 1. సమపాద స్థాన(క)ం :

**స్థితిః సమాభ్యాం పాదాభ్యాం సమపాద మితి స్మృతమ్ ।**
**పుష్పాంజలౌ దేవరూపే సమపాదం నియుజ్యతే ॥** 705

అర్థం : సమాభ్యాం పాదాభ్యాం, స్థితిః, సమపాదం, ఇతి, స్మృతం = సమంగా ఉన్న పాదాలతో, నిలిస్తే (అది), సమపాద (స్థానకం) అని, చెప్పబడినది.

పుష్పాంజలౌ, దేవరూపే, సమపాదం నియుజ్యతే = పుష్పాంజలి సమర్పించేటప్పుడు, దేవతల రూపాలు ధరించేటప్పుడు సమపాదం ఉపయుక్తమవుతుంది.

తాత్పర్యం : పాదాలు సమంగా ఉంటే, అది 'సమపాద స్థానకం' అవుతుంది.

పుష్పాంజలి, దేవతారూపాలు ధరించటం — వీటియందు ఈ స్థానకం తగును.

టీక : నాట్యశాస్త్రంలో ఈ స్థానకం ఉంది. అయితే రెండు పాదాల మధ్య జానెడు ఎడం ఉండాలని, ఆ పాదాలు స్వభావ సౌష్ఠవోపేతాలు కావాలని భరతముని.

## 2. ఏకపాద స్థాన(క)ం :

**జాన్వాశ్రిత్య పదైకేన స్థితిః స్యా దేకపాదకమ్ ।**
**ఏకపాదం త్విదం స్థానం నిశ్చలే తపసి స్థితమ్ ॥** 706

అర్థం : జాను - ఆశ్రిత్య, పద-ఏకేనస్థితిః, ఏకపాదకమ్, స్యాత్ = మోకాలును ఆశ్రయించి, ఒక పాదంమీద (నిలిచి)

ఉండటం, ఏకపాద (స్థానక)ం, అవుతుంది (రెండవకాలు, నిలిచిన కాలి మోకాలుమీదుగా అడ్డంగా ఉంటుంది);

ఇదం, ఏకపాదం స్థానం, నిశ్చలే, తపసి స్థితమ్ — ఈ, ఏక పాద స్థానం, నిశ్చలత్వమునందు, తపస్సునందు చెల్లుతుంది (లేదా నిశ్చలమైన తపస్సు చేయుచున్నవానియందు చెల్లుతుంది).

తాత్పర్యం : ఒక కాలుమీద నిలిచి, రెండవకాలును మొదటి కాలి మోకాలుమీదుగా అడ్డంగా ఉంచితే, అది 'ఏకపాద స్థానకం' అవుతుంది. నిశ్చలత్వం,తపస్సు — ఈ అర్థములందు లేదా నిశ్చలమైన తపస్సు చేయుచున్నవానియందు ఈ స్థానకం చెల్లుతుంది.

టీక : భరతముని చెప్పిన వైష్ణవ స్థానమునకు ఇది దగ్గరగా ఉంది.

## 3. నాగబంధ స్థాన(క)ం :

పాదం పాదేన సంవేష్ట్య తథా పాణిం చ పాణినా ।

స్థితిః స్యాత్ నాగబంధాఖ్యా నాగబంధే ప్రయుజ్యతే ॥ 707

అర్థం : పాదేన పాదం, (తథా) పాణినా పాణిం (చ), సంవేష్ట్య, స్థితిః నాగబంధాఖ్యా, స్యాత్ — ఒక పాదంతో రెండవ పాదాన్ని, ఒకచేతితో రెండవచేతిని, చుట్టి ఉంటే, (అది) నాగ బంధం అనే పేరుగలది (అవుతుంది);

నాగబంధే, ప్రయుజ్యతే — (ఈ హస్తం) నాగబంధ విష యంలో ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : ఒక పాదంతో రెండవ పాదాన్ని ఒకచేతితో రెండవచేతిని చుట్టి నిలిస్తే అది 'నాగబంధ స్థానకం' అవుతుంది.

ఈ స్థానకం 'నాగబంధం' అనే అర్థమందు తగును.

టీక : దీనిని భరతముని చెప్పలేదు.

## 4. ఐంద్రస్థాన(క)ం :

పాదమేకం సమాకుంచ్య స్థిత్వాఽన్యపదజానునీ ।
ఉత్తానితే కరం న్యస్య స్థితి రైంద్ర మితీరితమ్ ॥ 708

వాసవే రాజభావే చ స్థానమైంద్రం నియుజ్యతే ।

అర్థం : ఏకంపాదం, సమాకుంచ్య, స్థిత్వా = ఒక కాలు, బాగుగా వంచి, నిలిచి; అన్యపద-జానునీ, ఉత్తానితే = రెండవ పాదంయొక్క జానువును, పైకిఎత్తి; కరంన్యస్య, స్థితిః = చేతిని జారవిడిచి, ఉన్న స్థితి; ఐంద్రం, ఇతి, ఈరితమ్ = ఐంద్రం, అని, చెప్పబడినది.

వాసవే, రాజభావే (చ), ఐద్రంస్థానం నియుజ్యతే = ఇంద్రుడు, రాజు — అనే అర్థములందు ఐంద్రస్థానం ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : ఒక కాలును బాగుగా వంచి, రెండవ పాదం యొక్క జానువును పైకెత్తి, చేతిని జారవిడిస్తే అది 'ఐంద్ర స్థానకం' అవుతుంది.

ఇంద్రుడు, రాజు-అనే అర్థములందు ఈ స్థానకం తగును.

టీక : నాట్యశాస్త్రంలో ఈ స్థానకం లేదు.

## 5. గరుడస్థాన(క)ం :

ఆలీఢమండలే పశ్చాదథ జానుతలం భువి ॥ 709

సంస్థాప్య పాణియుగ్మేన వహన విరలమండలమ్ ।
స్థితి స్తు గరుడస్థానం గరుడే వినియుజ్యతే ॥ 710

అర్థం : అథ, ఆలీఢమండలే, పశ్చాత్, జానుతలం, భువి, సంస్థాప్య = ఇంతకుముందు చెప్పిన, ఆలీఢమండలంలో నిల్చి,

పిమ్మట, ఒక మోకాలును, నేలమీద, నిల్పి; పాణియుగ్మేన = రెండు చేతులతో; వహన విరలమండలమ్ = వహించటానికి ( = మోయటానికి) వీలుగా మండల-ఆకారంగా; స్థితిః(తు) = నిలిచి యుండే స్థితి; గరుడస్థానం = గరుడస్థానకం అవుతుంది.

గరుడే, వినియుజ్యతే = (ఇది) గరుత్మంతునియందు, విని యోగపడుతుంది.

తాత్పర్యం : ఆలీఢ మండలమందలి ఒక మోకాలును నేల మీద ఆన్చి, రెండు చేతులు మోయుటకు వీలుగా మండల ఆకారంగా ఉంచితే, అది గరుడస్థానకం అవుతుంది.

ఈ స్థానకం గరుత్మంతుని తెలుపుతుంది.

టీక : దీనిని భరతముని చెప్పలేదు

6. బ్రహ్మస్థాన(క)ం :

జానూపరి పదం న్యస్య పదస్యోపరి జాను చ ।
స్థితం యది భవేత్ బ్రాహ్మం జపాదిషు నియుజ్యతే ॥ 711

అర్థం: జాను-ఉపరి పదం, పదస్య-ఉపరి జాను(చ), న్యస్య = (ఒక) మోకాలిమీద (రెండవ) పాదాన్ని, (ఒక) పాదంమీద (రెండవ) మోకాలిని ఉంచి; స్థితం, భవేత్ యది = కూర్చుండటం; జరిగితే; బ్రహ్మం = (అది) బ్రహ్మ(స్థానక)ం (అవుతుంది).

జపాదిషు, నియుజ్యతే = (ఇది) జపాదులయందు ప్రయుక్త మవుతుంది.

తాత్పర్యం : ఒక మోకాలిమీద రెండవ పాదాన్ని, ఒక పాదంమీద రెండవ మోకాలిని ఉంచి కూర్చుంటే అది 'బ్రహ్మ స్థానకం' అవుతుంది.

ఈ స్థానకం జపం మొదలగువాటియందు తగును.

టీక : ఇది ఉపవేశనవిధికి (=కూర్చుండుటకు) సంబంధించిన 'పద్మాసనం'. భరతముని వివిధములగు ఉపవేశన విధులను వర్ణించి ఉన్నాడు (తె.నా.శా. పుటలు ౩౬౩-౬౪). ఇంతకుముందు చెప్పిన ఐదు స్థానక భేదాలు, మండల భేదాలు పది - ఇంచుమించుగా ఇవి అన్నీ నిలిచి ఉండటంలో గల భేదాలను తెల్పుతున్నవి. మండలాలకు వినియోగాలు చెప్పబడలేదు; కాని స్థానకాలకు వినియోగాలు చెప్పబడినవి.

# 13
# ఉత్ప్లవన - భ్రమరీ భేదాలు

## ఉత్ప్లవనభేదాలు

అథోత్ప్లవనభేదానాం లక్షణం పరికథ్యతే ।

అలగం కర్తరీ వాఽశ్వోత్ప్లవనం మోటితం తథా ॥ 712

కృపాలగ మితి ఖ్యాతం పంచధోత్ప్లవనం బుధైః ।

అర్థం : అథ, ఉత్ప్లవన భేదానాం, లక్షణం, పరికథ్యతే= ఇంక, ఉత్ప్లవన భేదాల, లక్షణం, చెప్పబడుతున్నది; అలగం, కర్తరీ (వా), అశ్వ - ఉత్ప్లవనం, మోటితం (తథా), కృపాలగం ఇతి= అలగం, కర్తరి, అశ్వ (ఉత్ప్లవన)ం, మోటితం, కృపాలగం అని; ఉత్ప్లవనం, పంచధా, బుధైః ఖ్యాతః=ఉత్ప్లవనం, ఐదు విధాలుగా, పండితులచేత, చెప్పబడినది

తాత్పర్యం : ఇంక ఉత్ప్లవన భేదాలు ఐదు విధాలు — 1. అలగం, 2. కర్తరి, 3. అశ్వం, 4. మోటితం, 5. కృపాలగం, వీటి లక్షణమిప్పుడు చెప్పబడుతున్నది.

టీక : ఉత్ప్లవన భేదాలను భరతముని చెప్పలేదు. ఉత్ప్లవన పదానికి Leep అని ఘోష్ అనువాదం.

### 1. అలగోత్ప్లవనం

ఉత్ప్లుత్య పార్శ్వయుగలం కటిదేశే తు విన్యసేత్ ॥ 713

బద్ధ్వా కరాభ్యాం శిఖరౌ అలగోత్ప్లవనం భవేత్।

అర్థం : ఉత్ప్లుత్య = ఒక గెంతువేసి (= ఒకసారి దుముకి); కరాభ్యాం, శిఖరౌ, బధ్వా = రెండు చేతులతో, శిఖర హస్తాలు, పట్టి; కటిదేశే (తు) పార్శ్వయుగలం, విన్యసేత్ = కటి మీద, రెండు ప్రక్కల, (ఆ హస్తాలను) ఉంచవలెను (ఇది); అలగ-ఉత్ప్లవనం భవేత్ = 'అలగోత్ప్లవనం' అవుతుంది.

తాత్పర్యం : ఒకసారి దుముకి, శిఖరహస్తాలుగా ఉన్న రెండు చేతులను నడుం మీద రెండు ప్రక్కలను ఉంచితే అది 'అలగోత్ప్లవనం' అవుతుంది.

## 2. ఉత్ప్లవనకర్తరి :

**ఉత్ప్లుత్య ప్రపదైః సవ్యపాదస్యైకస్య పృష్ఠతః ॥** 714

కర్తరీ విన్యసే దేషా స్యాదుత్ప్లవనకర్తరీ ।

**అధోముఖం చ శిఖరం కటే హస్తం న్యసే దిహ ॥** 715

అర్థం : ప్రపదైః ఉత్ప్లుత్య = వ్రేళ్ళ మీదుగా దుమికి; ఏకస్య, సవ్యపాదస్య, పృష్ఠతః, కర్తరీ విన్యసేత్ = ఒకచేతితో, సవ్య (= ఎడమ) పాదం, వెనుకగా, కర్తరీ హస్తాన్ని పట్టవలెను; ఇహ, అధోముఖం, శిఖరహస్తం, (చ) కటే, న్యసేత్ = అదే సమయంలో అధోముఖంగా (రెండవ) హస్తాన్ని, కటి మీద, ఉంచవలెను.

తాత్పర్యం : ప్రపదం మీదుగా ముందుకు దుమికి, ఒక చేతితో ఎడమ పాదమునకు వెనుకగా కర్తరీహస్తాన్ని పట్టి, రెండవ చేతితో అధోముఖంగా శిఖరహస్తం పట్టి, దానిని కటి మీద ఉంచితే అది ఉత్ప్లవనకర్తరి లేదా కర్తర్యుత్ప్లవనం అవుతుంది.

## 3. అశ్వోత్ప్లవనం

**పురః పాదం సముత్ప్లుత్య పశ్చాత్ పాదం నియోజయేత్ ।**

**కరౌ తు త్రిపతాకాఖ్యౌ కృత్వాఽ శ్వోత్ప్లవనం భవేత్ ॥** 716

అర్థం: త్రిపతాకాఖ్యౌ కరౌ(తు) కృత్వా = రెండు చేతులతో, త్రిపతాక హస్తాలు, పట్టి; పురః = మొదట; పాదం సముత్ప్లుత్య = ఒక పాదంతో దుమికి; పశ్చాత్ = తరువాత; పాదం, నియోజయేత్ =(రెండవ) పాదాన్ని దానితో సమానంగా ఉంచవలెను (అప్పుడు అది); అశ్వ - ఉత్ప్లవనం, భవేత్ = అశ్వోత్ప్లవనం, అవుతుంది.

తాత్పర్యం : రెండు చేతులతో త్రిపతాక హస్తాలు పట్టి, మొదట ఒక పాదంతో ముందుకు దుముకి, తరువాత రెండవ పాదాన్ని మొదటి పాదంతో సమానంగా ఉంచితే, అది 'అశ్వోత్ప్లవనం' అవుతుంది.

## 4. మోటితోత్ప్లవనం

పర్యాయపార్శ్వోత్ప్లవనం కర్తరీవతు మోటితా ।
త్రిపతాకే చ కరయోః కృత్వా శశ్వత్ ప్రకాశనాత్ ॥ 717

అర్థం : కరయోః, త్రిపతాకే (చ), కృత్వా = రెండు చేతులతో, త్రిపతాక హస్తాలను, పట్టి; శశ్వత్, ప్రకాశనాత్ = మాటి మాటికి చూపటం వలన; కర్తరీ, ఇవ = కర్తరి, వలెనే; పర్యాయ, పార్శ్వ - ఉత్ప్లవనం = పర్యాయంగా, రెండు ప్రక్కలకు దుముకటం; మోటితా = మోటితోత్ప్లవనం (అవుతుంది).

తాత్పర్యం : రెండు చేతులతో త్రిపతాక హస్తాలను పట్టి, ఉత్ప్లవన కర్తరి యందువలెనే పర్యాయంగా రెండు ప్రక్కలకు దుముకటం 'మోటితోత్ప్లవనం' అవుతుంది.

## 5. కృపాలగోత్ప్లవనం

పార్ష్ణి మేకైకపాదస్య కటే పర్యాయతో న్యసేత్ ।
అర్ధచంద్రకలాంమధ్యే హస్త మేతత్ కృపాలగమ్ ॥ 718

అర్థం : ఏకైక పాదస్య, పార్ష్ణిమ్, పర్యాయతః, కటే, న్యసేత్ = ఒక్కొక్క చీలమండను పర్యాయంగా కటి మీద ఉంచ

వలెను (= కటిని తాకించవలెను); మధ్యే,అర్ధచంద్రకలాం, హస్తమ్ = ఆ రెండింటిమధ్య, అర్ధచంద్ర కలాహస్తం ఉంచవలెను; తత్, కృపాలగం = అది, కృపలాగం (అనే) ఉత్ప్లవనం అవుతుంది.

తాత్పర్యం : ఒక్కొక్క చీలమండతో పర్యాయగా కటిని తాకుతూ, మధ్య అర్ధచంద్రకలాహస్తం పట్టితే అది 'కృపాలగోత్ప్లవనం' అవుతుంది.

## భ్రమరీభేదాలు

భ్రమర్యా లక్షణాన్యత్ర వక్ష్యే లక్షణభేదతః ।
ఉత్ప్లుతభ్రమరీ చక్రభ్రమరీ గరుడాభిధా ॥ 719
తథైకపాదభ్రమరీ కుంచితభ్రమరీ తథా ।
ఆకాశభ్రమరీ చైవ తథాంగభ్రమరీతి చ ॥ 720
భ్రమర్యః సప్త విజ్ఞేయా నాట్యశాస్త్రవిశారదైః

అర్థం : అత్ర, లక్షణభేదతః, భ్రమర్యా, లక్షణాని, వక్ష్యే = ఇప్పుడు, లక్షణ (= స్వరూప) భేదాలను అనుసరించి, భ్రమరుల లక్షణం చెబుతాను. ఉత్ప్లుతభ్రమరీ, చక్రభ్రమరీ, గరుడ-అభిధా, (తథా) ఏకభ్రమరీ, కుంచిత భ్రమరీ, (తథా), ఆకాశభ్రమరీ (చ) (ఏవ) (తథా), అంగభ్రమరీ, ఇతి(చ) = ఉత్ప్లుతభ్రమరి, చక్రభ్రమరి, గరుడం అనే పేరుగల భ్రమరి, ఏకభ్రమరి, కుంచిత భ్రమరి, ఆకాశ భ్రమరి, అంగభ్రమరి — అని; సప్త భ్రమర్యః, నాట్యశాస్త్ర విశారదైః విజ్ఞేయా = ఏడు భ్రమరులు, నాట్యశాస్త్ర విశారదుల చేత తెలిసికోదగినవి.

తాత్పర్యం : ఇప్పుడు భ్రమరుల యొక్క లక్షణం చెబుతాను (భ్రమరి = ఎగరటం) — 1. ఉత్ప్లుత భ్రమరి, 2. చక్ర భ్రమరి, 3. గరుడభ్రమరి, 4. ఏకపాద భ్రమరి, 5. కుంచితభ్రమరి, 6. ఆకాశభ్రమరి, 7. అంగభ్రమరి — ఇట్లా భ్రమరులు ఏడు అని నాట్యశాస్త్ర విశారదులు తెలిసికోవలెను.

టీక : భ్రమరీ భేదాలను కూడా భరతముని చెప్పలేదు. భ్రమరి పదానికి flight అని ఘోష్ అనువాదం.

## 1. ఉత్ప్లుతభ్రమరి :

స్థిత్వా సమాభ్యాం పాదాభ్యా ముత్ప్లుత్య భ్రామయేద్యది ॥ 721
సర్వాంగమంతరాలే స్యాదుత్ప్లుతభ్రమరీ త్వసౌ ।

అర్థం ॥ సమాభ్యాం పాదాభ్యాం, స్థిత్వా = సమపాదాలతో, నిలిచి; ఉత్ప్లుత్య = ఎగిరి; అంతరాలే సర్వాంగం భ్రామయేత్ యది = అంతరాళమందు శరీరమునంతటిని త్రిప్పినట్లయితే; అసౌ, ఉత్ప్లుత భ్రమరీ(తు), స్యాత్ = అది ఉత్ప్లుతభ్రమరి, అవుతుంది.

తాత్పర్యం : సమపాదాలతో నిలిచి, తరువాత ఎగిరి, అంతరాళమందు (= భూమికి తగులకుండా) శరీరాన్ని అంతటినీ త్రిప్పితే అది 'ఉత్ప్లుతభ్రమరి' అవుతుంది.

## 2. చక్రభ్రమరి :

భువి పాదౌ ముహుః కర్షం త్రిపతాకౌ కరౌ వహన్ ॥ 722
చక్రవత్ భ్రమతే యత్ర సా చక్రభ్రమరీ భవేత్ ।

అర్థం : పాదౌ,ముహుః, భువి, కర్షం = రెండు పాదాలను, మాటిమాటికి భూమిమీద, తట్టుతూ; కరౌ, త్రిపతాకౌ, వహన్ = రెండు చేతులతో త్రిపతాక హస్తాలను పట్టి; చక్రవత్, భ్రమతే, యత్ర = చక్రాకారంగా, తిరగటం, ఎక్కడో (అక్కడ); సా, చక్రభ్రమరీ, భవేత్ = అది, చక్రభ్రమరి, అవుతుంది.

తాత్పర్యం : రెండు చేతులతో త్రిపతాక హస్తాలను పట్టి నేలను పాదాలతో మాటిమాటికీ తట్టుతూ, చక్రాకారంగా తిరిగితే, అది 'చక్రభ్రమరి' అవుతుంది.

## 3. గరుడభ్రమరి :

తిర్యక్ ప్రసార్యైకపాదం పశ్చాజ్జాను భువి క్షిపేత్ ॥ 723
సమ్యక్ ప్రసార్య బాహూ ద్వౌ భ్రామయేత్ గరుడో భవేత్ ।

అర్థం : ఏకపాదం, తిర్యక్, ప్రసార్య = ఒక పాదాన్ని అడ్డంగా, చాపి; పశ్చాత్, జాను, భువి, క్షిపేత్ = పిమ్మట, మోకాలును, భూమిమీద, ఉంచవలెను (ఆ సమయంలో); ద్వౌ, బాహూ, సమ్యక్, ప్రసార్య, భ్రామయేత్ = రెండు, బాహువులను, బాగుగా, చాపి, (వేగంగా) త్రిప్పవలెను (అది); గరుడః, భవేత్ = గరుడ (భ్రమరి) అవుతుంది.

తాత్పర్యం : ఒక పాదాన్ని అడ్డంగాచాచి, పిమ్మట మోకాలును భూమిమీదఉంచవలెను; తరువాత రెండు బాహువులను బాగుగా చాపి, వేగంగా త్రిప్పితే అది 'గరుడభ్రమరి' అవుతుంది.

టీక : గరుడస్థానకాన్ని కూడా పరిశీలించదగును.

## 4. ఏకపాదభ్రమరి :

భ్రామయే దేకమేకేన పాదం పాదేన సత్వరమ్ ॥ 724
సా త్వేకపాద భ్రమరీ భవే దితి వినిశ్చితా ।

అర్థం : ఏక పాదం, ఏకేన పాదేన, సత్వరమ్, భ్రామయేత్ = ఒక పాదాన్ని, ఇంకో పాదంతో, వేగంగా, త్రిప్పితే; సా (తు) ఏకపాద భ్రమరీ, భవేత్ ఇతి, వినిశ్చితా = అది 'ఏకపాదభ్రమరి' అవుతుందని, నిశ్చయించబడినది.

తాత్పర్యం : ఒక పాదాన్ని ఇంకొక పాదంచేత (= పాదం మీద) పర్యాయంగా త్రిప్పితే అది 'ఏకపాద భ్రమరి' అవుతుంది.

## 5. కుంచితభ్రమరి :

నికుంచ్య జానుభ్రమణం కుంచిత భ్రమరీ భవేత్ ॥ 725

అర్థం : జాను, నికుంచ్య, భ్రమణం = జానువును, వంచి, తిరగటం; కుంచిత భ్రమరీ, భవేత్ = 'కుంచితభ్రమరి' అవుతుంది.

తాత్పర్యం: జానువును వంచి, తిరిగితే అది 'కుంచితభ్రమరి' అవుతుంది.

## 6. ఆకాశభ్రమరి:

ఉత్ప్లుత్య పాదౌ విరలౌ కృత్వా పాదౌ ప్రసార్య చ ।
భ్రామయేత్ సకలం గాత్ర మాకాశభ్రమరీ భవేత్ ॥ 726

అర్థం : ఉత్ప్లుత్య = (ఒకసారి) ఎగిరి, (ఆ సమయంలో); పాదౌ, విరలౌ, కృత్వా, పాదౌ, ప్రసార్య (చ) = పాదాలను ఎడంగా చేసి, ఆ పాదాలనే, బాగా చాపి; సకలం గాత్రం, భ్రామయేత్ = శరీరమంతటిని త్రిప్పితే (అది); ఆకాశభ్రమరీ, భవేత్ = 'ఆకాశ భ్రమరి' అవుతుంది.

తాత్పర్యం : ఒకసారి ఎగిరి, పాదాలను ఎడంగా చాపి, శరీరమంతటిని త్రిప్పితే అది ఆకాశభ్రమరి' అవుతుంది.

## 7. అంగభ్రమరి :

వితస్త్యంతరితౌ పాదౌ కృత్వాంగభ్రమణం తథా ।
తిష్ఠేద్యది భవేదంగభ్రమరీ భరతోదితా ॥ 727

అర్థం : పాదౌ, వితస్తి-అంతరితౌ, కృత్వా, తథా, అంగ భ్రమణం = పాదాలను, ఒక జానెడు దూరంగా, ఉంచి, తరువాత, శరీరాన్ని గుండ్రంగా త్రిప్పి; తిష్ఠేత్ యది = నిలిస్తే (అది ; భరత-ఉదితా, అంగభ్రమరీ, భవేత్ = భరతునిచేత చెప్పబడిన 'అంగ భ్రమరి' అవుతుంది.

తాత్పర్యం : పాదాలను ఒక జానెడు దూరంగా ఉంచి, తరువాత శరీరాన్ని గుండ్రంగా త్రిప్పితే, అది భరతుడు చెప్పిన అంగభ్రమరి' అవుతుంది.

టీక : ఈ భ్రమరులను భరతముని చెప్పలేదు. 'భరతోదితా' అనటం మాటవరుసకే.

# 14
# చారి - గతిభేదాలు

## చారిభేదాలు

అథాత్ర చారిభేదానాం లక్షణం కథ్యతే మయా ।
ఆదౌ తు చలనం ప్రోక్తం పశ్చాత్ చంక్రమణం తథా ॥ 728

సరణం వేగినీ చైవ కుట్టనం చ తతఃపరమ్ ।
లుఠితం లోలితం చైవ తతో విషమసంచరః ॥ 729

చారిభేదా అమీ అష్టౌ ప్రోక్తా భరతవేదిభిః ।

అర్థం : అథ, అత్ర, చారిభేదానాం, లక్షణం, మయా, కథ్యతే = ఇంక, ఇప్పుడు, చారిభేదాల, లక్షణం, నాచేత, చెప్పబడుతున్నది; (ఆదౌతు) చలనం (ప్రోక్తం), పశ్చాత్ చంక్రమణం (తథా), సరణం, వేగినీ (చ) (ఏవ), కుట్టనం (చ) (తతః పరమ్), లుఠితం, లోలితం (చ) (ఏవ), (తతః) విషమ సంచరః = (మొదట) చలనం (చెప్పబడినది), (తరువాత) చంక్రమణం, సరణం, వేగిని, కుట్టనం, (అటుపిమ్మట) లుఠితం, లోలితం, (పిమ్మట) విషమ సంచరం; అమీ, అష్టౌచారిభేదాః, భరతవేదిభిః, ప్రోక్తాః = ఈ, ఎనిమిది చారిభేదాలు, భరతవేత్తలచేత, చెప్పబడినవి.

తాత్పర్యం: ఇంక ఇప్పుడు చారిభేదాల లక్షణంచెబుతాను — 1. చలనం, 2. చంక్రమణం, 3. సరణం, 4. వేగిని, 5. కుట్టనం, 6. లుఠితం, 7. లోలితం, 8. విషమసంచరం - అనే భేదాలచేత చారులు ఎనిమిది అని భరతవేత్తలు చెప్పినారు.

టీక : ఊరు-కటీ-పాద-జంఘలయొక్క కర్మల పరస్పరసం యోజనఫలమైన చేష్ట 'చారి' అని నిర్వచించి 16 భూమిచారులను, 16 ఆకాశికీచారులను భరతముని నిర్వచించినాడు (10 వ అధ్యా.) కాని, ఆచారులకంటె, ఇక్కడ వివరింపబడుతున్న చారులు భిన్నములు. 'చారి' అన్న పదానికి 'గెయిట్' అని ఘోష్ అనువాదం.

## 1. చలనచారి :

స్వస్థానాత్ స్వస్యపాదస్య చలనా చ్చలనం భవేత్ ॥ 780

అర్థం : స్వస్యపాదస్య స్వస్థానాత్, చలనాత్ = పాదం తన స్థానం నుంచి, చలనం (పొందటం) వల్ల; చలనం, భవేత్ = చలన (చారి) అవుతుంది.

తాత్పర్యం : పాదాన్ని ఉన్న చోటు నుంచి కదలించితే, అది 'చలనచారి' అవుతుంది.

## 2. చంక్రమణచారి :

పాదయోః బాహ్యపార్శ్వాభ్యాం ముత్క్షిప్యోత్క్షిప్య యత్నతః ।
గతి ర్భవే చ్చంక్రమణం వర్ణితం నాట్యకోవిదైః ॥ 781

అర్థం : యత్నతః, ఉత్క్షిప్య - ఉత్క్షిప్య = (పాదాలను) ప్రయత్నపూర్వకంగా ఎత్తి, ఎత్తి; పాదయోః బాహ్య పార్శ్వాభ్యాం గతిః = (అ) పాదాల వెలుపలి ప్రక్కలకు వేస్తూ ఉంటే; చంక్రమణం, భవేత్ = 'చంక్రమణచారి' అవుతుంది (అని); నాట్యకోవిదైః, వర్ణితః = నాట్య విద్వాంసులచేత, వర్ణింపబడినది.

తాత్పర్యం : పాదాలను ప్రయత్నపూర్వకంగా ఎత్తి ఎత్తి ఆ పాదాల ప్రక్కలకు పర్యాయంగా వేస్తూ ఉంటే, అది 'చంక్రమణచారి' అవుతుంది.

### 3. సరణచారి :

చలనం తు జలూకావ దేకేనాన్యస్య పార్ష్ణినా ।

తిర్యగాకర్షయే ద్భూమిం కరాభ్యాం తు పతాకికే ॥ 782

ధృత్వా చ గమనం యత్తు సరణం తదుదీరితమ్ ।

అర్థం : ఏకేన - పార్ష్ణినా, అన్యస్య = ఒకపాదం యొక్క చీల మండచేత రెండవ(పాదంయొక్క చీలమండను తాకుతూ); కరాభ్యాంతు, పతాకికే, ధృత్వా (చ) = రెండు చేతులతో, పతాక హస్తాలను పట్టి; జలూకావత్, చలనం (తు), భూమిం, తిర్యక్, ఆకర్షయేత్ = జలగవలె, ప్రాకుతూ, భూమి మీద, అడ్డంగా, సాగటం; యత్తు తత్ = ఏదో, అది; సరణం,ఈరితమ్ = 'సరణచారి'(అని) చెప్పబడినది.

తాత్పర్యం : ఒక పాదం యొక్క చీలమండ చేత రెండవ పాదం యొక్క చీలమండను తాకుతూ, రెండు చేతులతో పతాక హస్తాలను పట్టి, జలగవలె భూమి మీద ప్రాకటం 'సరణచారి' అనబడుతుంది.

### 4. వేగినీచారి

పార్ష్ణి నావా పదాగ్రేణ ద్రుతగత్యా తు చాలనం ॥ 783

కరాభ్యాం చాలపద్మే చ త్రిపతాకే యథాక్రమమ్ ।

ధృత్వా నటేత్ యది భవేత్ వేగవత్త్వేన వేగినీ ॥

అర్థం : పార్ష్ణినా, వా, పద-అగ్రేణ, ద్రుత గత్యా (తు) చాలనం = చీలమండల చేత, లేదా, పాదాగ్రంచేత, వేగవంతమైన గతితో, చరిస్తూ; కరాభ్యాం (చ), యథాక్రమం, అలపద్మే (చ), త్రిపతాకే, ధృత్వా = రెండు చేతులతో వరుసగా అలపద్మ హస్తం, త్రిపతాకహస్తం, పట్టి; నటేత్ యది, వేగవత్త్వేన, వేగినా, భవేత్ = (వేగంగా) నటిస్తే, వేగవత్త్వం చేత, అది 'వేగినీచారి' అవుతుంది.

తాత్పర్యం : చీలమండచేత లేదా పాదాగ్రం చేత వేగంగా చరిస్తూ, రెండు చేతులతో వరుసగా అలపద్మహస్తం, త్రిపతాక హస్తం పట్టి నడిస్తే వేగంవల్ల అది 'వేగినీచారి' అవుతుంది.

## 5. కుట్టనచారి :

పార్ష్ణినా వా పదాగ్రేణ సమస్తేన తలేన వా ।

యత్తాడనం భూతలస్య కుట్టనం తదుదీరితమ్ ॥ 735

అర్థం : పార్ష్ణినా, వా, పద - అగ్రేణ, వా సమస్తేన తలేన = చీలమండచేత, లేదా, పాదాగ్రంచేత, లేదా మొత్తం పాద తలం చేత; భూతలస్య, తాడనం, యత్, తత్ = భూమిని, తట్టటం, ఏదో, అది; కుట్టనం, ఈరితమ్ = 'కుట్టనచారి' (అని) చెప్పబడినది.

తాత్పర్యం : చీలమండచేత లేదా పాదాగ్రంచేత లేదా మొత్తం పాదతలం (= అరకాలు)చేత నేలను తట్టితే, అది 'కుట్టన చారి' అవుతుంది.

## 6. లుఠితచారి :

స్వస్తికస్థితి పాదాగ్రే కుట్టనాత్ లుఠితం భవేత్ ।

అర్థం : స్వస్తికస్థితి = స్వస్తికస్థితిలో; పాదాగ్రే, కుట్టనాత్ = పాదాగ్రమందు, కుట్టనం చేయటం (= గట్టిగా రాయటంవల్ల); లుఠితం భవేత్ = 'లుఠితచారి' అవుతుంది.

తాత్పర్యం : స్వస్తిక స్థితిలో ఉండి (= ఒక పాదం మీద నిలిచి, రెండవ కాలిని అడ్డంగా చేర్చి), పాదాగ్రంతో కుట్టనం చేస్తే అది 'లుఠితచారి' అవుతుంది.

## 7. లోలితచారి :

పూర్వవత్ కుట్టనం కృత్వా మందంమంద మతఃపరమ్ ॥ 736

అస్పృష్టభూమేః పాదస్య చాలనం లోలితం భవేత్ ।

అర్థం : పూర్వవత్, కుట్టనం, కృత్వా = ముందు చెప్పినట్లుగా కుట్టనం,చేసి; అతఃపరమ్, అస్పృష్టభూమేః, మందంమందమ్, పాదస్య

చాలనం — అటుపిమ్మట, భూమిని తాకకుండా, మెల్లమెల్లగా,పాద చాలనం చేయటం ( = పాదాన్ని ముందుకు జరపటం); లోలితం, భవేత్ — 'లోలితచారి' అవుతుంది.

తాత్పర్యం : ముందు చెప్పిన విధంగా కుట్టనం చేసి, పిమ్మట భూమిని తాకకుండా పాదచాలనం చేస్తే,అది 'లోలితచారి' అవుతుంది.

## 8. విషమసంచరచారి :

వేష్టయిత్వా దక్షిణేన వామం వామేన దక్షిణమ్ ॥ 737

క్రమేణ పాదం విన్యస్య భవే ద్విషమసంచరః ।

అర్థం : దక్షిణేన వామం, వామేన దక్షిణం, వేష్టయిత్వా — కుడిపాదం ప్రక్కగా ఎడమ పాదాన్ని, ఎడమపాదం ప్రక్కగా కుడిపాదాన్ని, చుట్టుతూ; క్రమేణ, పాదం, విన్యస్య — పర్యాయంగా, పాదవిన్యాసం చేయటం; విషమసంచరః, భవేత్ — 'విషమ సంచరచారి' అవుతుంది.

తాత్పర్యం : కుడిపాదం ప్రక్కగా ఎడమ పాదాన్ని, ఎడమ పాదం ప్రక్కగా కుడి పాదాన్ని చుట్టుతూ, పర్యాయంగా పాదవిన్యాసం చేస్తే, అది 'విషమసంచరచారి' అవుతుంది.

## గతిభేదాలు

అథాత్ర గతి భేదానాం లక్షణం వక్ష్యతే క్రమాత్ ॥ 738

హంసీ మయూరీ చ మృగీ గజలీలా తురంగిణీ ।

సింహీ భుజంగీ మండూకీ గతి ర్వీరా చ మానవీ ॥ 739

దశైతా గతయో జ్ఞేయా నాట్యశాస్త్రవిశారదైః ।

అర్థం : అథ, అత్ర, గతి భేదానాం, లక్షణం, క్రమాత్, వక్ష్యతే — ఇంక, ఇప్పుడు, గతి భేదాల లక్షణం, క్రమంగా, చెప్ప బడుతున్నది; హంసీ, మయూరీ (చ), మృగీ, గజలీలా, తురంగిణీ, సింహీ, భుజంగీ, మండూకీ (గతిః), వీరా (చ), మానవీ —

హంసి, మయూరి, మృగి, గజలీల, తురంగిణి, సింహి, భుజంగి, మండూకి (గతి), వీర, మానవి; ఏతా, దశ గతయః, నాట్యశాస్త్ర విశారదైః, జ్ఞేయా = ఇట్లా, పది గతులు, నాట్యశాస్త్రవిశారదుల చేత, తెలియదగినవి.

తాత్పర్యం : ఇప్పుడు గతి భేదాల లక్షణం క్రమంగా చెప్ప బడుతుంది. 1. హంసి, 2 మయూరి, 3. మృగి, 4. గజలీల, 5. తురంగిణి, 6. సింహి, 7. భుజంగి, 8. మండూకి, 9. వీర, 10. మానవి — ఇట్లా గతులు పది విధాలని నాట్యశాస్త్ర విశారదులు తెలియవలెను.

టీక : 'స్త్రీల శీల భేదములు' అన్న పేరుతో భరతముని 23 భేదములు నిర్వచించినాడు (తె. నా శా. పుటలు 666-69). అంతే కాని వారి గతులను వివరించలేదు.

## 1. హంసీగతి :

పరివర్త్య తనుం పార్శ్వం వితస్త్యంతరితం శనైః ॥ 740

ఏకైకం తత్పదం న్యస్య కపిత్థం కరయో ర్వహన్ ।

హంసవద్గమనం యత్తు సా హంసీ గతి రీరితా ॥ 741

అర్థం : తనుం, పార్శ్వం, పరివర్త్య = శరీరాన్ని, రెండు ప్రక్కలకు, (పర్యాయంగా) త్రిప్పుతూ; వితస్తి - అంతరితం తత్ ఏకైకంపదం శనైః న్యస్య = ఒక జానెడు ఎడంగా, ఆ ఒక్కొక్క పాదాన్ని, మెల్లగా, ముందుకు వేస్తూ; కరయోః, కపిత్థం, వహన్ = రెండు చేతులతో, కపిత్థహస్తాలను, పట్టి; హంసవత్, గమనం, యత్తు, సా = హంసవలె, నడవటం, ఏదో, అది; హంసీగతిః, ఈరితా = హంసీగతి (అని), చెప్పబడినది.

తాత్పర్యం : శరీరాన్ని రెండు ప్రక్కలకు పర్యాయంగా త్రిప్పుతూ, ఒక జానెడు ఎడంగా ఒక్కొక్క పాదాన్ని ముందుకు వేస్తూ, రెండు చేతులతో కపిత్థహస్తాలను పట్టి హంసవలె నడిస్తే, అది 'హంసీగతి' అవుతుంది.

## 2. మయూరీగతి :

ప్రపదాభ్యాం భువి స్థిత్వా కపిత్థం కరయో ర్వహన్ ।
ఏకైకజాను చలనా న్మయూరీగతి రీరితా ॥ 742

అర్థం : భువి, ప్రపదాభ్యాం, స్థిత్వా = నేలపై, పాదాగ్రాల మీద, నిలిచి; కరయోః, కపిత్థం, వహన్ = రెండు చేతులతో, కపిత్థ హస్తాలను, పట్టి; ఏక - ఏక జానుచలనాత్ = ఒక్కొక్క మోకాలును, (పర్యాయంగా) కదపటం చేత; మయూరీగతిః, ఈరితా = మయూరీ ( = నెమలి) గతి, (అవుతుందని) చెప్పబడినది.

తాత్పర్యం : నేల మీద పాదాగ్రాలతో నిలిచి, రెండుచేతులతో కపిత్థహస్తాలను పట్టి, ఒక్కొక్క మోకాలును పర్యాయంగా ముందుకు వేస్తూ ఉంటే అది 'మయూరీగతి' అవుతుంది.

## 3. మృగీగతి :

మృగవద్గమనం వేగాత్ త్రిపతాకకరౌ వహన్ ।
పురతః పార్శ్వయో శ్చైవ యానం మృగగతిః భవేత్ ॥ 743

అర్థం : త్రిపతాక కరౌ, వహన్ = త్రిపతాక హస్తాలను రెండు చేతులతో, పట్టి; పురతః, పార్శ్వయోః (చ) (ఏవ) యానం = ముందుకు, ప్రక్కలకు, సాగటం; మృగవత్ వేగాత్ గమనం = లేడివలె వేగంగా పరుగెత్తటం (వల్ల); మృగగతిః, భవేత్ = 'మృగ (= లేడి) గతి,' అవుతుంది.

తాత్పర్యం : రెండు చేతులతో త్రిపతాక హస్తాలను పట్టి, ముందుకు, ప్రక్కలకు సాగుతూ లేడివలె వేగంగా పరుగెత్తటం వల్ల 'మృగీగతి' అవుతుంది.

## 4. గజలీలాగతి :

పార్శ్వయో స్తు పతాకాభ్యాం కరాభ్యాం విచరం స్తతః ।
సమపాదగతి ర్మందం గజలీలేతి విశ్రుతా ॥ 744

అర్థం : పార్శ్వయోః, పతాకాభ్యాం, విచరన్ = రెండు ప్రక్కల, పతాక హస్తాలను, పట్టి; తతః మందం సమపాదగతిః = పిమ్మట, మెల్లగా, సమపాద పాదాలతో ముందుకు సాగటం; గజ లీలా, ఇతి, విశ్రుతా = 'గజలీలాగతి' (అని), ప్రఖ్యాతమైనది.

తాత్పర్యం : రెండు ప్రక్కల పతాక హస్తాలను పట్టి, పిమ్మట మెల్లగా సమ పాదాలతో ముందుకు సాగటం 'గజలీలాగతి' అవుతుంది.

## 5. తురంగిణీగతి :

ఉత్క్షిప్య దక్షిణం పాద ముల్లంఘ్య చ ముహుర్ముహుః ।
వామేన శిఖరం ధృత్వా దక్షిణేన పతాకికామ్ ॥ 745
తురంగిణీగతిః ప్రోక్తా నృత్తశాస్త్రవిశారదైః ।

అర్థం : దక్షిణం పాదం, ఉత్క్షిప్య = కుడి పాదాన్ని, ఎత్తి; ముహుఃముహుః, ఉల్లంఘ్య (చ) = మాటిమాటికి లేదా వెంట వెంటనే, ముందుకు దుముకుతూ; వామేన శిఖరం, దక్షిణేన పతాకి కామ్, ధృత్వా = ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత పతాకహస్తం, పట్టి (సాగితే, అది); తురంగిణీగతిః, నృత్తశాస్త్ర విశారదైః, ప్రోక్తా = 'తురంగిణీ (= గుఱ్ఱం) గతి', (అని), నృత్తశాస్త్ర విశారదుల చేత, చెప్పబడినది.

తాత్పర్యం : కుడిపాదాన్ని ఎత్తి, మాటిమాటికి ముందుకు దుముకుతూ, ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత పతాకహస్తం పట్టి సాగితే, అది 'తురంగిణీగతి' అవుతుందని నృత్తశాస్త్రవిశారదులు చెప్పినారు.

## 6. సింహీగతి :

పాదాగ్రాభ్యాం భువి స్థిత్వా పురఉత్ప్లుత్య వేగతః ॥ 746
కరాభ్యాం శిఖరం ధృత్వా యానం సింహగతిర్భవేత్ ।

అర్థం : పాదాగ్రాభ్యాం, భువి, స్థిత్వా = పాదాగ్రాల మీద, భూమిపై, నిలిచి; కరాభ్యాం, శిఖరం, ధృత్వా = రెండు చేతులతో, శిఖరహస్తాలను పట్టి; పురః, వేగతః ఉత్ప్లుత్య, యానం = ముందుకు, వేగంగా, దూకి, సాగటం; సింహగతిఃభవేత్ = (అది) 'సింహీగతి', అవుతుంది.

తాత్పర్యం : భూమిపై పాదాగ్రాల మీద నిలిచి, రెండు చేతులతో శిఖరహస్తాలను పట్టి, ముందుకు వేగంగా దూకుతూ సాగితే, అది 'సింహీగతి' అవుతుంది.

## 7. భుజంగీగతి :

త్రిపతాకకరౌ ధృత్వా పార్శ్వయో రుభయో రపి ॥ 747
పూర్వవ ద్గమనం యత్తు సా భుజంగీగతి ర్భవేత్ ।

అర్థం : ఉభయోః, పార్శ్వయోః (అపి), త్రిపతాకకరౌ, ధృత్వా = రెండు పార్శ్వములందును, త్రిపతాక హస్తాలు, పట్టి; పూర్వవత్, గమనం, యత్తు, సా = ముందు చెప్పిన విధంగా, నడవటం, ఏదో, అది; భుజంగీగతిః, భవేత్ = 'భుజంగీగతి' అవుతుంది.

తాత్పర్యం : రెండు చేతులతో రెండు పార్శ్వములందు త్రిపతాక హస్తాలను పట్టి, ముందు చెప్పిన విధంగా నడవటం, 'భుజంగీగతి' అవుతుంది.

## 8. మండూకీగతి :

కరాభ్యాం శిఖరం ధృత్వా కించిత్ సింహీసమాగతిః ॥ 748
మండూకీగతి రిత్యేషా ప్రసిద్ధా భరతాగమే ।

అర్థం : కరాభ్యాం, శిఖరం, ధృత్వా = రెండు చేతులతో

శిఖరహస్తాలను, పట్టి; కించిత్, సింహీసమాగతిః = కొంచెం సింహీ గతితో సమానమైన గతి (= నడక) (సాగితే); ఏషా, మండూకీ గతిః, ఇతి, భరతాగమే, ప్రసిద్ధా = అది, మండూకీగతి, అని, భరత వేదంలో ప్రసిద్ధమైనది.

తాత్పర్యం : రెండు చేతులతో శిఖరహస్తాలను పట్టి, కొంచెం సింహీగతితో సమానమైన గతితో సాగితే, అది 'మండూకీగతి' అవుతుందని భరతవేదంలో ప్రసిద్ధమైనది.

## 9. వీరాగతి :

వామే తు శిఖరం ధృత్వా దక్షిణేన పతాకికా ॥ 749

దూరా దాగమనం యత్తు వీరాగతి రుదీరితా ।

అర్థం : వామే (తు) శిఖరం, దక్షిణేన పతాకికా, ధృత్వా = ఎడమచేత శిఖర హస్తాన్ని, కుడిచేత పతాక హస్తాన్ని, ధరించి; దూరాత్, ఆగమనం, యత్తు = దూరం నుంచి, రావటం ఏదో, అది; వీరాగతిః, ఉదీరితా = 'వీరాగతి' (అని) చెప్పబడినది.

తాత్పర్యం: ఎడమచేత శిఖరహస్తం, కుడిచేత పతాకహస్తం ధరించి, దూరంనుంచి వస్తున్నటుగా ఉంటే అది 'వీరాగతి' అవుతుంది.

## 10. మానవీగతి :

మండలాకారవద్ భ్రాంత్వా సమాగత్య ముహుర్ముహుః ॥ 750

వామకరం న్యస్య కట్యాం దక్షిణే కటకాముఖమ్ ।

మానవీగతి రిత్యేషా ప్రసిద్ధా పూర్వసూరిభిః ॥ 751

అర్థం: మండల - ఆకారవత్, ముహుః ముహుః, భ్రాంత్వా, సమాగత్య = గుండ్రంగా, మాటి మాటికి, తిరుగుతూ, వచ్చి; కట్యాం, వామకరం న్యస్య, దక్షిణే కటకాముఖమ్ = కటిపై ఎడమ చేతిని ఉంచి, కుడిచేత కటకాముఖ హస్తం (పట్టితే); ఏషా, మానవీ

గతిః, ఇతి, పూర్వసూరిభిః, ప్రసిద్ధా = అది 'మానవీగతి' అని, ప్రాచీనపండితుల చేత, ప్రసిద్ధమైనది.

తాత్పర్యం : గుండ్రంగా మాటి మాటికీ తిరుగుతూ వచ్చి కటిపై ఎడమచేతిని ఉంచి, కుడిచేత కటకాముఖ హస్తం పట్టితే అది 'మానవీగతి' అని ప్రాచీనపండితులు చెప్పినారు.

## మండలాదుల పరస్పర సంబంధం

మండలాని ప్రయుక్తాని తథైవోత్ప్లవనాని చ ।
భ్రమర్య శ్చైవ చార్య శ్చ గతయ శ్చ పరస్పరమ్ ॥ 752

ఏకైకభేదసంబంధా దనంతాని భవంతి హి ।
ఏతా శ్చ నర్తనవిధౌ శాస్త్రతః సంప్రదాయతః ॥ 753

సతా మనుగ్రహేణైవ విజ్ఞేయా నాన్యథా భువి ।

అర్థం : మండలాని (తథ) (ఏవ), ఉత్ప్లవనాని (చ), భ్రమర్యః (చ) (ఏవ), చార్యః (చ), గతయః (చ) పరస్పరం సంబంధాత్ ప్రయుక్తాని = మండలములు, ఉత్ప్లవనములు, భ్రమరులు, చారులు, గతులు — ఇవి పరస్పరసంబంధంతో ప్రయుక్తాలు (అయితే); ఏకైక భేదసంబంధాత్, అనంతాని, భవంతి(హి) = ఒక్కొక్క భేదంతో సంబంధంవల్ల, అనంత సంఖ్య కలవి, అవుతాయి; ఏతాః(చ), నర్తన విధౌ = వీటినెల్ల, నర్తన విధియందు; శాస్త్రతః, సంప్రదాయతః, సతాం అనుగ్రహేణ (ఏవ), విజ్ఞేయా = శాస్త్రం (అధ్యయనం చేయటం)వల్ల, సంప్రదాయానుసారంగా, విజ్ఞులయొక్క అనుగ్రహంవల్ల, తెలియవలెను; అన్యథా, న = ఇంకోవిధంగా, కాదు.

తాత్పర్యం : మండలములు, ఉత్ప్లవనములు, భ్రమరులు, చారులు, గతులు — ఇవి పరస్పర సంబంధంతో ప్రయుక్తములవుతాయి. అందుచేత పరస్పరసంబంధంతో ఒక్కొక్క భేదం అనంత సంఖ్యకలది అవుతుంది. ఇవి అన్నీ నర్తన విధియందు శాస్త్రం ద్వారా, సంప్రదాయానుసారంగా, విజ్ఞుల అనుగ్రహంతో తెలియదగినవి; అంతేకాని ఇంకోవిధంగా సాధ్యం కాదు.

టీక : నృత్త-నృత్య-నాట్యములు మూడింటికిని ప్రమాణ ములు మూడు - 1. లోకం, 2. శాస్త్రం, 3. ఆత్మజ్ఞానం (తె.నా. శా. పుట 729). లోకమన్నది సంప్రదాయాన్ని, విజ్ఞుల బోధను మేళవించుకొన్న ప్రమాణం. నాట్యశాస్త్రాదులు శాస్త్రప్రమాణం. ఇంక సంప్రదాయాన్ని, విజ్ఞుల బోధను, ఆకళింపుచేసుకొని, స్వీయానుభవాన్ని వాటితో సమన్వయించుకొనటం ఆత్మజ్ఞానం అవుతుంది. ఈ సత్యాన్ని పై రెండుశ్లోకాలు విశదీకరిస్తున్నవి. శాస్త్రం ఎంతచెప్పినా, అందులో కొన్ని ఛిద్రాలు (గ్యాప్స్) ఉండనే ఉంటాయి. అభినవ గుప్తుడు పేర్కొన్నట్లుగా సంప్రదాయాన్ని అనుసరించి నృత్యఆచార్యుడు వాటిని పూరిస్తూ ఉంటాడు. అంటే నృత్యాచార్యుడు ఛిద్రచ్ఛాదనం (లోటులను పూర్తి)చేసి, అలాత చక్ర ప్రతిమత్వం (మండుతున్న కొరవిని వేగంగా గుండ్రంగా త్రిప్పుతూఉంటే ఏర్పడే జ్వాలావలయంలోని ఏకత్వం) సాధించ గలడు. శాస్త్రం చదివి కరణ-అంగహారాధులను ప్రయోగించ టానికి పూనుకొంటే వాటికి ఏకరూపత సిద్ధించక, అవి విడివిడిగానే గోచరిస్తూఉంటాయి. అందుచేత శాస్త్ర-సంప్రదాయ విదుడైన ఉత్తమ నృత్యాచార్యునివద్దనే నృత్యాన్ని అభ్యసించాలి. ఇందుకు చక్కని వ్యాయామం అవసరం. ఈ నృత్యాభ్యాసం యోగా భ్యాసంతో సమానం. అందుచేతనే నృత్యం శివ-పార్వతులకు ప్రీతిపాత్రమైంది.

# 15
# వృక్ష - మృగ హస్తాలు

## వృక్ష హస్తాలు

### 1. అశ్వత్థ హస్తం :

**అలపద్మౌ రేచితౌ చే దశ్వత్థే సంప్రయుజ్యతే ॥** 754

అర్థం : అలపద్మౌ, రేచితౌచేత్ = రెండు అలపద్మహస్తాలు, రేచితములైతే(ఆ హస్తం); అశ్వత్థే, సంప్రయుజ్యతే = అశ్వత్థ వృక్షమందు ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : రెండు అలపద్మ హస్తాలు రేచితాలు( = చలిస్తున్నవి) అయితే, అది అశ్వత్థవృక్షహస్తం అవుతుంది. ఇది అశ్వత్థ వృక్షం ( = రావిచెట్టు) అనే అర్థంలో వినియోగపడుతుంది.

టీక : వృక్ష హస్తాలను, సింహాది మృగహస్తాలను, పక్షిహస్తాలను, జలజంతు హస్తాలను భరతముని చెప్పలేదు. ఇవి ఘోష్‌పాఠంలో కూడా లేవు. ఇతర గ్రంథాలనుంచి గ్రహించినట్లుగా నీడామంగళం వారు చెప్పలేదు. మాతృభూతయ్య, దివాకరకవి గ్రంథాలలో కూడా ఇవి లేవు.

### 2. కదళీహస్తం :

**కదళ్యాం శ్లిష్టముకుళో రేచితోద్వేష్టితో భవేత్ ।**

అర్థం : శ్లిష్టముకుళః = శ్లిష్ట ( = వ్రేళ్ళు సన్నిహితంగా ఉన్న) ముకుళహస్తం; రేచితః, ఉద్వేష్టితః = రేచితం, ఉద్వేష్టితం (అయితే); కదళ్యాం భవేత్ = కదళీవృక్షం ( = అరటిచెట్టు) అనే అర్థంలో చెల్లుతుంది.

తాత్పర్యం : శిష్ట ముకుళహస్తం ఉద్వేష్టితం (=పైకి చాపబడినది), రేచితం అయితే కదళీవృక్షహస్తం అవుతుంది(=కదళీ వృక్షం అనే అర్థమందు చెల్లుతుంది).

### 3, 4. నారంగ-లికుచహస్తాలు :

నారంగే పద్మకోశః స్యాద్భ్రమరో లికుచే భవేత్ ॥ 756

అర్థం : నారంగే, పద్మకోశః, స్యాత్ = నారింజచెట్టు విషయంలో, పద్మకోశహస్తం, అవుతుంది; లికుచే, భ్రమరః, భవేత్ = గజనిమ్మచెట్టు విషయంలో, భ్రమరహస్తం, అవుతుంది.

తాత్పర్యం : నారింజచెట్టు విషయంలో పద్మకోశహస్తం చెల్లుతుంది. గజనిమ్మచెట్టు విషయంలో భ్రమరహస్తం చెల్లుతుంది.

### 5, 6. పనస-బిల్వహస్తాలు :

పనసే చతురః ప్రోక్తో బిల్వార్థే చతురో భవేత్ ।

అర్థం : పనసే, చతురః, ప్రోక్తః = పనసచెట్టు విషయంలో, చతురహస్తం, చెప్పబడినది; బిల్వార్థే, చతురః, భవేత్ = బిల్వ వృక్షం (=మారేడుచెట్టు) విషయంలో (కూడా) చతురహస్తమే.

తాత్పర్యం : పనసచెట్టు విషయంలో చతురహస్తం చెల్లుతుంది. మారేడుచెట్టు విషయంలోకూడా చతురహస్తమే చెల్లుతుంది.

### 7. పున్నాగహస్తం :

పతాకచతురౌ ప్రోక్తౌ పున్నాగతరునిర్ణయే ॥ 756

అర్థం : పున్నాగతరు, నిర్ణయే = పున్నాగవృక్షం (=పొన్న చెట్టు)ను, నిరూపించటంలో; పతాకచతురౌ, ప్రోక్తౌ = పతాక-చతురహస్తాలు, చెప్పబడినవి.

తాత్పర్యం : పున్నాగవృక్ష విషయంలో పతాకహస్తం, చతురహస్తం తగును.

## 8, 9. మందార-వకుళహస్తాలు :

**మందారే ఖండచతురః సందంశో వకుళే భవేత్ ।**

అర్థం : మందారే, ఖండచతురః=మందార వృక్షమందు ఖండచతురహస్తం; వకుళే, సందంశః = వకుళ (=పొగడ) వృక్షమందు సందంశహస్తం; భవేత్ = అవుతాయి.

తాత్పర్యం : మందారవృక్ష విషయంలో ఖండచతుర హస్తం, వకుళవృక్ష విషయంలో సందంశహస్తం తగును.

## 10, 11. వట-అర్జునహస్తాలు :

**పతాకో వటవృక్షే స్యా దర్జునే సింహవక్త్రకః ॥** 757

అర్థం : వటవృక్షే, పతాకః=వట(=మఱ్ఱి) వృక్షమందు పతాకహస్తం; అర్జునే, సింహవక్త్రకః=అర్జునవృక్షం(=ఏఱు మద్దిచెట్టు) విషయంలో సింహాముఖ హస్తం; స్యాత్ =అవుతాయి.

తాత్పర్యం : మఱ్ఱిచెట్టు విషయంలో పతాకహస్తం, ఏఱు మద్దిచెట్టు విషయంలో సింహాముఖ హస్తం తగును.

## 12, 13. పాటలీ-హింతాల హస్తాలు :

**పాటల్యాం శుకతుండః స్యాత్ హింతాలే కర్తరీముఖః ।**

అర్థం : పాటల్యాం, శుకతుండః = పాటలీ (=కలిగొట్టు) వృక్షమందు శుకతుండహస్తం; హింతాలే, కర్తరీముఖః=హింతాల వృక్ష విషయంలో, కర్తరీముఖ హస్తం; స్యాత్ =అవుతాయి.

తాత్పర్యం : పాటలీవృక్ష విషయంలో శుకతుండహస్తం, హింతాలం అనే వృక్షవిషయంలో కర్తరీముఖ హస్తం తగును.

## 14. పూగహస్తం :

**పద్మకోశా స్వస్తికా స్తః పూగవృక్ష నిరూపణే ॥** 758

అర్థం : పూగవృక్ష నిరూపణే = పూగ (=పోక)వృక్షాన్ని, నిరూపించటంలో; స్వస్తికౌ = స్వస్తికంగా పట్టబడిన; పద్మకోశా, స్తః = రెండు పద్మకోశ హస్తాలు, చెల్లుతాయి.

తాత్పర్యం : స్వస్తికంగా ఉన్న రెండు పద్మకోశహస్తాలు పూగవృక్షం అనే అర్థమందు చెల్లుతాయి.

## 15. చంపకహస్తం :

చంపకే పూర్వశాస్త్రజ్ఞై రధోలాంగూల మిష్యతే।

అర్థం : చంపకే, అధోలాంగూలం = చంపక (= సంపెంగ) వృక్ష విషయంలో, అధోలాంగూల హస్తం; పూర్వశాస్త్రజ్ఞైః ఇష్యతే = ప్రాచీన శాస్త్రవేత్తల చేత, గ్రహింపబడినది.

తాత్పర్యం : చంపకవృక్ష విషయంలో అధోలాంగూల హస్తాన్ని పూర్వ శాస్త్రజ్ఞులు చెప్పినారు.

టీక : 'అధోలాంగూలహస్తం' ఈ గ్రంథంలో లేదు. బహుశః లాంగూలహస్తం అధః (= క్రిందుగా) ఉంటే' అని అర్థం కావచ్చు.

## 16. ఖదిరహస్తం :

అధోనతః తామ్రచూడః కరః ఖదిరవర్ణనే॥ 759

అర్థం : ఖదిర, వర్ణనే = ఖదిర వృక్షం (= నల్లతుమ్మచెట్టు) వర్ణించటంలో; అధోనత, తామ్రచూడః = క్రిందకు వంచబడిన, తామ్రచూడహస్తం (చెల్లుతుంది).

తాత్పర్యం : క్రిందకు వంచబడిన తామ్రచూడహస్తం నల్ల తుమ్మ చెట్టువిషయంలో చెల్లుతుంది.

## 17. శమీహస్తం :

శమీవృక్షే సమాఖ్యాతః కరో యః శ్లిష్టకర్తరీ।

అర్థం : యః, శ్లిష్టకర్తరీ కరః = ఏది, శ్లిష్టకర్తరీ హస్తమో (అది); శమీ వృక్షే, సమాఖ్యాతః = శమీవృక్ష (= జమ్మిచెట్టు) విషయంలో, చెప్పబడినది.

తాత్పర్యం : జమ్మిచెట్టు విషయంలో శ్లిష్టకర్తరీహస్తం తగును.

టీక : 'శ్లిష్టకర్తరీహస్తం' ఈ గ్రంథంలో లేదు. 'శ్లిష్ట (= కలిసిన = స్వస్తికంగా ఉన్న) కర్తరీహస్తాలు' అని అర్థం కావచ్చు.

## 18. అశోకహస్తం :

పతాకౌ మణిబంధస్థౌ సమ్యక్ తిర్యక్ కృతౌ యది ॥ 760

పతాకస్వస్తికోహస్తః కథితో భరతాదిభిః ।

పతాకస్వస్తికో హస్తః అశోకాభినయే స్మృతః ॥ 761

అర్థం : పతాకౌ = రెండు పతాకహస్తాలు; మణిబంధస్థౌ = మనికట్టులవద్ద ఉన్నవి; సమ్యక్, తిర్యక్, కృతౌ, యది = బాగా, అడ్డంగా' త్రిప్పబడినవి, అయితే (అవి); పతాక స్వస్తికః హస్తః, భరతాదిభిః, కథితః = పతాకస్వస్తికహస్తం (అవుతుందని), భరతాదులచేత, చెప్పబడినది; పతాకస్వస్తికః హస్తః, అశోక- అభినయే, స్మృతః = పతాకస్వస్తికహస్తం, అశోకవృక్షాన్ని అభినయించటంలో, స్మరింపబడినది.

తాత్పర్యం : పతాకస్వస్తికహస్తం (స్వస్తికంగా ఉన్న పతాకహస్తాలు) అశోకవృక్షం అనే అర్థమందు తగును. రెండు పతాకహస్తాలు మనికట్టులవద్ద బాగా అడ్డంగా తిరిగిఉంటే, అది పతాకస్వస్తికహస్తం అనబడుతుందని భరతాదులు చెప్పినారు.

## 19 సిందువారహస్తం :

సిందువారతరౌ యోజ్యః కరః శ్లిష్టమయూరకః ।

అర్థం: శ్లిష్టమయూరకః కరః = శ్లిష్టమయూరహస్తం; సిందు

వారతరౌ యోజ్యః = సిందువార (= వావిలి) వృక్ష విషయంలో యోజింపదగినది.

తాత్పర్యం : వావిలిచెట్టు అనే అర్థమందు శ్లిష్టమయూర హస్తం (= కలిసిన రెండు మయూరహస్తాలు) తగును.

## 20. ఆమలకహస్తం :

తర్జనీ మధ్యమా హస్తతలే సమ్మిశ్రితే యది ॥ 762

ఇతరే ప్రసృతాః సోఽయం కరః సంయమనామకః ।
సంయమాభిధహస్తోఽయం భవే దామలకే ద్రుమే ॥ 763

అర్థం : హస్తతలే, తర్జనీ - మధ్యమా, సమ్మిశ్రితే = అరచేతిలో చూపుడువ్రేలు, నడిమివ్రేలు కలియగా; ఇతరే, ప్రసృతాః యది = తక్కిన వ్రేళ్ళు చాపబడినవి, అయితే; సః అయం కరః, సంయమనామకః = ఆ హస్తం, 'సంయమం' అనే పేరుకలది (అవుతుంది); అయం, సంయమ - అభిధ, హస్తః = ఆ 'సంయమం' అనే పేరుగల, హస్తం; ఆమలకే ద్రుమే, భవేత్ = ఆమలకవృక్షం (= ఉసిరిచెట్టు) విషయంలో అవుతుంది.

తాత్పర్యం : సంయమహస్తం ఉసిరిచెట్టు అనే అర్థమందు చెల్లుతుంది. అరచేతిలో చూపుడువ్రేలు, నడిమివ్రేలు కలియగా తక్కిన వ్రేళ్ళు చాపబడినవి అయితే అది సంయమహస్తం అవుతుంది.

## 21. కురవకహస్తం :

కర్తరీ త్రిపతాకౌ చ జ్ఞేయా కురవకద్రుమే ।

అర్థం : కురవక ద్రుమే = కురవకవృక్షం (= ఎఱ్ఱగోరింట చెట్టు) విషయంలో; కర్తరీ త్రిపతాకౌ (చ), జ్ఞేయా = కర్తరీ-త్రిపతాక హస్తాలు (చెల్లుతాయని) తెలియవలెను.

తాత్పర్యం : కర్తరీహస్తం, త్రిపతాక హస్తం ఎఱ్ఱగోరింట చెట్టు విషయంలో చెల్లుతాయి.

## 22. కపిత్థహస్తం :

అలపద్మౌ స్వస్తికౌ చేత్ కపిత్థార్థే నియుజ్యతే ॥ 764

అర్థం : అలపద్మౌ, స్వస్తికౌ, చేత్ = రెండు అలపద్మ హస్తాలు, స్వస్తికంగా, ఉంటే (అది); కపిత్థ-అర్థే, నియుజ్యతే = కపిత్థవృక్షం (= వెలగచెట్టు) అనే అర్థంలో, వినియోగపడుతుంది.

తాత్పర్యం : స్వస్తికంగా ఉన్న రెండు అలపద్మ హస్తాలు వెలగచెట్టు అనే అర్థమందు వినియోగపడతాయి.

## 23. కేతకీహస్తం :

పతాకచతురాభిఖ్యౌ స్వస్తికౌ మణిబంధయోః ।

కేతకీవృక్షభేదే ఽపి యుజ్యేతే దేవమంత్రిణి ॥ 765

అర్థం : పతాక-చతురాభిఖ్యౌ = పతాక - చతురములనే పేరు గల హస్తాలు; మణిబంధయోః స్వస్తికౌ = మనికట్టులవద్ద స్వస్తికం (అయినప్పుడు); కేతకీ వృక్షభేదే, దేవమంత్రిణి (అపి) = కేతకి (= మొగలి) అనే వృక్షమునందు, దేవమంత్రియందు (చెల్లుతాయి).

తాత్పర్యం : పతాకహస్తం మనికట్టులవద్ద స్వస్తికంగా ఉంటే, కేతకీవృక్షం, దేవమంత్రి (= బృహస్పతి) అనే అర్థాలను తెలుపుతాయి.

## 24. శింశపాహస్తం :

అర్ధచంద్రౌ స్వస్తికౌ చేత్ ప్రయోజ్యౌ శంశపాతరే ।

అర్థం : అర్ధచంద్రౌ, స్వస్తికౌ, చేత్ = రెండు అర్ధచంద్ర హస్తాలు, స్వస్తికం, అయితే; శింశపాతరే, ప్రయోజ్యే = శింశపా (= శింశుపా) వృక్షం అనే అర్థంలో ప్రయోగింపదగును.

తాత్పర్యం : స్వస్తికంగా ఉన్న రెండు అర్ధచంద్ర హస్తాలు శింశుపావృక్ష విషయంలో చెల్లుతాయి.

## 25, 26. నింబ-సాలహస్తాలు :

శుకతుండౌ స్వస్తికౌ చేత్ నింబే సాలే నిరూపితౌ ॥ 766

అర్థం : శుకతుండౌ, స్వస్తికౌ చేత్ = రెండు శుకతుండ హస్తాలు, స్వస్తికంగా పట్టబడితే; నింబే సాలే నిరూపితౌ = నింబ వృక్షం (= వేపచెట్టు), సాలవృక్షం (= మద్దిచెట్టు) విషయంలో, నిరూపితములైనవి.

తాత్పర్యం : స్వస్తికంగా ఉన్న రెండు శుకతుండ హస్తాలు వేపచెట్టు, మద్దిచెట్టు అనే అర్థములందు చెల్లుతాయి.

## 27. పారిజాతహస్తం :

వామే పతాకకో హస్తః తత్ర సవ్యే పతాకికః ।
ఉద్వేష్టితకృతో హస్తః త్రిజ్ఞానః పరికీర్తితః ॥ 767

త్రిజ్ఞానః పారిజాతస్య క్రోడే యది ధృతః కరః ।

అర్థం : వామే పతాకకః హస్తః = ఎడమచేతియందు పతా(క)క హస్తం; (తత్ర) సవ్యే, పతాకికః = కుడిచేతియందు; పతా(కి)క హస్తం; ఉద్వేష్టితకృతః, త్రిజ్ఞానహస్తః, పరికీర్తితః = ఉద్వేష్టితములు(= పైకి త్రిప్పి పట్టినవి) అయితే, 'త్రిజ్ఞానహస్తం' (అని) కీర్తింపబడినది. త్రిజ్ఞానకరః, క్రోడే, ధృతః, యది = త్రిజ్ఞానహస్తం, రొమ్మునకు ఎదురుగా, ధరింపబడినది, అయితే; పారిజాతస్య = పారిజాతస్య = పారిజాత వృక్షంయొక్క (అర్థంలో చెల్లుతుంది).

తాత్పర్యం : త్రిజ్ఞానహస్తం పారిజాత వృక్షమందు చెల్లుతుంది. ఎడమచేత కుడిచేత పతాకహస్తాలు పైకి త్రిప్పిపట్టితే, అది 'త్రిజ్ఞానహస్తం' అవుతుంది.

## 28, 29. తింత్రిణీ-జంబూహస్తాలు :

తింత్రిణ్యా మపి లాంగూలో జంబ్వా మర్ధపతాకకః ॥ 768

అర్థం : తింత్రిణ్యాం (అపి), లాంగూలః = తింత్రిణీవృక్షం (= చింతచెట్టు) విషయంలో, లాంగూలహస్తం; జంబ్వాం, అర్ధపతాకకః = జంబూవృక్షం (= నేరేడుచెట్టు) విషయంలో, అర్ధపతాక హస్తం (చెల్లుతాయి).

తాత్పర్యం : చింతచెట్టు అనే అర్థమందు లాంగూల(= కాంగుల) హస్తం, నేరేడుచెట్టు అనే అర్థమందు అర్ధపతాకహస్తం చెల్లుతాయి.

## 30, 31. పాలాశ-రసాల హస్తాలు :

పాలాశే చార్ధచంద్ర శ్చ రసాలే త్రిపతాకికః ।

అర్థం : పాలాశే(చ), అర్ధచంద్రః (చ) = పాలాశవృక్షం (= మోదుగచెట్టు) విషయంలో, అర్ధచంద్ర హస్తం (చెల్లుతుంది); రసాలే, త్రిపతాకికః = రసాలవృక్షం (= తియ్యమామిడిచెట్టు) విషయంలో, త్రిపతాకహస్తం (చెల్లుతుంది).

తాత్పర్యం : మోదుగచెట్టు విషయంలో అర్ధచంద్ర హస్తం, తియ్యమామిడిచెట్టు విషయంలో త్రిపతాకహస్తం వినియోగపడతాయి.

## సింహాది మృగహస్తాలు

### 1. సింహహస్తం :

దక్షిణే సింహవక్త్రః స్యాత్ తత్పృష్ఠే వామహస్తతః ॥ 769

పతాకహస్తమాశ్రిత్య చలత్ప్రవిరళాంగులిమ్ ।

శ్లిష్టసింహముఖః సోఽయం సింహార్థే వినియుజ్యతే ॥ 770

అర్థం : దక్షిణే, సింహవక్త్రః = కుడిచేతితో సింహముఖహస్తం; తత్, పృష్ఠే = దానికి (= కుడిచేతికి) వెనుకగా; వామహస్తతః చలత్ ప్రవిరళ-అంగులిమ్, పతాక హస్తమ్, ఆశ్రిత్య =

ఎడమచేతితో, ఎడం ఎడంగా కదులుతున్న వ్రేళ్ళుగల, పతాక హస్తం, అవలంబించి(తే); సః, శ్లిష్టసింహాముఖః, స్యాత్ = అది, శ్లిష్టసింహాముఖ (హస్త)ం అవుతుంది; అయం, సింహార్థే, విని యుజ్యతే = ఈ హస్తం, సింహం అనే అర్థమందు, వినియోగపడు తున్నది.

తాత్పర్యం : కుడిచేతితో సింహాముఖ హస్తం, దాని వెను కగా ఎడమచేతితో ఎడం ఎడంగా కదులుతున్న వ్రేళ్ళుగల పతాక హస్తం పట్టితే, అది శ్లిష్ట సింహాముఖ హస్తం అవుతుంది. 'సింహం' అనే అర్థమందు ఈ హస్తం వినియోగపడుతుంది.

## 2. వ్యాఘ్రహస్తం :

అర్ధచంద్రో ఽధోముఖశ్చే ద్వ్యాఘ్రార్థే సంప్రయుజ్యతే ।

అర్థం : అర్ధచంద్రః, అధోముఖః చేత్ = అర్ధచంద్రహస్తం, అధోముఖంగా, అయితే (అది); వ్యాఘ్ర-అర్థే, సంప్రయుజ్యతే = వ్యాఘ్రం( = పెద్దపులి) అనే అర్థమందు, వినియోగింపబడుచున్నది.

తాత్పర్యం : అర్ధచంద్ర హస్తాన్ని అధోముఖంగా పట్టితే అది వ్యాఘ్రహస్తం అవుతుంది; ఇది పెద్దపులి అనే అర్థమందు వినియోగ పడుతుంది.

## 3. సూకరహస్తం :

పూర్వోక్త మత్స్యహస్తే తు దక్షిణః కుంచితః చలః ॥ 771

అస్యాంగుళ్యః ప్రవిరళాః పంచసంఖ్యా యథాక్రమమ్ ।
యుజ్యతే స్తబ్ధరోమార్థే సంకీర్ణమకరః కరః ॥ 772

అర్థం : పూర్వ-ఉక్తే, మత్స్యహస్తే (తు) = ఇంతకుముందు చెప్పబడిన, మత్స్యహస్తమందు; దక్షిణః, కుంచితః, చలః = కుడి చేయి వంచబడినది, చలించుచున్నది (కాగా); అస్య-అంగుళ్యః పంచసంఖ్యాయథాక్రమం ప్రవిరళాః = దానియొక్క వ్రేళ్ళు

అయిదు, వరుసగా, ప్రవిరళములు (=ఎడం ఎడంగా ఉన్నవి), అయితే (అది); సంకీర్ణమకరః, కరః=సంకీర్ణమకరహస్తం (అవుతుంది); స్తబ్ధరోమార్థే, యుజ్యతే=(ఈ హస్తం) వరాహం అనే అర్థమునందు, ఉపయుక్తం అవుతున్నది.

తాత్పర్యం : మత్స్య హస్తమందలి కుడిచేయి వంగినవి కదలుతున్నది కాగా, అయిదు వ్రేళ్ళు క్రమంగా విరళములు అయితే అది సంకీర్ణ మకరహస్తం అవుతుంది. ఈ హస్తం వరాహం అనే అర్థమందు తగును (స్తబ్ధరోమం = వరాహం = పంది).

## 4. కపిహస్తం :

పూర్వోక్తముష్టిహస్తస్తు మధ్యమాంగుష్ఠయోగతః ।
నామ్నాఽధోముష్టిముకుళః కపేరర్థే నిరూప్యతే ॥ 773

అర్థం : పూర్వ-ఉక్త, ముష్టిహస్తః (తు) = ఇంతకుముందు చెప్పబడిన, ముష్టిహస్తం; మధ్యమ - అంగుష్ఠయోగతః = నడిమి వ్రేలు బొటన వ్రేలు కలియటంవల్ల ; అధోముష్టి ముకుళః, నామ్నా =అధోముష్టి ముకుళ(హస్త)ం, అనే పేరుగలది (అవుతుంది); కపేః అర్థే, నిరూప్యతే = (ఈ హస్తం) కపి (=కోతి) అనే అర్థమునందు నిరూపించబడుతున్నది.

తాత్పర్యం : ముష్టి హస్తమందలి నడిమివ్రేలు బొటన వ్రేలు కలిస్తే అది ముష్టిముకుళహస్తం అవుతుంది. ఈ హస్తం కోతి అనే అర్థమందు చెల్లుతుంది.

## 5. ఖల్లూకహస్తం :

వామహస్తే పద్మకోశో ఽధోముఖత్వముపాశ్రితః ।
దక్షిణే తు పతాకాఖ్యస్తస్య పృష్ఠతలాశ్రితః ॥ 774
ఖల్లూకార్థే ప్రయోజ్యః స్యాత్ పద్మకోశపతాకకః ।

అర్థం : వామహస్తే, పద్మకోశః = ఎడమచేతియందు, పద్మకోశహస్తం; అధోముఖత్వమ్-ఉపాశ్రితః = అధోముఖత్వం ఆశ్రయించగా(= పొందగా); దక్షిణే(తు), పతాక-ఆఖ్యః = కుడిచేతియందు, పతాకం అనే పేరుగలది; తస్య, పృష్ఠతలశ్రితః = దాని (= పద్మకోశహస్తం) యొక్క, వెనుకభాగాన్ని ఆశ్రయించినది కాగా; పద్మకోశ పతాకకః స్యాత్ =(అది) పద్మకోశపతాక(క) హస్తం అవుతుంది; భల్లూక - అర్థే, ప్రయోజ్యః =(ఈ హస్తం) భల్లూకం(= ఎలుగుబంటి) అనే అర్థంలో, ప్రయోగింపదగినది.

తాత్పర్యం : ఎడమచేతితో పద్మకోశ హస్తం అధోముఖంగా పట్టి, కుడిచేతితో పతాకహస్తం దానివెనుకగా పట్టితే అది 'పద్మకోశ పతాకహస్తం' అవుతుంది. ఈ హస్తం ఎలుగుబంటి అనే అర్థమందు చెల్లుతుంది.

## 6. మార్జారహస్తం:

పూర్వోక్త ముష్టిహస్తస్యానామికాంగుష్ఠయోగతః ॥ 775

నామ్నాఽయమర్ధముకుళో మార్జారే సంప్రయుజ్యతే ।

అర్థం : పూర్వ-ఉక్త, ముష్టిహస్తస్య = పూర్వం చెప్పబడిన, ముష్టిహస్తంయొక్క; అనామికా-అంగుష్ఠ, యోగతః = అనామిక-అంగుష్ఠం, కలియటంవల్ల; నామ్నా అర్ధముకుళః = పేరుచేత అర్ధ ముకుళం (అనే హస్తం అవుతుంది); అయం, మార్జారే, సంప్రయుజ్యతే = ఇది (= ఈ హస్తం), మార్జారము (= పిల్లి) (అనే అర్థము)నందు వినియోగింపబడుతున్నది.

తాత్పర్యం ; ముష్టి హస్తమందలి ఉంగరపు వ్రేలు, బొటన వ్రేలు కలిస్తే, అది 'అర్ధ ముకుళహస్తం' అవుతుంది. ఈ హస్తం పిల్లి అనే అర్థమందు చెల్లుతుంది.

## 7. చమరీహస్తం :

వామే ముష్టిర్దక్షిణే వా మణిబంధేన మిశ్రితా ॥ 776

ముద్రికాఽధోముఖా ముష్టిముద్రాహస్తోఽయ మీరితః ।

ముష్టిముద్రాకర శ్చాపి చమర్యాం సంప్రయుజ్యతే ॥ 777

అర్థం : వామే, ముష్టిః = ఎడమచేత, ముష్టిహస్తం; దక్షిణే (వా), ముద్రికా = కుడిచేత, ముద్రికాహస్తః; మణిబంధేన, మిశ్రితా, అధోముఖా = మనికట్టువద్ద, కలిసినదై, క్రిందుముఖంగా (ఉంటే); అయం, ముష్టిముద్రాహస్తః, ఈరితః = ఇది, ముష్టిముద్రాహస్తం (అని) చెప్పబడినది; ముష్టిముద్రాకరః (చ) (అపి), చమర్యాం, సంప్రయుజ్యతే = ముష్టిముద్రాహస్తం, చమరీమృగం అనే అర్థమందు ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : ఎడమచేతితో ముష్టిహస్తం పట్టి, మనికట్టువద్ద చేర్చి, అధోముఖంగా చేస్తే, అది ముష్టిముద్రాహస్తం అవుతుంది; ఇది చమరీమృగం అనే అర్థమందు ప్రయుక్తమవుతుంది.

## 8. గోధాహస్తం :

ఊర్ధ్వౌ కనిష్ఠికాంగుష్ఠౌ పతాకే కించిదీరితౌ ।

నామ్నా తలపతాకోఽయం గోధాయాం పుంజితో భవేత్ ॥ 778

అర్థం : పతాకే, కనిష్ఠికాంగుష్ఠౌ, ఊర్ధ్వౌ కించిత్ ఈరితే = పతాకహస్తమందలి, చిటికెనవ్రేలు బొటనవ్రేలు, పైకి, కొంచెం ఎత్తిపట్టబడితే; అయం, నామ్నా తలపతాకః = ఇది, 'తలపతాకం' అనే పేరుగల (హస్తం), అవుతుంది; పుంజితః = (ఇది) ముడువబడినదై; గోధాయాం, భవేత్ = గోధ (= ఉడుము) అనే అర్థమందు అవుతుంది.

తాత్పర్యం : పతాకహస్తమందలి చిటికెనవ్రేలిని, బొటనవ్రేలిని కొంచెం పైకి ఎత్తి పట్టితే, 'తలపతాకహస్తం' అవుతుంది. ఇది ముడువబడినదై ఉడుము అనే అర్థమందు ప్రయుక్తమవుతుంది.

## 9. శల్యమృగ హస్తం :

పూర్వోక్త మృగశీర్షస్య తర్జన్యూర్ధ్వ ప్రసారితా ।

నామ్నా చంద్రమృగో హస్తః శల్యార్థే సంప్రయుజ్యతే ॥ 779

అర్థం: పూర్వ-ఉక్త, మృగశీర్ష స్య = ముందు చెప్పబడిన,మృగ శీర్ష హస్తం యొక్క; తర్జనీ - ఊర్ధ్వ ప్రసారితా = చూపుడు వ్రేలు పైకిఎత్తి చాపబడితే (అది); నామ్నా చంద్రమృగహస్తః = పేరు చేత 'చంద్రమృగహస్తం' (అవుతుంది); శల్య - అర్థే, సంప్రయుజ్యతే = (ఈ హస్తం) శల్యమృగం( = ఏదు పంది) అనే అర్థ మందు, ప్రయుక్తమవుతుంది.

తాత్పర్యం : మృగశీర్ష హస్తమందలి చూపుడువ్రేలు పైకి చాపబడితే అది 'చంద్రమృగహస్తం' అవుతుంది. శల్యమృగం అనే అర్థమందు ఈ హస్తం ప్రయుక్తమవుతుంది.

## 10. కురంగహస్తం :

కురంగే చ ప్రయోక్తవ్యో మృగశీర్షకనామకః ।

అర్థం : మృగశీర్షకనామకః = మృగశీర్ష(క)ం అనేపేరు గలది; కురంగే (చ), ప్రయోక్తవ్యః = కురంగం ( = జింక)యందు కూర్చదగినది.

తాత్పర్యం : మృగశీర్ష హస్తం జింక అనే అర్థమందు చెల్లుతుంది.

## 11. కృష్ణసారహస్తం :

పూర్వోక్తముష్టిహస్తే తు కనిష్ఠాంగుష్ఠసారణాత్ ॥ 780

నామ్నా ముష్టిమృగో హస్తః కృష్ణసారే ప్రయుజ్యతే ।

అర్థం : పూర్వ - ఉక్త, ముష్టిహస్తే (తు) = ముందు చెప్పబడిన, ముష్టిహస్తమందు; కనిష్ఠ - అంగుష్ఠ, సారణాత్ = చిటికెన వ్రేలిని, బొటనవ్రేలిని, చాపితే; ముష్టిమృగః హస్తః = ముష్టిమృగ

హస్త అవుతుంది· కృష్ణసారే, ప్రయుజ్యతే=(ఈ హస్తం) కృష్ణసారం (=నల్లజింక) అనే అర్థమందు, ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం: ముష్టిహస్తమందలి చిటికెనవ్రేలిని, బొటనవ్రేలిని చాపితే, అది ముష్టిమృగహస్తం అవుతుంది. ఈ హస్తం నల్లజింక అనే అర్థమందు ప్రయుక్తమవుతుంది.

టీక: నల్లజింకచర్మం భూమ్యాకర్షణ శక్తిని, విద్యుచ్ఛక్తి ప్రసారాన్ని ఆపుతుంది. అందుచేత ఋషులు దీనినే వాడేవారు.

## 12. గోకర్ణహస్తం:

దేనుకర్ణే నాగబంధౌ రేచితౌ యది యోజితౌ ॥

అర్థం: నాగబంధౌ, రేచితౌయది = రెండు నాగబంధహస్తాలు మీదికి చలింపజేయబడితే (ఇది); ధేనుకర్ణే, యోజితౌ = ధేనుకర్ణ (=గోకర్ణమృగం) అనే అర్థమందు, యోజింపబడుతున్నది.

తాత్పర్యం: రెండు నాగబంధహస్తాలు మీదికి చలించితే ఆ హస్తం గోకర్ణమృగం అనే అర్థమందు చెల్లుతుంది.

## 13. మూషికహస్తం:

పూర్వోక్తముకుళే హస్తే తర్జనీ సంప్రసారితా।
నామ్నాయం ఖండముకుళో మూషికార్థే నియుజ్యతే ॥ 782

అర్థం: పూర్వ - ఉక్త, ముకుళే హస్తే = ముందు చెప్పబడిన, ముకుళ హస్తమందలి; తర్జనీ సంప్రసారితా = చూపుడువ్రేలు బాగుగా చాపబడినది (అయితే); అయం, నామ్నా, ఖండముకుళః, = అది పేరుచేత ఖండముకుళం (అవుతుంది); మూషిక - అర్థే, నియుజ్యతే = (ఇది) మూషికం (= ఎలుక) అనే అర్థమందు, వినియుక్తమవుతున్నది.

తాత్పర్యం: ముకుళహస్తమందలి చూపుడువ్రేలు బాగుగా చాపబడితే, అది ఖండముకుళహస్తం అవుతుంది. అది ఎలుక అనే అర్థమందు తగును.

## 14. గిరికాహస్తం :

పూర్వోక్తముకుళే భూయ స్తర్జనీ కుంచితా యది ।

తిర్యక్ప్రసారితః ఖడ్గముకుళో గిరికార్థకే ॥ ।౮౩

అర్థం : పూర్వ - ఉక్త, ముకుళే = ముందుచెప్పబడిన, ముకుళహస్తమందలి; తర్జనీ, భూయః కుంచితా, తిర్యక్ ప్రసారితః, యది = చూపుడు వ్రేలు, అధికంగా వంచబడినది, అడ్డంగా చాపబడి నది (ముందు వెనుకలకు చలించేది—స్వామి), అయితే (అది); ఖడ్గ ముకుళః = ఖడ్గముకుళ (హస్త)ం (అవుతుంది); గిరిక - అర్థే= (ఈ హస్తం) గిరిక (= చిట్టెలుక) అనే అర్థమందు ప్రయుక్తమవు తుంది.

తాత్పర్యం : ముకుళ హస్తమందలి చూపుడువ్రేలిని బాగుగా వంచి, అడ్డంగా చాపితే లేదా ముందు వెనుకలకు చలింపజేస్తే అది ఖడ్గముకుళహస్తం అవుతుంది. చిట్టెలుక అనే అర్థమందు ఈ హస్తం తగును.

## 15. శశహస్తం :

హస్తః తలపతాకాఖ్యః శశకే తిర్యగాశ్రయః ।

అర్థం : తలపతాక - ఆఖ్యః, హస్తః, తిర్యక్ - ఆశ్రయః = తలపతాకం అనే పేరుగల హస్తం, అడ్డంగా త్రిప్పబడితే అది; శశకే = శశమునందు (= కుందేలు) (అనే అర్థమునందు ప్రయుక్త మవుతుంది).

తాత్పర్యం : తలపతాకహస్తాన్ని అడ్డంగా త్రిప్పితే అది కుందేలు అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 16. వృశ్చికహస్తం :

అధోముఖో రేచిత శ్చేత్ కర్కటో వృశ్చికే భవేత్ ॥ 784

అర్థం : కర్కటః, అధోముఖః, రేచితః, చేత్ = కర్కట హస్తాన్ని, అధోముఖంగా చలింపజేస్తే (ఆ హస్తం); వృశ్చికే, భవేత్ = వృశ్చికం (= తేలు) అనే అర్థమందు, చెల్లుతుంది.

తాత్పర్యం : అధోముఖంగా చలించే కర్కటహస్తం తేలు అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 17. శునకహస్తం :

పతాకాభిధహస్తే తు కుంచితా చేత్కనిష్ఠికా ।

నామ్నా మధ్యపతాకోఽయం శునకార్థే ప్రయుజ్యతే ॥ 785

అర్థం : పతాక-అభిధహస్తే (తు) = పతాకం అనే పేరుగల హస్తమందలి; కనిష్ఠికా, కుంచితా చేత్ = చిటికెనవ్రేలు, ముడవబడితే; నామ్నా మధ్యపతాకః = (ఆ హస్తం) పేరుచేత 'మధ్యపతాకం' (అవుతుంది); శునక-అర్థే, ప్రయుజ్యతే = ఈ హస్తం శునకం (= కుక్క) అనే అర్థమందు, ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : పతాక హస్తంమందలి చిటికెనవ్రేలు ముడవబడితే అది 'మధ్యపతాకహస్తం' అవుతుంది. ఇది కుక్క అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 18. ఉష్ట్రహస్తం :

పూర్వోదితాంజలికరే చాంగుష్ఠౌ కుంచితౌ యుతౌ ।

ప్రసారితావూర్ధ్వభాగే చలితౌ చాప్యధోముఖౌ ॥ 786

నామ్నా ఖండాంజలి రయముష్ట్రార్థేసంప్రయుజ్యతే ।

అర్థం : పూర్వ-ఉదిత, అంజలికరే (చ) = ముందు చెప్పబడిన, అంజలిహస్తమందలి, అంగుష్ఠౌ, కుంచితౌ, యుతౌ = రెండు

బొటన(వేళ్ళు వంచబడినవి, దగ్గరగా చేర్చబడినవి; ఊర్ధ్వభాగే ప్రసారితౌ అధోముఖౌ చలితౌ (చ) (అపి) = పైకి పొడవుగా-చాప బడినవి, అధోముఖంగా చలించినవి (అయితే); నామ్నా ఖండాం జలిః = పేరుచేత ఖండాంజలి హస్తం (అవుతుంది); అయం, ఉష్ట్రి-అర్థే, సంప్రయుజ్యతే = ఇది (= ఈ హస్తం) ఉష్ట్రిం (= ఒంటె) అనే అర్థమందు, ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : అంజలి హస్తమందలి రెండు బొటన(వేళ్ళను వంచి, దగ్గరకు చేర్చి, పైకి పొడుగుగా చాపి, క్రిందకు చలింపజేస్తే అది 'ఖండాంజలిహస్తం' అవుతుంది. ఈ హస్తం ఒంటె అనే అర్థ మందు ప్రయుక్తమవుతుంది.

## 19. అజహస్తం :

శిఖరౌ శ్లిష్టవదనౌ మేషార్థే సంప్రయుజ్యతే ॥ 787

అర్థం : శిఖరౌ, శ్లిష్టవదనౌ = రెండు శిఖరహస్తాలు, ముఖ భాగంలో కలిస్తే (అజహస్తమవుతుంది ఇది); మేష-అర్థే సంప్ర యుజ్యతే = మేషం (= మేక) అనే అర్థమందు, ప్రయుక్తమవు తుంది.

తాత్పర్యం : రెండు శిఖరహస్తాలు ముఖభాగంలో కలిస్తే అది అజహస్తం అవుతుంది; అది మేక అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 20. గార్దభహస్తం :

పూర్వఖండాంజలౌ మిశ్రే కుంచితే తర్జనీద్వయే ।

భిన్నాంజలి రయం నామ్నా గార్దభార్థే నియుజ్యతే ॥ 788

అర్థం : పూర్వ, ఖండాంజలౌ = పూర్వం(= ఇంతకుముందు చెప్పిన), ఖండాంజలి హస్తమందు; తర్జనీద్వయే, మిశ్రే, కుంచితే = రెండు చూపుడు(వేళ్ళు, కలిపి, ముడువబడితే; అయం నామ్నా భిన్నాంజలిః = ఇది, పేరుచేత, 'భిన్నాంజలి' (అవుతుంది); గార్దభ-

అర్థే, నియుజ్యతే=గార్దభం (=గాడిద) అనే అర్థమందు, నియుక్త మవుతున్నది.

తాత్పర్యం : ఖండాంజలి హస్తమందలి రెండు చూపుడు వ్రేళ్ళను కలిపి ముడిస్తే అది 'ఖిన్నాంజలి హస్తం' అవుతుంది. ఈ హస్తం గార్దభం అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 21. వృషభహస్తం :

**మధ్యమానామికే కించిత్ కుంచితే తలమాశ్రితే ।**
**అంగుష్ఠే నోపరియుతే శేషే ద్వే చ ప్రసారితే ॥** 789
**తలసింహకరః సోఽయమ్వృషభార్థే నియుజ్యతే ।**

అర్థం : మధ్యమ-అనామికే, కించిత్ కుంచితే, తలం-ఆశ్రితే=మధ్యమ-అనామికలు, కొంచెం వంగి, అరచేతిని ఆశ్రయించినవి; అంగుష్ఠేన-ఉపరియుతే, శేషేద్వే(చ), ప్రసారితే=మీద అంగుష్ఠాలు కలవి కాగా, తక్కిన రెండు వ్రేళ్ళను చాపితే; అయమ్‌సః తలసింహకరః=ఆ హస్తం, 'తలసింహహస్తం' (అవుతుంది, ఇది); ఋషభ-అర్థే, నియుజ్యతే=ఋషభం (=ఎద్దు) అనే అర్థమందు, నియుక్తమవుతున్నది.

తాత్పర్యం : హస్తమందలి నడిమివ్రేలు, ఉంగరపువ్రేలు కొంచెం అరచేతిలోనికి వంగినవి, మీద అంగుష్ఠాలు కలవి కాగా, తక్కిన రెండువ్రేళ్ళు ప్రసారితములైతే అది 'తలసింహహస్తం' అవుతుంది. ఈ హస్తం ఎద్దు అనే అర్థమందు ఉపయోగపడుతుంది.

## 22. ధేనుహస్తం :

**మధ్యమా వక్రితా యత్ర శేషాః సర్వే ప్రసారితాః ॥** 790
**ధేనౌ యోజ్యో యంత్రభేదే భవేత్ సంకీర్ణముద్రకః ।**

అర్థం : యత్ర మధ్యమా, వక్రితా, శేషాః సర్వే, ప్రసారితాః = ఎచ్చట, నడిమివ్రేలు వంగినది, తక్కినవ్రేళ్ళు అన్నీ, చాపబడినవి (అవుతాయో, అది); సంకీర్ణముద్రకః, భవేత్ = సంకీర్ణ ముద్రా(= ముద్రక) హస్తం అవుతుంది; ధేనౌ, యంత్రభేదే, యోజ్యః = ధేనువు(= ఆవు), యంత్రభేదం - ఈ అర్థములందు ఈ హస్తం యోజింపదగినది.

తాత్పర్యం : హస్తమునందు నడిమివ్రేలు వంగినది, తక్కిన వ్రేళ్ళు ప్రసారితములు అయితే, అది 'సంకీర్ణముద్రాహస్తం' అవుతుంది. ధేనువు, యంత్రభేదం అనే అర్థాలలో ఈ హస్తం తగును.

# 16

# పక్షి - జల జంతుహస్తాలు

## పక్షిహస్తాలు

### 1. పారావతహస్తం :

**పారావతే కపోతాఖ్యకరః స్యాత్ పుంఖితాకృతిః ॥** 791

అర్థం : పుంఖిత-ఆకృతిః, కపోత-ఆఖ్యా, కరః = పుంఖిత ఆకారంగా ఉన్న, 'కపోతం' అనే పేరుగల, హస్తం; పారావతే, స్యాత్ = పారావతం ( = పావురాయి) విషయంలో అవుతుంది.

తాత్పర్యం: పుంఖిత ఆకారంగా ( = మొనదేరి)ఉన్న కపోత హస్తం పావురాయి విషయంలో చెల్లుతుంది.

### 2. కపోతహస్తం :

**కపోతః తిర్యగాకారః కపోతే వినియుజ్యతే ।**

అర్థం : తిర్యక్-ఆకారః, కపోతః = అడ్డంగా పట్టిన, కపోత హస్తం; కపోతే, వినియుజ్యతే = కపోతం ( = గువ్వ = అడవి పావురం) విషయంలో వినియుక్తమవుతున్నది.

తాత్పర్యం : అడ్డంగా పట్టిన కపోతహస్తం కపోతం విషయంలో తగును.

### 3 శశాదన హస్తం :

**బ్రహ్మోక్తశుకతుండః స్యాత్ శశాదన నిరూపణే ॥** 792

అర్థం : బ్రహ్మోక్త శుకతుండః = బ్రహ్మోక్త శుకతుండ

హస్తం; శశాదన నిరూపణే, స్యాత్ = శశాదన (=దేగ)ను నిరూపించటంలో, వినియుక్తమవుతుంది.

తాత్పర్యం : బ్రహ్మోక్తశుకతుండహస్తం దేగ విషయంలో తగును.

**4. ఉలూకహస్తం :**

గజదంతౌ శ్లిష్టముఖౌ సంకీర్ణగజదంతకః ।

సంకీర్ణగజదంతోఽయ ములూకార్థే నియుజ్యతే ॥ 793

అర్థం : గజదంతౌ, శ్లిష్టముఖౌ = రెండు గజదంతహస్తాల, ముఖాలు(=చివరలు) కలిసినవి (అయితే — అది); సంకీర్ణ గజదంతకః = సంకీర్ణ గజదంతహస్తం (అవుతుంది); అయం, సంకీర్ణగజదంతః, ఉలూక-అర్థే, నియుజ్యతే = ఈ, సంకీర్ణగజదంతహస్తం, ఉలూకం (=గుడ్లగూబ) అనే అర్థమునందు, వినియుక్తమవుతున్నది.

తాత్పర్యం : రెండు గజదంత హస్తాల చివరలు కలిస్తే అది సంకీర్ణగజదంతహస్తం అవుతుంది. ఈ హస్తం గుడ్లగూబను తెలుపుతుంది.

**5. గండభేరుండహస్తం :**

మణిబంధే సమాశ్లిష్టా వర్ధచంద్రా వధోముఖౌ ।

సర్వాంగుళ్య స్తు విరళా నామ్నా స్వస్తికచంద్రకః ॥ 794

గండభేరుండకాఖ్యే ఽస్య వినియోగః ప్రకీర్తితః ।

అర్థం : అర్ధచంద్రౌ = రెండు అర్ధచంద్రహస్తాలు; మణిబంధే, సమాశ్లిష్టౌ, అధోముఖౌ, సర్వ-అంగుళ్యః (తు), విరళాః = మనికట్టులవద్ద, కలిసినవి, అధోముఖంగా, అన్ని వ్రేళ్ళు, విరళంగా ఉన్నవి (అయితే); నామ్నా స్వస్తికచంద్రకః = పేరుచేత స్వస్తికచంద్ర(క) హస్తం (అవుతుంది); అస్యవినియోగః, గండభేరుండక-

ఆఖ్యే, ప్రకీర్తితః = దీనియొక్క, వినియోగం, గండభేరుండకం అనే పేరుగల పక్షి విషయంలో, కీర్తింపబడినది.

తాత్పర్యం : మనికట్టువద్ద స్వస్తికంగానూ, అధోముఖం గానూ, అన్నివ్రేళ్ళు విరలంగానూ ఉన్న రెండు అర్ధచంద్రహస్తాలు కలిసి 'స్వస్తికచంద్ర హస్తం' అవుతాయి - ఇది గండభేరుండ పక్షి అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 6. చాతకహస్తం :

**లాంగూల శ్చాతకే భూయాత్ పుంఖితత్వ ముపాశ్రితః ॥** 795

అర్థం ; పుంఖితత్వమ్-ఉపాశ్రితః, లాంగులః = పుంఖితత్వం పొందిన, లాంగూలహస్తం; చాతకే, భూయాత్ = చాతక పక్షి విషయంలో అవుతుంది.

తాత్పర్యం : పుంఖితంగా ఉన్న లాంగూలహస్తం చాతక పక్షి(= వానకోయిల) అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 7. కుక్కుటహస్తం :

**పూర్వోక్తభ్రమరో భూయా త్తామ్రచూడనిరూపణే ।**

అర్థం : పూర్వ-ఉక్త, భ్రమరః = ఇంతకుముందు చెప్పబడిన, భ్రమరహస్తం; తామ్రచూడ, నిరూపణే, భూయాత్ = తామ్ర చూడాన్ని (= కోడిని) నిరూపించుటయందు, అవుతుంది

తాత్పర్యం : భ్రమరహస్తం కోడి అనే అర్థమందు తగును.

## 8. కోకిలహస్తం :

**అరాళః పుంఖితాకారః కోకిలార్థే నియుజ్యతే ॥** 796

అర్థం : పుంఖిత - ఆకారః, అరాళః = పుంఖిత ఆకారంగా ఉన్న, అరాళహస్తం; కోకిల - అర్థే, నియుజ్యతే = కోకిల అనే అర్థంలో, వినియోగపడుతుంది.

తాత్పర్యం : పుంఖిత - ఆకారంగా ఉన్న అరాళహస్తం కోకిల అనే అర్థమందు తగును.

## 9. వాయసహస్తం :

భరతార్ణవ సంప్రోక్త భ్రమరాంగుష్ఠక స్తథా।
అగ్రభాగేన తర్జన్యా మిశ్రితో యది పుంఖితః॥ 797
సందంశముకుళో భూయా ద్వాయసార్థే నియుజ్యతే।

అర్థం : భరతార్ణవ సంప్రోక్త- భ్రమర - అంగుష్ఠకః (తథా) = భరతార్ణవమందు చెప్పబడిన, భ్రమరహస్తం యొక్క,అంగుష్ఠకం; అగ్రభాగేన, తర్జన్యాః, మిశ్రితః, పుంఖితఃయది = (తన) చివరి భాగం (= కొన)తో, తర్జనిని కలిసి, పుంఖితంగా ఉంటే (అది); సందంశముకుళః, భూయాత్ = సందంశముకుళహస్తం, అవుతుంది; వాయస-అర్థే నియుజ్యతే = (ఇది) వాయసం(= కాకి) అనే అర్థమందు, వినియోగపడుతున్నది.

తాత్పర్యం : భరతార్ణవమందు చెప్పబడిన భ్రమరహస్తమందలి అంగుష్ఠం యొక్క చివరను తర్జనితో కలిపి పుంఖితంచేస్తే అది సదంశముకుళ హస్తం అవుతుంది. ఈ హస్తం కాకి అనే అర్థాన్ని తెలుపుతుంది.

టీక : భరతార్ణవంలోని భ్రమరహస్త నిర్వచనం, భిన్నంగా క్రింది విధంగా ఉంది.

"మధ్యమ - అనామికలు బాగుగావంగి, అరచేతిని తాకుతున్నవి, తక్కిన వ్రేళ్ళు చాపబడినవి అయితే, అది భ్రమరహస్తం అవుతుంది". (పుట. 22)

## 10. కురరహస్తం :

కురరాఖ్యేఽ పవిద్ధాఖ్యో సూచి రేవ ప్రయుజ్యతే॥ 798

అర్థం : అపవిద్ధ - ఆఖ్యః సూచిః (ఏవ) = సూచీహస్తమే

అపవిద్ధం అనే పేరుగలది (అయితే); కురర-అర్థే, ప్రయుజ్యతే = కురరము( = లకుముకిపిట్ట) విషయంలో ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : అపవిద్ధంగా పట్టిన సూచీహస్తం లకుముకిపిట్ట అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 11. శుకహస్తం :

శుకతుండః ప్రయోక్తవ్యః శుకార్థే పుంఖితాకృతిః ।

అర్థం : పుంఖిత-ఆకృతిః, శుకతుండః = పుంఖిత ఆకారంగా ఉన్న, శుకతుండహస్తం; శుక-అర్థే, ప్రయోక్తవ్యః = శుకం ( = చిలుక) అనే అర్థమందు, ప్రయోగింపదగినది.

తాత్పర్యం : పుంఖితంగా ఉన్న శుకతుండహస్తం చిలుక అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 12. సారసహస్తం :

ముకుళే తు కనిష్ఠాపి కించిత్ వక్రితభావితః ॥ 799

నామ్నా ప్రదేశముకుళో యోజ్యోఽయం సారసార్థకే ।

అర్థం : ముకుళే(తు), కనిష్ఠా (అపి), కించిత్, వక్రిత భావితః = ముకుళ హస్తమందలి, చిటికెనవ్రేలు, కొంచెం, వంకరగా ఉంటే (అది); నామ్నా ప్రదేశముకుళః = పేరుచేత ప్రదేశ ముకుళహస్తం (అవుతుంది); అయం, సారస-అర్థకే, యోజ్యః = ఈ హస్తం, సారస ( = బెగ్గురు) పక్షి అనే అర్థమందు, యోజింపదగినది.

తాత్పర్యం : ముకుళ హస్తమందలి చిటికెనవ్రేలు కొంచెం వంకరగా ఉంటే, అది 'ప్రదేశ ముకుళహస్తం' అవుతుంది; ఇది సారస పక్షిని తెలుపుతుంది.

## 13. బకహస్తం :

తర్జన్యంగుష్ఠసంయోగే మధ్యమా ఽ నామికాపి చ ॥ 800

ప్రసారితే కనిష్ఠా చేత్ వక్రితా తలమాశ్రితా ।

నామ్నా సంకీర్ణహంసో౽యం శుక్రాచార్యమతోదితః ॥ 801

బకార్థే మంత్రభేదేషు యోజ్యః సంకీర్ణహంసకః ।

అర్థం : తర్జనీ - అంగుష్ఠ సంయోగే, మధ్యమా - అనామికా (అపి) (చ) ప్రసారితే, కనిష్ఠా, వక్రితా, తలమాశ్రితాచేత్ = తర్జనీ - అంగుష్ఠాలు కలిసినవి, మధ్యమ - అనామికలు ప్రసారితాలు, కనిష్ఠిక వంగి, అరచేతిని తాకినది, అయితే; నామ్నా సంకీర్ణహంసః = పేరుచేత సంకీర్ణహంసహస్తం(అవుతుంది); అయం, శుక్రాచార్యమత-ఉదితః = ఇది శుక్రాచార్యుని మతమందు చెప్పబడినది; బక - అర్థే, మంత్రభేదేషు, సంకీర్ణహంసకః, యోజ్యః = బకము ( = కొంగ), మంత్రభేదాలు అనే అర్థాలలో, సంకీర్ణహంస (క) హస్తం, కూర్పదగినది.

తాత్పర్యం : తర్జని - అంగుష్ఠాలు కలిసినవి, మధ్యమా-అనామికలు ప్రసారితాలు, కనిష్ఠిక అరచేతిలోనికి వంగినది అయితే అది సంకీర్ణహంస హస్తం అవుతుంది. ఇది శుక్రచార్యమతం. ఈ హస్తం కొంగ, మంత్రభేదాలు - అనే అర్థాలను తెలుపుతుంది.

## 14. క్రౌంచహస్తం :

పూర్వాలపద్మహస్తే కనిష్ఠా తలకుంచితా ॥ 802

లీనాలపద్మహస్తో౽ యం క్రౌంచార్థే సంప్రయుజ్యతే ।

అర్థం : పూర్వ- అలపద్మహస్తే (తు) కనిష్ఠా తలకుంచితా = పూర్వం చెప్పిన, అలపద్మ హస్తమందలి, కనిష్ఠిక, అరచేతిలోనికి వంచబడితే (అది); లీన-అలపద్మహస్తః = లీనాలపద్మహస్తం (అవుతుంది); అయం, క్రౌంచ- అర్థే, సంప్రయుజ్యతే = క్రౌంచపక్షి అనే అర్థమందు, ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : అలపద్మహస్తమందలి కనిష్ఠిక అరచేతిలోనికి వంగితే 'లీనాలపద్మహస్తం' అవుతుంది. ఇది క్రౌంచపక్షి అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 15. ఖద్యోతహస్తం :

అంగుష్ఠో మధ్యమాయాః స్యాదగ్రపర్వనిపీడితః ॥ 803

ముఖహంసకరః సోఽయం ఖద్యోతార్థేఽపవిద్ధకః ।

అర్థం : అంగుష్ఠః మధ్యమాయాః, అగ్రపర్వనిపీడితః, అపవిద్ధకః, సః, ముఖహంసకరఃస్యాత్ = అంగుష్ఠం నడిమివ్రేలి, పై కణుపుతో ఒరయునట్లు, అపవిద్ధంగా ఉంటే, అది, ముఖహంస హస్తం (= హంసముఖ హస్తం - స్వామి) అవుతుంది; అయం, ఖద్యోత - అర్థే = ఇది, ఖద్యోతం (= మిణుగురుపురుగు) అనే అర్థమందు (చెల్లుతుంది).

తాత్పర్యం: అంగుష్ఠాన్ని నడిమివ్రేలి పై కణుపు ఒరయునట్లుగా, అపవిద్ధంగా పట్టితే అది ముఖహంస లేదా హంసముఖ హస్తం అవుతుంది. ఇది మిణుగురుపురుగు అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 16. భ్రమరహస్తం :

ప్రయోజ్యో భ్రమరో హస్తో భృంగార్థే యది పుంఖితః॥ 804

అర్థం : భ్రమరః హస్తః, పుంఖితః యది = భ్రమరహస్తం, పుంఖితంగా ఉంటే (అది); భృంగ - అర్థే, ప్రయోజ్యః = భృంగం (= తుమ్మెద) అనే అర్థమందు, వినియుక్తమవుతున్నది.

తాత్పర్యం : భ్రమరహస్తం పుంఖితంగా ఉంటే, తుమ్మెద అనే అర్థాన్ని తెలుపుతుంది.

## 17. మయూరహస్తం :

మయూరార్థే ప్రయోజ్యః స్యాత్ మయూరో పుంఖితో యది ।

అర్థం : మయూరః, పుంఖితః యది = మయూరహస్తం, పుంఖితంగా ఉంటే (అది); మయూర - అర్థే, ప్రయోజ్యః = మయూరం (= నెమలి) అనే అర్థమందు. ప్రయోగింపదగినది.

తాత్పర్యం : మయూరహస్తం పుంఖితంగా ఉంటే అది నెమలిని నిరూపిస్తుంది.

## 18. హంసహస్తం :

హంసాస్యోఽపి ప్రయోజ్యః స్యాద్ధంసార్థే నృత్తకోవిదైః ॥ 805

అర్థం : హంసాస్యః, హంస - అర్థే, అపి = హంసాస్య (హస్త)ం, హంస అనే అర్థమందు, కూడా; నృత్తకోవిదైః ప్రయోజ్యః = నృత్తకోవిదుల చేత, పయోగింపదగినది.

తాత్పర్యం : హంసాస్యహస్తం హంస అనే అర్థమందుకూడా వినియోగపడుతుంది.

## 19. చక్రవాకహస్తం :

అలపద్మౌ పుంఖితౌ చేత్ చక్రవాకే నియుజ్యతే।

అర్థం: అలపద్మౌ, పుంఖితౌచేత్ = రెండు అలపద్మహస్తాలు పుంఖితంగా ఉంటే; చక్రవాకే, నియుజ్యతే = చక్రవాక పక్షి అనే అర్థంలో, వినియోగపడుతుంది.

తాత్పర్యం : పుంఖితంగా ఉన్న రెండు అలపద్మహస్తాలు చక్రవాక పక్షిని నిరూపిస్తాయి.

## 20. కోయష్టికహస్తం ;

అరాళో దక్షిణే వామే పతాకేన విమిశ్రితః ॥ 806

నామ్నా ఽరాళపతాకోఽయం కోయష్టికనిరూపణే।

అర్థం : దక్షిణే, అరాళః, వామే, పతాకేన, విమిశ్రితః = కుడిచేతి, అరాళహస్తం, ఎడమచేతి, పతాకహస్తంతో, కలిస్తే;

నామ్నా అరాళపతాకః = పేరుచేత అరాళపతాకహస్త (మవుతుంది): అయం, కోయష్టిక, నిరూపణే = ఇది, కోయష్టిక (= గ్రుడ్డికొంగ) అనే పక్షిని, నిరూపించటంలో (ప్రయుక్తమవుతుంది).

తాత్పర్యం: కుడిచేతి అరాళహస్తం ఎడమచేతి పతాక హస్తంతో కలిస్తే, 'అరాళపతాక హస్తం' అవుతుంది. ఇది కోయష్టిక అనే అర్థమందు చెల్లుతుంది.

## 21. వ్యాళీహస్తం :

తర్జనీ మధ్యమే చాగ్రే చాప వద్వక్రితే యుతే॥ 807
అనామికాంగుష్ఠసంధౌ వక్రితా సుప్రతిష్ఠితా ।
కనిష్ఠావక్రితా చాయం వ్యాళీ వ్యాళ్యాం నియుజ్యతే ॥ 808

అర్థం: తర్జనీ - మధ్యమే (చ), చాపవత్, వక్రితే, అగ్రే యుతే = తర్జనీ-మధ్యమ అంగుళులు, ధనస్సువలె, వంగి, అగ్రమున కలిస్తే; అనామికా - అంగుష్ఠ సంధౌ వక్రితా సుప్రతిష్ఠితా = అనామిక, అంగుష్ఠం మొదటవంగినది; కనిష్ఠా వక్రితా (చ) = కనిష్ఠిక (కూడా) వంగినది (అయితే అది); వ్యాళీ = వ్యాళీ హస్తం అవుతుంది; అయం, వ్యాళ్యాం, నియుజ్యతే = ఇది వ్యాళీ (అనే పక్షి) యందు, వినియోగపడుతుంది.

తాత్పర్యం: చూపుడు - నడిమి వ్రేళ్ళ చివరలు కలిసి విల్లు వలె వంగినవి, అనామిక అంగుష్ఠం మొదట వంగినది, కనిష్ఠిక కూడా వంగినది అయితే, అది 'వ్యాళీహస్తం' అవుతుంది. ఈహస్తం వ్యాళి అనే పక్షిని తెలుపుతుంది.

### జలజంతుహస్తాలు

## 1. భేకహస్తం :

చక్రాంగుష్ఠౌ చ తర్జన్యో హస్తయో రంతరం గతౌ।
మధ్యమే మిశ్రితే దీర్ఘే కుంచితే చాఽన్యనామికే ॥ 809

ప్రసారితే కనిష్ఠే చ శ్లిష్టచక్రో ఒయమిష్యతే ।
ఏతస్య వినియోగ స్తు భేకార్థే సంప్రయుజ్యతే ॥ 810

అర్థం : చక్ర - అంగుష్ఠౌ. తర్జన్యౌ (చ) = రెండు చక్ర హస్తాల అంగుష్ఠాలు, తర్జనులు; హస్తయోః, అంతరం గతౌ = అర చేతులలోనికి వంగినవి; మధ్యమే, మిశ్రితే, దీర్ఘే = నడిమివ్రేళ్ళు, కలిసినవి, చాపబడినవి; అనామికే అపి, కుంచితే = అనామికలుకూడా వంగినవి; కనిష్ఠే (చ), ప్రసారితే = కనిష్ఠికలు, చాపబడినవి (అయితే); అయం, శ్లిష్టచక్రః, ఇష్యతే = ఇది, శ్లిష్టచక్ర (హస్త)ం (అని) అంగీకరింపబడుతున్నది; ఏతస్య, వినియోగః (తు), భేక-అర్థే సంప్రయుజ్యతే = దీనియొక్క, వినియోగం, భేకం (= కప్ప) అనే అర్థమందు, తగును.

తాత్పర్యం: రెండు చక్రహస్తములందలి అంగుష్ఠములు, తర్జనులు అరచేతిలోకి వంగినవి, నడిమివ్రేళ్ళు పొడవై కలిసినవి, అనామికలువంగినవి, కనిష్ఠికలు చాపబడినవి అయితే అది శ్లిష్టచక్రహస్తం అవుతుంది. ఈ హస్తం భేకము అనే అర్థంలో తగును.

## 2. కుళీరహస్తం :

దక్షిణః కర్కటో భూయా దపవేష్టితరూపకః ।
వామహస్తోపరిస్థాయీ శ్లిష్టశ్చాస్యాంగుళిః క్రమాత్ ॥ 811
లీనకర్కటకః సోఒయం కుళీరే సంప్రయుజ్యతే ।

అర్థం : దక్షిణః, కర్కటః, అపవేష్టితరూపకః = కుడిచేతి, కర్కటహస్తం, అపవేష్టితరూపంగా; వామహస్త, ఉపరిస్థాయీ = ఎడమచేతి, మీద చేరినది; అస్య, అంగుళిః, క్రమాత్, శ్లిష్టః = దానియొక్క, అంగుళులు (రెండవదాని యొక్క అంగుళుల మధ్యగా) క్రమంగా, దూర్చబడినవి (అయితే); సః, లీనకర్కటకః భూయాత్ = అది, లీనకర్కటక (హస్త)ం, అవుతుంది; అయం, కుళీరే, సంప్రయుజ్యతే = ఇది కుళీరం (= ఎండ్రకాయ) అనే అర్థమందు, ప్రయుక్తమవుతున్నది.

తాత్పర్యం : కుడిచేత కర్కటహస్తాన్ని అపవేష్టితంగా పట్టి దానిని ఎడమచేతి మీద చేర్చి, దాని అంగుళులను రెండవచేతి అంగుళుల మధ్య క్రమంగా దూర్చితే, అది లీనకర్కటహస్తం అవుతుంది. ఈ హస్తం ఎంద్రకాయ అనే అర్థాన్ని తెలుపుతుంది.

### 3. రక్తపాయీహస్తం :

రక్తపాయిని సూచీ స్యాత్ రేచితా తిర్యగేవ చ ॥ 812

అర్థం : సూచీ, రేచితా, తిర్యక్ (ఏవ) (చ), రక్తపాయిని, స్యాత్ = సూచీహస్తం, అడ్డంగా, రేచితమైతే, రక్తపాయి (= జలగ) అనే అర్థాన్ని తెలుపుతుంది.

తాత్పర్యం : సూచీహస్తాన్ని అడ్డంగా రేచితం చేస్తే అది జలగను నిరూపిస్తుంది.

### 4. నక్రహస్తం :

పతాకస్వస్తికో హస్తో మిళిత శ్చ విసర్జితః ।

నక్రార్థే పేటికార్థే చ యోజితః పూర్వసూరిభిః ॥ 813

అర్థం : పతాక స్వస్తికః, మిళితః (చ), విసర్జితః = పతాకస్వస్తిక హస్తాన్ని దగ్గరకు చేర్చి, విడదీసినప్పుడు; నక్ర-అర్థే, పేటిక-అర్థే(చ) = మొసలి, పెట్టె అనే అర్థములందు; పూర్వసూరిభిః, యోజితః = పూర్వ పండితులచేత, యోజింపబడినది.

తాత్పర్యం : పతాకస్వస్తిక హస్తాలను కలిపి, విడదీస్తే అది మొసలి, పెట్టె అనే అర్థాలను తెలుపుతుంది.

### 5. ఢుండుభహస్తం :

దక్షిణః కర్తరీభూతః కరశ్చోర్ధ్వముఖో యది ।

అస్యప్రకోష్ఠే వామః స్యాత్ కటకాముఖరూపతః ॥ 814

కర్తరీదండహస్తోఽయం ఢుండుభార్థే ప్రయుజ్యతే ।

అర్థం : కర్తరీభూతః, దక్షిణః, ఊర్ధ్వముఖః యది = కర్తరీ హస్తమై అయిన, కుడిచేయి, ఊర్ధ్వముఖంగా ఉంచే; అస్య, ప్రకోష్ఠే, వామః, కటకాముఖరూపతః, స్యాత్ = దాని, ప్రకోష్ఠం (= మణికట్టు నుంచి మోచేయివరకు గల భాగం)మీద, వామహస్తం కటకాముఖరూపంగా అయితే (అది); కర్తరీదండహస్తః = కర్తరీదండ హస్తం (అవుతుంది); అయం, డుండుభ - అర్థే, ప్రయుజ్యతే = ఇది, డుండుభం (= రెండుతలలపాము) అనే అర్థమందు, ప్రయుక్త మవుతున్నది.

తాత్పర్యం : కుడిచేత కర్తరీహస్తాన్ని ఊర్ధ్వముఖంగా పట్టి, దాని ప్రకోష్ఠం మీద కటకాముఖహస్తంగా ఉన్న ఎడమచేతిని ఉంచితే, అది కర్తరీదండహస్తం అవుతుంది. ఈ హస్తం రెండు తలల పామును నిరూపిస్తుంది.

* * * *

## నీడావారివిజ్ఞప్తి

సరసాభినయాదీనా మాపాదనసుధీజుషా ॥
వేంకటాచార్యవర్యేణ నీడామంగలవాసినా ।
భరతాగమగ్రంథాభావశాస్త్రే ష్వనేకశః ॥
సంగృహ్య విషయాన్సమ్య క్పూర్వకై స్సముదాహృతాన్ ।
గ్రథితోఽయం సమాలోచ్య నితరాం విదుషాం ముదే ॥
ఏన మాలోక్య సుధియ స్తుష్యేయు రితి సాదరమ్ ।
దర్పణాఖ్యేన గ్రంథేఽ ముద్రితోఽసౌ యథామతి ॥

అర్థం : సరసాభినయాదీనామ్, ఆపాదన, సుధీజుషా = సరసాభినయం మొదలగు వాటిని ఆపాదించటం (= చెప్పటంలో) సమర్థుడైన; నీడామంగలవాసినా, వేంకటాచార్యవర్యేణ = నీడా మంగలపురవాసి అయిన (తిరు) వేంకటాచార్యవర్యునిచేత; భరత-ఆగమ గ్రంథాది భావశాస్త్రేషు = భరతాగమం (= నాట్య

శాస్త్రం మొదలగు భావశాస్త్రాలలో; పూర్వైః,అనేకశః సమ్యక్, సముదాహృతాన్, విషయాన్,. సంగృహ్య, సమాలోచ్య— పూర్వులచేత, అనేక విధాలుగా, చక్కగా, ఉదాహరింపబడిన, విషయాలను, గ్రహించి, బాగుగా ఆలోచించి; విదుషాం, ముదే, అయం, గ్రంథః, గ్రథితః = విద్వాంసుల, మోదంకోసం, ఈ గ్రంథం, కూర్చబడినది; ఏనం - ఆలోక్య, దర్పణ - ఆఖ్యేన గ్రంథేన, సుధియః, సాదరమ్ తుష్యేయుః, ఇతి = దీనిని పరిశీలించి, దర్పణం అనే పేరుగల ఈ గ్రంథం చేత, సుధీమంతులు, సాదరంగా, తుష్టిని పొందుదురు గాక, అని; యథామతి, అపి, ముద్రితః = యథామతిగా, ఈ గ్రంథం, ముద్రితమైనది.

ఇతి, అభినయదర్పణాఖ్యః, గ్రంథః, గ్రంథాంతరస్థ శిరోభేదాది సహితః, సమాప్తః = ఇట్లా అభినయదర్పణం అనే పేరుగల (ఈ) గ్రంథం, ఇతర గ్రంథాలలోని శిరోభేదాదులతో కూడినదై, సమాప్తం అయింది.

తాత్పర్యం : సరసాభినయములను కూర్చటంలో సమర్థుడైన వాడును, నీడామంగలపురనివాసియును అయిన వేంకటాచార్యుని చేత నాట్యశాస్త్రాది గ్రంథాలలో పూర్వులు అనేక విధాలుగా చక్కగా ప్రతిపాదించిన విషయాలను గ్రహించి, బాగుగా ఆలోచించి,విద్వాంసుల మోదం కొరకు, ఈ గ్రంథంచేత పండితులు తుష్టిని పొందగలరన్న విశ్వాసంతో, తెలిసిన విధంగా ముద్రించటమైనది.

ఇతర గ్రంథాలనుంచి గ్రహించి, కూర్చిన శిరోభేదాలు మొదలగు వానితో కూడిన ఈ గ్రంథం సమాప్తమైనది.

టీక : తెలుగు లిపిలో, తాత్పర్యసహితంగా, ముద్రింపబడిన 'అభినయదర్పణం' సంపాదకులు శ్రీమాన్ తిరువేంకటాచారిగారు. ఆయన 'నీడామంగలం' నివాసి. అభినయకోవిదుడు. విద్వాంసుల సంతోషం కొరకు నాట్యశాస్త్రాది గ్రంథాలలో ఉన్న, శిరోభేదాలు మొదలయిన అనేకాంశాలను ఎన్నుకొని, నందికేశ్వరుని అభినయ

దర్పణంలో చేర్చారు. ఇట్లా చేర్చిన శ్లోకాలు 408 అని పీఠికలో వారు పేర్కొన్నారు.

తిరువేంకటాచారిగారి సంపాదకత్వంలో వావిళ్ళ వారు ముద్రించిన ఈ గ్రంథాన్ని శ్రీయుతులు ఆనందకుమారస్వామి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగార్లు "The Mirror of Gesture" అన్న పేరుతో ఆంగ్లంలోనికి అనువదించారు. అందులో తిరువేంకటాచారిగారి పీఠిక యొక్క ఆంగ్లానువాదం కూడా ముద్రితమైనది. ఆ పీఠిక వ్రాసిన సంవత్సరం క్రీ.శ. 1887; కాగా, ముద్రణ కూడా ఆ సంవత్సరమే జరిగి ఉంటుంది. పీఠిక చివర "Madabhushi Tiruvenkata, of Nidamangalam" అని ఉన్నది. కావున తిరువేంకటాచారిగారి ఇంటి పేరు 'మాడభూషి' అన్నమాట!

అనుబంధం-1

## ప్రకీర్ణహస్తాభినయం

| విషయం | మాతృభూతయ్య చెప్పినవి | దివాకరకవి భిన్నంగా చెప్పినవి |
|---|---|---|
| సమయాలు : | | |
| సూర్యోదయం | పద్మకోశం | |
| సూర్యాస్తమయం | ముకుళం | |
| మధ్యాహ్నం | హంసాస్యం | |
| ఋతువులు : | | |
| వసంతం | లాంగూలం | |
| గ్రీష్మం | మృగశీర్షం | |
| వర్షం | సందంశం | |
| శరత్ | శుకతుండం | |
| హేమంతం | హంసాస్యం | |
| శిశిరం | పద్మం | |
| నవరసాలు : | | |
| శృంగారం | పద్మం | |
| వీరం | అర్ధచంద్రం | త్రిపతాకం |
| కరుణం | ముకుళం | |
| అద్భుతం | లాంగూలం | సందంశం |

| హాస్యం | హంసాస్యం | |
|---|---|---|
| భయానకం | శిఖరం | ఊర్ణనాభం |
| బీభత్సం | త్రిపతాకం | త్రిపతాక-కర్తరులు |
| రౌద్రం | శుకతుండం | |
| శమం | — | హంసపక్షం |
| ఉత్సాహం | పద్మం | |

<u>నవరత్నాలు :</u>

| వజ్రం | సింహముఖం | |
|---|---|---|
| వైడూర్యం | సింహముఖం | పద్మకోశం |
| పద్మరాగం | సందంశం | |
| నీలం | సందంశం | కటకాముఖం |
| గోమేధికం | అర్ధపతాకం | |
| మాణిక్యం, పుష్యరాగం | కా (లాంగూలం | |
| మరకతం (= పచ్చ) | చతురం | |
| మౌక్తికం (= ముత్యం) | హంసాస్యం | |
| ప్రవాళం (= పగడం) | త్రిపతాకం | శిఖరం |

టీక : మాణిక్యం నాలుగు విధాలు; ఆ నాలుగింటిలో సింహళదేశపు మాణిక్యాన్ని 'పద్మరాగం' అంటారు.

<u>శిలలు :</u>

| చంద్రకాంతం | అర్ధచంద్రం | |
|---|---|---|
| సూర్యకాంతం | పద్మకోశం | అలపల్లవం |

<u>నవలోహాలు :</u>

| బంగారం | చతురం |
|---|---|
| కుందనం | హంసాస్యం |

| | | |
|---|---|---|
| రజితం | అర్ధపతాకం | పతాకం |
| కల్షు | సింహముఖం | |
| తామ్రం (=రాగి) | త్రిపతాకం | |
| ఇత్తడి | ముకుళం | ఖండచతురం |
| తగరం | పతాకం | అర్ధపతాకం |
| ఇనుము | ముష్టి | |
| కరగుట | పద్మకోశం | |
| సుత్తె | కపిత్థం | |
| కంచువు (=గొట్టం) | కటకాముఖం | |
| ఉక్కు | — | సూచీముఖం |
| గుళిగ (=రసమణి) | — | కాంగూలం |

టీక : మాతృభూతయ్య సీసాన్ని విడిచి, ఎనిమిది లోహాలకే హస్తాలు చెప్పినాడు. బంగారం, కుందనం వేర్వేరుగా చెప్పబడినవి. దివాకరకవి కూడా సీసానికి హస్తం చెప్పలేదు.

సప్తస్వరాలు :

| | | |
|---|---|---|
| షడ్జమం | మయూరం | |
| ఋషభం | సింహముఖం | మృగశిరం |
| గాంధారం | మృగశీర్షం | సింహముఖం |
| మధ్యమం | పద్మకోశం | హంసాస్యం |
| పంచమం | కపిత్థం | శుకతుండం |
| ధైవతం | పతాకం | |
| నిషాదం | సింహముఖం | సందంశం |

సప్తహారాలు :

| | | |
|---|---|---|
| భాను | పద్మం | అలపద్మం |

| | |
|---|---|
| ఇందు | అర్ధచంద్ర |
| భౌమ | త్రిపతాక |
| సౌమ్య | సందంశ |
| గురు | శిఖర |
| భృగు | పతాక |
| మంద (= శని) | ముష్టి |
| నిమిషం | సందంశం |
| అరగడియ | అర్ధసూచి |
| జాము | సూచి |
| దినము | హంసాస్యం |
| సంవత్సరం | పతాకం |

దివాకర కవి మాత్రమే చెప్పిన హస్తాభినయం :

లెక్కలు :

| | |
|---|---|
| ఒకటి | సూచి |
| రెండు | అర్ధపతాకం |
| మూడు | తామ్రచూడం |
| నాలుగు | శిఖరం |
| ఐదు | ముకుళం |
| ఆరు | బాణం |
| ఏడు | హంసాస్యం |
| ఎనిమిది | సందంశం |
| తొమ్మిది | కటకాముఖం |

ద్వాదశరాశులు :

| | |
|---|---|
| మేషం | హంసాస్యం |
| వృషభం | శిఖరం |
| మిథునం | అర్ధపతాకం |
| కర్కాటం | కర్కటం |
| సింహం | సింహముఖం |
| కన్య | మృగశీర్షం |
| తుల | ముష్టి |
| వృశ్చికం | శుకతుండం |
| ధనువు | అర్ధచంద్రం |
| మకరం | పతాకాస్వస్తికం |
| కుంభం | కలశం |
| మీనం | మకరం |

సర్వాంగాభినయం :

| | |
|---|---|
| పాదాలు | పతాకం |
| గుడికాళ్ళు | ముష్టి |
| జంఘలు (= పిక్కలు) | కపోతం |
| మోకాళ్ళు | అర్ధచంద్రం |
| తొడలు | ద్విరదం |
| తుంటికీలు | కటకాముఖం |
| గుదస్థలం | హంసాస్యం |
| పిరుదులు | అర్ధచంద్రం |
| మేఢ్రం | మృగశీర్షకం |
| వృషణాలు | త్రిపతాకం |

| | |
|---|---|
| మధ్యదేశం | ముష్టి |
| కుక్షి | (అధోముఖంగా ఉన్న కపోతం) |
| వళులు | శుకతుండం |
| నాభి | సూచి |
| నూగారు | సర్పశీర్షం |
| ఱొమ్ము | స్వస్తికం |
| చనుమొనలు | ముకుళం |
| కుచములు | పద్మకోశం |
| కక్షం (=చంక) | అర్ధచంద్రం |
| కంఠం | ముష్టి |
| చుబుకం | ముకుళం |
| జడ | అర్ధచంద్రం |
| చెక్కిలి | త్రిపతాకం |
| దంతపంక్తి | శుకకుండం |
| నాసిక | సూచీముఖం |
| చెవులు | సందంశం |
| పెదవి, కనుబొమలు, ముఖం | సూచీ |
| ఫాలభాగం | పతాకం |
| ముంగురులు | త్రిపతాకం |
| కేశపాశాలు | కర్తరీస్వస్తికం |
| కేశబంధం | అలపల్లవం |
| మనోవికారం | కర్తరి |

| | |
|---|---|
| సుగుణం, బుద్ధి | సూచీముఖం |
| మంచిమాటలు | సందంశం |
| గోష్ఠి | ముకుళం, త్రిపతాకం, బాణం. |

<u>పంచబాణాలు : అవి చేసే పనులు :</u>

అరవిందం : మోహం అధికంకాగా, వలపుచేష్టలు చేయిస్తుంది.

అశోకం : మోము వాడుతుంది, మేను ఉడుగుతుంది, విభ్రమం చెందిస్తుంది.

చూతం : సిగ్గు పోగొట్టుతుంది.

మల్లె : మన్మథజ్వరంతో చేష్టలుడుగజేస్తుంది.

నీలోత్పలం : మన్మథతాపం అధికంకాగా, మరణమే శరణ్యమనిపిస్తుంది.

# అక్షరసాభినయం

శివే శృంగారార్ద్రా, తదితరజనే కుత్సనపరా
సరోషా గంగాయాం, గిరిశనయనే విస్మయవతీ ।
హరాహిభ్యో భీతా, సరసిరుహ సౌభాగ్యజయినీ
సఖీషు స్మేరా, తేమయి జనని! దృష్టిస్సకరుణా ॥

సౌందర్యలహరి - 51వ శ్లో.

అర్థం : జననీ! =(ఓ) జననీ; శివే =(భర్తయు, నటరాజును అగు)శివునియందు; శృంగార-ఆర్ద్రా =శృంగారముచేత,తడిసినది;తత్ ఇతర జనే = ఆ శివునికంటె వేరైన, జనమునందు; కుత్సనపరా = ఏవగింపు కలది; గంగాయాం =(సవతియగు) గంగయందు; సరోషా = కోపముతో కూడినది; గిరిశ-నయనే=శివునియొక్క, మూడవ కంటియందు; విస్మయవతీ = ఆశ్చర్యముతో కూడినది; హర-అహిభ్యః = శివునియొక్క (సొమ్ములగు), పాములవలన; భీతా = భయపడినది; సరసిరుహ-సౌభాగ్య = పద్మములయొక్క, సౌందర్యమును; జయినీ=జయించినది; సఖీషు = చెలులయందు, స్మేరా = వికాసముకలది (అయిన) తే దృష్టిః = నీయొక్క, చూపు; మయి = నాయందు; సకరుణా = దయకలది (అగునుగాక!)

తాత్పర్యం : తల్లీ! నీ చూపు భర్త అయిన శివునియందు శృంగారపరమైనది; ఇతరులయెడ ఏవగింపు కలది; సవతియగు గంగయందు కోపము కలది; శివుని మూడవకంటి విషయమున ఆశ్చర్య పడినది; శివుని భూషణములయిన సర్పములను చూసి భయపడినది; పద్మముల సౌందర్యమును జయించినది; చెలికత్తెలను చూచి నవ్వు నది- అటువంటి దృష్టి నా యందు కరుణ చూపునది అగును గాక!

టీక : జగజ్జనని, లాస్యమూర్తి అయిన పార్వతీదేవియొక్క చూపును అష్టరసాత్మకముగా వర్ణించినారు జగద్గురువులగు ఆదిశంకరలు. ఆ తల్లి చూపు — భర్త విషయమున శృంగారరసాత్మకము. తదితరుల విషయమున ఏవగింపు అనగా జుగుప్స కలది కాన బీభత్స రసాత్మకము. సవతియందు కోపము లేదా క్రోధము కలది కావున రౌద్రరసాత్మకము. ముక్కంటి మూడవ నేత్రమును చూచి ఆశ్చర్య పడినది కావున అద్భుతరసాత్మకము. శివునకు భూషణములగు సర్ప ములను చూచి భయపడినది కావున భయానకరసాత్మకము. పద్మ ముల అందమును జయించెడి ఉత్సాహముకలది; అనగా ఆ అందమును మించిన అందము కలది కావున వీరరసాత్మకము. చెలికత్తెల పరిహాస ములకు హసించునది కావున హాస్యరసాత్మకము. భవశోకపరితప్తుడ నగు నా యందు దయచూపినది కావున కరుణ రసాత్మకము. ఇట్లు ఆ తల్లి చూపు అష్టరసాత్మకముగా ఉన్నది.

భరతముని నాట్యశాస్త్రమందు ఎనిమిది రసములనే వివరించి నాడు (తొమ్మిదవదగు శాంతరసమును తరువాతివారు చేర్చినారు.) ఆదిశంకరులు కూడా ఎనిమిది రసములనే పరిగణించినారేమో!

'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' కదా! (ఇంద్రియము లన్నింటిలోను కన్ను ప్రధానమైనది). అటువంటి కంటి చూపునకు (దృష్టికి) నృత్యమందు ఎంతో ప్రాధాన్యమున్నది. "దృష్టులయందే నాట్యము ప్రతిష్ఠితమైనది" అని భరతముని సూక్తి. కంటిచూపు సర్వభావాలనే కాక సర్వరసాలను ప్రదర్శించగలదు. ఈ అష్ట రసాభినయం నర్తకీ - నర్తకులకు నికషోపలమువంటిది.

అనుబంధం-3

## దశావతార - అభినయం

### 1. శ్లోకం

వేదానుద్ధరతే జగన్నివహతే భూగోలముద్బిభ్రతే
దైత్యం దారయతే బలింఛలయతే క్షత్రక్షయం కుర్వతే।
పౌలస్త్యం జయతే హలంకలయతే కారుణ్యమాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతి కృతే కృష్ణాయ తుభ్యం నమః॥

గీతగోవిందం - 4వ శ్లోకం.

1. వేదాన్ (=వేదాలను)— ఎడం ఎడంగా ఉన్న అంగుళుల యొక్క చివరలను వంచాలి.

ఉద్ధరతే ( =ఉద్ధరిస్తున్నవాడు)— అలపల్లవ హస్తాల్ని మెల్లగా పైకి ఎత్తాలి.

— ఇది మత్స్యావతారం.

2. జగత్ ( =భూమిని) — రెండు పతాకహస్తాలను, అరచేతులు పైకి ఉండేటట్లుగా, చాపాలి.

నివహతే (=వహిస్తున్నవాడు)— అలపల్లవ హస్తాన్ని స్కంధంమీద పెట్టి, తరువాత అరచేతులు పైకి ఉండేటట్లుగా రెండు పతాక హస్తాలను పైకి ఎత్తాలి.

— ఇది కూర్మావతారం.

3. భూగోలం( =భూగోళాన్ని )—పతాకహస్తాలతోముందు భూమిని చూపిస్తూ, కపోతహస్తాన్ని ఊర్ధ్వముఖంగా పట్టాలి.

ఉద్బిభ్రతే (=పైకి ఎత్తుచున్నవాడు)— అరచేతులు పైకి ఉండేటట్లుగా, రెండు పతాకహస్తాలను పైకి ఎత్తాలి.

— ఇది వరహావతారం.

4. దైత్యం (=హిరణ్యకశిపురాక్షసుని)— రెండు ఊర్ణనాభ హస్తాల అరచేతులు ముఖసమీపంలో కలియాలి.

దారయతే (=చీలుస్తున్నవాడు)— రేచితహస్తం పట్టాలి.

— ఇది నృసింహావతారం.

5. బలిం (=బలిని)— సూచీముఖహస్తాన్ని ఊర్ధ్వముఖంగా పట్టి, గజదంత హస్తాలతో జబ్బలు చరచి, సర్పశీర్షహస్తాలు చూపాలి.

ఛలయితే (=వంచిస్తున్నవాడు)— అలపల్లవ హస్తాన్ని వెనకకు త్రిప్పాలి.

— ఇది వామనావతారం.

6. క్షత్త్రి (=క్షత్త్రియులయొక్క)— ప్రత్యాలీఢ స్థానకంలో నిల్చి, ముష్టిహస్తాన్ని ముందుకు చాచి, కటకాముఖహస్తాన్ని చెవి దగ్గరవరకు తీసుకొనిరావాలి.

క్షయం (=నాశనం)— అరచేయి అధోముఖంగా ఉండేటట్లుగా పతాకహస్తాన్ని ఎడంమూపునుంచి, అడ్డంగా క్రిందకు తీసుకొనిరావాలి.

కుర్వతే (చేస్తున్నవాడు)— హంస్యాస్యహస్తాన్ని అధోముఖంగా పట్టాలి.

— ఇది పరశురామావతారం.

7. పౌలస్త్యం (=రావణుని)— అలపల్లవ హస్తాన్ని గడ్డం క్రింద త్రిప్పి, ముందువైపు అరచేతులు, విరళాంగులుకల పతాక హస్తాలను పట్టాలి.

జయతే (=జయిస్తున్నవాడు)— అలపల్లవ హస్తాన్ని ఉద్వేష్టితం చేయాలి.

— ఇది రామావతారం

8. హలం, కలయతే (=నాగలిని ధరిస్తున్నవాడు) — అరాళ హస్తాన్ని, స్కంధంమీద ఉంచాలి.

— ఇది బలరామావతారం.

9. కారుణ్యం (=దయను) — కరుణ దృష్టితో, హంస పక్షహస్తాన్ని గుండెల మీద ఉంచాలి.

ఆతన్వతే (=విస్తరింపజేస్తున్నవాడు) — రెండు పతాక హస్తాలను అరచేతులు పైకి పెట్టి, విస్తరించాలి.

— ఇది బుద్ధావతారం.

10. మ్లేచ్ఛాన్ (=మ్లేచ్ఛులను) — సందంశ హస్తాన్ని చెవి క్రిందకు చూపి, పతాకహస్తాన్ని ఎదుట చలింపజేయాలి.

మూర్ఛయతే (=మూర్ఛిల్లునట్లు చేస్తున్నవాడు) — అంచిత శిరస్సుతో, డోలాహస్తం పట్టాలి.

— ఇది కల్క్యావతారం.

దశాకృతి (=పది రూపాలు) — అరచేతులు ముందుకుచాపి, విరళాంగులుకల పతాక హస్తాలనుపట్టి, మెల్లగా శరీరం మీద సదంశ హస్తాలను చూపాలి.

కృతే (=చేస్తున్నవాడు) — హంసాస్య హస్తాన్ని అధో ముఖంగా పట్టాలి. అటువంటి —

కృష్ణాయ (=కృష్ణుడవైన) — వైష్ణవ స్థానకంలో, వేణువును ధరించిన ముద్ర పట్టాలి.

తుభ్యం,నమః(=నీకు,నమస్కారం) — అవధూత శిరస్సుతో, పతాక హస్తాన్ని ముందుకు చాచి, అంజలి హస్తాన్ని లలాటం మీద చూపాలి.

టీక : కృష్ణభక్తుడైన జయదేవ మహాకవి, పది అవతారాలను శ్రీకృష్ణుడే ధరించినట్లు వర్ణించినాడు. కాగా విష్ణువునకు, కృష్ణునకు అభేదము చెప్పటమే కాక, కృష్ణావతారాన్ని కూడా వర్ణించినట్లయింది.

## 2. అష్టపది

1. ప్రళయపయోధిజలే ధృతవానసి వేదం
విహితవహిత్ర చరిత్ర మఖేదమ్
కేశవ! ధృతమీనశరీర! జయజగదీశహరే!

| | |
|---|---|
| ప్రళయ | ఒక పతాక హస్తాన్ని ఇంకొక పతాకహస్తంతో మర్దిస్తూ ఆకాశమువైపు చూడాలి. |
| పయోధిజలే | రెండు పతాకహస్తాలను అధోముఖంగా స్వస్తికంచేసి, విడదీసి, అరచేతులు పైకి ఉంచాలి. |
| ధృతవానసి | ముష్టిహస్తాన్ని క్రిందనుంచి పైకి ఎత్తాలి. |
| వేదం | నికుంచకంతో అరచేతులు ముందుకు చాపాలి. |
| విహిత | పతాకహస్తాన్ని మెల్లగా క్రిందకు చాపాలి. |
| వహిత్ర | (=నావ)—కదల్చబడిన అంగుష్ఠంకల హస్తంతో పుష్పపుట హస్తాన్ని ప్రసారితం చేయాలి. |
| చరిత్రం | అరచేయి పైకి ఉండేటట్లుగా పతాకహస్తాన్ని చాపాలి. |
| అఖేదం | పతాకహస్తాన్ని హృదయం మీద ఉంచి, ముకుళ దృష్టితో చూడాలి. |
| కేశవ | కేశబంధహస్తం చూపాలి. |
| ధృత | ముష్టిహస్తాన్ని ఆవర్తనం చేయాలి. |
| మీన శరీర | మకరహస్తం చూపాలి. |
| జయ | హస్తాన్ని ఉద్వృత్తం చేయాలి. |
| జగదీశ | అంజలి హస్తాన్ని లలాటం మీద ఉంచాలి. |
| హరే | వైష్ణవ స్థానకంలో నిలవాలి. |

2. క్షితిరతివిపుల తరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణ కిణ చక్ర గరిష్ఠే
కేశవ ! ధృత కచ్ఛపరూపః జయజగదీశహరేః

| | |
|---|---|
| క్షితిః | ముందువైపు చూపబడుతున్న, క్రిందుగా వ్రేళ్ళుకల పతాకం పట్టాలి. |
| అతి | ఆవేష్టితాలు, కొంచెం పైకి లేచినవి అయిన రెండు పతాక హస్తాలు చూపాలి. |
| విపులతరే | స్వస్తిక హస్తాన్ని విడదీసి ముందుకు చాపాలి. |
| తవ | అరచేయి పైకి ఉండేటట్లుగా పతాకాన్ని ముందుకు చాపాలి. |
| తిష్ఠతిపృష్ఠే | అరచేయి క్రిందుగా ఉన్న శుకతుండహస్తం మీద ముష్టి హస్తం ఉంచాలి. |
| ధరణి | అంగుళులు అధోముఖంగా ఉండేటట్లుగా పతాకాన్ని ముందువైపు చూపాలి. |
| ధరణ | అరచేతులు పైకి ఉండేటట్లుగా రెండు పతాక హస్తాలను పైకి ఎత్తిపట్టాలి. |
| కిణ | ముష్టి హస్తం పట్టాలి. |
| చక్ర | సూచీముఖ హస్తాన్ని త్రిప్పాలి. |
| గరిష్ఠే | ఆవేష్టితాలైన, రెండు పతాక హస్తాలను పైకి ఎత్తి పట్టాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| కచ్ఛపరూప | శుకతుండ హస్తం పట్టాలి. |
| జయ | పూర్వంవలెనే. |

8. వసతి దశన శిఖరే ధరణీ తవలగ్నా
శశిని కలంక కలేవ నిమగ్నా
కేశవః ధృతసూకరరూపః జయజగదీశహరే ః

| | |
|---|---|
| వసతి | అరచేయి క్రిందుగా ఉండేటట్లుగా మెల్లగా పతాకాన్ని త్రిప్పాలి. |
| దశన శిఖరే | చిటికెన వ్రేలు ముఖాన్ని తాకునట్లుగా శిఖర హస్తం పట్టాలి. |
| ధరణీ | వ్రేళ్ళు అధోముఖం కాగా పతాకంతో ముందువైపు చూపాలి. |
| తవ | అరచేయి పైకి ఉండేటట్లుగా పతాకాన్ని ముందుకు చూపాలి. |
| లగ్నా | రెండు సూచీముఖ హస్తాల చివరలు అడ్డంగా కలియాలి. |
| శశిని | అర్ధచంద్ర హస్తం పట్టాలి. |
| కలంక | మృగశీర్ష హస్తం చూపాలి. |
| కలా | సూచీముఖ హస్తం పట్టాలి. |
| ఇవ | ఆవర్తనం చేయాలి. |
| నిమగ్నా | ముకుళ హస్తాన్ని అధోముఖంగా అధోగతంచేయాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| సూకరరూప | రెండు తామ్రచూడ హస్తాలు పట్టాలి. లేదా ముఖాన్ని తాకుతున్న కనిష్ఠికగల శిఖరహస్తం పట్టి, రెండు సందంశ హస్తాలు శరీరం మీద చూపాలి. లేదా సూకరముద్ర పట్టాలి. |
| జయ | పూర్వంవలెనే. |

4. తవ కరకమలవరే నఖ మద్భుతశృంగమ్
దలిత హిరణ్యకశిపు తనుభృంగమ్
కేశవ! ధృతనరహరి రూప! జయజగదీశహరే!

| | |
|---|---|
| తవ | అరచేయి పైకి ఉండునట్లుగా పతాకాన్ని ముందుకు చాపాలి. |
| కర | పతాకం పట్టాలి. |
| కమల | కమలంయొక్క ఆకార ప్రదర్శనం చేయాలి. |
| వరే | అలపల్లవ హస్తాన్ని మెల్లగా పైకి ఎత్తాలి. లేదా పతాకాన్ని ఆవర్తితంచేసి, కొంచెం పైకి చాపాలి. |
| నఖం | అంగుళి గోరు మీద అంగుష్ఠాన్ని వలితం చేయాలి. |
| అద్భుత | అద్భుత దృష్టితో చూడాలి. |
| శృంగం | మృగశీర్ష హస్తం పైకి ఉండాలి. |
| దలిత | వీరదృష్టితో, రేచిత హస్తం పట్టాలి. |
| హిరణ్యకశిపు | ముఖసమీపంలో పైకి, క్రిందకు ఉన్న అరచేతులుగల ఊర్ణనాభ హస్తాలను ప్రదర్శించాలి. |
| తను | హంసపక్ష హస్తంతో శరీరాన్ని చూపాలి. |
| భృంగం | భ్రమర హస్తం పట్టాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| నర | అలపల్లవ హస్తాన్ని స్కంధమూలం మీద ఉంచాలి. |
| హరి | అరచేతులు ముందుకు ఉన్న రెండు ఊర్ణనాభ హస్తాలను స్వస్తికం చేయాలి. |
| రూప | సందంశ హస్తాన్ని శరీరం మీద పట్టాలి. |
| జయ | పూర్వంవలెనే. |

5. ఛలయసి విక్రమణే బలిమద్భుత వామన
పదనఖనీరజనితజనపావన
కేశవ! ధృతవామనరూప! జయజగదీశహరే!

| | |
|---|---|
| ఛలయసి | పతాకాన్ని ఉద్వేష్టితం చేయాలి. |
| విక్రమణే | విష్ణుక్రాంత కరణం చూపాలి. |
| బలిం | సూచీముఖ హస్తాన్ని పైకిత్రిప్పి, సర్పశీర్ష హస్తంతో జబ్బ చరచాలి. |
| అద్భుత | అద్భుత దృష్టి ప్రదర్శించాలి. |
| వామన | ఒక తాలం ఎడంగా, అరచేయి క్రిందుగా ఉన్న అర్ధ చంద్ర హస్తాన్ని పైన, అరచేయి పైగా ఉన్న రెండో అర్ధచంద్ర హస్తాన్ని క్రింద పట్టాలి. |
| పద | పతాకంతో చరణం చూపాలి. |
| నఖ | అంగుష్ఠంతో గోరు చూపాలి. |
| నీర | వదులుగా ఉన్న వ్రేళ్ళతో, క్రిందుగా ఉన్న అర చేతులతో రెండు పతాక హస్తాలను పైకి ఎత్తిపట్టాలి లేదా మకర హస్తం ప్రదర్శించాలి. |
| జనిత | పతాకాన్ని ఆవర్తితంచేసి, కొంచెం పైకి ఎత్తాలి. |
| జన | అరచేతులు పైకి ఉండునట్లుగా రెండు పతాక హస్తాలను చూపాలి. |
| పావన | అలపల్లవ హస్తం యొక్క అరచేతులు పైకి ఉండాలి. లేదా అంజలి హస్తం లలాటం మీద ఉండాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| వామన రూప | ఇంతకుముందు చెప్పిన విధంగా |
| జయ | పూర్వంవలెనే. |

6\. క్షత్రియ రుధిరమయే జగదపగతపాపమ్
స్నపయసి పయసి శమిత భవతాపమ్
కేశవః ధృత భృగుపతిరూపః జయజగదీశహరే :

| | |
|---|---|
| క్షత్రియ | ప్రత్యాలీఢ స్థానకంలో నిల్చి, వీర దృష్టితో, ముష్టి హస్తాన్ని ఎడం ప్రక్కగా చాపి, కటకాముఖ హస్తాన్ని చెవి పర్యంతం తీసుకొనిరావాలి. |
| రుధిర | పతాకం స్కంధం మీదనుంచి అడ్డంగా క్రిందికిరాగా, త్రిపతాకం కంఠం వద్ద నుంచి చలిస్తూ రావాలి. |
| మయే | రెండు పతాకాలు క్రిందుగా కలిసినవై, ముందు భాగంలో లోలితం కావాలి. |
| జగత్ | అరచేయి పైకి ఉండునట్లుగా పతాకాన్ని చూపాలి. |
| అపగత | పతాకాన్ని ఉద్వేష్టితం చేయాలి. |
| పాపం | విధుతశిరస్సుతో, విడివడిన అంగుళులతో పతాకాలు చలిస్తూ ఉండాలి. |
| స్నపయసి పయసి | స్నానము చేస్తున్న రీతిని రెండు సర్పశీర్ష హస్తాలతో ప్రదర్శించాలి. |
| శమిత | అరచేయి క్రిందకు ఉండునట్లుగా పతాకాన్ని మెల్లగా త్రిప్పాలి. |
| భవ | శరీరం మీద పట్టి, రెండు సందంశ హస్తాలను పైకి ఎత్తి పట్టాలి. |
| తాపం | విధుత శిరస్సుతో, అభితప్త దృష్టితో, అంగుళాలు విడివడి చలిస్తున్న రెండు పతాకాలు ప్రదర్శించాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| భృగుపతిరూప[1] | |
| జయ | పూర్వంవలెనే. |

---

1\. దీనికి అభినయం గ్రంథంలో లేదు. తాళపత్ర ప్రతిలో లేదో లేదా ముద్రణలో జారిపోయినదో ?

7. వితరసి దిక్షు రణే దిక్పతి కమనీయమ్
దశముఖ మౌలిబలిం రమణీయమ్
కేశవః ధృతరామశరీరః జయజగదీశహరే ః

| | |
|---|---|
| వితరసి | ముకుళ హస్తం అధోముఖం కావాలి. |
| దిక్షు | సూచీ ముఖంతో దిక్కులను చూపాలి. |
| రణే | ప్రత్యాలీఢ స్థానకంలో నిల్చి, ముష్టి హస్తాన్ని ఎడం ప్రక్కగా ప్రసారితం చేసి, కుడి ప్రక్కగా ఖటకా ముఖ హస్తాన్ని చూపాలి. |
| దిక్పతి | సూచీముఖ హస్తంతో దిక్కులు చూపుతూ, ముష్టి - శిఖర హస్తాలను ప్రదర్శించాలి. |
| కమనీయం | సందంశ హస్తం లోలితం కావాలి. |
| దశముఖ | అలపల్లవ హస్తం చెక్కిలి క్రింది భాగంలో ఉండగా, విడివడిన వ్రేళ్ళుగల రెండు పతాక హస్తాలు ముందు భాగంలో ఉండాలి. |
| మౌలి | అరచేతులు ముందువైపు ఉన్న రెండు త్రిపతాకాలు కొంచెం శిరస్సును తాకుతూ ఉండాలి. |
| బలిం | ప్రతిదిక్కున అధోముఖంగా ఉన్న పద్మకోశ హస్తాన్ని ప్రదర్శించాలి. |
| రమణీయం | సందంశం లోలితం కావాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| రామశరీర | అవధూత శిరస్సుతో, అంజలి హస్తాన్ని లలాటం మీద ప్రదర్శించాలి. |
| జయ | పూర్వంవలెనే. |

8. వహసి వపుషి విశదే వసనం జలదాభమ్
హలహతి భీత మిలిత యమునాభమ్
కేశవః ధృతహలధరరూపః జయజగదీశహరే ॥

| | |
|---|---|
| వహసి | శరీరం దగ్గర, అరచేతులు అధోముఖంగా ఉన్న రెండు పతాక హస్తాలను ప్రదర్శించాలి. |
| వపుషి | హంసపక్ష హస్తాన్ని శరీరం మీద పట్టాలి. |
| విశదే | సందంశ హస్తం లోలితం కావాలి. |
| వసనం | రెండు ఖటకాముఖ హస్తాలను ప్రక్కల నుంచి ముందుకు తీసుకొని రావాలి. |
| జలదాభం | అరచేతులు అధోముఖంగా ఉన్న రెండు పతాకాలను, అడ్డంగా చాపి, మెల్లగా పైకితేవాలి; కలిసిన రెండు సూచీముఖ హస్తాలను ప్రదర్శించాలి. |
| హల | తామ్రచూడ హస్తం పట్టాలి. |
| హతి | అరచేయి క్రిందకు ఉన్న తామ్రచూడ హస్తం చూపాలి. |
| భీత | విధుత శిరస్సును, కాతర దృష్టిని ప్రదర్శించాలి. |
| మిలిత | రెండు సూచీముఖ హస్తాలు కలియాలి. |
| యమునా | ఊర్ధ్వముఖంగా త్రిప్పబడిన సూచీముఖ హస్తం నుంచి త్రిపతాకాన్ని క్రిందికి తీసుకొనివచ్చి, ముందు భాగంలో చలింపజేసి, ప్రసారితం చేయాలి. |
| ఆభం | అలపల్లవం లోలితం కావాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| హలధరరూప | అరాల హస్తాన్ని స్కంధం మీద ఉంచాలి. |
| జయ | పూర్వంవలెనే. |

9. నిందసి యజ్ఞవిధే రహహ శ్రుతిజాతమ్
సదయ హృదయ దర్శిత పశుఘాతమ్
కేశవఃధృతబుద్ధశరీరః జయజగదీశహరే ః

నిందసి — సందంశ హస్తాన్ని అధరం నుంచి విక్షిప్తం చేయాలి.

యజ్ఞవిధేః — మృగశీర్ష హస్తం చూపి, ముందు భాగంలో సింహ ముఖ హస్తాన్ని కొంచెం జార్చాలి.

అహాహా — ధుత శిరస్సు ప్రదర్శించాలి.

శ్రుతి — నికుంచకం ప్రదర్శించాలి.

జాతం — ముష్టి హస్తాన్ని ఆవర్తితం చేయాలి.

సదయ — కరుణ దృష్టితో, మెల్లగా అరచేయి క్రిందకు వచ్చు నట్లు పతాకాన్ని హృదయ సమీపంలో చూపాలి.

హృదయ — సందంశ హస్తం హృదయం మీద ఉండాలి.

దర్శిత — అపాంగంతో పాటు త్రిపతాకం ఆవర్తితం కావాలి; తిర్యక్ దృష్టి చూపాలి.

పశు — మృగశీర్ష హస్తం పట్టాలి.

ఘాతం — స్కంధం వద్దనుంచి, అరచేయి అధోముఖంగా ఉన్న పతాకం, అడ్డంగా క్రిందకు సాగాలి.

కేశవ — పూర్వంవలెనే.

బుద్ధ శరీర — శిరస్సును నిశ్చలంగా ఉంచాలి.

జయ — పూర్వంవలెనే.

10. మ్లేచ్ఛనివహ నిధనే కలయసి కరవాలమ్
ధూమకేతుమివ కమపి కరాలమ్
కేశవః ధృతకల్కిశరీరః జయజగదీశహరేః

మ్లేచ్ఛ — సందంశ హస్తాన్ని చెవిదగ్గర ఉంచి, అరచేయి

ముందుకు ఉండి లోలితమవుతున్న పతాకం ప్రదర్శించాలి.

నివహా — ముష్టి హస్తంతో ఆవర్తనం చేయాలి. లేదా సూచీ ముఖ హస్తాన్ని ఊర్ధ్వముఖంగా త్రిప్పాలి.

నిధనే — స్కంధదేశం నుంచి, పతాకం అడ్డంగా క్రిందకు సాగాలి.

కలయసి — ముష్టి హస్తం చూపాలి.

కరవాలం — పతాకం పైకి, క్రిందకు చలించాలి.

ధూమకేతుం — సూచీముఖ హస్తం ఊర్ధ్వముఖంగా చలించాలి.

ఇవ — ఆవర్తనం చేయాలి.

కమపి — త్రిపతాకాన్ని వ్యావర్తితంచేసి, కొంచెం పైకి తేవాలి.

కరాలం — భయానక దృష్టి చూపాలి.

కేశవ — పూర్వంవలెనే.

కల్కి — మనికట్టువద్ద కర్తరీముఖ హస్తం పట్టి, తురంగమచారి ప్రదర్శించాలి.

శరీర — హంసపక్ష హస్తాన్ని శరీరం దగ్గర చూపాలి

జయ — పూర్వంవలెనే.

11. శ్రీ జయదేవకవే రిదముదితముదారమ్
శృణు సుఖదం శుభదం భవసారమ్
కేశవః ధృతదశవిధరూపః జయజగదీశహరే ।

శ్రీః — అలపల్లవ హస్తం మెల్లగా ఊర్ధ్వముఖం కావాలి.

జయదేవకవేః — అంజలి హస్తాన్ని లలాటం మీద ఉంచాలి.

ఇదం — మృగశీర్ష హస్తం యొక్క అరచేయి పైకి ఉండాలి.

| | |
|---|---|
| ఉదితం | హంసాస్య హస్తం క్రింది పెదవి నుంచి ముందుకు సాగాలి. |
| ఉదారం | అలపల్లవ హస్తం లోలితం కావాలి. |
| క్రుణు | సూచీముఖ హస్తం చెవి వద్ద ఉండాలి. |
| సుఖదం | ముకుళ దృష్టితో, పతాకాన్ని హృదయం మీద ఉంచాలి. |
| శుభదం | ఉద్వృత్తం చేయాలి. |
| భవ | రెండు సందంశ హస్తాలు శరీరం మీద నుంచి మెల్లగా ఊర్ధ్వగతములు కావాలి. |
| సారం | ముష్టి హస్తాన్ని ఆవర్తనం చేయాలి. |
| కేశవ | పూర్వంవలెనే. |
| దశవిధరూప | అరచేతులు ముందుకు ఉన్న, విడివడిన అంగుళాలు గల రెండు పతాక హస్తాలను ప్రదర్శించాలి. |
| జయ | పూర్వంవలెనే. |

టీక : మద్రాసు ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీవారు ప్రకటించిన "అభినయ సహిత గీతగోవిందం" నుంచి ఈ లెవ అనుబంధం కూర్చబడింది.

అనుబంధం - 4

## ఉపయుక్త గ్రంథ సూచి

| | |
|---|---|
| అభినయ దర్పణం | సీడామంగలం తిరు వేంకటాచార్యులు; వావిళ్ళ వారి ముద్రణము (1934). |
| అభినయ దర్పణం | డా॥ మనోమోహన్ ఘోష్; ఫర్మా కె. యల్. ముఖోపాధ్యాయ, కలకత్తా (1957). |
| అభినయ దర్పణం | శ్రీ వాచస్పతి గైరోలా; సంవర్తికా ప్రకాశన్, అలహాబాదు (1967). |
| The Mirror of Gesture | శ్రీ ఆనంద కుమారస్వామి, శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్య; మున్షీరామ్ మనోహర్‌లాల్, న్యూఢిల్లీ (1977). |
| అభినయ దర్పణం | లింగముగుంట మాతృభూతయ్య కవి, Govt. Oriental MSS. Library, Madras (1951). |
| భరతసార సంగ్రహం | చిల్లకూరి దివాకరకవి, Govt. Oriental MSS. Library, Madras (1956). |
| రాగతాళ చింతామణి | పోలూరి గోవిందకవి, Govt. Oriental MSS Library, Madras (1952). |
| నృత్తరత్నావళి | జాయ సేనాపతి (శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి అనువాదంతో); ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైద్రాబాద్ (1969). |
| భరతార్ణవం | నందికేశ్వరుడు; సరస్వతీ మహల్ గ్రంథాలయం, తంజావూరు (1957) |

Geeta Govindam with Abhinaya — Govt. Oriental MSS. Library, Madras (1950).

సంగీత రత్నాకరం (7 వ అధ్యాయం) — అడయార్ లైబ్రరీ, మద్రాసు (1953).

కూచిపూడి ఆరాధన నృత్యములు — శ్రీమాన్ సి. ఆర్. ఆచార్య; దర్పణ, అహ్మదాబాదు (1969).

భరతసారమ్ — చంద్రశేఖర పండితుడు (శ్రీ లంకా సూర్యనారాయణ శాస్త్రిగారి అనువాదంతో) 1955.

తెలుగు నాటక వికాసం — డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు (1967).

నాట్యశాస్త్రము — డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు (1959).

అనుబంధం - 5

## అనువాదంలో ముఖ్యపదానుక్రమణిక